శ్రీ బమ్మెర పోతనామాత్య ప్రణీతము



# నారాయణ శతకము

## రాఘవీయ వ్యాఖ్యా సహితం

వ్యాఖ్యాత

**శ్రీమాన్ కే.వి. రాఘవాచార్యులు**

(విశ్రాంతాంధ్రోపన్యాసకులు)

సంపాదకులు

**శ్రీ చల్లా సాంబిరెడ్డి,** బి.ఎ., ఎల్ఎల్.బి.




ప్రచురణ

**శ్రీ పావని సేవాసమితి**

'శ్రీ సాయి నిలయము' - యస్.ఆర్.టి. 270, సనత్ నగర్

హైదరాబాద్ - 500 018. ఫోన్ : 3702898

# శ్రీ పావని సేవా సమితి ప్రచురణ నెం. 7
# సవ్యాఖ్యాన శతక సాహిత్య పరంపర - 6

ప్రథమ ముద్రణము - 2002 ఏప్రియల్ ప్రతులు 1000

SRI NARAYANA SATAKAMU

| | | |
|---|---|---|
| శ్రీ నారాయణ శతకము | | శ్రీ బమ్మెర పోతనామాత్య ప్రణీతము |
| వ్యాఖ్యాత | | శ్రీమాన్ కే.వి. రాఘవాచార్యులు |
| With commentary named | - | "Raghaveeya Vyakhya" |
| Divine Blessings by | - | Sri Sri Sri Tridandi Chinna Srimannarayana Ramanuja Jeeyar swamyji |
| Appreciation by | - | Mahakavi - Sriman Utpala Satyanarayanacharya, Hyderabad.<br>"Andhra Vyasa" Brahmasri Yeluripati Anantaramayya, Hyderabad. |
| Edited by | - | Sri CHALLA SAMBI REDDY, B.A., LL.B. |
| Published & Rights reserved by | - | Sri Pavani Seva Samithi (Reg) Sri Sai Nilayam - S.R.T. 270 Sanathnagar - Hyderabad - 500 018, Phone. 3702898. |
| Title Page drawing | - | Gangadhar |
| Price | - | **Rs. 50/-** |
| Type setting at | - | Fontline Graphics, Baglingampally, Hyderabad - 500 044, Phone. 7660000. |
| Printed at | | Sri Sai Ram Printers,<br>Hyderabad - 500 004, Phone. 3232316. |




# Tridandi Chinna Srimannarayana Ramanuja Jeeyar Swamy

Jeeyar Educational Trust,
Sitanagaram - 522 501
Guntur District (A.P.)
Ph : (08645) 72929, 72353


Dt : 10.4.02

శ్రీమతే నారాయణాయ నమః
అనేకానేక మంగళాశాసనములు!

అతిగహనాలైన దార్శనిక మర్మాలను, ఉపాసనాప్రక్రియలను సాంప్రదాయిక సిద్ధాన్తాలను సహితం సర్వజనహృదయంగమం చేయాలనే తలంపుతో ఆవిర్భవించిన అనర్ఘసాహిత్యమే స్తోత్రజాలం. అటువంటి స్తోత్ర లక్షణాలనే అనుసరించినా పద్యసంఖ్యా పరిమితిని బట్టి 'శతకాలు'గా పరిగణింపబడే స్తోత్రాలూ ఎన్నో ఉన్నాయి. తెలుగులో శతక వాఙ్మయానికి ఒక ప్రత్యేకత ఉంది. లౌకిక - పారలౌకిక విషయాలను రెంటినీ సమస్కంధంగా శతక బద్ధం చేయడం తెలుగులో చాలా ప్రహతంగా ఉంది. సమాజస్వభావాన్ని అడుగడుగునా విశ్లేషించి నీతిని గరపే వేమన - సుమతీ శతకం లాంటి వాటినే కాక, పసితనంలోనే దైవచింతనతోపాటు హృదయమార్దవాన్ని కూడా రంగరించిపోసే కృష్ణశతకం లాంటివాటిని కూడా తెలుగింటి పిల్లలచే చదివించేవారు వెనుకటి గురువులు.

శతకవాఙ్మయానికున్న సూటిగా హృదయంలోనికి ప్రవేశింపగల సామర్థ్యాన్ని గుర్తించియే దాశరథి శతకంలాంటి భక్తజనహృదయార్తిని ఆవిష్కరించే శతకరాజాలు

కూడా ఆవిర్భవించాయి తెలుగుభాషలో. తెలుగు జనుల హృదయాల్లో నిరంతరం ప్రతిధ్వనిస్తూనే ఉన్నాయి. ఈ కోవకు చెందిన స్తోత్రలక్షణ లక్షితమైన నారాయణ శతకంలోని ప్రతి పద్యమూ మళ్ళీ మళ్ళీ పాఠకులను ప్రేరించి చదివించే లక్షణం కలిగి ఉందనడం ఉపచారవచనం కాదు.

ఇది అవడానికి శతకమే అయినా, ఎన్నో సాంప్రదాయిక మర్మాలను వ్యక్తపరచిన గ్రంథరాజం. ఇది వ్యాఖ్యాన సాపేక్షం కాకున్నా, వ్యాఖ్యానమూలంగా మరెన్నో అందాలు వెలికివచ్చే అవకాశం ఉన్నందున శ్రీమాన్ కె.వి. రాఘవాచార్యులవారు దానికి సంప్రదాయ వివరణ శైలితో కూడిన చక్కని వ్యాఖ్యను సంతరించి బంగారానికి తావిని చేకూర్చారు. ఒకమాట.....

రెండవపద్యంలో 'జనస్తబ్ధుండ' అని ఉంది. దానికి 'పుట్టుకతోనే మర్యాదనెరుగని సోమరిని' అని శ్రీ ఆచార్యులవారు వివరించడాన్ని బట్టి - బహుశః ఇది 'జనిస్తబ్ధుండ' అని అయి ఉండవచ్చని మేం భావిస్తున్నాం. ఈ పద్యంలోని వ్యాఖ్యలో ద్వయమంత్రార్థవివరణం చేశారు. ఈ పద్యంలోను తర్వాతి పద్యంలోను నారాయణ శబ్దార్థాన్ని సాంప్రదాయికంగా వివరించారు. ఇలాగే ప్రతిపద్యంలోను సాంప్రదాయిక వివరణలను - విడువకుండా చక్కటి వ్యాఖ్యను వెలయించి, ఈ శతకానికి సర్వ స్పృహణీయతను, ఉదాత్తతను దర్శింపజేశారు శ్రీ రాఘవాచార్యులవారు.

వీరి కృషికి అనేక మంగళాశాసనపురస్కృతాభినందనలు తెలియజేస్తూ, ఇలాంటి వ్యాఖ్యలతో చక్కటి శతకవాఙ్మయాన్ని లోకానికి అందిస్తున్న ప్రకాశకులకు కూడా అనేక మంగళాశాసనాలు చేస్తున్నాం. సంస్కారవంతమైన పాఠకలోకం దాన్ని ఆదరించగలదని ఆశిస్తున్నాం.

జై శ్రీమన్నారాయణ!

(శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామి)

సదాశయములుండటంవేరు

పదిమందినికూడగట్టుకొని వాటి సాధనకు కృషి చేయటం వేరు

సామర్థ్యము, దీక్ష, నేర్పూ, ఓర్పు లేనిదే అది సాధ్యంకాదు

ఇవన్నీ మూర్తీభవించి

చేసిన ఉద్యోగానుభవం వినియోగించి

శ్రీ పావని సేవా సమితి కార్యదర్శి అయి

వయసు భారమనక

సర్వకార్యక్రమాలకూ చక్కని రూపమిచ్చి

జయావహముగా నడిపిస్తున్న మిత్రులు

శ్రీ గట్టుపల్లి చెంచు రామారావు గారికి

(శ్రీ జి. సిహెచ్. రామారావు)

సప్తతి ప్రవేశ సందర్భములో

- చల్లా సాంబిరెడ్డి

శ్రీశో ౬ వ్యాత్

# ముందుమాట

ఆంధ్రవాఙ్మయంలో శతక సాహిత్యప్రక్రియ ఎంతో వైవిధ్యాన్ని సంతరించుకున్నది. ఇష్టదైవతాన్ని భక్తితో స్తుతించిన సంస్కృత స్తోత్రాల పద్ధతులు తెలుగు భక్తి శతకాలలో గోచరిస్తుంటాయి. శతకప్రక్రియ నాటికీ, నేటికీ అనువాదంకాక, స్వోపజ్ఞకమై మకుట వృత్తసంఖ్యానియమితమై భాసిస్తున్నది.

నారాయణ శతకం శార్దూల మత్తేభవృత్తాలతో, నూట ఐదు పద్యాలతో భక్తి రసభరితమైనది. వెల్లంకి తాతంభట్టు, కస్తూరి రంగకవిలాంటి లాక్షణికులు దీన్ని పేర్కొన్నందువల్ల ఇది ప్రాచీన మైన శతకం. వేదశాస్త్రాలను బాగా విని, వ్యాసభాగవతాన్ని పలుసార్లు పఠించి, సంస్కృతస్తోత్రాలను పుక్కిట బట్టి, అంతకు ముందున్న శతకాల ఛాయను గ్రహించి, శ్రీమన్నారాయణుని అనుగ్రహాన్ని పొందడానికి ఆర్తితో పద్యరచనాభ్యాసం చేసినట్లున్న శతకమిది.

ఈ శతకంలోని పద్యాలు సప్తశీర్షికలుగా విభక్త మైనందువల్లనూ, శాబ్దికంగా ఏ కవి శైలితోనూ సామ్యంలేనందువల్లనూ, గహనమైన శాస్త్రార్థాలను లలితమైన అలతి పదాలలో ప్రకటిస్తున్నందువల్లనూ కావ్యకళాభిజ్ఞత స్ఫురిస్తున్నది.

శతకం జగత్కారణుడైన పరబ్రహ్మతత్త్వాన్నీ, స్వరూపగుణవిభూతులనూ, దశావతారాలనూ అద్భుతంగా ఆవిష్కరిస్తున్నది. నారాయణుని నామం మంత్రరాజమనీ, తిరుమంత్రమనీ, అదిరహస్యమహిమను పాటిస్తుందనీ, శ్రుతి కళాసిద్ధాంతమనీ "హరుని న్నద్రిజ నాంజనేయుని'' మొదలైన భక్తులనెందరినో ఎడబాయకుంటుందనీ 'నామప్రభావదశకం' విశదీకరిస్తుంది. పరత్వ, సౌలభ్యాలను ప్రకటించిన శ్రీకృష్ణభగవానుని లీలలను హృద్యంగా చిత్రించడానికి 'కృష్ణావతారవింశతి' ప్రత్యేకింపబడింది. భక్తి రూపాపన్నజ్ఞానోపాసనతో గమ్యమైనది మోక్షం కాబట్టి 'జ్ఞానవింశతి', 'మోక్షవింశతి' అనే వేర్వేరు శీర్షికలతో నారాయణుని విభవైశ్వర్యాలను విలక్షణంగా విశ్లేషిస్తూ ప్రదర్శిస్తున్న పద్య శతక మిది.

ద్విత్వ నకార సంధులు, క్త్వార్థక సంధులు, వైరి సమాస పదాలు సాధారణంగా నాటికావ్యభాషాప్రవాహంలో దొర్లినవే అనడం వింతకాదు. (ధ్రువు - దీవ్యత్), (పెను - సేవించు) యతి మైత్రి భంగమైనందువల్ల '28' వ పద్యంలోని మూడవపాదమూ, '94' వ పద్యంలోని రెండవపాదమూ, ప్రామాదికంగా జారినట్లు కనిపిస్తున్నది.

చిత్త శుద్ధికల భాగవతోత్తము లెవ్వరూ ప్రాపంచిక భోగాలకోసం ఆరాటపడరు. కీర్తికోసం కక్కుర్తిపడరు. నిజనామోద్ఘాటనం చేసుకోరు.

భగవద్బంధువు"నరహరి తనోర్దాస దాసస్య దాసః"అనే కాక 'దాసి' పదంతో తనలో స్త్రైణాన్ని జాగరితం చేసి, మధుర భక్తి స్ఫోరకంగా వర్తిస్తూ కవిలోక మూర్ధన్యుడవుతాడు.

నారాయణ శతకం బమ్మెరపోతన రచితమని జనశ్రుతి. శతకంలో కవిపేరు కానరానందువల్ల పండితులు, పరిశోధకులు పోతన రచన కాదంటారు.

"ఇది శ్రీ పరమేశ్వరకరుణాకలిత కవితా విచిత్ర కేసన మంత్రి పుత్ర సహజపాండిత్య పోతనామాత్య ప్రణీతం బైన నారాయణ శతకము సంపూర్ణము" అనే శతకాంతగద్యం, రెండు పాతకాగితపు వ్రాత ప్రతులలో కనబడుతుందట. తాళపత్ర గ్రంథాలలో మాత్రం లేదట. గ్రంథాంతంలో ఈ గద్యను వ్రాసినసిరా వేరుగా కనబడినందువల్ల, ఇది పోతనశతకమని విశ్వసించిన వారెవ్వరో తర్వాత దీన్ని చేర్చియుంటారని ఊహించారు. పోతనగారికి ప్రియమైన అనుప్రాసాలంకారాలు గానీ, భాగవతపద్య భావరచనా సౌందర్యంగానీ, నారాయణశతకంలో కనబడనందువల్లనూ ఇది పోతన రచన కాదన్నారు.

పోతరాజుగారు గోదావరికి పోయి చంద్రగ్రహణ సమయాన పట్టు స్నానం చేసి ధ్యాన మగ్నుడైనప్పుడు కాంతాసమేతుడైన ఒకరాజ పుత్రుడు సాక్షాత్కరించి, తాను శ్రీరామచంద్రుడననీ, తన పేర శ్రీమహాభాగవతాన్ని తెలుగు చేయుమనీ, భవబంధాలు తెగుతాయనీ ఆనతిచ్చాడు. వెంటనే పోతన ఆశ్చర్య పడి ఇలా అన్నాడు.

"పలికెడిది భాగవతమఁట
పలికించెడి వాఁడు రామభద్రుండఁట నేఁ
బలికిన భవ హరమగునఁట
పలికెద వేరొండుగాథ పలుకగనేలా " (భాగవతం. 1-16) అని.

పర్వదివసాల్లో గోదావరికి పోయి అవశ్యంగాస్నానం చేయడం ఆచారం. "ధర్మ పురి

లక్ష్మీనాథనారాయణా" (97ప.) అని ఈ శతకంలో ఉంది. కరీంనగరం జిల్లాలో ఉన్న ధర్మపురి గోదావరీ తీరాన ఉంది. ఆదిలక్ష్మీ నృసింహక్షేత్రం. బమ్మెరకు తక్కిన తీర్థక్షేత్రాలకంటె దగ్గరి క్షేత్రం ధర్మపురి. తాను తరచుగా పోయి తీర్థమాడి, స్వామి దర్శనం చేసుకునే భాగ్యాన్ని కలిగిస్తున్నందువల్ల, తన శతకంలో ఆస్వామిని విధిగా స్మరించాలనుకొన్నాడేమో!!కానీ 'నృసింహ'పదం 'చ(ట)ం' లో ఇముడలేదు. కాబట్టి, 'లక్ష్మీనాథ' పదాన్ని పర్యాయంగా ప్రయోగించి ఉంటాడు.

సాహిత్య పరిశీలకులు 'ధర్మపురిలో ఉండే స్వామిమీద ఎవరో వ్రాసిన శతక మిది' అన్నారు.

'పోతనకు 'బ్రహ్మ' యన్నచో చాలదు "తలవాకిట వాణిగలపోడిమి చే వాడిమి కెక్కిన నలుమొగంబుల తక్కరి గొంటు" అని బ్రహ్మాండముగ విస్తరించి చెప్పిననే యాతనికి తృప్తి' అని పుట్టపర్తి నారాయణాచార్యులుగా రన్నమాట నిజమే.

నారాయణ శతకంలో పరబ్రహ్మను గూర్చి "బ్రహ్మాండావలిలోన సత్వగుణివై బాహ్యాంబునందాదిమబ్రహ్మాఖ్యంబరతత్త్వబోధములకున్ భవ్యాధినాథుండవై"(9) అన్న పద్యం గమనీయం.

ఏదేమైనా, నారాయణశతకం పోతన రచించాడనియే ప్రతీతికదా! "భక్తి జ్ఞాన వైరాగ్యములు ఈశతకమున బీజరూపముననున్నవి...... పోతన భాగవతాంధ్రీకరణకు పూర్వము దీనిని చెప్పెనని ఊహింపవచ్చును" అన్నారు 'స్వామి శివశంకరస్వామి' వారు.

వాస్తవంగా, ఈ శతకరచనలో పొడసూపిన భావసౌందర్యం భాగవత రచనలో పరిపుష్టి చెందిన దనడం సమంజసం.

నీతి భక్తి భావబోధకాలైన శతకాలు బాలబాలికలను విజ్ఞాన వంతులుగా చేయడానికి అధికంగా ఉపయోగపడుతాయి. వేదశాస్త్రేతిహాస పురాణాల సారాంశాలను సంగ్రహించుకున్న శతకాల సౌరభాన్ని పలుదెసల ప్రసరింప జేసే వ్యాఖ్యానాలను వ్రాయించి, నేటి యువకుల, భావిపౌరుల హృదయాలను జ్ఞాన గంధవిలసితాలు గా జేయడానికి ఉద్యమించిన శ్రీపావని సేవాసమితి అధ్యక్షులైన చల్లా సాంబిరెడ్డిగారు సర్వదా సర్వథా అభినందనీయులు. శ్రీపావని సేవాసమితి పాలకవర్గ సభ్యులు బహుధా ప్రశంసనీయులు.

నారాయణ శతకానికి వ్యాఖ్యానం రచించే అవకాశం నాకు కలిగించిన శ్రీ చల్లా సాంబిరెడ్డిగారికి ప్రత్యేకంగా నాహార్దిక ధన్యవాదాలు.

ఈ వ్యాఖ్యను వ్రాయడానికి ప్రేరకులైన సహృదయులూ, విద్వత్కవులూ అయిన శ్రీమాన్ ఉత్పల సత్యనారాయణాచార్యుల వారికి సప్రశ్రయ నమస్సుమాంజలులు.

శతక వ్యాఖ్యా పరంపరను పర్యవేక్షిస్తున్న పాండిత్యపాథోనిధులూ, ఆంధ్రవ్యాస బిరుదాంచితులూ అయిన బ్రహ్మశ్రీ ఏలూరిపాటి అనంతరామయ్య గారికి నా హృదయపూర్వకాభివాదాలు.

రాఘవీయేతి వ్యాఖ్యేయం ప్రణీతాఽజ్ఞానినా మయా।
సౌగుణ్యం యది తత్సర్వ మాచార్యకరుణాఫలమ్॥

భాగవత చరణ రేణువు

**కే. వి. రాఘవాచార్యులు**

ఇంద్రకుటీర్
2-1-45, ప్లాట్ నం.101
నల్లకుంట, హైదరాబాదు - 44
చిత్రభాను శ్రీరామనవమి,
21-4-2002.

# ఒక్క మాట

శ్రీకృష్ణానుచింతనులు, పరమ ధార్మికులు అయిన శ్రీ చల్లా సాంబిరెడ్డి మహోదయులు శ్రీ పావని సేవా సమితి పక్షాన భాగవత సుధాలహరి ప్రచురణ పరంపరలో తొలుతగా పోతనగారి గజేంద్రమోక్షస్తవాన్ని విపుల వ్యాఖ్యాన సహితంగా ప్రచురించి ధన్యులయినారు. వారి సవ్యాఖ్యాన శతక యోజనలో కూడా పోతనగారి శ్రీనారాయణ శతకాన్ని చేర్చి, ఈనాడింత అద్భుతమైన వ్యాఖ్య వెలయింపజేయడం ద్వారా ఆ మహాత్ముని కీర్తిని దశదిశావ్యాప్తం చేసి అగణ్య పుణ్యులయినారు. తమ వదాన్యతకు, మాన్యతకు సాఫల్యం చేకూర్చుకొన్నారు. వారి శతక ప్రకాశన యోజన ఈ శతకవ్యాఖ్యతో పూర్తిగా సఫలమైనట్లుగా భావిస్తున్నాను.

పోతనగారు శ్రీ కైవల్య పదంబు చేరుకొనడానికే మహానందాంగనాడింభకుడైన శ్రీకృష్ణ భగవానుణ్ని వేడుకొని శ్రీమదాంధ్ర భాగవత మకరందాన్ని మనకందజేశారు. ఆ భక్తాగ్రగణ్యుడు తానాశించిన శ్రుతిశిరో భూషణములైన శ్రీకృష్ణుని శుభచరణాల సన్నిధికి చేరుకొన్నాడనడంలోను, దివ్య సూరులలో ఒకడై విరాజిల్లుతున్నాడనడంలోను సందేహం లేదు. భగవచ్చరణ సన్నిధికి చేరిన పరమభక్తుని ఆశీస్సులు మరింత శక్తిమంతములు, అమోఘము లవుతాయని శాస్త్ర గ్రంధాలు చెబుతున్నాయి. కాబట్టి ప్రచురణకర్త అయిన శ్రీ సాంబిరెడ్డి గారిపైన, శ్రీ నారాయణ శతక వ్యాఖ్యాత అయిన శ్రీ రాఘవాచార్యులగారిపైన పోతనగారి ఆశీర్వర్షం తప్పకుండా కురుస్తుందని నేను విశ్వసిస్తున్నాను.

శ్రీమాన్ కె.వి. రాఘవాచార్య మహోదయులు శ్రీమద్వేదాంత దేశికుల వారి పాదుకా సహస్రమనే ఉద్గ్రంథానికి అనిదంపూర్వమైన విస్తృత వ్యాఖ్య వెలయించిన ఉద్దండ పండితులు. సంస్కృతాంధ్ర ద్రావిడాంగ్లభాషలలో నిష్ణాతులు. శ్రుతి స్మృతి పురాణేతి హాసకావ్యశాస్త్ర ప్రపంచాన్ని పుక్కిటబట్టిన సాహిత్య పాథోనిధి కుంభసంభవులు. అయినా నిగర్విచూడామణులు. శీల సమున్నతులైన సుగమ్యులు. పటాటోప మెరుగని పండిత ప్రకాండులు. ఇట్టి మహనీయుడు పోతన కృత శ్రీ నారాయణ శతకానికి వ్యాఖ్యాత కావడం నా మటుకు నాకు హార్దిక ప్రసన్నతను చేకూర్చింది.

ఇక ఈ శతక వ్యాఖ్యా సమాఖ్యను గూర్చి నేనేమి చెప్పగలను?

బహుజ్ఞతా ధురంధరులైన శ్రీమాన్ రాఘవాచార్యవర్యులు ప్రాచీన పండితుల అగాధవివేచనను, వారి తత్త్వజ్ఞానాన్నీ సందర్భానుసారంగా తమ వ్యాఖ్యానంలో

విశేషించి ఆంధ్ర భక్తి శతకవాఙ్మయక్షేత్రాన్ని సుసమృద్ధమూ కృతార్థమూ చేశారనడంలో అత్యుక్తి లేదు. ఈ శతకంలోని ప్రతిపద్య వ్యాఖ్యానమూ ఈ విషయాన్నే నిరూపిస్తున్నది. ఒక్కొక్క పద్యానికి శ్రుతి పురాణశాస్త్రాలంకార సమన్వితంగా సమకూర్చిన ఈ వ్యాఖ్య ఒక సుందర సువర్ణ శృంఖల. అనేక నూతన విశేషాలను ఉటంకించి విద్వజ్జన హృదయాలలో పరితోషం సముత్పన్నం చేయడమే వ్యాఖ్యాతృ చూడాంత సాఫల్య మవుతుంది. పాఠకుల హృదయాలలో విశ్వాసాన్ని పాదుకొల్పే గురుతరభారం వ్యాఖ్యాత మీదనే ఉంటుంది. ఈ రెంటిని తత్త్వాభినివేశంతో సామర్థ్యవంతంగా ఈ గ్రంథకర్త నిర్వహించారు.

శ్రీమాన్ రాఘవాచార్యులుగారు శ్రీ వైష్ణవ సంప్రదాయ వేత్తలు. భక్తి జ్ఞాన వైరాగ్య సంపన్నులు. భగవన్నిష్ఠాపరులు. ఈ వ్యాఖ్యాన కార్యాన్ని భగవత్సేవగా భావించి శ్రీమన్నారాయణ చరణారవిందాలకు నివేదించి కార్యసిద్ధిని పొందారు. సత్పురుషులు తమ కార్యసిద్ధికి భగవదనుగ్రహమే కారణమనుకొంటారు. కానీ, తమ బుద్ధి వైదగ్ధ్యమని భావింపరు. ఈ విషయమే వారి మున్నుడిలో పలుకుబడిలో, నడవడిలో కూడ కానవస్తుంది.

శ్రీమాన్ రాఘవాచార్యులు గారు కేవలం సాహిత్య రంగంలోనే కాక, సాంసారిక రంగంలో కూడా శీల సమున్నతులై ఆదర్శనీయులైనారు. వారి కుమారుడు శ్రీ కె.వి. రమణ ఐ.ఎ.ఎస్. మహోదయులు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంలో ప్రఖ్యాతి కెక్కిన ఆఫీసరు. అయినా, ఆయన తండ్రిని చూడగానే పాదాభివందనం చేయక మానరు. ఇక వీరి అనుజులు తండ్రిని సేవించినట్లుగా వీరిని సేవించడం నేనెరుగుదును. ఒకానొక సాహిత్య సభలో ఈ సాధుశీలిని గూర్చి నేనప్రయత్నంగా చెప్పిన పద్యం ఇప్పటికీ గుర్తున్నది.

జనమత వర్తనుల్ పరమ సాధువులిద్దరు అగ్రజన్ముని
జనకునిగాగ కొల్చు సహ జన్ముల పేర్మిని ఉగ్గడింతునా?
అనుజుని పుత్రుగా దలచు అగ్రజు కూర్మిని ప్రస్తుతింతునా?
పనుపడుగాత! రాఘవుని భ్రాతృత సర్వజనమ్ములందునన్

తొలిసారిగా శ్రీనారాయణ శతకాన్ని సుందర వ్యాఖ్యా సమంచితం చేసి అటు భగవంతుణ్ని, ఇటు భక్తుడైన పోతన గారిని సంతుష్టిపరిచే మహాభాగ్యం శ్రీ రాఘవాచార్యుల వారికి దక్కింది. ఈ కారణంచేత కూడా వీరు సత్కర్ములు - సాధుకర్ములు అయినారు. శతక జగత్తులో ఈ శ్రీ నారాయణ శతకం సమ్మాననీయమైన స్థానాన్ని పొందడం సత్యం. శ్రీ చల్లా సాంబిరెడ్డిగారి సదాశయాలు జయప్రదాలు కావడమూ తథ్యం.

**ఉత్పల సత్యనారాయణాచార్య**

# నారాయణ రాఘవీయం

ఆంధ్రవ్యాస, కవికులరత్నదీప, వైదికాగమాలంకార, పురాణ పరమేష్ఠి, కవికుల వతంస, భాషాప్రవీణ, ఏలూరిపాటి అనంతరామయ్య ఎం.ఏ. తెలుగు, ఎం.ఏ సంస్కృతము, బి.ఇడి., రిటైర్డ్ గుంటూరు సంస్కృతకళాశాల ప్రిన్సిపాల్. డీన్ఆఫ్ ఓరియంటల్ ల్యాంగ్వేజెస్, నాగార్జున విశ్వవిద్యాలయము, అనంతసాహితి కార్యదర్శి, 16-1-24/6/సి/1 శ్రీసాయి ఎపార్ట్‌మెంట్స్, కమ్యూనిటీహాలు వద్ద, సైదాబాద్ కాలనీ, హైదరాబాద్ - 500 059, ఫోన్ నెం. 4072913 తేది 26.03.02

మ. ధరసింహాసనమై, నభంబుగొడుగై, తద్దేవతల్ భృత్యులై,
పరమామ్నాయము లెల్ల వందిగణమై, బ్రహ్మాండమాకారమై,
సిరి భార్యామణియై విరించికొడుకై, శ్రీగంగ సత్పుత్రియై,
వరుసన్నీ ఘన రాజసంబు నిజమై వర్ధిల్లు నారాయణా.

సుమారు అరవై సంవత్సరాల క్రితం తెలుగువారిలో అక్షరాస్యులలో ఈ పద్యం రాని వాడు ఉండేవాడు కాదు.

అయితే, 'తల్లీ నిన్ను దలంచి' పద్యంలాగానే, ఇదికూడా తెలుగు వారికి మిక్కిలి ఇష్టమైన పోతనామాత్యుడు వ్రాసినది అని చదివే వారికికాని, దీనిని చెప్పేవారికి కాని, చాలామందికి తెలిసి ఉండక పోవచ్చు. 'తల్లీ నిన్ను దలంచి' అన్నపద్యం ఎంత సూటిగా చదువరి హృదయాన్ని చదువులమ్మకు తెలియచేస్తుందో, ధరసింహాసనమై అన్న పద్యం అంత స్పష్టంగా పరమాత్మప్రాభవాన్ని వర్ణిస్తుంది. ఇంతకూ, ఈ పద్యం నారాయణ శతకంలోనిది. ఈ శతకం లోని పద్యాలు భాగవతంలోని పద్యాలంత ప్రౌఢముగా ఉండని కారణముచేత, ఇది పోతన వ్రాసినదా కాదా అనే విషయంలో చాలా తర్జనభర్జనలు జరిగాయి. ఏమైనా నారాయణశతకం పోతన వ్రాసినదే అనిన ప్రజల హృదయాన్ని బట్టి, శ్రీచల్లా సాంబిరెడ్డిగారు అధ్యక్షులుగాగల శ్రీ పావని సేవాసమితి వారు తాము ప్రచురించ దలచిన సవ్యాఖ్యాన దశశతకాలలో దీనిని చేర్చారు. మిగిలిన శతకాలకు లాగానే దీనికి ఉభయ వేదాంత ప్రవర్తక శ్రీమాన్ శ్రీమదిత్యాది కే.వి.రాఘవాచార్యులవారు వ్యాఖ్యాతగా లభించటం సేవాసమితి చిత్తశుద్ధికి ఫలం. శ్రీ రాఘవాచార్యుల వారు సంస్కృతాంధ్ర ద్రావిడాది భాషలలో నిష్ణాతులు. భాషా సాహిత్య వ్యాకరణాలంకారాది విషయాలలోనే కాక భక్తివేదాంత భగవత్ కాలక్షేప ప్రామాణిక గ్రంథ పరిశీలనములలో నిపుణులు. ఈ వ్యాఖ్యలో ప్రతిపదార్థ భావ -

విశేషాంశ వివరణములు ఉన్నవి. ఈ విశేషాంశ వివరణములో అయాశతకముల ప్రత్యేకతను కవి హృదయమును కనుగొనుటలో వ్యాఖ్యాతకు గల పాండిత్యానుభవములను పురస్కరించుకొని తారతమ్యములు కన్పింపవచ్చును. శ్రీనారాయణ శతకము శతక కర్త దృష్టిని బట్టి భాషాసాహిత్యాది విషయములకే కాక, తాత్త్విక విషయములకును ప్రాధాన్యమిచ్చిన శతకం. ప్రతిపాద్య విషయమేది అయినా కవి ఇట్టి దృక్పథము కలవాడైనప్పుడే కావ్యము గంభీరమైచర్వణ ప్రౌఢులకు సంతోషం ఇనుమడింప జేస్తుంది. వ్యాఖ్యాత పాండిత్యానుభవాదులను బట్టి కవి ఇంత ఉద్దేశించినాడా అని కూడా ఆయాతావులలో వ్యాఖ్యానము విస్మయం కలిగిస్తుంది. కవిః కరోతి కావ్యాని వ్యాఖ్యాతావేత్తి తద్రసం అనిన దానిని బట్టి సమర్థుడైన కవి తనకు గల ప్రతిభా వ్యుత్పత్త్యభ్యాసముల ప్రాచుర్యాన్నిబట్టి అలవోకగా అప్రయత్నసిద్ధముగా అనేక విషయములు నిక్షిప్తములు అయ్యేటట్లుగా అందమైన కవిత్వం చెప్పవచ్చు. వ్యాఖ్యాత వివరించిన విషయాలు ఒక్కొక్కపుడు కవికి కూడా విస్మయానందములు కలిగించవచ్చు. అట్టి వ్యాఖ్యాత ఒక రచనకు లభించటం ఆ రచయితా ఆభాషా దాని చదువరులూ చేసుకొన్న అదృష్టం. ఈ దృష్టితో చూచినప్పుడు, ఈ వ్యాఖ్యాత, నిస్సందేహముగా, అట్టి కోటికి ఎక్కదగినవారు. ఈ మాటకు ఈశతకములోని ప్రతిపద్యవ్యాఖ్యానమూ ఉదాహరణమే అయినప్పటికీ, మొదటి పద్య వ్యాఖ్యానము వంటివి ప్రత్యేకించి పేర్కొనదగినవి. దానిలో శ్రీశబ్దమునకు, నారాయణ శబ్దమునకూ, ఆయన **కళ్యాణ** గుణగణములకు, రెండవ పద్య వ్యాఖ్యలోను, చేసిన వివరణము ప్రత్యేకించి పేర్కొనదగినవి. మూడవ పద్య వ్యాఖ్యానములో దాస్య వివరణం వంటివి చాలా ఉపయోగకరమైనవి. ఐదవ పద్యంలో విద్యలకు చేసిన వ్యాఖ్యానం విజ్ఞాన విలసితమైనది. పరబ్రహ్మ స్వరూపము తెలియని ధర్మరహితమైన పాండిత్యం పనికి రాని కుక్క తోకవంటిది. అని చెప్పటమూ, దానికి చేసిన వివరణమూ ఆచార్యులవారి అనేక సంవత్సరముల బోధనానుభవానికి ఫలం. ఈశ్వర సంహిత, శంకరాచార్యోక్తులు మొదలైనవి ప్రామాణికములుగా స్వీకరించటం వారి లోకజ్ఞతకు నిదర్శనం. ఇందులోని అవతార దశక వ్యాఖ్యానం మరీముచ్చటగా ఉన్నది. త్రివిక్రమత్వానికి వారు చెప్పిన నిరుక్తి ప్రశంసనీయమైనది. షడూర్ములకు పదిహేడవ పద్య వ్యాఖ్యలో వారిచ్చిన వివరణం. కేవల సాహిత్యగాంధ్రకు తెలిసేది కాదు. దశావతారాలేకాక భగవంతుని అనేక అవతారాల ప్రశంస పురాణలలోనేకాదు, వేదాలలో కూడా స్పష్టముగా ఉన్నదని ఘంటా పథముగా చెప్పారు. ఆచార్యులవారు తాము ప్రతిపాదించ వలసిన విషయానికి సమర్థకంగా వేదాలు, శాస్త్రాలు, పురాణాలు, ఇతిహాసాలు, ప్రాచీన వ్యాఖ్యలు - వీటినే కాక అంతగా ప్రచారంలో లేని తెలుగు రచనలనుకూడా వినియోగించుకొన్నారు.

ఇది వారి నిరంతర గ్రంథానుశీలనాభ్యాసాన్ని తెలియచేస్తుంది. అకాండతాడవంకాకుండా సందర్భము దొరికి నప్పుడల్లా సాంప్రదాయిక విషయాలను వారు వివరించిన తీరు ముచ్చట గొలుపుతున్నది. ఇందుకు నామప్రభావ దశకమంతా ఉదాహరించదగినదే. అందులోనూ నారాయణ శబ్దార్థ విషయం. వీరి వ్యాఖ్యద్వారా మనకందించిన రత్నాలలో అష్టాక్షరాది వేణు గోపాలాష్టకం ఒకటి. దివ్య రూపదశకం, నామప్రభావదశకం, కృష్ణావతార వింశతి, జ్ఞానవింశతి ఆచార్యులవారి వ్యాఖ్యానశక్తికి నికషోపలాలు. ఎనభై రెండవ పద్యానికి వ్రాసిన వ్యాఖ్యలో ఆచార్యులవారు ఇచ్చిన ఉదాహరణలు రక్తి విరక్తి వాఙ్మయాలలో వారికి గల నైపుణ్యానికి నిదర్శనాలు. ఎనభై ఐదవ పద్యం వ్యాఖ్యలో పేరు చెప్పకుండా కాకాయ కంకాయచ యోది తేష్టం, దాశాయ కీశాయచ, రాక్షసాయ - అని ఉదాహరించటం వారు విశ్వ గుణాదర్శాది చంపువులు బాగాపరిశీలించారనటానికి ఉదాహరణం. ఒక్క భగత్గుణ దర్పణం క్షుణ్ణంగా చదివితేచాలు, సమస్త వేదోపనిషత్ శాస్త్రపురాణేతి హాసాంగ భాష్యాదుల పాండిత్యం కరతలామలకం అవుతుంది. ఈ రాఘవీయ వ్యాఖ్య బహువిషయ సంభరితమైనది. కడచిన కాలంలో గురువులవద్ద సంస్కృత కావ్యాదులు చదివేటప్పుడు వ్యాఖ్య ముఖ్యముగా మల్లినాథ వాఖ్య కూడా చదివించి, బోధించి, కంఠస్థము చేయించేవారు. దానితో పంచ కావ్యములు చదివితే చాలు, షట్ఛాస్త్రములు చదివితే కలిగే జ్ఞానము, సాహిత్యానికి సంబంధించినంతవరకు లభించేది. శ్రీపావని సేవాసమితి వారి పుణ్యమా అని శ్రీనారాయణశతకానికి అట్టి ఉత్తమ వ్యాఖ్య లభించింది. దీనిలో ధర్మ భక్తి జ్ఞాన వైరాగ్య సాహిత్య వ్యాకరణాలంకార ఛందోవిశేషాలకు అవసరమైన మేరకు చక్కని సమర్థమైన సప్రమాణమైన వివరణము ఉన్నది. ఈ గ్రంథము వ్యాఖ్యానముతో సహ తెలుగు ఎం.ఏ తరగతి వారికి పాఠ్యగ్రంథముగా నిర్ణయిస్తే ఆవిద్యార్థులకు అనేక విషయాలలో పాండిత్యం అలవడుతుంది. దీనిని వ్రాయించినందుకూ, వ్రాసినందుకూ శ్రీపావని సేవాసమితి వారినీ, శ్రీరాఘవాచార్యుల వారినీ అభినందిస్తున్నాను. శ్రీఆచార్యుల వారు పరిణతమైన వయస్సులో ఉన్నారు. వారి జ్ఞానం వృథాకారాదు. వారు ఇలా తమకు ఇష్టమైన గ్రంథములపై ఓపిక ఉన్నంతవరకు నిమిషం పోనివ్వకుండా వ్యాఖ్యలువ్రాస్తే, లోకానికి అందించేవారు ఉన్నారు. నాదిపూచీ. భగవానుడు వారికి అట్టిసంకల్పం కలిగించుగాక.

**ఏలూరిపాటి అనంతరామయ్య**

# మామాట

శ్రీపావని సేవాసమితి చేపట్టిన సవ్యాఖ్యాన శతక ప్రచురణ పరంపరలో శ్రీ నారాయణ శతకము ఆరవది.

మా మొదటి ప్రచురణ "మహాకవి" శ్రీ ఉత్పల సత్యనారాయణాచార్యవారి గోపీనయనోత్పలార్చిత వ్యాఖ్యతో శ్రీ కృష్ణశతకము వెలువడి పలువురి ప్రశంసలందు కొంది. ఇప్పుడు మరికొన్ని విశేషాంశాలతో పరివర్ధిత సంస్కరణ ముద్రణగా వెలువడుతోంది. ద్వితీయ ప్రచురణ భక్త రామదాసు ప్రణీతము - దాశరథి శతకము, ఆచార్య యం. కులశేఖరరావు గారి మనసోల్లాస వ్యాఖ్యతో ప్రచురితమై, ద్వితీయ ముద్రణ అయినది. తృతీయ ప్రచురణ - యథావాక్కుల అన్నమయ్య ప్రణీతము "సర్వేశ్వర శతకము" డా॥ముదిగొండ వీరభద్రయ్యగారి వ్యాఖ్యతో వెలువడి, ద్వితీయ ముద్రణ జరుగుతోంది. చతుర్థ ప్రచురణ 'ఆంధ్రవ్యాస' బ్రహ్మశ్రీ ఏలూరిపాటి అనంతరామయ్యగారి వివేకానందినీ వ్యాఖ్యతో శ్రీ బద్దెన కవి ప్రణీతము - సుమతి శతకము వెలువడి, జనబాహుళ్యములోనికి చొచ్చుకొని పోయి, ద్వితీయ ముద్రణ అయినది. మా పంచమ ప్రచురణ ధర్మపురి శ్రీ శేషప్పకవి ప్రణీతము శ్రీ నరసింహశతకము - జనప్రియ వ్యాఖ్యతో విద్వాన్, శ్రీ కసిరెడ్డి వెంకటపతిరెడ్డి గారిచే వ్యాఖ్య వ్రాయబడి, మార్చి 2002 లో పాఠకులకు అందించినాము.

ఇప్పుడు మీ ముందుకు వచ్చిన మా షష్ఠ ప్రచురణ శ్రీ బమ్మెర పోతనామాత్య ప్రణీతము - శ్రీనారాయణ శతకము. దీన్ని రాఘవీయ వ్యాఖ్యాసహితంగా అందించిన శ్రీమాన్ కె.వి.రాఘవాచార్యులు గారు పరమ వైష్ణవాచార్యులు. నిష్ఠాగరిష్ఠులు. వేద శాస్త్ర పురాణ కావ్య నాటకాలంకారాది బహుశాస్త్ర పారంగతులు. వారి కలం నుండి ఈ వ్యాఖ్య లభించటం శ్రీపావని సేవాసమితి అదృష్టంగా భావిస్తున్నాము. వారికి శ్రీ పావని సేవా సమితి హృదయ పూర్వక ధన్యవాదములు తెలుపుకొంటున్నది.

మరినాలుగు శతకాలు మీకు అందించాలనే మా ప్రయత్నము త్వరలో సఫలమౌతుందని మా ఆకాంక్ష. అవి డా॥ రవ్వా శ్రీహరి గారి వ్యాఖ్యతో భర్తృహరి (నీతిశతకము); 'ఆంధ్రవ్యాస' శ్రీ ఏలూరిపాటి అనంతరామయ్యగారి వ్యాఖ్యతో శ్రీ కాళహస్తీశ్వర శతకము; డా॥ కసిరెడ్డి వెంకటరెడ్డిగారి వ్యాఖ్యతో వేమన శతకము; డా॥ తిరుమల శ్రీనివాసాచారి గారి వ్యాఖ్యతో భాస్కర శతకము.

మా ప్రచురణల నుండి శ్రీకృష్ణశతకము; దాశరథి శతకము; మరియు సుమతి

శతకాలను ఆంధ్రప్రదేశ్‌లోని గ్రంథాలయాలకు డైరెక్టర్ ఆఫ్ పబ్లిక్ లైబ్రరీస్, హైదరాబాద్ వారి ఆర్డర్స్ ప్రకారం పంపటము జరిగినది. ఇది మాకెంతో ప్రోత్సాహాన్నిచ్చింది. మిగతాశతకాలకు కూడ వారి ప్రోత్సాహము లభించగలదని ఆకాంక్షిస్తున్నాము.

సవ్యాఖ్యాన శతక సాహిత్య ప్రచురణతోపాటు, భాగవతములోని కొన్ని ముఖ్య ఘట్టాలకు వ్యాఖ్యలు వ్రాయిస్తున్నాము. ఈ దిశలో "శ్రీమద్భాగవత సుధాలహరి" అనుపేర శ్రీబమ్మెరపోతనామాత్య ప్రణీతము - గజేంద్రమోక్షము - (సంస్కృత మూలసహితము) 'మహాకవి' - శ్రీమాన్ ఉత్పల సత్యనారాయణాచార్య వారి గోపీనయనోత్పలార్చిత వ్యాఖ్యతో వెలువడి - పండిత ప్రశంసలందుకొని - ద్వితీయ ప్రచురణ జరుగబోతోంది. ఈ పుస్తకాన్ని కూడ ఆంధ్రప్రదేశ్‌లోని వివిధ జిల్లా గ్రంథాలయాలకు, మరొకొన్ని ముఖ్యగ్రంథాలయాలకు డైరెక్టర్ ఆఫ్ పబ్లిక్ లైబ్రరీస్ వారి ఆర్డర్స్ ప్రకారం పంపటం జరిగింది. ఈ పరంపరలో ప్రొఫెసర్ యస్. లక్ష్మణమూర్తిగారు, వరంగల్‌వారి వ్యాఖ్యతో 'రుక్మిణీ కళ్యాణము', మహాకవి శ్రీమాన్ ఉత్పల సత్యనారాయణాచార్య వారి కలం నుండి మరొక గోపీనయనోత్పలార్చిత వ్యాఖ్యతో "భక్తప్రహ్లాద" ప్రచురించాలనే మా ఆకాంక్ష త్వరలో నెరవేరగలదని ఆశిస్తున్నాము.

బడి - గుడి అనే మా నినాదంలో 'బడి'కి సంబంధించినంతవరకు బాలబాలికలలో శతక పఠన ప్రోత్సహించటానికి శ్రీపావని సేవాసమితి ప్రాధాన్యము నిచ్చినది. ఇంతవరకు ఈ జంట నగరాలలో శ్రీకృష్ణశతకము, సుమతి శతకము, వేమన శతకాలలో పోటీలు నిర్వహించి వేలాది విద్యార్థినీ విద్యార్థులకు ప్రోత్సాహన్నిచ్చింది. ఇతర జిల్లాలలోకూడ కొన్ని చోట్ల ఈ పఠన పోటీలు జరుగుతున్నాయి. ఈ సంవత్సరము (2002)లో రెండుశతకాలలో ఒకే సారి పోటీలు నిర్వహిస్తున్నాము. అవి శ్రీకృష్ణశతకము; దాశరథిశతకములు. పద్యానికి పది రూపాయలు ప్రథమ బహుమతిగా విద్యార్థులకు ఇచ్చి, ఈ పోటీలకు ఒక అర్థవంతమైన సంప్రదాయాన్ని నెలకొల్పటం జరిగినది. ఈ పోటీల నిర్వహణలో ముఖ్యపాత్ర సాధన సాహితి స్రవంతి సంస్థ నిర్వహించినది. పోతే గుడి విషయం. శ్రీకృష్ణశతకము నుండి ఎంపిక చేసిన 50 పద్యాలను 'మహాకవి' ఉత్పల సత్యనారాయణాచార్యుల వారి వ్యాఖ్యతో 'గానమాధురి' చిత్తూరు శ్రీమతి రేవతీ రత్నస్వామిగారి గానంతో ఆడియో క్యాసెట్ చేశాము. అలానే దాశరథి శతకమునుండి ఎంపిక చేసిన 37 పద్యాలను 'మహాకవి' శ్రీమాన్ ఉత్పల సత్యనారాయణాచార్యుల వారి ఉపోద్ఘాతముతో, బందరు శ్రీ సుందరకాండమూర్తిగారి గానంతో మరొక క్యాసెట్ విడుదలైంది. ఈ రెండు క్యాసెట్స్ భద్రాచల శ్రీసీతారామచంద్రస్వామివారి సన్నిధిలో సెప్టెంబరు - 2001లో ఆవిష్కరింపబడినవి. ఆంధ్రప్రదేశ్‌లోని ముఖ్య దేవాలయాలకు

ఈ రెండుక్యాసెట్స్ ఉచితముగా ఇవ్వటానికి నిశ్చయించి ఆంధ్రప్రదేశ్ దేవాదాయ ధర్మాదాయశాఖ కమీషనర్ వారి సహకారము కోరినాము. వారు దయతో అంగీకరించి 1200 క్యాసెట్స్ దేవాలయాలకు పంపిణీ చేయటానికి సహకరించారు. వారికి మాధన్యవాదములు తెలుపుకొంటున్నాము.

శ్రీనారాయణ శతకానికి శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జియర్ స్వామి వారు అత్యంత అనుగ్రహముతో తమ మంగళాశాసనములను మాకు లభింపజేశారు. ఇది మా అదృష్టము, మా ఈ శతకసాహిత్య సవ్యాఖ్యాన ప్రచురణకు శ్రీరామరక్ష. వారికి మా సాష్టాంగ నమస్కారములు.

మనము అనేక సందర్భాలలో అనేకమైన బహుమతులను మన ప్రేమ పాత్రులకు అందజేస్తుంటాము. రకరకాల వస్తువులరూపంలో ఇచ్చే బహుమతులు చూడటానికో, వాడటానికో మాత్రమే పనికి వస్తాయి. ఇలాంటి ఉత్తమ భావాలుగల మిక్కిలి విలువైన తక్కువ ఖరీదులో లభించే అందమైన పుస్తకాలు బహూకరిస్తే కంటికి ఇంపుగా ఉంటాయి. చదివినప్పుడూ మనిషిని ఉన్నతస్థితికి తీసుకొని వెళ్లుతుంటాయి. ఈ అలవాటు మనం ఇంకా పెంచుకోవాలి.

పరమ భాగవత రసికులై, శ్రీ కృష్ణైక జీవనులై, పరిణత ప్రజ్ఞులైన 'మహాకవి' శ్రీమాన్ ఉత్పల సత్యనారాయణాచార్యవారు ఈ పుస్తకానికి 'ఒక్కమాట' అనుగ్రహించారు. ఆ మహా విద్వాంసునికి సర్వదా కృతజ్ఞులము.

ఈ పుస్తకానికి 'నారాయణ రాఘవీయం' అనుగ్రహించిన ఆంధ్రవ్యాస, కవికుల రత్నదీప, వైదికాగమాలంకార, పురాణపరమేష్ఠి, కవికుల వతంస, శ్రీ ఏలూరిపాటి అనంతరామయ్య మహోదయులకు కృతజ్ఞతలను తెలుపుకొంటున్నాము.

ఈ పుస్తకానికి ముఖపత్రాలంకరణ కావించిన ప్రఖ్యాత చిత్రకారులు శ్రీ గంగాధర్ గారికి; ముచ్చటగా టైప్ చేసిన ఫాంట్‌లైన్ గ్రాఫిక్స్ అధినేత్రి శ్రీమతి నిర్మలగారికి, సుందరముగా ముద్రించిన శ్రీసాయిరాం ప్రింటర్స్ అధినేత శ్రీనాగేశ్వరరావుగారికి, మిత్రులకు, శ్రేయోభిలాషులకు మా కృతజ్ఞతలు.

**జి.సి.హెచ్.రామారావు**

కార్యదర్శి

శ్రీపావని సేవాసమితి.

శ్రీసాయి నిలయము

ఎస్.ఆర్.టి.270, సనత్‌నగర్,

హైదరాబాద్ - 500 018. ఫోన్.3702898.

# శ్రీ

# నారాయణ శతకము

**శ్రీ రామామణిపాణిపంకజమృదుశ్రీతజ్ఞపాదాబ్జ, శృం**
**గారాకారశరీర, చారుకరుణాగంభీర, సద్భక్త మం**
**దా, రాంభోరుహపత్రలోచన, కళాధారోరుసంపత్సుధా**
**పారావారవిహార, నాదురితముల్ భంజింపు నారాయణా॥** 1

అర్థం: శ్రీ... పాదాబ్జ! శ్రీ = లక్ష్మీదేవి అనే; రామామణి = నారీరత్నంయొక్క; పాణి పంకజ = పద్మాలవంటి హస్తాల యొక్క; మృదుశ్రీతజ్ఞ = మార్దవశోభనెరిగిన; పాద + అబ్జ = పాదపద్మాలుగల వాడా! శృంగార + ఆకారశరీర = శృంగారమైన అవయవాలుగల శరీరము కలవాడా! చారుకరుణాగంభీర = అందమైన, అగాధమైన దయగలవాడా! సద్భక్త మందార = చక్కనిభక్తి కలవారికోరికలనీడేర్చే కల్పవృక్షరాజమా! అంభస్+ రుహపత్రలోచన = కమలదళనయన! కళా-విహార! కళా = కళలకు; ఆధార = జీవనాడియైన; ఉరుసంపత్ = గొప్పవిభూతితో; సుధాపారావార = అమృతమయమైన సముద్రమందు; విహార = ఉల్లాసంగా విలసిల్లువాడా! నారాయణా = ఓ పరమాత్మా! నా దురితముల్ = నేను చేసిన పాపాలను; భంజింపుము = తెగనరకుము.

తాత్పర్యం : శ్రీదేవి, తన కేల్దమ్ములచే మృదువుగా పాదకమలసేవ చేసే దివ్యమంగళ విగ్రహా! అపారదయార్ద్రహృదయా! ఆశ్రితజన మందారా! పద్మదళాయతాక్షా! కళలకాధారమైన గొప్ప ఐశ్వర్యంతో సుధాజలధిలో స్వేచ్ఛగా విహరించే ఓ నారాయణా! నన్ను పాపబంధాలనుంచి విముక్తుణ్ణి చేయవయ్యా!

**వ్యాఖ్య : భవబంధవిమోచనమే ఈ శతకరచనోద్దేశం.**

శ్రీదేవి రామామణి. లక్ష్మీదేవి మాహాత్మ్యాన్ని 'శ్రీ' శబ్దం ప్రకటిస్తుంది.

1. అందరిచే ఆశ్రయింపబడుతుంది శ్రీదేవి.
2. తాను నారాయణుణ్ని ఆశ్రయిస్తుంది.
3. ఆశ్రితుల మాటలను తాను వింటుంది.
4. ఆశ్రితుల ఆర్తిని తన వల్లభునికి వివరిస్తుంది.
5. దోషాలను పోగొడుతుంది.
6. విశ్వమంతటా రమణీయగుణాలతో వ్యాపించి ఉంటుంది.

"తదిహ భవతీం శ్రీరితి విదుః" అందువల్ల నిన్ను 'శ్రీ' అన్నారు, అని శ్రీ శబ్దానికి ఆరు రకాలుగా వ్యుత్పత్తి చెప్పబడింది.

నారాయణుణ్ని ఆశ్రయించి తాను స్వరూపలాభాన్ని పొందడం, తన వల్ల ఆయనకు స్వరూప సిద్ధి కలుగడమే శ్రీ శబ్దానికి ముఖ్యార్థం. కాబట్టి "నారీణాముత్తమా వధూః" (రా) అన్నట్లు శ్రీదేవి ఇంతులలో ఒజ్జ బంతి.

నారాయణుని పాదాబ్జాలు పాలేటి రాచూలి పట్టుకొమ్మలు.

శ్రీదేవి పద్మప్రియ, పద్మాలయ, పద్మముఖి, పద్మాక్షి, పద్మనాభ ప్రియ, వేయేల? ఆమె పద్మయే అని శ్రుతి స్మృతులు కీర్తిస్తున్నాయి. శ్రీదేవి స్వరూపంలో చంద్రునిలాగా మృదుశీతముగ్ధత్వగుణాలూ, అమృతం లాగా మాధుర్య గుణమూ, కల్పతరువు లాగా ఔదార్యగుణమూ శోభించడం అనితర సాధారణ విషయం.

"పాదారుంతుద మేవ పంకజరజశ్చేటీ భృశాలోకితై

రంగమ్లాని రథాంబ! సాహసవిధౌ లీలారవిందగ్రహః"(శ్రీగుణరత్న కోశం - 42)

లక్ష్మీదేవి నివసించే పద్మమందలి పరాగం ఆమె పాదతలాలకు కంటకాగ్రం లాగా బాధ పెడుతుందట. చెలికత్తెల చూపులు సోకితే ఆమె శరీరం వాడిపోతుందట. ఆమె చేతిలో విలాసంగా ధరించిన లీలారవిందమే సాహసంతో పెద్ద బరువును మోసినట్లు ఆమెకు అనిపిస్తుందట. అంతసౌకుమార్యంగల శ్రీదేవి కరకమలాల మార్దవశోభ ఎంతటిదో నారాయణుని చరణకమలాలకే తెలుస్తుంది.

"కమనీయరూపరేఖా, రమణీయత జాలనొప్పు రమణీమణి య

క్కమలాలయ తన మృదుకర, కమలంబుల విభుని పాదకమలములొత్తన్"
(ఆం.భాగ.2 స్కం.232)

శ్రీదేవి ఎంతో మృదువుగా పాదసంవహనం చేసినా, అతిసుకుమారంగా ఉండే నారాయణుని పాదకమలాలు కంది పోతుంటాయి;

"మలర్మగళ్ కైవరుళ్మలర్ పొనిల్ కిలన్తన" అని ఆళ్వార్లశ్రీసూక్తి.

"రసోవైసః" "సర్వగంధః సర్వరసః" (ఉపనిషద్వాణి)

నారాయణుడు సర్వరసస్వరూపుడు. శ్రీదేవి శృంగారరసాధిదేవత. కాబట్టి పరస్పరం ఉజ్జ్వలించే ప్రణయభావాన్నీ, నిరంకుశైశ్వర్యాన్నీ. నిరవధి కానందాన్నీ ప్రకటించే, శుభాశ్రయమైన, అప్రాకృతశరీరం కలవాడు శ్రీమన్నారాయణుడు.

నారాయణుడు ఒక్కడే పురుషోత్తముడు. ఇతరజగత్తంతా స్త్రీ ప్రాయమే. కాబట్టి ఉపాయాన్నీ, ఉపేయాన్నీ - అంటే, భగవద్రతిని పొందడానికి సాధనాన్నీ, పొందదగిన

ఫలాన్నీ - నిస్సంశయంగా వెల్లడించేది నారాయణుని స్వరూపం. అహంకారాన్ని నిరసించే దాస్య (మధుర) భక్తియే చేతనులు - జీవాత్మలు - ఉజ్జీవించడానికి హేతువని శేష శేషిత్వాన్ని స్వాభావికంగా ప్రదర్శించే సౌశీల్య, సౌందర్యమూర్తి శ్రీమన్నారాయణుడు.

"లక్ష్మ్యా సహ హృషీకేశో దేవ్యా కారుణ్యరూపయా।
రక్షకః సర్వసిద్ధాంతే, వేదాంతేఽపి చ గీయతే॥

దంపతులలో ఏ ఒక్కరినో ఎప్పుడూ ప్రార్థించరాదు. సీతాదేవినొక్కరినే కోరి రావణుడు నశించాడు. ఒక్కరామదేవుణ్ని కోరి శూర్పణఖ (వికృతి) ముక్కుచెవులు తెగి ముప్పునాతి అయిందికదా! అందువల్ల, కారుణ్యరూపిణియైన లక్ష్మీదేవితో కూడియున్న నారాయణుడే రక్షకుడని సర్వోపనిషత్సిద్ధాంతం.

రూపాన్ని చూస్తే గానీ గుణమేర్పడదు. దయకు ప్రథమోత్పత్తి స్థానమైన పాదాబ్జాల ప్రశంస తర్వాత, దయాగుణప్రశంస లక్షణంగా ఉంది. దయనిలిచి ఉండే స్థానం అంతరంగం.హేయగుణ మొక్కటీలేని అనంతకల్యాణగుణాలచే పరిపూర్ణుడు నారాయణుడు. దయాగుణమే లేకపోతే, ఇతర గుణాలకు విలువలేదు కదా! గుణాలన్నింటికీ దయాగుణ సహకారం అత్యావశ్యకం.

జ్ఞానంచేత కృత్యాకృత్యాలనూ, వాటివల్ల కలిగే ఫలాలనూ తెలుసు కోవచ్చు. శక్తిచే అపరాధులను దండించనూ వచ్చు. కరుణ ఎంతో గంభీరంగా ఉన్నందువల్ల ఆ జ్ఞాన శక్త్యాదిగుణాలు అందులో మునిగి పోయి, వాటిఫలంకూడా లభింపకుండడం చారుత్వం. శ్రీవేదాంతదేశికులు 'దయ'ను పరహితచింతనగా నిష్కర్షించారు.

దయాగుణం 'గంభీర' శబ్దప్రయోగం వల్ల మహాసముద్రమనీ, దానిలోనికి దిగడం సాధ్యం కాదనీ తెలుస్తుంది. దయకు గట్టువలె ఉన్న భగవంతుణ్ని త్రికరణశుద్ధిగా నమ్మి ధ్యానిస్తే తాపత్రయం నశిస్తుంది. ఇహపరసుఖాలు కలుగుతాయి.

గట్టు మీదనే కదా చెట్టు ఉంటుంది. ఆకాశగంగాతీరాన వెలసిన ఇంద్రుని నందనోద్యానవనంలోనే మందారం, పారిజాతం, సంతానం, కల్పం, హరిచందనం అనే పేర్లుగల చెట్లు ఉంటాయి. ఆ దేవ తరువులు తమ నీడకు చేరిన వారికోరికలను, తలచినదే తడవుగా, సిద్ధింపజేస్తాయి.

"వృక్ష ఇవ స్తబ్ధో దివి తిష్ఠత్యేకః" (నారాయణోపనిషత్)

"నివాసవృక్షః సాధూనా మాపన్నానాం పరాగతిః" (రామాయణం)

"వరుణో వారుణో వృక్షః" (వి.స.నామం)

"సమాశ్రితాత్ బ్రహ్మతరో రనంతాత్ నిస్సంశయః పక్వఫలప్రపాతః"

ఇలా శ్రుతిస్మృతీతిహాసపురాణాలు భగవంతుణ్ని వృక్షంగా వర్ణించాయి. తనను నీడలాగా అనువర్తించే వారికి, తన సర్వస్వాన్ని ఇచ్చి, వారి అపరాధాలను సహిస్తూ వారిని వరించే పరబ్రహ్మను వృక్షమని కీర్తించాయి. ఆయన సాధువులు ఉజ్జీవింపదగిన వృక్షం. ఆపన్నులకు శరణం.

బ్రహ్మమనే తరువును ఆశ్రయించిన వారి ఒడిలో పక్వమైన ఫలం పడితీరుతుంది.

సర్వకాల సర్వావస్థల్లోనూ భగవద్ధ్యానమగ్నులైన జనులు సద్భక్తులు. వారిపాలిట మాధవుడు మందారతరువు. భక్తుల ధ్యానోపాసనలవల్ల వారి సకలకర్మలు, సర్వపాపాలు అగ్గి బడిన దూదిలాగా బుగ్గి అవుతాయి. ప్రారబ్ధకర్మ అనుభవించక నశించదు కదా!

"తదా విద్వాన్ పుణ్య పాపే విధూయ, నిరంజనః పరమం సామ్యముపైతి దివ్యమ్" (ఉపనిషత్సూక్తి)

"తేషా మహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్, భవామి" (భ.గీ.12-7)

దాయాదులకు ఆస్తి చెందేరీతిగా, ముముక్షువులైన సద్భక్తుల పుణ్యం వారి మిత్రులకు, పాపం వారి శత్రువులకు చెందుతుంది. ఇలాగా సద్భక్తులు పరిశుద్ధులై, గుణాష్టకావిర్భావంవల్ల భగవంతునితో సమాన ధర్మాన్ని పొందుతారు. నారాయణుడు అవ్యాజానుగ్రహంతో మోక్షఫలాన్ని ప్రసాదిస్తాడని సారాంశం.

తరువును తలచిన వెంటనే పత్ర పుష్పాలు స్ఫురించడం నైసర్గికం. కరుణ ఎంత గంభీర మైనదో అంభోరుహ పత్రం అంత విశాలమైనది. "పద్మకోశ ప్రతీకాశం హృదయం" అన్నట్లు పుండరీక సదృశం హృదయమైతే పుండరీక దళ సదృశాలు నయనాలు. హృద్గతాభిప్రాయాన్ని ముఖంమీద చమకింపజేసేవి లోచనాలేకదా! 'పుండరీకాక్ష' నామం నారాయణునికి భాగధేయం. ఆనామసంకీర్తనం నరునికి పాథేయం. ఆయనకు రుచి, మనకు శుచి.

"కప్యాసం పుండరీక మేవ మక్షిణీ" అనే ఛాందోగ్యోపనిషద్వాక్యానికి "గంభీరాంభస్సముద్భూత సుమృష్టనాళ రవికరవికసిత పుండరీక దళామలాయతేక్షణః" అని "వేదార్థసంగ్రహం"లో వివరణ ఇచ్చారు భగవద్రామానుజులు.

'పుండరీకం సితాంభోజం' అని అమరకోశమందు అనుశిష్టం. శబరస్వామి వారు 'రక్తాంభోజ' మని శ్రుత్యర్థాన్ని వివరించారు. కాబట్టి 'పుండరీకాక్షుడు' అంటే తెల్లదామరల వంటి కన్నులు కలవాడు అని కాదు. కెందామరలవంటి కన్నులు కలవాడు అనే అర్థాన్నే పెద్దలు నిర్ణయించారు.

'అంభోరుహ పత్రలోచన' నామం శ్రీమన్నారాయణుని సర్వజ్ఞత్వ సర్వేశ్వరత్వ సౌలభ్య వాత్సల్యాలను ఉద్బోధిస్తూ భక్తులను అనితర సామాన్యంగా కటాక్షిస్తుంది.

"ఏకైకశోఽంగాని ధియాఽనుభావయే త్పాదాది". (భాగ.2-1-13) "మానవా మౌళితోవర్ణ్యా దేవాశ్చరణతః పునః"

'మనుష్యులను వర్ణిస్తే శిరస్సు నుంచి ఆరంభించాలి. భగవంతుణ్ణి వర్ణిస్తే పాదాలనుంచి ఆరంభించాలి' అనే పద్ధతిని బట్టి ఈ శతకకవి, చరణాలు మొదలుకొని చక్షుఃపర్యంతం వర్ణించాడు.

తర్వాత "కారణం తు ధ్యేయః" అన్నట్లు విశ్వాయమాన పరాగంగల పద్మం నాభియందుండే మూలరూపాన్ని కళాధారోరుసంపత్సుధా పారావారవిహార' అని స్తుతించాడు.

"అసద్వా ఇదమగ్ర ఆసీత్. తతో వై సదజాయత" శ్రుతి. 'అసత్. అంటే కారణావస్థ. ప్రళయంలో జడాజడ ప్రపంచాన్ని ప్రకృతిని - సూక్ష్మంగా నేల, నీరు. నిప్పు అనే నామరూపవిభేదం లేకుండా, భగవంతుడు తనలో భద్రపరచి ఉంచిన దశ.

'సత్' అంటే కార్యావస్థ. సూక్ష్మరూపంగా నామరూపరహితాలై తనలో లీనమై ఉన్న చిదచిత్తులకు బహుత్వాన్ని కల్పించి, నామరూపాలనేర్పరచి, తాను వాటిలో అంతర్యామియై ఉండిన దశ. ఇదే సృష్టి. సదసద్రూపాలు - స్థూల సూక్ష్మరూపాలు - రెండూ భగవంతునికి ఉన్నాయి. అవ్యక్తరూపంతో అన్నింటినీ భరించిన భగవానుడే, స్థూల చిదచిత్తులతో కూడి జగద్రూపంగా వ్యక్త మవుతాడు. అందువల్ల 'సర్వ ' శబ్దవాచ్యుడు "సర్వః".(వి.స.నా)

"కళా ముహూర్తాః కాష్ఠాశ్చాహోరాత్రాశ్చ సర్వశః" (తై.ఉప)

కళలు, ముహూర్తాలు, కాష్ఠలు అనే విభాగం కలిగిన కాలం భగవంతుని అధీనమై ఉంది. "అహమేవాక్షయః కాలః (భ.గీ.10-33)

నాశరహితమైన కళాముహూర్తాదిమయకాలమూ భగవానుడే కదా!

సృజనాత్మకమే కళ. కళలు పదహారు.

"కళాశ్చ పంచభూతాని జ్ఞానకర్మేంద్రియాణి చ।

పంచ పంచ మనశ్చేతి షోడశోక్తా మహర్షిభిః॥"

జ్ఞానేంద్రియాలు 5. కర్మేంద్రియాలు 5. మనస్సు1. (నింగి, గాలి, నిప్పు, నీరు, నేల) భూతాలు 5. మొత్తం పదహారు 16.

"జగృహే పౌరుషం రూపం భగవాన్మహదాదిభిః।

సంభూతం షోడశ కళ మాదౌ లోకసిసృక్షయా॥ (భా.గ.1.31)

లోకాలను సృష్టించాలనే సంకల్పంతో నారాయణుడు మహదహం కారతత్త్వసముదాయంతో కూడిన షోడశకళలతో పురుష రూపాన్ని స్వీకరించాడు. "కళాస్సర్వే హరేరేవ" (భాగ.1.3.27) సర్వకళలు శ్రీహరివే. కళాధారమైనది కారణదశ. కారణం లేనిదే కార్యం ఆవిష్కరింపబడదు. నారాయణుడు సత్య సంకల్పుడు, అంటే ఫలించే కోరికకలవాడు. ఇచ్ఛాశక్తియే గొప్ప సంపద. ఇచ్ఛయే క్రియాశక్తికి మూలం.

"ఇచ్ఛా త ఏవ తవ విశ్వపదార్థసత్తా". (వై.స్త)

"ఇచ్ఛా గృహీతోఽభిమతోరుదేహః" (వి.పు.)

భగవంతుడు తన సంకల్పంచేతనే గొప్పరూప సంపత్తును స్వీకరిస్తాడు.చేతనా చేతనరూపజగత్తును తనలోనే ఇముడ్చుకొంటాడు.

"అంభస్యపారే" (అపారే అంభసి.) (నారా.ఉప)

"ఏకస్తిష్ఠతి విశ్వాత్మా స తు నారాయణప్రభుః"

ప్రళయకాలంలో బ్రహ్మరుద్రులుగానీ, చంద్రసూర్యులుగానీ, భూమ్యాకాశాలుకానీ ఏవీ లేవని శ్రుతి. సకలప్రపంచం ఏకార్ణవమైనప్పుడు అందు నారాయణుడొక్కడే సమాధిరూపమైన యోగనిద్రలో జగద్రక్షణచింత చేస్తుంటాడు.

ఈ విషయాన్నే పొదవి పొట్లం కట్టి పోతన ఇచ్చాడు.

"మహదహంకార తన్మాత్రసంయుక్తుఁడై

చారుషోడశ కళాసహితుఁడగుచు......

"మానితోదారజలరాశిమధ్యమునను, యోగనిద్రావిలాసియై యొప్పుచుండు"॥

(భాగ 1-60) సుధాపారావార విహారుడు నారాయణుడేకదా।

"ఆపో నారా ఇతి ప్రోక్తాః ఆపో వై నరసూనవః।

తావదస్యాయనం పూర్వం తేన నారాయణః స్మృతః"

నీటికి నారము అని పేరు. నీరు నరుని వల్ల జనించింది. నారములు స్థానంగా కలవాడు నారాయణుడని మనుస్మృతి విశదపరచింది.

"నరాజ్జాతాని తత్త్వాని నారాణీతి తతో విదుః।

తాన్యేవ చాయనం నిత్యం తేన నారాయణః స్మృతః॥" (పాద్మం)

నరునిచే కలిగిన తత్త్వాలు నారములు. అవి స్థానంగా కలవాడు నారాయణుడని మహాభారతంకూడా నిర్వచించింది.

'రిఙ్ - క్షయే' అనే ధాతునిష్పన్నం 'ర' నాశంలేని నిత్యవస్తువులని 'నర'శబ్దార్థం. సమూహార్థంలో 'అణ్'ప్రత్యయం చేరగా ఆదివృద్ధి. నరసమూహం 'నార'శబ్దం.

నారములకాశ్రయమైనవాడు. (షష్ఠీతత్పురుష) నారములు ఆశ్రయంగా కలవాడు (బహువ్రీహి).

నారాయణ, వాసుదేవ, విష్ణు శబ్దాలు వ్యాపకమంత్రాలు. అందులోనూ "పూర్వపదాత్ సంజ్ఞాయా మగః"అని ణత్వం. కాబట్టి 'నారాయణ' శబ్దం సంజ్ఞావాచకం. మిగిలినవి సంజ్ఞావాచకాలు కావు. నారాయణమంత్రం అష్టాక్షరి. నా=౦, రా=2 య=1, ణ=5 మొత్తం 8.

"యస్మాన్నాణీయో న జ్యాయోఽస్తి కశ్చిత్". ఎవనికంటె సూక్ష్మవస్తువు గానీ, గొప్పవస్తువు గానీ లేదో అతడు నారాయణుడన్నది వేదవాణి.

ఈ శతకకవి 'నారాయణ' పదాన్ని మకుటంగా స్వీకరించి స్తుతింప ఆరంభించాడు. ఎందుకు? "నా దురితముల్ భంజింపు"మంటున్నాడు కదా! 'దురితం' అంటే నింద్యమైన కర్మ - పాపం. తెలిసో తెలియకో పాపపుణ్యకార్యాలను చేయకుండా జీవించలేడు మానవుడు. పాపం దుఃఖాన్ని , పుణ్యం సుఖాన్ని కలిగిస్తుంది.

"సుకృతం దుష్కృతం చైవ గచ్ఛంత మనుగచ్ఛతః" అన్నట్లు పోయేవాని వెంట పుణ్యాపాపకర్మలు కూడా పోతాయి. కర్మలున్నన్ని నాళ్ళు జన్మ తప్పదు. ఏ కర్మలేని వానికే మరోజన్మ ఉండదు. మోక్షఫలం లభిస్తుంది.

అద్దానికి క్రమ్మిన దుమ్మును, మురికిని తొలగించడమే చేయవలసిన పని. కాని, ప్రతిఫలనశక్తిని కూర్చడం కాదు. పాపపుణ్యాలను తొలగిస్తే ముక్తి తనంత తాను వచ్చితీరుతుంది. మరి దురితాలు తొలగిపోయేదెలా?

"ముహూర్త మపి యో ధ్యాయన్ నారాయణమనామయమ్
సోఽపి సిద్ధిమవాప్నోతి కింపునస్తత్పరాయణః॥

ప్రధాన పురుషేశ్వరుడైన నారాయణుణ్ని ఒక్క ముహూర్త కాలం (48 నిమిషాలు) ధ్యానించినా కర్మబంధం తెగిపోయి సిద్ధినిపొందుతాడు. ఇక నారాయణుడే పొందదగిన వాడని ఆసక్తుడై ఉండే వ్యక్తికి లభించే భాగ్యమేమని చెప్పేది?

"యదర్థ మంభోధి రమంథ్య బంధి చ" (స్తోత్రరత్నం)

ఎవరిని పొందడానికి నారాయణుడు సముద్రాన్ని మథించాడో, సేతు బంధం చేశాడో, ఎవరిపైన వ్యామోహంతో ఇల్లరికమైన వసతి నేర్పరచుకొన్నాడో ఆ శ్రీరామామణి యొక్క పతిపారార్థ్యంతో శతక మారంభమయింది.

శకారం లక్ష్మి. అగ్ని బీజమైన రేఫం సంపత్కరం. ఈ కారం ఆనందార్థకం. నాదం సర్వేశ్వరుడు. బిందువు దుఃఖహరం. మంగళదీపరేఖయైన లక్ష్మీదేవి యొక్క బీజాక్షరం 'శ్రీ' శబ్దం.

శ్రియః పతిత్వ దయాళుత్వ ఆశ్రితమందారత్వ పుండరీకాక్షత్వ విశ్వాత్మకత్వాదులచేత సర్వదేవతాసార్వభౌమత్వంగల నారాయణుని స్తుతిశతకకృతి ముఖాన శ్రీశబ్దం తిలకంగా అలంకృతం.

**మ. కడకుంబాయక వేయునోళ్ళుగల యాకాకోదరాధీశుఁడున్**
**గడముట్ట న్వినుతింపలేక నిగుడన్ గ్రాలంగ నొప్పారు ని**
**మ్మడరన్ సన్నుతిసేయ నాదు వశమే; యజ్ఞాని, లోభాత్ముఁడన్**
**జడుఁడ న్నజ్ఞుఁడ, నైక జిహ్వుఁడ, జనస్తబ్ధుండ,నారాయణా॥ 2**

అర్థం : ఓ నారాయణా! వేయినోళ్ళుగల; ఆకాకోదర+అధీశుడున్=కాకి పొట్టవంటి మెత్తని కడుపున్న పాములకు దొరయైన ఆదిశేషుడుకూడా; కడముట్టన్=సంపూర్ణంగా; వినుతింపలేక = స్తుతింపజాలక; కడకున్ = చివరకు; పాయక = వదలిపెట్టక; నిగుడన్గ్రాలంగన్ఒప్పారు = చాగిలపడి చుట్టగా తిరిగి పడుకగా ఒప్పియున్న; మిమ్ము; అడరన్ = అతిశయంగా; సన్నుతి సేయ = స్తోత్రం చేయడానికి; అజ్ఞాని = శాస్త్రవిషయాలు తెలియని వాడను; లోభాత్ముఁడన్ = లుబ్ధుడను; జడుఁడన్ = చైతన్యంలేని మొద్దును; అజ్ఞుఁడన్ = మూర్ఖుడను; న+ఏకజిహ్వుఁడ = వదరుబోతును; జనస్తబ్ధుండ = పుట్టుకతోనే మర్యాదనెరుగని సోమరిని; నాదు వశమే = నాకుశక్యమువునా?

తా: ఓనారాయణా! వేయినోళ్ళున్న ఆదిశేషుడుకూడా మిమ్ము సమగ్రంగా స్తుతింపజాలలేదు. మిమ్మువిడిచి మనజాలనూ లేదు. తుదకు తన దేహాన్ని మీకు సెజ్జగా అర్పించుకొన్నాడు. ఇక శాస్త్రజ్ఞానంలేని, పేరాసగల, జడుడనూ, మూర్ఖుడనూ, ఒక్క నాలుకున్నా బాగా వదరుబోతును స్తబ్ధుడనైన నేను మిమ్ము బాగా స్తోత్రంజేయజాలుదునా?

వ్యాఖ్య : **అనంతగుణసముద్రుడైన నారాయణుణ్ని స్తుతింప శక్యం కాదు.** నారాయణుడు స్వరూపంతోనూ, గుణాలతోనూ నిస్సమాభ్యధికుడు. "బృహత్త్వం చ స్వరూపేణ గుణైశ్చ" (శ్రీభాష్యం). పరబ్రహ్మవాచ్యుడు.

"సత్యం జ్ఞానం అనంతం బ్రహ్మ". సత్యం, జ్ఞానం మొదలుకొని అనేకకల్యాణ గుణాలు కలవాడు పరబ్రహ్మ అని ఉపనిషద్వాణి.

భగవంతుని స్వరూపస్వభావాలను మనసార అనుభవించి నోరార ప్రకటించడమే నుతి. "యద్ధి మనసా ధ్యాయతి, తద్వాచా వదతి" (శ్రుతి) ప్రతికార్యానికి మొదట గుణవిశిష్టమైన 'సంకల్పం' ముఖ్యాచారమయింది.

సర్పరాజైన ఆదిశేషుడు సహస్రఫణామణిమండలమండితుడు.

ఆయనకు దశశతపాణిపాదవదనాక్షిముఖుడైన భగవంతుణ్ని స్తుతించాలనే సంకల్పం కలిగింది. ఆయనకున్న వేయినోళ్ళలో ఒక్కొక్కనోరు, భగవద్గుణాలలో ఒక్కొక్క గుణాన్ని మాత్రమే అనుసంధించి ఆనందించింది. మనకు రెండు కన్నులున్నా చూపు ఒక్కటే అయినట్లు, సహస్రఫణికి రెండేసి నాలుకలున్నా రుచి ఒక్కటే. శేషుని వేయినోళ్ళు, "ఈ గుణమందే నాకు రుచి మెండు" అని గుణపక్షపాతంతో పరస్పరం కలహిస్తూ వేయిగుణాలను మాత్రమే అనుసంధించడంతో విశ్రమించాయి.

"యథా రత్నాని జలధే రసంఖ్యేయాని పుత్రక।
తథా గుణా హ్యనంతస్యా ప్యసంఖ్యేయా మహాత్మనః॥"

సముద్రం అనేక రత్నాలకు ఆకరంకదా! అలాగే భగవంతుడు, జ్ఞాన బలైశ్వర్య వీర్యశక్తి తేజస్సౌశీల్య వాత్సల్య మార్దవార్జవసౌహార్ద సామ్యకారుణ్య మాధుర్య గాంభీర్యౌదార్య చాతుర్య స్థైర్య ధైర్య శౌర్య పరాక్రమాదికల్యాణ గుణాలు లెక్కకు మిక్కిలిగా కలవాడు అని మత్స్య పురాణం నొక్కి చెబుతుంది.

"సంఖ్యాతుం నైవ శక్యంతే గుణా దోషాశ్చశార్ఙ్గిణః।
ఆనంత్యాత్ ప్రథమో రాశిః, అభావాదేవ పశ్చిమః॥"

సర్వేశ్వరునికి కల్యాణ గుణాలు అనంతంగా ఉన్నాయి; హేయ గుణాలు లేనే లేవు. కాబట్టి ఆయన గుణదోషాలను లెక్కింపనెవరి తరమూ కాదు.

"ఇషుక్షయాన్నివర్తంతే నాంతరిక్షక్షితిక్షయాత్।
మతిక్షయాన్నివర్తంతే న గోవిందగుణక్షయాత్॥"

ధానుష్కుడు తన తూణీరంలోఉన్న బాణాలన్నీ ఒడిసిపోవడంవల్ల ఊరకుంటాడే కానీ, ఆకాశంలో చోటు లేక కాదు కదా! అలాగే స్తుతించేవాడు మనస్సుకు శక్తి చాలక చాలిస్తాడే కానీ, భగవంతునియందు గుణాలు లేక కాదు.

"గుణానామాకరో మహాన్" అభిరామగుణాకరుడు నారాయణుడు

"శ్రీమన్నారాయణచరణౌ శరణం ప్రపద్యే,
శ్రీమతే నారాయణాయ నమః॥" ఇది ద్వయమంత్రం.

"షట్పదోఽయం ద్విఖండః". ఆరు పదాలున్న (3+3) ఈ రెండు వాక్యాలలోనూ 'నారాయణ' శబ్దం ఉంది. పూర్వఖండంలోని 'నారాయణ'పదం జనులందరు ఆశ్రయించడానికి తగిన దయావాత్సల్యసౌశీల్యసౌలభ్యాదిగుణాలను బోధిస్తుంది. ఉత్తర ఖండంలోని 'నారాయణ' పదం ఆశ్రిత సౌకర్యాపాదకగుణాలను అంటే ఆశ్రయించిన వారికి సకల ఫలాలనిచ్చే పరత్వాన్ని బోధిస్తుందని పూర్వాచార్యులు ఉపదేశించారు.

".నారాయణ! కరుణామయ! శరణం కరవాణి తావకౌ చరణౌ।

ఇతి షట్పదీ మదీయే హృదయసరోజే సదా వసతు॥" (విష్ణుషట్పదీస్తోత్రం) 'షట్పది' అంటే ద్వయమంత్రం. మరొక అర్థం తుమ్మెద. ఈ షట్పది నాహృదయకమలమందే ఎల్లప్పుడూ ఉండాలి' అని శ్రీ శంకరభగవత్పాదులు స్తోత్రం చేశారు కదా!

"తచ్చరితానురాగగుణ విస్ఫూర్తిన్ సహస్రాస్యసుం

దరతన్ బొల్పగు శేషుఁడు స్నెరుఁగడన్నన్ జెప్పలేరొండొరుల్"

అన్నారు పోతనామాత్యులు (ఆం.భాగ.2 స్కం.203)

"ఓ వృషాచలపతీ! వేంకటేశ్వరా! వేయిపడగలూ, రెండువేలనాలుకలూ కలిగియుండి పరిశుద్ధాత్ముడైన ఆదిశేషుడే నీ ఒకే ఒక్క దయాగుణాన్ని స్తుతింప సమర్థుడు కాలేదు. ఇప్పుడు ఆదయాదేవి మహిమను నేనెలా వర్ణిస్తానో" అని శ్రీవేదాంతదేశికులు తమవినయాన్ని ప్రకటించారు.

"ఫణాసహస్రో ద్విసహస్రజిహ్వః

శుద్ధాత్మకో భోగిపతిస్త్వదీయామ్।

దయాం న దక్షో గదితుం, కథం వా

తాం వర్ణయా మ్యద్య వృషాద్రినాథ॥"

(దయాసహస్రమ్. ప్రథమశతకమ్. 2వ శ్లోకమ్)

ఈ శతకకర్తకూడా తన ఆకించన్యాన్ని వెల్లడిస్తూ నారాయణ స్తుతికి పూనుకొన్నాడు.

గొప్ప జ్ఞాన బలాలు కలిగిన సర్పరాజే వేయినోళ్ళున్నా శ్రియఃపతిగుణాలను సమగ్రంగా కొలువజాలలేదు. మరి మానుకొని మనజాలనూ లేదు. కడకు ఆదీర్ఘపృష్ఠుడు సాగిలపడి తనస్వామి సౌకుమార్యానికి తగినట్లు, వేలచంద్రులను కరగించి పోసినట్లు, చల్లని తెల్లని కాంతితో మెత్తగా ఎత్తుగా ఉండి పరిమళించే సెజ్జగా పరిణమించి, సర్వేశ్వరత్వానికి ముఖ్యలక్షణభూతుడయ్యాడు.

ఒకటేమిటి? ఆయాసమయాల్లో శ్రీపతికి దివ్యమందిరంగా, శయ్యగా, సింహాసనంగా, పాదుకలుగా, కట్టుపుట్టంగా, దిండుగా, ఎండ, వానలనుపడనీయని గొడుగుగానూ, అనేక ఆకారాలను ధరించి దాస్యం చేయబూనుకొన్నాడు.

'శేషః పరార్థత్వాత్" (వేదార్థసంగ్రహం).

స్వార్థమెరుగక పరునికోసం పాటు పడేవాడు 'శేషుడు' అనీ, సర్వవిధ కైంకర్య పరులందరికీ ఉపమానమైనందువల్ల 'అనంతు' డనీ సకల జనులచే యోగరూఢంగా వ్యవహరింపబడినాడు కాకోదరాధీశుడు.

జ్ఞానాధికులే భగవద్గుణాలను పూర్తిగా ప్రశంసింపలేనప్పుడు అజ్ఞాని నైన నాకు స్తుతింపసాధ్యమా? అన్నాడు కవి.

అజ్ఞాని : తత్త్వహితపురుషార్థాలు తెలియనివాడు. కర్మజ్ఞానభక్తిప్రపత్తులనే నాల్గింటిలో ఏ ఒక్క ఉపాయమందైనా శ్రద్ధాసక్తులు లేనివాడు.

అజ్ఞానం మూడువిధాలు.

1. జ్ఞానానుదయం: బాల్యదశలాగా జ్ఞానంకలిగే అవకాశంలేని స్థితి. వయస్సు పెరిగి జ్ఞానం కలిగినప్పుడు ఈ స్థితి తొలగిపోవచ్చు.

2. అన్యథాజ్ఞానం : ఒక వస్తువును చూచి మరొక వస్తువుగా భ్రమించే స్థితి. దేహాన్ని ఆత్మగా భావించడం, తాడును పాము అనుకోవడం. ఉపదేశాదులతో వస్తు స్వరూపాన్ని యథార్థంగా తెలుసుకొన్నప్పుడు అన్యథాజ్ఞానం అణగిపోతుంది.

3. విపరీతజ్ఞానం : క్షుద్రసుఖాలకు, దుర్వ్యసనాలకు మరుగడానికి కారణమైన అవివేకం. విషయచాపల్యానికి హేతువైన విపరీతజ్ఞానాన్ని తొలగించుకోవడం దుస్సాధ్యం.

లోభాత్ముడు: తన ప్రయత్నం లేశమైనా లేకున్నా పురుషార్థపరుడు కావాలనే గొంతెమ్మకోరికలున్నవాడు.

జడుడు: మెరపులాగా తళుక్కున తలంపులనొలకించే మనస్సు స్పందించక, తాను కదలక, కదలించక, శరీరంమాత్రం చెట్టులాగో, చట్టులాగో ఉండే వ్యక్తి.

రెండునాలుకలుండే పాముకు ప్రతికోటిగా ఉన్నమాట ఏకజిహ్వుడు. మానవులకు ఒక్కనాలుక గాక ఎక్కువ నాలుకలుంటాయా? అని వివాదిస్తే (న+ఏక జిహ్వుడు=) నైకజిహ్వుడు-వదరుబోతు అని అర్థం.

"అహం త్వల్పస్త్వద్వ ద్యదిహ బహు జల్పామి" (పాదుకాసహస్రం.10)

సత్పురుషుల వలె స్తుతిస్తాననుకొని, క్షుద్రుడనైన నేను ఏదో వాగుతున్నాను.

"న తే వర్ణయితుం శక్తా గుణాన్ జిహ్వోఽపి వేధసః" నీ గుణాలను వర్ణించడానికి చతుర్ముఖుని జిహ్వకు కూడా శక్తి చాలదు. నిన్ను స్తుతింప నావశమా? అని కవులు స్తుతించే శక్తి కలవారైనా ఉత్కృష్టవస్తువును కీర్తించడానికి ముందు తమ అహంకారాన్ని నిరసించుకొని, వినయాన్ని ప్రదర్శించడం సత్కవుల సంప్రదాయంకదా!

**శా. నే నీదాసుఁడ నీవు నాపతివి నిన్నే కాని యొండెవ్వరిన్**
**ధ్యానింపం బ్రణుతింప నట్లగుటకు న్నా నేర్పు చందంబునన్**
**నీ నామస్తుతులాచరించు నెడల న్నేతప్పులుం గల్గినన్**
**వానిన్ లోఁగొనుమయ్య, తండ్రి, విహితవ్యాపార, నారాయణా॥ 3**

అర్థం: విహిత వ్యాపార = విశేషంగా మేలైన కార్యాలను నిర్వహించే; ఓ నారాయణా! నేను, నీదాసుడను; నీవు, నా పతివి = నాస్వామివి. నిన్నే కాని ఒండు ఎవ్వరిన్ = నిన్ను

తప్పు మరొక్కరిని; ధ్యానింపన్ = మనస్సులో తలవను; ప్రణుతింపను = పొగడను. అట్లు అగుటకున్ = అందువల్ల; నా నేర్పు చందంబునన్ = నాకు తెలిసిన రీతిగా; నీ నామస్తుతులు, ఆచరించు+ఎడలన్ = నీగుణాలను (పేర్లను) ప్రశంసించునప్పుడు; ఏతప్పులున్ కల్గినన్ = ఎట్టిదోషాలు దొరలినా; వానిన్ = వాటిని; ఓ తండ్రి! లోన్, కొనుమయ్య = చిత్తగింపుమయ్యా!

తా: జగద్ధితకృత్యాలనాచరించే ఓ నారాయణా! నేను సేవకుడను. నీవు ప్రభువవు. నిన్ను గాక మరెవ్వరినీ స్మరింపను. స్తుతింపనుకూడా. కాబట్టి, నా శక్తికొలది నీ నామసంకీర్తనం చేయునప్పుడు కలిగే నా తప్పులను క్షమించి స్వీకరింపుము తండ్రీ!

**వ్యాఖ్య : జగద్ధితవ్యాపారుడు నారాయణుడు.**

నారాయణుడు ప్రపంచాన్ని సృష్టించి చరాచర పదార్థాలయందు ప్రవేశించి పాలించే సామర్థ్యం కలవాడు.

"తత్సృష్ట్వా, తదేవానుప్రావిశత్". "అంతః ప్రవిష్టశ్శాస్తా జనానాం సర్వాత్మా". (తై.ఉప.)

సర్వప్రాణుల దేహమందున్నా పరమాత్మకు కర్మకర్తృత్వమూ లేదు. ప్రాణుల కర్మఫలమాలిన్యమూ ఆయనకంటుకోదు.

"శరీరస్థోఽపి కౌంతేయ! న కరోతి న లిప్యతే" (భ.గీ.13-32)

సర్వవ్యాపియైన ఆకాశం, సూక్ష్మమైనందువల్ల దానియందున్న భూతజాలంచేత, మాలిన్యాన్ని పొందనట్లు నారాయణుడు అనేకదేహాల్లో ఉన్నా నిర్లిప్తుడుగా ఉంటాడు.

"యథా సర్వగతం సౌక్ష్మ్యాత్ ఆకాశం నోపలిప్యతే॥ (భ.గీ. 13.33)

"హరి సకల ప్రాణిహృదయంబుల యందును నంతర్యామియైయాకాశంబుభంగి నుండును. (ఆం.భాగ.7.241 వచనం).

"న స్మరత్యపకారాణాం శతమప్యాత్మవత్తయా!
కథంచి దుపకారేణ కృతే నైకేన తుష్యతి॥".

ఎన్ని అపకారాలు చేసినా దయాళువు కాబట్టి మనస్సులో ఉంచుకోడు. ఏదైన ఉపకారం స్వల్పంగా చేసినా, పరమోపకారంచేసినట్లు సంతోషిస్తాడు. ఏదేని మంచిని కనిపెట్టి రక్షించడానికి పూనుకొంటాడు. విభీషణునియందు దోషమేదైన ఉన్నా, మిత్ర భావంతో వచ్చినందువల్ల ఆయనను విడువక కాపాడుతానన్నాడు కదా!

"మిత్రభావేన సంప్రాప్తం న త్యజేయం కదాచన!
దోషో యద్యపి తస్య స్యాత్" (రా.యు.28-3)

కాబట్టి, "విహిత వ్యాపార" - సంబోధనాంత పదం, పద్యభావాన్నంతా పాదివింది.

"న హి పాలన సామర్థ్యం ఋతే సర్వేశ్వరం హరిమ్" (వి.పు.1-22-21)

శ్రీ హరికి తప్ప ఇతరుల కెవ్వరికీ రక్షించేసామర్థ్యం లేదు. "త్రాణే స్వామిత్వ మౌచిత్యం" అన్నట్లు రక్షణ విషయంలో స్వామిత్వం ఆవశ్యకం. కాబట్టి నారాయణుడు స్వామి-ప్రభువు. సొమ్ము కలవాడు స్వామి. తనసొమ్మును కాపాడు కొంటూ ఇష్టం వచ్చినట్లు ఉపయోగించుకొంటాడు. పాలించే సామర్థ్యం కలవాడు పతి-శేషి స్వామియొక్క సొత్తు, తొత్తు జీవుడు.

"దాసభూతాః స్వత స్సర్వే హ్యాత్మానః పరమాత్మనః।
నాన్యథా రక్షణం తేషాం బంధే మోక్షే తథైవ చ॥ (హారీతస్మృతి)

సమస్త జీవులు నారాయణునికే దాసభూతులు. సంసారబంధమందున్నా, మోక్షస్థానమందున్నా నారాయణుడే రక్షకుడు.

"స్వోజ్జీవనేచ్ఛా యది తే స్వసత్తాయాం స్పృహా యది
ఆత్మదాస్యం హరేః స్వామ్యం స్వభావాచ్చ సదా స్మర"॥

నేను ఉజ్జీవించాలనేకోరిక, నాకు 'సత్త' అంటే శరీరధారణానుకూల వ్యాపారం ఉండాలనే ఆశ ఉంటే, పరమాత్ముడు స్వామి, జీవాత్ముడు దాసుడని ఎల్లప్పుడు తలచుకోవాలి అని వేదాంతశాస్త్రం బోధిస్తుంది.

జీవులకు భగవద్దాస్యమే స్వరూపసిద్ధం.

1. స్వరూపదాస్యం 2. గుణదాస్యం అని దాస్యం ద్వివిధం.

1. "ఇహ సంగ్రహతః శ్రీమాన్ గోప్తా శేషీ సమాధికదరిద్రః।
శరణం సర్వశరీరి ప్రాప్యః సేవ్యశ్చ సాధుభిర్భావ్యః॥

లక్ష్మీపతి, రక్షకుడు, నియంత, తనతో సమానుడుగానీ, తన కంటె గొప్పవాడుగానీ లేనివాడు, ఉపాయభూతుడు, సమస్తవస్తువులు తనకు దేహంగా కలవాడు, సజ్జనులచే సేవింపదగినవాడు. పొందదగిన వాడూ నారాయణుడే. నాకు నేను దాసుడనూ కాను. వేరేదానికి స్వామినీ కాను. సర్వేశ్వరుని సంకల్పంతో నిమిత్తంలేకుండా స్వతంత్రుడనూ కాను అని భావిస్తూ నారాయణ నామాన్ని స్మరించడమే జీవాత్మ యొక్క స్వరూపదాస్యం.

2. "గుణాధికే హి విషయే గుణస్వారస్యవేదినః।
రామే రామానుజ స్యేవ దాస్యం గుణకృతం భవేత్॥"

శ్రీరామచంద్రస్వామి విషయమై లక్ష్మణుని రీతిగా, గుణాధికుడైన వాని విషయమై గుణస్వారస్యం తెలిసినవారికి గుణ మూలకమైన దాస్యముంటుంది.

గుణాలు రెండురకాలు:

1. స్వరూపనిరూపకాలు : వస్తుస్వరూపాన్ని తెలిపేగుణాలు.

2. నిరూపిత స్వరూపకాలు - వస్తు స్వరూపంతెలిసిన తర్వాత ఆవస్తువును ఇంకా విశేషంగా తెలిపే గుణాలు.

"నిరపేక్షస్వతంత్రత్వం స్వామ్యం చాన్యస్య న క్వచిత్"।

నిరుపాధికస్వాతంత్ర్యమూ, స్వామిత్వమూ నారాయణునికి తప్ప మరొకరికి లేనేలేదు.

పరమాత్ముని జగత్కారణత్వం అనితరసామాన్యమైన గుణం కదా।

జీవాత్మకు జగత్సృష్టిస్థితిలయాదులను చేసేగుణం లేదు.

"జ్ఞానానందమయస్త్వాత్మా శేషో హి పరమాత్మనః"

జ్ఞానం, ఆనందం స్వాభావికంగా ఉండే జీవుడు సర్వశేషియైన నారాయణునికి సకల విధకైంకర్యం చేసే శేషుడు - దాసుడు. "గుణైర్దాస్య ముపాగతః". శ్రీరాముని గుణాలచే ఆకర్షితుడనైన దాసుడనని లక్ష్మణుడు హనుమంతునితో అన్నాడు కదా!

గుణదాస్యంకన్న స్వరూపదాస్యం మిన్న.

అనన్యార్హ శేషత్వం జీవలక్షణం కాబట్టి ఈ కృతికర్త నారాయణుని తప్ప వేరొకరిని ధ్యానించను, స్తుతించనన్నాడు.

"యో వై స్వాం దేవతా మతియజతే ప్రస్వాయై దేవతాయై చ్యవతే, పాపీయాన్ భవతి, న పరాం ప్రాప్నోతి."

తన ఇష్ట దేవతను పూజిస్తున్న వ్యక్తి వేరేదేవతను పూజిస్తే మొదట పూజించిన దేవతయొక్క అభిమానాన్ని కోల్పోతాడు. తర్వాత పూజించిన వేరే దేవతకూడా ఒక్కదాని మీద స్థిరబుద్ధిలేక మారుతున్న వ్యక్తి అని విశ్వసించదు. ఏదేవతా పట్టించుకోనందువల్ల పాపిష్ఠుడవుతాడు, సద్గతిని పొందలేడు' అని శ్రుత్యర్థం.

"ముముక్షవో ఘోరరూపాన్ హిత్వా భూతపతీ నథ।

నారాయణకళాః శాంతా భజంతి హ్యనసూయవః॥"

(భాగ.1-2-26) దీని అర్థమిది -

"మోక్షార్థులైన వారలు ఘోరరూపులైన భూతపతుల విడిచి, దేవతాంతర నింద సేయక, శాంతులై నారాయణకథలయందే ప్రవర్తింతురు" (ఆం.భాగ)

దాసుడైనందువల్ల (కవి) నారాయణుని నామస్తుతులనాచరిస్తా నన్నాడు. "ఏతావానస్య మహిమా"- "స్వే మహిమ్ని ప్రతిష్ఠితః"(శ్రుతి)

"యాని నామాని గౌణాని విఖ్యాతాని మహాత్మనః।
ఋషిభిః పరిగీతాని" - (వి.స.నా.పూర్వపీఠిక)

మహామహిమశాలి యైన నారాయణుని నామాలు ఆయన కల్యాణ గుణాల మూలంగా, దివ్యచేష్టితాలకారణంగా ఏర్పడినవే. ఋషులు వాటిని అత్యాదరంతో స్తుతించారు.

లోకంలో స్తుతి చేయడం రెండు రకాలు:

స్తుతింపదలచిన వస్తువునందు లేని గుణాలను ఉన్నట్లుగా ఆరోపించడం ఒక విధమైతే, వస్తువునందు ఉన్న గుణాలను ఒక్కటినైనా విడువకుండా పూర్తిగా వర్ణించడం మరొక విధం.

సకల కల్యాణ గుణ పరిపూర్ణుడైన శ్రీమన్నారాయణునియందు వేరేచోట ఉన్న గుణాలను ఆరోపించి స్తుతించే పద్ధతి అసంగతం. ఇక, అసంఖ్యేయగుణాలను పూర్తిగా వర్ణించడమూ అసంభావ్యమే.

అశక్య విషయాన్నైనా శక్యంగా భావించి చేయ ప్రయత్నించడం సాహసమనుకోక, (నానేర్పు చందంబునన్) శక్య మైనంతవరకు స్తుతి చేస్తానని విన్న వించుకొన్నాడు ఈ సుకవి.

ఇక్కడ శ్రీకూరేశ మహాకవి 'శ్రీస్తవం' లోని కమనీయ శ్లోకం గమనీయం.

"యే వాచాం మనసాం చ దుర్గ్రహతయా ఖ్యాతా గుణాస్తావకాః
తానేవప్రతి సాంబుజిహ్వా ముదితా వై మామికా భారతీ।
హాస్యం తత్తు న మన్మహే; న హి చకోర్యేకాఽఖిలాం చంద్రికాం।
నాలం పాతుమితి ప్రగృహ్యా రసనామాసీత సత్యాం తృషి॥" (4)

నోటితో ఉచ్చరించడానికీ మనస్సుతో స్మరించడానికీ శక్యం కాని మీ ప్రసిద్ధ గుణాలను స్తుతించడానికి నా నాలుక (వాక్కు/నోరు) నేడు ఉవ్విళ్ళూరుతున్నది. నేను మాత్రం అది పరిహాసాస్పదమనుకోను. ఎందుకు? అంటే, వెన్నెలను ఆస్వాదించి జీవించే చాతకపక్షి, వెన్నెలను పూర్తిగా త్రాగడం నాకు చేతగాదని తలచి తననాలుకను పట్టుకొని (దప్పిదీర్చుకోక) ఉండదుకదా!

పిపాసగల చకోరి అమృతాస్వాదనం కోసం సిద్ధపడే రీతిగా, వాక్కు కూడా ఉదాసీనంగా ఉండక స్తుతింపగోరుతున్నదని భావం.

దాస్యలక్షణాల్లో స్తుతికావ్యరచన ఒకటి ప్రధానమైనది.

"పద్య మంగుళివిచ్ఛేద ఉరోవిన్యస్త మక్షరమ్।
తన్నామవహనం చైవ దాస్యమేతచ్చతుర్విధమ్॥"

1. పద్య రచన (స్తుతి కావ్యం) 2. వ్రేలుకోసుకోవడం (హింసించుకోవడం)3. ఎదలో మంత్రం పదిలపరచడం (మంత్రజపం) 4. పూజ్యుని పేరు పెట్టు కోవడం.

ఇందులో 'అంగుళివిచ్ఛేదం' ఆచరణలో లేదు. మళ్ళీ పుట్టిపెరుగనిది కాబట్టి దయాళువు దాన్ని కోరడని, అది నిరసింపబడినట్లు దేశికులు 'సచ్చరిత్ర రక్ష'లో స్పష్టపరచారు.

"పద్యగద్యగీత భావార్థములనైన, కమలనయనుదలప కలుషహరము". (ఆం.భాగ.6.21)

స్తుతిస్తున్నప్పుడు (శతకరచనలో) దోషాలు దొర్లితే వాటిని స్వీకరించు మని అయ్యా! తండ్రి! అంటూ మనవి చేశాడు కదా!

"అజ్ఞానా దథవా జ్ఞానా దపరాధేషు సత్స్వపి।

ప్రాయశ్చిత్తం క్షమ స్వేతి ప్రార్థనైకేవ కేవలమ్॥" (రహస్యత్రయసారం)

తెలిసో, తెలియకో తప్పులు చేసినా, క్షమించుమని ప్రార్థించడమే అందుకు ప్రాయశ్చిత్తం.

"మాతా పితా భ్రాతా నివాసః శరణం సుహృద్గతిర్నారాయణః" (సుబాలోపనిషత్తు)

"ఈశ్వరం తం విజానీమ స పితా స ప్రజాపతిః।

స్వామిత్వేన సుహృత్త్వేన గురుత్వేన చ సర్వదా।

పితృత్వేన తథా భావ్యో మాతృత్వేన చ మాధవః॥" శ్రియఃపతి స్వామిగా, స్నేహితునిగా, ఆచార్యునిగా, తండ్రిగా, తల్లిగా సంభావ్యుడు.

"పితేవ పుత్రస్య -- దేవ సోఢుమ్" - (భ.గీ.11-44)

కుమారుని పట్ల తండ్రివలె, నీవు నాతప్పులను ఓర్చుకొమ్మని పార్థుడు తన సారథిని ప్రార్థించాడు కదా!

"తనయుల సంభాషణములు

జనకునకుం గర్ణయుగళసద్భూషణముల్॥ (ఆం.భా.గ.7-140)

జగత్తుకే తండ్రి కాబట్టి నారాయణుడు దోషభోగ్యుడే.

**మ. నెరయన్నిర్మలమైన నీస్తుతికథానీకంబు పద్యంబులో**
**నొరుగుల్ మిక్కిలి గల్గెనేనియుఁగడు న్యోగంబె చర్చింపగాఁ**
**గుఱుగణ్ణైనను పంకబోయినఁగడుంగుజ్జైనఁబేడెత్తినం**
**జెఱకుంగోలకు తీపు గాక కలదే, చేదెందు, నారాయణా॥ 4**

అర్థం : ఓ నారాయణా! నెరయన్ = పూర్తిగా; నిర్మలమైన = పవిత్రమైన, పరిశుద్ధమైన; నీస్తుతికథా+అనీకంబు = నీస్తోత్రకథాకదంబమైన; పద్యంబులోన్ = పద్యకావ్యంలోన;

ఒరుగుల్ = వంకలు, తప్పులు; మిక్కిలి = చాల; కల్గెన్ + ఏనియు = ఉన్నప్పటికీ; కడున్ = మిక్కిలి; యోగంబె = యుక్తమే - చర్చింపగా = విచారించగా; కులు, కణ్పు, ఐనను = కొద్ది కణపులు కలదైనా; వంక పోయినన్ = వంకరగా ఉన్నా; కడున్ గుజ్జు ఐనన్ = చాలాపొట్టిదైనా / రసంగల చెక్కు బాగా ఉన్నా; పేడు+ఎత్తినన్ = పైనతోడ్కమాత్రంగా పెరిగినదైనా; చెఱకున్ కోలకు = చెరకుగడకు; తీపు కాక = మాధుర్యం ఉండక; ఎందు = ఎక్కడనైనా; చేదు = తిక్తరసం; కలదె = ఉంటుందా?

తా: ఓ నారాయణా! నిండుగా పరిశుద్ధమైన నిన్నుస్తుతించే కథలు చాలా ఉన్న పద్యకృతిలో తప్పులున్నప్పటికీ విచారిస్తే, అది యుక్తమే అనిపిస్తుంది. చెఱకుగడ చిన్న చిన్న కణుపులు, వంకర, గుజ్జు కలిగి, పేడెత్తి ఉన్నా తియ్యగా ఉండక చేదుగా ఉంటుందా?

**వ్యాఖ్య: నారాయణస్తుతికావ్యం అపశబ్దాలతో ఉన్నా అనుసంధేయమే.**

భగవంతుని గుణాలను, లీలలను వర్ణించే పద్యకావ్యంలో దోషాలున్నా అది రచయితనూ, పఠితలనూ పావనం చేయక మానదు. వేద మంత్రాలలో స్వరలోపం, వర్ణలోపమయితే చదివే వారికీ, విన్నవారికీ దోషం అంటుకొంటుంది. స్పష్టంగా ఉచ్చరించాలి. లేకపోతే, **"హసద్భిః క్రియతే కర్మ, రుదద్భి రనుభూయతే"** అన్నట్లు సంతోషంతో పనిచేస్తాం. ఏడుస్తూ అనుభవిస్తాం. లక్షణంగా లేని, లౌకికభాషలో భగవత్కథలను, స్తోత్రాలను, రచించినా, పఠించినా, లేదా శబ్దాలను అసాధువుగా ప్రయోగించినా, చక్కగా పలుకకున్నా ఏదోషమూ కలుగదు. పావనత్వానికి హాని ఉండదు. చెరకు గడయే దీనికి దృష్టాంతం. చిన్న చిన్న కణుపులతో వంకరటింకరగా ఉన్నా, గుజ్జు ఉన్నా, పేడెత్తినా చెరకు తియ్యగానే ఉంటుంది. తిక్తంగా ఉండదు.

భగవద్విషయం పవిత్రమైనదే. వ్రాసినా, చదివినా ఉద్దేశం నిష్కల్మషమైనదే కాబట్టి. తప్పులు దొరలినా దోషంకాదు. భగవదవతారాలనూ, చేష్టితాలనూ వర్ణించడం వల్ల, తెలిసికోవడంవల్ల జీవితం సఫలమవుతుంది. జన్మరాహిత్యమవుతుందని గీతాచార్యుని ఉపదేశం. (భ.గీ.4.9)

ఘన పురాషార్థప్రద మైన 'నారాయణ' పదం. రచనలో గానీ, ఉచ్చారణలోగానీ 'నారణం' గా దొరలింది. ఉన్న అక్షరాలను లోపం చేయడం, లేని మకారాన్ని కూర్చడం దోషం కాదా? అంటే, ఉప్పుమడిలో పడిన వస్తువు ఉప్పే అవుతున్నట్లు ఉద్దేశ్యమంతా ఒక్కటే అవుతుందనీ, భగవద్విషయమైన ప్రక్రియ స్పృహణీయమనీ నంబిళ్ళైస్వామి 'ఈడు'వ్యాఖ్యానం.

నారదుడు వ్యాసమహర్షికి చెప్పిన మాట ఆదరణీయమే కదా!

"తద్వాగ్విసర్గో జనతాఘవిప్లవో
యస్మిన్ ప్రతిశ్లోక మబద్ధవత్యపి।
నామాన్యనంతస్య యశోఽంకితాని య
చ్ఛృణ్వంతి గాయంతి గృణంతి సాధవః" (సం.భాగ.1-5-11)
"అపశబ్దంబుల గూడియున్ హరిచరిత్రాలాపముల్ సర్వపాప
పరిత్యాగము సేయు" (ఆం.భాగ.1-5-95)

అయితే, అపశబ్దాల రచనకు అనుమతిలభించిన దని భావించరాదు.

**మ. చదువుల్ పెక్కులు సంగ్రహించి పిదపం జాలంగ సుజ్ఞాని యై**
**మదిలోఁ బాయక నిన్ను నిల్పఁదగు నామర్మంబు వీక్షింపఁడే**
**మొదలం గాడిద చారుగంధవితతుల్ మోవంగ శక్యంబె కా**
**కది సౌరభ్యపరీక్ష జూడ కుశలే యవ్యక్త, నారాయణా॥ 5**

అర్థం: అవ్యక్త = ఇంద్రియాలకుగోచరించని; ఓ నారాయణా! మొదలన్ = మొదట; పెక్కులు = అనేకములైన;చదువుల్ = విద్యలను; సంగ్రహించి = బాగా నేర్చి; పిదపన్ = తర్వాత; చాలంగ = పర్యాప్తంగా; సుజ్ఞానియై = మంచి జ్ఞానం కలవాడై; మదిలో = మనస్సులో; పాయక = వదలక; నిన్ను; నిల్పన్ తగున్ = స్థిరపరచుకోదగును. ఆమర్మంబు = ఆరహస్యాన్ని; వీక్షింపడే = పరిశీలించడుకదా! గాడిద; చారుగంధవితతుల్ = మంచి వాసనగల విస్తారమైన ద్రవ్య రాశులను; మోవంగ = మోయడానికి; శక్యంబె కాక = సామర్థ్యం కలదే తప్ప; అది = ఆ గార్దభం; సౌరభ్య పరీక్ష జూడ = సువాసనను పసికట్టడానికి; కుశల, ఏ = చాతుర్యం కలది అగునా? కాదు.

తా: అవ్యక్తుడవైన ఓ నారాయణా! మొదట విద్యలను బాగా నేర్చి పిమ్మట యోగ్యమైన సమ్యక్ జ్ఞానంకలవాడై హృదయంలో నిన్ను సర్వదా స్మరిస్తూ నిల్పుకోవాలి. కాని నరుడు ఆమర్మాన్ని గమనించడు కదా! గంధపు చెక్కలు మోసేగాడిదకు వాటిబరువే తెలుస్తుంది కాని పరిమళాన్ని పసికట్టే పాటవమున్నదా?

**వ్యాఖ్య : విద్యలవల్ల జ్ఞానం పొంది భగవంతుణ్ని హృదయ పీఠాన ప్రతిష్ఠించాలని కవిఆకాంక్ష.**

నారాయణుడు అవ్యక్తుడు. అన్నిటిలో ఉన్నా, ఇంద్రియాలకు గానీ, ప్రమాణాలకుగానీ తెలియరాని వాడు. అవాఙ్మానసగోచరుడంటారు. తన అసాధారణాకారాన్ని తాను మాత్రమే తెలుసుకొనేవాడు. సర్వ భూతాలలో, తిలలలో తైలం వలె ఉండి, అవి నశించినా వాటితో పాటు నశించని వాడే అవ్యక్తుడు, అక్షరుడు. ఆయనే అందరికి పరమగతి. ఆపరంధామానికి చేరినవారు ఏలోకంలోకీ తిరిగి రారు. ఆ పరమపదమే నాది.

"అవ్యక్తోఽక్షర ఇత్యుక్తః, తమాహుః పరమాం గతిమ్।
యం ప్రాప్య న నివర్తంతే, తద్ధామ పరమం మమ ॥(భ.గీ.8-21)
అని అందరు తన నాశ్రయించడానికి అవతరించిన శ్రీకృష్ణుడు బోధించాడు.

నీవు నన్ను దర్శించిన రీతిగా దర్శించడానికి ఎవరికీ శక్యం కాదు. నన్ను తెలుసుకోవడానికి అనన్యభక్తి ఒక్కటే సమర్థమయింది.

"భక్త్యా త్వనన్యయా శక్యః"(భ.గ.11-54) అని గీతోపదేశం.

జ్ఞానం పక్వమైతే భక్తి కుదురుతుంది. దాన్ని భక్తిరూపజ్ఞాన మంటారు. జ్ఞానాన్ని ఆర్జించడానికి పెక్కు చదువులు చదువాలి.

ఋగ్యజుస్సామాథర్వణ వేదాలు (4), వేదాంగాలు - శిక్ష, వ్యాకరణం, ఛందస్సు నిరుక్తం, జ్యోతిషం, కల్పమనే (6) శాస్త్రాలు, మీమాంస, న్యాయం, పురాణం, ధర్మశాస్త్రం (4), ఆయుర్వేదం, ధనుర్వేదం, గాంధర్వం, అర్థశాస్త్రం (4) 'విద్యా హ్యష్టాదశైవ తాః" (3-6-29)

పద్దెనిమిదివిద్యలు అని విష్ణుపురాణం చెబుతుంది.

వేదాంతశాస్త్రంలో సద్విద్యలు (32)ముప్పది రెండున్నాయి.

అనేక విద్యలను సంగ్రహించడం అంటే గురువువద్ద శ్రద్ధతో సమగ్రంగా అభ్యసించాలి.

1. 'గురుశుశ్రూషయా విద్యా' గురువుగారికి కొంతకాలం సేవ చేస్తూ వినయంగా ప్రవర్తించడంవల్ల ఆయన దయాళుడై బోధిస్తాడు.

2.'పుష్కలేన ధనేన వా' - వలసినంత ధనాన్ని సమర్పించి విద్యను నేర్వవచ్చు.

3. 'అథవా విద్యయా విద్యా' - తనకు తెలిసిన విద్యను అవసరమున్న వ్యక్తికి బోధిస్తూ తనకు తెలియని, ఆయనకు తెలిసిన విద్యను సాధించవచ్చు.

'చతుర్థానోపపద్యతే' - విద్యార్జనకు నాల్గవ విధానం లేదు. శ్రద్ధాసక్తులున్న సవినయుడు విద్యను చక్కగా అభ్యసిస్తాడు.

1. 'ఆచార్యాత్ పాదమాదత్తే' - గురువునుంచి విద్యార్థి ఒక 1/4 భాగం విద్యను సంగ్రహిస్తాడు.

2. 'పాదం శిష్యః స్వబుద్ధితః' - నేర్చినదాన్ని మననంచేస్తూ తన ప్రజ్ఞతో మరో 1/4 భాగం పెంచుకొంటాడు.

3. 'పాదం సబ్రహ్మచారిభ్యః' - తోటి చదువరులతో చర్చిస్తూ, ఇంకో 1/4 భాగం వృద్ధి చేసుకొంటాడు.

4. 'పాదః కాలేన పచ్యతే' - కాలక్రమంగా, ఆవిద్య 1/4 భాగం అనుభవంతో సమగ్రమవుతుందని అనుభవజ్ఞులన్నారు.

ఈ విద్యలన్నింటిని కలిపి మొత్తం, రెండే రెండు విద్యలుగా "ద్వే విద్యే వేదితవ్యే" పరమాత్మను తెలుసు కోవడానికి అవసరమన్నది ముండకోపనిషత్తు.

విద్య అంటే జ్ఞాన మని అర్థం. శాస్త్రజన్యజ్ఞానాన్ని "అపరవిద్య"గా, వివేక జన్య జ్ఞానాన్ని "పరవిద్య" గా బోధిస్తుంది ఉపనిషత్తు.

వేదశాస్త్రాదులనభ్యసించడంవల్ల - అపరవిద్యవల్ల - పరోక్షంగా పరబ్రహ్మను తెలుసుకొంటాడు. పరవిద్యవల్ల అక్షరశబ్దవాచ్యపరబ్రహ్మను ఉపాసనాత్మకమైన భక్తిరూపాపన్నజ్ఞానంచేత ప్రత్యక్షంగా దర్శనసమానాకారంగా సాక్షాత్కారం చేసుకొంటాడు. శబ్దబ్రహ్మజ్ఞానం తర్వాత, పరబ్రహ్మసాక్షాత్కారానికి హేతు వైన ఉపాసనాత్మకభక్తిరూపజ్ఞానమే "సుజ్ఞానం".

"మోక్షే ధీర్జ్ఞానమ్".జ్ఞానమంటే మోక్షమందలిబుద్ధి, అని అమరకోశం. శ్రీభాష్యం 'సర్వాపేక్షాధికరణం'లో బ్రహ్మసూత్రాన్ని (3-4-26)వివరిస్తూ జ్ఞానాన్ని సప్తాంశములతో విశదీకరించింది.

జ్ఞానం 1. వేదాంతవాక్యార్థజ్ఞానానికంటె భిన్నార్థం కలది.

2. ధ్యానం, ఉపాసనం అనే పర్యాయపదాలు కలది.
3. సాక్షాత్కారరూపమైన స్మృతి.
4. అత్యంతప్రియమైనది.
5. ప్రతిదినం అభ్యసించడంవల్ల వృద్ధి పొందేది.
6. మరణించే దాకా అనుష్ఠింపదగినది.
7. మోక్షఫలసాధనం.

స్నేహ పూర్వకంగా నిరంతరం భగవద్ధ్యానం చేసే భక్తుడు సుజ్ఞాని.

"యేఽనన్య మనస శ్శుద్ధాః యే దాస్యైకమనోరథాః।
తేషాం మే హృదయం విష్ణోః వైకుంఠాత్పరమం పదమ్"॥

వేరే ప్రయోజనాన్ని అపేక్షింపక భగవత్సేవ యందే మనస్సును లగించిన సుజ్ఞానుల హృదయంలో నివసించడమే వైకుంఠునికి ఎక్కువ ఇష్టం. అందరి హృదయంలోనూ భగవంతుడు ఉన్నాడు. కాని,

"భగవచ్చరణద్వంద్వే భక్తి ర్యేషాం న విద్యతే।
తేషాం హృది స్థితో దేవః కంటకాగ్ర ఇవ స్థితః॥

భగవత్పాదాలను సేవించే భక్తి లేనివారి హృదయమందున్న నారాయణుడు ముండ్ల మీద నిల్చియున్నట్లు అతివ్యసనంతో ఉంటాడని బ్రహ్మాండ పురాణం తెల్పుతుంది.

'మదిలో నిల్పడం' -అంటే మంత్రాన్ని అర్థం తెలుసుకొని ధ్యానించడం.

'నారాయణ' శబ్దంలోని అక్షరాల అర్థాలను 'మంత్రసస్మృతి' తెల్పుతుంది.

'నా'కారార్థం: "నాస్తిక్యహానిర్నిత్యత్వం నేతృత్వం చ హరేః పదమ్।
నాకారసేవినాం నృణాం మంత్రవిద్భిః ప్రకీర్తితః॥

దేవుడు లేడనే బుద్ధిని తొలగిస్తుంది. ఆదిమధ్యాంతరహితుడు, తనను భజించేవారిని పరమపదానికి తీసుకొని పోతాడంటుంది.

'రా'-"రంజనం భగవత్యాశు రాగహాని స్తతోఽన్యతః।
రాష్ట్రత్రాణాదికం చాపి ప్రాప్యతే రేఫసేవయా॥"
భగవత్ప్రేమను, వైరాగ్యాన్ని , రాష్ట్రరక్షణమూ కల్పిస్తుంది.

'య'-"యోగోద్యోగఫలం చాశు యకారాత్ప్రాప్యతే బుధైః।
యక్షరాక్షసవేతాలభూతాదీనాం భయాపహః"
యోగానుష్ఠాన ఫలాన్ని ఇస్తుంది. యక్షరాక్షస భేతాళ భూతాదుల భయం లేకుండా చేస్తుంది.

'ణ'- వర్ణనం చ తథా విష్ణో ర్వాణీ సిద్ధిర్ణ కారతః"
'ణ' కారం వల్ల భగవంతుణ్ని వర్ణించే వాక్శుద్ధి సిద్ధిస్తుంది.

అర్థం, ప్రకరణం, లింగం, దేశకాలాల ఔచిత్యం, వీటన్నిటిని బట్టి శబ్దార్థాలు విభజింపబడుతాయి.

నామాన్ని అర్థంతోపాటు అనుసంధిస్తున్నప్పుడు వేర్వేరు యోజన లందు వేర్వేరుగా ఫలప్రాప్తి ఉంటుంది. నామహేతువులైన గుణాలనూ, శబ్దార్థ యోజననూ, విద్యల అంతస్సారాన్నీ హృద్యంగా అనుభవిస్తూ, అనుశీలిస్తూ, ఆస్వాదిస్తూ ఉండడమే ఆ మర్మవీక్షణం.

ఎన్ని విద్యలు నేర్చినా సమ్యక్ జ్ఞానంతో వాటి రహస్యాలను తన అనుష్ఠానంద్వారా సదస్యం చేయనివాడు తెలిసీ తెలియని వాడే.

"అధీత్య చతురో వేదాన్ ధర్మశాస్త్రాణి మానవః।
యో వై బ్రహ్మ న జానాతి దర్వీ పాకరసం యథా॥"

నాలుగువేదాలనధ్యయనం చేసినా, ధర్మశాస్త్ర పారంగతుడైనా, సర్వ శాస్త్రసారమైన పరబ్రహ్మస్వరూపాన్ని ఎరుగని మానవుడు, వంట పాత్రలయందు మగ్నమైనా వంటకపురుచినెరుగని గరిటెలాంటివాడే.

"నాచ్ఛాదయతి కౌపీనం, న దంశమశకాపహమ్।
శునః పుచ్ఛమివానర్థం పాండిత్యం ధర్మవర్జితమ్॥"

గోచికి గానీ, ఈగలను దోమలను తోల్కొనడానికి గానీ ఉపయోగపడని కుక్కతోకలాగా ధర్మానుష్ఠానరూపంగా ఉపయోగపడని పాండిత్యం వ్యర్థమేకదా!

"యథా ఖరశ్చందనభారవాహీ, భారస్య వేత్తా న తు చందనస్య।
ఏవం హి శాస్త్రాణి బహూన్యధీత్య చార్థేషు మూఢాః ఖరవద్వహంతి॥"

(సుశ్రుతం 4-3) చందనపు చెక్కలను మోసే గాడిద, వాటి భారాన్నే కాని సువాసనను మాత్రం తెలుసుకోదు. అనేక విద్యల నభ్యసించినా, వాటి మర్మాన్ని గ్రహించే యోగ్యత, సారాన్ని అనుభవించే కౌశలం లేని వ్యక్తి గాడిదయే కదా!

ఒకప్పుడు మూఢుణ్ని, మూర్ఖుణ్ని, గాడిదను తక్కెడలో ఒక వైపు ఉంచారు పెద్దలు. ఈ అధమవస్తువులకు తగినట్లు ఉత్తమవస్తువులు కావలసి వెదికితే మూడు వస్తువులు దొరికాయి. భగవత్తత్వాన్ని నిరూపించేవేదం, దాన్ని తెలుసుకొనే విప్రుడు, తెలుసుకొనబడే కేశవుడు. ఈ మూడింటిని రెండవవైపు ఉంచగనే తూనిక సరిపోయింది. దీన్నే పెద్దలు ఇలా అన్నారు.

"వేదో విప్రః కేశవశ్చైకరాశిః, మూఢో మూర్ఖో గార్దభశ్చైకరాశిః"

దేవతల్లో ప్రధానులు బ్రహ్మ, విష్ణు, రుద్రులు! ఈత్రి మూర్తులలో 'క' అంటే బ్రహ్మను, 'ఈశ' అంటే రుద్రుణ్ని, వ అంటే (వీరిద్దరిని) వహించేవాడు కేశవుడు. ఈనామం నారాయణునికే తప్ప బ్రహ్మ రుద్రులకు లేదు కదా!

**మ. లలి(గబ్బంబు కరాట మివ్వసుధ నెల్లన్మించె(బో నీ కథా**
**వళి కర్పూరమునించిన న్నితరమౌ వ్యర్థార్థకామోదముల్**
**పెలుచంబూనిన యక్కరాటము తుదిన్ బేతే కరాటంబె పో**
**చలదిందీవరపత్రలోచన, ఘనశ్యామాంగ, నారాయణా॥ 6**

అర్థం : చలత్ + ఇందీవరపత్రలోచన = చలించే కలువరేకులలాంటి కన్నులు కలవాడా! ఘన శ్యామ+అంగ = మేఘంవలె నీలవర్ణదేహంకలవాడా! ఓనారాయణా! నీ కథా + ఆవళి కర్పూరము నించినన్ = నీ కథల సముదాయ మనే పచ్చకర్పూరం నింపినట్లైతే; కబ్బంబు, కరాటము = కావ్యమనే బరణి; లలిన్ = క్రమంగా; ఈ వసుధన్, ఎల్లన్ = ఈభూమియందంతటా; మించెన్,పో = తళుక్కున మెరుస్తూ వ్యాపిస్తుంది కదా! ఇతరమౌ = వేరే; వ్యర్థ + అర్థక + ఆమోదముల్ = పనికిరాని వస్తువులు వాసనలను; పెలుచన్ = మిక్కుటంగా; పూనినన్ = కలిగియున్నట్లైతే; ఆ కరాటము = ఆ బరణి; తుదిన్ = చివరకు; బేతే = వ్యర్థంగా; కర+అటంబె, పో = చేతుల్లో మెలగేదే సుమా!

తా: కలువరేకుల్లాగా చలించేకన్నులూ, నీలమేఘం లాగా శరీరమూ కలిగిన ఓ నారాయణా! నీకథల సముదాయమనే పచ్చకర్పూరం నింపినట్లైతే కావ్యమనే బరణి

వరుసగా వసుధనంతా తళుక్కున ఆవరిస్తుంది. ఇక వేరే నిష్ప్రయోజక ద్రవ్య వాసనలతో బాగా నిండిన ఆ బరణి, చివరకు చేతులతో పట్టుకొనే వస్తువే అవుతుంది సుమా!

**వ్యాఖ్య: భగవత్కథలుగల కావ్యం ఆదరణీయం.**

నారాయణుడు తామరాకులవలె విశాలమైనకన్నులు కలవాడే 'ఇందీః' అంటే లక్ష్మి. ఆమె అసితేక్షణ. నల్లకలువలలాంటికన్నులు కలది. సర్వేంద్రియాలను ఆకర్షించే కమలాక్షుణ్ని లక్ష్మి వరించింది. ఆమె చూపులు పడగానే ఆయన కన్నులు ఇందీవరపత్రాలలాగా తరళాయమానమయ్యాయి. ఐశ్వర్యవంతమైన దృక్కులు కలవాడని అర్థం.

నీటితోనిండియున్న మేఘం నీలవర్ణంతో శోభిస్తూ, ఔదార్యంతో మిట్ట పల్లాలనకుండా అంతటా వర్షిస్తుంది. నల్లని వర్ణం చల్లని దయకు సంకేతం. ఔదార్యమేమూర్తీభవించినట్లున్న ఘనశ్యామాంగుడు కృపను వర్షిస్తాడు. వసుధను సమస్తవస్తుసంపన్ననూ చేస్తాడని అర్థం.

భగవంతుని కథావళియే పచ్చకర్పూరం. కావ్యమే కర్పూరంతో నింపిన బరణి. పచ్చకర్పూరం తెల్లగా ఉంటుంది. బరణిని తెరువగానే, దశదిశల సువాసన గుభాళిస్తుంది. ఇది తాద్రూప్యరంజక మైన ఆలంకారికవాక్యం.

నారాయణకథలతో నిండిన పుస్తకం పచ్చకర్పూరంలాగా నేలనాలుగుచెరగులా పరిమళిస్తూ స్వచ్ఛంగా ప్రకాశిస్తుంది. పుస్తకం హస్తభూషణమైనా, మస్తకంతో కుస్తీ పడుతుంది. జాడ్యాన్ని ఝాడిస్తుంది.

"శ్రోత్రం దైవం. తచ్ఛ్రోత్రేణ హి విందతే - ద్రవిణం బ్రహ్మవర్చసమ్" (బృ.ఉ) భౌతికద్రవ్యంతో నిండిన వసుధను జ్ఞానద్రవ్యంతో ప్రకాశింప చేస్తుంది. కావ్యాన్ని విన్నా, చదివినా ధర్మం వ్యాపిస్తుంది. ధర్మవ్యాప్తిచే పాపం పంచబంగాళమవుతుంది. "ధర్మేణ పాపమపనుదతి" (శ్రుతి).

"కావ్యాత్ ధర్మప్రాప్తిః భగవచ్చరణారవిందస్తవాదినా" - (సాహిత్య దర్పణం).

భగవంతుని చరిత్రను ప్రకటించే కబ్బం, ఇహపరసుఖసాధనమనడం దబ్బరం కాదు. ఇతర రచనలను చదివితే ప్లాట్ ఫార్మ్ మీద పల్లీపలుకులు బుక్కినట్లే కదా!

విష్ణుకథలను చెప్పక, ఆయన గుణాలనెన్నక, కేవలం రాజులచరిత్రను, రాజకీయధర్మాలను చెప్పినందువల్ల వేదవ్యాసమహర్షికి వగ, వంత కలిగినదనీ, శ్రీహరి గుణవర్ణనం చేయడం శ్రేయస్కరమనీ నారదమహర్షి ప్రబోధించాడు. ఆచార్యోపదేశంవల్ల నారాయణభక్తియోగమనస్కారంతో వ్యాసమహర్షి

భువనక్షేమంకరమైన శ్రీమద్భాగవతాన్ని రచించాడు. మోక్షార్థియైన శ్రీశుకునిచే చదివించాడు, ప్రకాశింప చేశాడు. నారదుడు వ్యాసునికి ఉపదేశించిన విధమిది-

"హరినామస్తుతి సేయుకావ్యము సువర్ణాంభోజహంసావళీ
సురుచిభ్రాజితమైన మానససరఃస్ఫూర్తిన్ వెలుంగొందు శ్రీ
హరినామస్తుతి లేని కావ్యము విచిత్రార్థాన్వితంబయ్యు శ్రీ
కరమై యుండ దయోగ్యదుర్మదనదత్కాకోలగర్తాకృతిన్"
(ఆం.భాగ.5 ఆ.94)

భగవంతుణ్ని స్తుతించే కావ్యం బంగారు కమలాలతో, హంసలకులుకులతో ప్రకాశించే మానససరస్సులాగా శోభిస్తుంది. భగవద్గుణాలను ప్రశంసించని కృతి, శబ్దార్థాలంకారాలతోనూ, సరసగుణాలతోనూ మనస్సునాకర్షించే రీతిగా ఉన్నా చూడడానికీ, వినడానికీ తగని, బాగా బలిసి అరచేకాకులతో, బుసకొట్టే విషసర్పాలతో నిండిన గోయిలాంటి ఆకృతికలదై సంపత్కరంగా ఉండదన్న మహర్షి మాట గమనార్హం.

**మ. మనమారన్నచలేంద్రజాధిపతికి న్మస్తాగ్రమాణిక్యమై**
**మునికోపానలదగ్ధరాజతతికి న్ముక్తిస్ఫురన్మార్గమై**
**యెనయన్ సాయకశాయికింజననియై యేపారు మిన్నేటికిం**
**జనిమూలంబగు నంఘ్రి నాదుమదిలోఁజర్చింతు, నారాయణా॥- 7**

అర్థం : ఓనారాయణా! అచల + ఇంద్రజా + అధిపతికిన్ = పర్వతరాజపుత్రికకు పెనిమిటియైన శివునికి; మస్త + అగ్ర మాణిక్యమై = జటాజూటమందు శోభించే మాణిక్యమై; ముని కోప + అనల, దగ్ధ, రాజతతికిన్ = కపిలమునియొక్క కోపమనే అగ్గిచే బుగ్గియైనరాజుల సమూహానికి; ముక్తి స్ఫురత్ + మార్గమై = మోక్షమనే పురుషార్థాన్ని పొందడానికి వెలుగుదారియై; ఎనయన్ = పొందికగా; సాయకశాయికిన్ = బాణాల మీద పడుకొన్న భీష్మాచార్యులకు; జనని యై = కన్నతల్లియై; ఏపారు = బాగాశోభించే; మిన్నేటికిన్ = ఆకాశగంగకు; జని మూలంబు + అగు = పుట్టుకకు కారణమైన; అంఘ్రి = పాదాన్ని; నాదు = నాయొక్క; మదిలో = హృదయమందు; మనము + ఆరన్ = మనసార; చర్చింతు = ధ్యానింతును.

తా : ఓనారాయణా! పార్వతీ పతికి చూడామణిగానూ, కపిలముని యొక్క కోపాగ్నిచేత బూడిదయైన సగరచక్రవర్తి పుత్రులకు ముక్తిమార్గంగానూ, అంపసెజ్జపై పడుకొన్న భీష్మాచార్యుల కన్న తల్లిగానూ, ప్రసిద్ధి పొందిన ఆకాశగంగకు ఉద్గమస్థానమైన నీ పాదాన్ని నా అంతరంగంలో మనసారా ధ్యానిస్తాను.

**వ్యాఖ్య: నారాయణుని పాదమహిమను ప్రస్తుతించే పద్యమిది.**

'నారం' అంటే ఉదకం. ఉదకాన్ని సృజించి తాను దానిలో అంతరాత్మగా ఉన్నాడు. కాబట్టి నారాయణుడని భగవంతునికి పేరు.

"సృష్ట్వా నారం తోయ మంతస్థితోఽహం।
యేన స్యాన్మే నామ నారాయణేతి!!"

"అప ఏవ ససర్జాదౌ" - భగవంతుడు మొదట నీటినే సృజించాడు, అని మనుస్మృతి. "యా సృష్టిః స్రష్టురాద్యా" (అభిజ్ఞానశాకుంతలం).

"తోయేన జీవాన్ వ్యససర్జ భూమౌ" నీటిచేత (ఉపలక్షితమైన భూతాలద్వారా) జీవులను భూమిమీద సృజించాడన్నది నారాయణోపనిషత్తు.

'నారాయణా!' అనే సంబోధనాంతపదం, ఈ పద్యభావతరంగిణీ ప్రకటనౌచిత్యాన్ని ప్రదర్శిస్తుంది.

శివుడు గంగాధరుడు:

ఇంద్రసేనుడు యాగాదులు చేయడం వల్ల బలిచక్రవర్తిగా ప్రఖ్యాతుడయ్యాడు. శ్రీమహావిష్ణువు వామనమూర్తియై ఆమహాబలివద్ద మూడడుగుల స్థలాన్ని యాచించి పొందాడు. త్రివిక్రముడై ఒక పాదంతో నేల నంతా ఆక్రమించాడు. రెండవపాదంతో ఆకాశాన్ని కొలిచాడు. ఆ శ్రీపాదం వ్యాపించి సత్యలోకానికి పోయినప్పుడు, ధర్మదేవతయే **"వామపాదాంబుజాంగుష్ఠనఖస్రోతోవినిర్గతామ్। విష్ణోః"**- (వి.పు.2-8-109) శ్రీమహావిష్ణువు యొక్క ఎడమకాలి బొటనవ్రేలునుంచి నఖరూపమైన ప్రవాహంగా - గంగ ఉద్భవించింది. బ్రహ్మదేవుడు ఆధర్మతీర్థంతో విష్ణుపాదాన్ని భక్తితో కడిగి పూజించాడు. ఆ విష్ణుపాదప్రక్షాళన చేత ప్రవహించిన గంగా తీర్థాన్ని పరమశివుడు తన శిరస్సున ధరించి పవిత్రుడయ్యాడని "ఈశ్వర సంహిత" చెబుతుంది.

"ద్రవీభూత స్తథా ధర్మో హరిభక్త్యా మహామునే।
గృహీత్వా ధర్మపానీయం పదం నాథస్య తుష్టయే॥
క్షాళితం పరయా భక్త్యా దధార శిరసా హరః॥
పావనార్థం జటామధ్యే యోగ్యోఽస్మీత్యవధారణాత్॥"

శ్రీమద్భాగవతసూక్తికూడా ఇలాగే ఉంది.

"యచ్ఛౌచనిస్సృత సరిత్ప్రవరోదకేన
తీర్థేన మూర్ధ్ని విధృతేన శివః శివోఽభూత్॥".

అధ్యాత్మరామాయణంలో వసిష్ఠుని మాటలు ఇలా ఉన్నాయి. శ్రీవిష్ణుపాదతీర్థాన్ని ధరించి పార్వతీపతి. నాతండ్రియైన బ్రహ్మకూడా అమంగళం తొలగినవారై ధన్యులయ్యారు.

"త్వత్పాదసలిలం ధృత్వా ధన్యోఽభూద్గిరిజాపతిః।

బ్రహ్మాఽపిమత్పితా తే హి పాదతీర్థహతాశుభాః॥"

కర్మపరిపాకం చేత బ్రహ్మ మొదల్కొని అంతా అమంగళమే, అని గ్రహించి విరక్తుడైన వ్యక్తికి శ్రియఃపతియే గతి.

"కర్మణాం పరిపాకత్వా దావిరించా దమంగళమ్।

ఇతి మత్వా విరక్తస్య వాసుదేవః పరా గతిః॥

అనే శబ్దప్రమాణమే స్పృహణీయం.

విష్ణుపాదోద్భవ యైన గంగయే ముక్తి మార్గం:

అయోధ్యాధిపతియైన సగర చక్రవర్తికి ఇద్దరు భార్యలు. భృగుమహర్షివరంవల్ల కేశినికి అసమంజుడు అనే ఒక్క కొడుకు పుట్టాడు. సుమతికి (60) అరవై వేల మంది కొడుకులు పుట్టారు. అసమంజుడు క్రూరుడైనందువల్ల రాజ్యం నుంచి బహిష్కృతుడు. అసమంజుని కొడుకైన అంశుమంతుడు బుద్ధిమంతుడు.

సగరచక్రవర్తి అశ్వమేధయాగం చేయడానికి వదలిన యజ్ఞాశ్వం మరునాడే మాయమైంది. ఇంద్రుడు అశ్వాన్ని దొంగలించాడు. సగరుడు అశ్వాన్ని వెదకి తెమ్మని తన కుమారులైన సాగరులను పంపాడు. అరవైవేలమంది అంతటా వెదకినా, అశ్వం కనపడలేదు. వారు భూతహింసకు పాల్పడి భూమిని తవ్వుతూ పాతాళానికి చేరారు. అక్కడ కపిల మహామునినీ, అశ్వాన్నీ చూచారు. కపిలుడే దొంగ అని వారు కేకలువేస్తూ మునిని కొట్టబోయారు. కపిలముని హుంకరించాడు. ఆయన కోపాగ్నికి సాగరులు భస్మమయ్యారు.

సగరుడు చివరకు అంశుమంతుణ్ని పంపాడు. అతడు పినతండ్రులు తవ్వినతోవలోనే పోయి పాతాళంలో సాగరుల బూడిదకుప్పలను చూచి దుఃఖించాడు. అక్కడ సాగరుల మేనమామయైన గరుత్మంతుడు కనిపించాడు. మొదట మీ తాతగారి యజ్ఞం పూర్తిచేసి, తర్వాత గంగాజలాన్ని మీ పినతండ్రుల భస్మరాశులమీద ప్రవహింపజేయుమని అంశుమంతునికి సలహా నిచ్చాడు గరుడుడు.

అంశుమంతుడు కపిలమునిని వినయంగా ప్రార్థించాడు, యజ్ఞీయాశ్వాన్ని సగరునికి అందజేశాడు, జరిగినదంతా చెప్పాడు. సగరుడు చాలా దుఃఖించాడు, యజ్ఞాన్ని పూర్తి చేశాడు.

తర్వాత ఎవరూ గంగాజలాన్ని ప్రవహింపజేయ సమర్థులు కాలేదు. అంశుమంతుని మనుమడు,దిలీపుని పుత్రుడైన భగీరథమహారాజు గోకర్ణక్షేత్రంలో పెక్కేండ్లు తపస్సు చేశాడు. బ్రహ్మదేవుడు ప్రత్యక్షమయ్యాడు. తన తాతల బూడిదకుప్పలమీద గంగ ప్రసరించాలనీ, తనకు సంతానం కలగాలనీ భగీరథుడు ప్రార్థించాడు. బ్రహ్మ రెండు వరాలను ఇచ్చాడు.

గంగ భగీరథుని వెంట రాసాగింది. దారిలో జహ్నుమహర్షియజ్ఞశాలను ముంచివేసింది. కోపంతో ఆముని గంగను తాగేశాడు. దేవతలూ ప్రార్థించారు. జహ్నువు తన చెవిలోనుంచి గంగను విడిచాడు, కాబట్టి గంగకు 'జాహ్నవి' అని పేరు కలిగింది. భగీరథునివెంట పోయిన భాగీరథి - గంగ- భస్మరాశుల మీద ప్రవహించింది. సాగరులు దేవతలై ఆనందించారు. గంగ దగ్ధరాజతతికి ముక్తి స్ఫురన్మార్గమయింది.

"భగవద్విష్ణుపాదాంగుష్ఠనిర్గతస్య హి జలస్యైతన్మాహాత్మ్యమ్"(వి.పు.4-4-30)శ్రీవిష్ణు పాదాంగుష్ఠంనుంచి నిర్గమించిన నీటికే ఇంతటి మహిమ ఉందికదా! భీష్ముని కన్నతల్లి గంగాదేవి:

సునందాప్రతీపులనే పుణ్యాదంపతులకు ముగ్గురు పుత్రులు.

1. శంతనుడు 2. దేవాపి 3. బాహ్లికుడు.

గంగాతీరాన తపస్సుచేస్తున్న ప్రతీపమహారాజును చూచిన గంగ మోహంతో స్త్రీ రూపందాల్చి వచ్చి ఆయన కుడితొడమీద కూర్చున్నది. ఏకపత్నీ వ్రతుడైన ప్రతీపుడు "పుత్రులకు మాత్రమే యోగ్యమైన కుడితొడమీద కూర్చున్ననీవు నా పుత్రునికి భార్యవవుతావన్నాడు."

1. ఆపుడు 2. ధ్రువుడు 3. సోముడు 4. ధరుడు 5. అనిలుడు 6. అనలుడు 7. ప్రత్యూషుడు 8. ప్రభాసుడు అనే అష్టవసువులు పత్నులతోకూడి వసిష్ఠుని ఆశ్రమానికి వెళ్ళారు. 'నందిని' అనే వసిష్ఠుని హోమధేనువు పాలు తాగినవాళ్ళకు జరామరణములుండవు. కాబట్టి ప్రభాసుని భార్యయైన 'యోగసిద్ధి' ఆ ధేనువును తస్కరించుమని కోరింది. ప్రభాసుడు వసువులందరు కలిసి నందినిని అపహరించారు. వసువులను 'మర్త్యలోకాన పుట్టండి' అని శపించాడు వశిష్ఠుడు.

ఇక్ష్వాకు వంశపురాజైన 'మహాభిషుడు' ఇంద్రసభలో గాలిచేత పైట జారిన గంగాదేవిని అభిలాషతో చూచాడు. ఈ చేష్టను గమనించిన బ్రహ్మ 'మర్త్యలోకంలో జన్మించు' మని మహాభిషుణ్ణి శపించాడు. అతడే శంతనుడు.

శప్తులైన అష్టవసువులు భూలోకానికి వస్తూ దారిలో గంగను చూచారు. పరస్పర వృత్తాంతాల నడిగి తెలుసుకొన్నారు. తాము పుట్టిన వెంటనే తమను నదిలో

పారవేయమని వసువులు గంగను వేడుకొన్నారు. ఒక్క కొడుకైనా దీర్ఘాయుష్మంతుడుగా ఉండకూడదా? అని గంగాదేవి కోరగా పెద్దతప్పుచేసిన ప్రభాసుడంగీకరించాడు.

శంతను మహారాజు యువతిగా ఉన్న గంగను చూచి కామించాడు. ఆమె 'ఏమిచేసినా మారాడకూడ' దన్ననియమాన్ని అంగీకరించిన శంతనుణ్ని పెండ్లాడింది. తనకు పుట్టిన నిసుగును వెంటనే నదిలోకి విసరివేస్తుండేది. కట్టడికి వెరచిన శంతనుడు కిమ్మన లేదు. ఎనిమిదవ శిశువు పుట్టగానే 'ఓ పుత్రఘాతీ! ఈ శిశువును చంపనీయ' నన్నాడు శంతనుడు. శపథం తప్పిన నీ వద్ద నేనుండననీ, పెద్దవాడైన తర్వాత నీ కప్పగిస్తాననీ పుత్రుణ్ని తీసుకొనిపోయింది గంగాదేవి.

"శంతనోరప్యమరనద్యాం జాహ్నవ్యాముదారకీర్తి రశేష శాస్త్రార్థవి ద్భీష్మః పుత్రో ఽభూత్." (వి.పు.4-20-33)

శంతనునికి గంగాదేవి యందు జన్మించిన పుత్రుడే కీర్తిమంతుడూ, సకల శాస్త్రార్థవేత్త యైన భీష్ముడు.

గాంగేయుడు వసిష్ఠునివద్ద సకల విద్యలనభ్యసించాడు. ధర్మాత్ముడు. మహాపరాక్రమవంతుడు. యువరాజు తాను రాజ్యాన్ని త్యజించి, బ్రహ్మచర్యవ్రతాన్ని పరిగ్రహించి, దాశరాజుకూతురైన సత్యవతిని కామించి కృశించిన తండ్రికి ఇప్పించి వివాహంచేసిన వీరసూనుడు. దేవతలు మెచ్చుకొన్న దేవవ్రతుడు. పితృభక్తిపరాయణుడై. తండ్రిచేత "స్వచ్ఛంద మరణం" వరంగా పొందిన లబ్ధవర్ణుడు.

కురుపితామహుడు దుర్యోధనుని పక్షాన పాండవులతో - పదిదినాలు పార్థునితో - యుద్ధంచేసిన వీరయోధుడు. ఆయుధం పట్టనని ప్రతిజ్ఞ చేసిన పార్థసారథిచేత చక్రాన్ని ఆయుధంగా పట్టించిన ఆర్తప్రపన్నుడు. తాను మరణించే ఉపాయాన్ని పాండవులకు చెప్పిన త్యాగధనుడు. శిఖండిని ముందుంచుకొని అర్జునుడు బాణాలు వేస్తుండగా, శిఖండిని చూడగనే అస్త్రసన్యాసం చేసిన అమరవీరుడు. పార్థుడు ప్రయోగించిన శరపరంపరకు తూర్పుతలగా పడిన శరతల్పుడు. ఎవరేమిచ్చినా గ్రహించక, కిరీటి బాణం వేయగా పాతాళంనుంచి పైకి వచ్చిన గంగోదకాన్ని మాత్రం పానం చేసిన గాంగేయుడు, సాయక శాయియై ఉత్తరాయణం వచ్చేదాక "మా విజయుంజేరెడు వన్నెకాఁడు మదినావేశించునెల్లప్పుడున్" అని ప్రస్తుతిస్తూపార్థసారథిమీద మనస్సును చేర్చి పారవశ్యస్థితిలో ఉన్నవాడు.

శివునికి తలమానికమై, సాగరులకు ముక్తి మార్గమై, సాయకశాయికి కన్నతల్లి యైన మిన్నేటి పుట్టుకకు కారణమైనది పవిత్ర నారాయణ చరణమే."క్షాళితాఖిల కల్మషవ్రజామరనదీ జనక కోమల పదా బ్జముల" ను మనసార స్తుతించినవారు పరిశుద్ధాత్ములై పరమపదం పొందుతారు కదా!

**శా. నీపుత్రుండు చరాచరప్రతతుల న్నిర్మించి పెంపారఁగా**
**నీ పుణ్యాంగన సర్వజీవతతులన్నిత్యంబు రక్షింపగా**
**నీ పాదోదకమీజగత్త్రయములన్నిష్పాపులంజేయఁగా**
**నీ పెంపేమని చెప్పవచ్చు సుగుణా నిత్యాత్మ, నారాయణా॥ 8**

అర్థం: సుగుణా = మంచిగుణాలుకలవాడా! నిత్యాత్మ = ఎల్లప్పుడు జ్ఞానస్వరూపంకలవాడా! ఓ నారాయణా! నీపుత్రుండు = నీకుమారుడైన బ్రహ్మ; చర+ అచర, ప్రతతులన్ = జీవ జడవస్తురాశులను; నిర్మించి = సృజించి; పెంపారగా = వృద్ధిపొందగా; నీపుణ్య + అంగన = నీధర్మపత్నియైన లక్ష్మి; సర్వజీవతతులన్ = సమస్తజీవరాశులను; నిత్యంబు = ఎల్లప్పుడు; రక్షింపగా = కాపాడగా; నీపాద + ఉదకము = నీచరణతీర్థమైన గంగ, ఈ జగత్ + త్రయములన్ = ఈ మూడులోకాలను; లోకాలయందుండే వారిని; నిష్పాపులన్ = పరిశుద్ధులను; చేయగా = చేస్తుంటే; నీపెంపు = నీపెద్దరికం, వైభవం; ఏమని చెప్పవచ్చు = ఏమీ చెప్పరానిదికదా!

తా: ఓ సుగుణా! నిత్యాత్మ! నారాయణా! నీ పుత్రుడైన చతుర్ముఖబ్రహ్మ జంగమస్థావర పదార్థాలను సృజిస్తుంటే, నీధర్మపత్నియైన లక్ష్మీదేవి సకల జీవరాశులను ఏమరకుండా రక్షిస్తుంటే, నీ పాదతీర్థమైన గంగ ముల్లోకాలను పావనం చేస్తుంటే నీ మహిమ వర్ణించనలవికానిది.

**వ్యాఖ్య : నారాయణమహిమ వర్ణనాతీతం.**

నారాయణుడు సుగుణుడు. దోషంలేశమైనా లేనప్పుడు ఉన్నవన్నీ జగదుపకార గుణాలే. సకల కల్యాణగుణ సముద్రుడు. ఆయన నిత్యాత్ముడు.

"నిత్యం హి నాస్తి జగతి భూతం స్థావరజంగమమ్।
ఋతమేకం పురుషం వాసుదేవం సనాతనమ్॥

'నారాయణుడు తప్ప స్థిరచరవస్తువులలో నిత్యమైనదిలేదు'అన్నట్లు నారాయణుడే నిత్యుడు. శాశ్వతంగా ఉండేవాడు. అంతేకాదు దివ్యజ్ఞానమే శరీరంగా గల విభువు. "దివ్యబోధతను ర్విభుః".

నారాయణుని పుత్రుడు స్రష్ట చతురాననుడు.

"కదా చిత్తస్య సుప్తస్య నాభ్యాం కామాదజాయత।
దివ్యమష్టదళం భూరి పంకజం పార్థివం మహత్॥"(బ్రహ్మాండపురాణం)

యోగ నిద్రాముద్రితుడైన నారాయణుని సంకల్పంచేత అతని నాభియందు పృథివీసంబంధమైన అష్టదళాలుగల పెద్ద పద్మం ఒకటి జనించింది.

"యన్నాభిజాతా దరవిందకోశాత్
బ్రహ్మావిరాసీద్యత ఏష లోకః॥ (భాగ.10-24-1)

నారాయణుని ఆనాభికమలం నుంచి బ్రహ్మదేవుడు జన్మించాడు. ఆయన వల్ల ఈలోకం జనించింది. శ్రుతి వాక్యాలలా ఉన్నాయి.

"బ్రహ్మ దేవానాం ప్రథమ స్సంబభూవ
విశ్వస్య కర్తా భువనస్య గోప్తా॥" (ముం.ఉప)

"సచింతయన్ ద్వ్యక్షర మేకదాఽంభ స్యుపాశ్రుణో ద్విర్గదితం వచో విభుః।
స్పర్శేషు యత్ షోడశ మేకవింశం, నిష్కించనానాం నృప! యద్ధనం విదుః॥

(భాగ.1 స్కం-9 అ.6) బ్రహ్మకు, అంతాజలమయమే కాబట్టి, ఏమీ తోచలేదు, అంతలో ఆనీటినుంచి "తప, తప" అనే శబ్దం వినిపించింది. దైన్య జీవనులకు ఆశబ్దం గొప్పధనం. పెక్కేండ్లు బ్రహ్మతపస్సుచేయగా నారాయణుడు ప్రత్యక్షమయ్యాడు. వేదాలను నేర్పాడు. ఆజ్ఞానం చేతనే అండాంతర్వర్తియైన చేతనాచేతన పదార్థాల సృష్టికంతటికీ కర్త అయ్యాడు. తనకప్పగించిన సృష్టికార్యాన్ని, మళ్ళీ తండ్రి తెలియజేయనక్కరలేకుండా, నిర్వహించే పుత్రుడీ చతుర్ముఖుడు.

లక్ష్మీదేవి పుణ్యాంగన. "స్యాద్ధర్మమస్త్రియాం పుణ్యం" (నిఘంటువు). పుణ్యశబ్దం ధర్మార్థకం. "రాఘవత్వేఽభవత్సీతా, రుక్మిణీ కృష్ణజన్మని!! అన్నట్లు నారాయణుడే అవతారమెత్తినా, నిత్యానపాయినియైవెలసే ధర్మపత్ని లక్ష్మీదేవి. వామనావతారంలోనూ, బ్రహ్మచారిగా ఉన్నా - "కృష్ణాజినేన సంవృణ్వన్ వధూం వక్షఃస్థలాలయామ్" - 'వక్షఃస్థలంలో ఉన్న పత్నిని కృష్ణాజినంతో కప్పి పెట్టినా' డన్నట్లు నిత్యసంబంధం కలది. 'శ్రీమన్నారాయణు' డనే పదంలోని 'మతుప్' ప్రత్యయం నిత్యయోగాన్నే బోధిస్తుంది.

పవిత్రాణాం హి గోవిందః పవిత్రం పరముచ్యతే।
పుణ్యానామపి పుణ్యోఽసౌ మంగళానాం చ మంగళమ్"॥ (భారతం-వన)

అన్నట్లు పుణ్యుడైన నారాయణుని వక్షఃస్థలమందు వెలసిన మంగళ దేవత. లోకమాత. అజ్ఞాతవిగ్రహ- ఆమె కోపమెరుగదు.

"వాత్సల్య నిర్భరతయా జననీ కుమారం
స్తన్యేన వర్ధయతి దష్టపయోధరాఽపి॥" (గోదాస్తుతి)

చంటివాడు పంటితో గంటు పెట్టినా కన్నెర్రచేయక చైతన్య స్తన్య మిచ్చి పెంచే కరుణామయి.

"శ్రీమన్మందకటాక్షలబ్ధ విభవబ్రహ్మేంద్ర గంగా ధరామ్" (శ్రీసూక్తం)
లక్ష్మీకటాక్షం వల్లనే బ్రహ్మరుద్రేంద్రులు ఐశ్వర్య వంతులయ్యారు.

"మాతర్మైథిలి! రాక్షసీస్త్వయి తథైవార్ద్రాపరాధాస్త్వయా
రక్షన్త్యా పవనాత్మజాల్లఘుతరా రామస్య గోష్ఠీ కృతా।
కాకం తం చ విభీషణం శరణమిత్యుక్తిక్షమౌ రక్షతః
సానః సాంద్ర కృతాగసః సుఖయతు క్షాంతిస్తవాకస్మికీ"॥(శ్రీగుణరత్నకోశం)
"సీతా లక్ష్మీ ర్భవాన్విష్ణుః" అనికదా! వాల్మీకి వాక్యాకం.

శ్రీరామునితో కూడియున్నప్పుడు కాకాసురుడు సీతమ్మరొమ్మును చండచుంచువుతో పొడిచి హింసించాడు. అది క్షమించరానినేరమని గ్రహించిన రాముడు బ్రహ్మాస్త్రం ప్రయోగించాడు. మూడులోకాల్లోనూ తిరిగి ఎవ్వడూ రక్షించలేనందువల్ల అతడు చివరకు శ్రీరాముని పాదాలకడ పడిపోయాడు. సీతమ్మ, పురుషకారంతో - రాముని కోపాన్ని తగ్గించి అనుగ్రహాన్ని హెచ్చించే లక్ష్యంతో - రామునిపాదాలకు మరింత దగ్గరగా కాకిని చేర్చినందువల్ల రాముడు రక్షించాడు. పతికి దూరంగా ఉన్నప్పుడు కూడా హనుమంతునితో "తప్పుచేయనివారెవరు? 'నకశ్చిన్నాపరాధ్యతి'. తప్పుచేసినా క్షమించాలి" అని నచ్చ చెప్పి అశోక వనంలో మహాపరాధలైన రాక్షసస్త్రీలను ఆయనబారినుంచి కాపాడిన తల్లి సీతమ్మ.

విశేషమేమి? అంటే, కాకిగానీ విభీషణుడుగానీ శరణుపొందినందువల్లనే శ్రీరాముడు వారిని రక్షించాడు. శ్రీరాముని దయ సహేతుకంకదా! హనుమంతుని బారినుంచి రాక్షసాంగనలను రక్షించిన సీతమ్మ దయ ఆకస్మికం. నిర్హేతుకం. కాబట్టి రాముని దయకంటె సీతామాత దయ చాలా గొప్పది అన్నారు శ్రీపరాశరభట్టరు.

దోషభూయిష్ఠులైన జీవులను శిక్షించకుంటే శాస్త్రధర్మం సజీవంగా నిల్వదని దండింప బూనుకొంటాడు భగవంతుడు. ఆయన ప్రక్కనే ఉండి

"రక్షింపు మనెడి వారిని
రక్షింపక యున్న సర్వరక్షకత వృథా।
శిక్షలు దొసఁగుకు వేసిన
పక్షంబున నెట్లు నీకృపాగుణముండున్"!

అని వాదించి - భగవంతునిచేత సర్వ జీవతతుల దోషాలను క్షమింపజేసి, నిత్యం రక్షించే పుణ్యాంగన లక్ష్మీదేవి.

శ్రీవిష్ణుపాదోదకమైన గంగ ముజ్జగాలను పావనం చేస్తుంది.

లోకాలు అంటే లోకాల్లో ఉండే దేవ, మానవ, తిర్యక్, స్థావరాదులు.

1. కృతకం 2. అకృతకం 3. కృతకాకృతకం అని లోకాలు మూడు.

1. భూలోకం 2. భువర్లోకం 3. స్వర్లోకం అని ఒకవిధం.

భూలోకానికన్న క్రింద ఉన్న లోకాలు "అతల, వితల, సుతల, తలాతల, మహాతల, రసాతల, పాతాళ" మనే ఏడుకలసి ఒకలోకం. ముఖ్యంగా పద్నాలుగు లోకాలు, మూడులోకాలుగా సంక్షిప్తాలు.

దివినుంచి భువికి దిగజారిన - గాం గతా - గంగకు స్వర్గలోకాన మందాకిని, భూలోకంలో గంగ, పాతాళంలో భోగవతి అనిపేర్లు.

అనుకూలవతియైన భార్య, విధేయమైన సంతానం గల కుటుంబి పెంపు ఎంత ఇంపో! చూడసొంపే మరి.

'ముకుందమాల'లోని 'దారా వారాకరవరసుతా" (33)

అనే శ్లోకం, ఈ పద్యరచనకు ప్రేరకం కావచ్చు.

శ్రీయామునాచార్యకృత 'చతుశ్లోకి' లోని"కాంతస్తే పురుషోత్తమః

ఫణిపతిఃశయ్యాసనం, వాహనం వేదాత్మావిహగేశ్వరః" అనే శ్లోకమూ;

'గోదాస్తోత్రం'లోని "మాతా చేత్తులసీ, పితా యది తవ శ్రీవిష్ణుచిత్తో మహాన్" అనే శ్లోకమూ ఇట్టివే.

శ్రీపుష్పదంతముఖపంకజనిస్సృతమైన 'శివమహిమ్నస్తోత్రం'లో

"రథః క్షోణీ యన్తా శతధృతి రగేంద్రో ధనుః" అనే త్రిపురాంతకుని ఆడంబర శ్లోకమూ గమనార్హమే.

రామదాసకృత 'దాశరథి శతకం'లో "నీ సతి పెక్కుకల్మొలిడ నేర్పరి" (89) అనే పద్యశైలికూడా ఇలాంటిదే కదా!

**శా. బ్రహ్మాండావలి లోన సత్వగుణి వై బాహ్యంబునం దాదిమ**
**బ్రహ్మాఖ్యం బరతత్త్వబోధములకున్ భవ్యాధినాథుండవై**
**బ్రహ్మేంద్రామరవాయుభుక్పతులకున్ భావింపరాకున్న నా**
**జిహ్మవ్యాప్తుల నెన్న నాదువశమే చిద్రూప, నారాయణా॥** 9

అర్థం: చిత్ + రూప = ఓజ్ఞానస్వరూపా! నారాయణా! బ్రహ్మాండ + ఆవలిలోన = ప్రకృతి మండలాన ఉన్న అండకోటిలోపల; సత్వగుణివై = శుద్ధ సత్వగుణంకలవాడవై; బాహ్యంబునందు = వెలుపల; ఆదిమ బ్రహ్మ + ఆఖ్యన్ = మొదటి బ్రహ్మఅనే పేరుతో; పరతత్త్వబోధములకున్ = పరుడని తెలిపే యథార్థ జ్ఞానపద్ధతులకూ; భవ్య + అధినాథుండవై = ప్రపంచోత్పత్తికి యోగ్యుడవైన గొప్ప ప్రభుడవై; బ్రహ్మ + ఇంద్ర + అమర, వాయుభుక్, పతులకున్ = చతుర్ముఖుడు, శతమఖుడు అనే దేవరాజులకు, గాలిని మేసేసర్పరాజుకుకూడా; భావింపరాక + ఉన్నన్ = ఊహింపనలవికానప్పుడు; ఆ జిహ్మవ్యాప్తులన్ = కుటిలంగా - మాయతో వ్యాపించిన ఆమూర్తులను; ఎన్నన్ = ప్రశంసింప; నాదు వశమే = నాకు శక్యమా?

తా: ఓ చిద్రూప, నారాయణా! బ్రహ్మాండసముదాయంలోపల శుద్ధసత్వగుణంకలిగి ఉన్నావు. వెలుపల 'ఆదిమబ్రహ్మ' నామంతో పరతత్త్వజ్ఞానం కలిగించే శాస్త్రాలకూ, విశ్వసత్తకూ తగినమేటి ప్రభుడవై ఉన్నావు. అయినా నాకపతులకుగానీ నాగరాజులకు గానీ ఊహింపరాకుండా అలా మాయతో వ్యాపించిఉన్న తత్త్వాలను - మూర్తులను స్తుతింప నావశమా?

**వ్యాఖ్య: నారాయణ చిద్రూపాన్ని వర్ణింపశక్యంకాదనే కవి యొక్క సవినయ విషయ ప్రకటనౌచిత్యం.**

నారాయణుడు చిద్రూపుడు. సర్వపదార్థాల స్వరూప స్వభావాలపట్ల విపుల జ్ఞానం కలవాడు. స్వయంప్రకాశుడు.

"య స్సర్వజ్ఞః సర్వవిత్ యస్య జ్ఞానమయం తపః" (ముం.ఉ) (సర్వవిత్ = సర్వప్రపంచరూపేణ విద్యతే) సంకల్పరూపజ్ఞానంతో సృజించి, సర్వప్రపంచ రూపంగా ఉన్నవాడు పరబ్రహ్మ.

'బ్రహ్మాండ' మంటే పెద్దగోళం. బ్రహ్మ శబ్దానికి ప్రకృతి అనే అర్థమూ ఉంది. ప్రకృతి మండలంలో అనేక వేల అండవిశేషాలు లెక్క లేనన్ని ఉన్నాయి.

"అండానాం తు సహస్రాణాం సహస్రాణ్యయుతాని చ।

ఈదృశానాం తథా తత్ర కోటికోట్యయుతాని చ"॥

అన్నట్లు అఖిలాండకోటి కలది బ్రహ్మాండం.

అండం పద్నాల్గు భువనాలుకలది. దానికి దశగుణితోత్తరం ఆవరణ సప్తకం ఉంది.

యదండ మండాంతరగోచరం చ య

ద్దశోత్తరాణ్యావరణాని యాని చ (స్తోత్రరత్నం) భూమి, జలం, అగ్ని, వాయువు, ఆకాశం, భూతాలు, మహత్తు అనే ఏడు ఆవరణాలు ప్రతి అండాన్ని చుట్టుకొని ఉన్నాయి.

ఈ సప్త అవరణాలు ఒకదానికంటె మరొకటి పదేసి రెట్లు ఎక్కువగా అండావరణాలుగా ఉన్నాయి.

బ్రహ్మాండకోటిలో అణగియుండే దేవమనుష్యతిర్యక్ స్థావరాలలోను, వారి భోగ్యవస్తువులలోను, అణువుకంటె సూక్ష్మంగా అంతటా వ్యాపించి ఉన్నవాడు నారాయణుడు.

సత్వరజస్తమోగుణాలు కలది ప్రకృతి. ఈ ప్రకృతియందు ఆబ్రహ్మస్తంబ పర్యంతమైన జీవ వర్గం - క్షేత్రజ్ఞసముదాయం, కట్టెయందు నిప్పులాగా, నువ్వులలో నూనెలాగా ఇమిడి ఉంది. జీవరాశి ప్రకృతిబద్ధమని తాత్పర్యం కదా!

"సత్త్వేన సర్వగో విష్ణుః సర్వాత్మా సదసన్మయః"

రజస్తమోగుణాలు లేని ఒకే ఒక సత్వగుణం కలనారాయణుడు బ్రహ్మాండకోటిలోపలా, బయటా వ్యాపించి ఉన్నాడు. ఆయన లోకంలో అవతరించినా, ఆయన రూపం అప్రాకృతం - శుద్ధ సత్వమయమే.

"న కర్మణా వర్ధతే నో కనీయాన్, న కర్మణా లిప్యతే పాపకేన" అని వేదమన్నట్లు భగవంతుడు పుట్టడం మనవలె పూర్వకర్మఫలాన్ని అనుభవించడానికి కాదు. అతణ్ణి కర్మలు అంటవు.

"జగతాముపకారాయ న సా కర్మనిమిత్తజా" (వి.పు.)

భగవంతుడు తన ఇష్టమైన రూపాన్ని ధరించడం లోకోపకారం కోసమే కదా!

శరీరంలోపల ఆత్మ ఇమిడిఉందికదా!మరి ఆత్మకూ పరమాత్మకూ భేదమేమి? అంటే "దారుణ్యగ్ని ర్యథా తైలం తిలే తద్వత్పుమానపి।

ప్రధానేఽవస్థితో వ్యాపీ" కట్టెలోపల అగ్గివలె, నువ్వుల్లో నూనెవలె మాత్రమే శరీరంలో సూక్ష్మంగా జీవాత్మ ఉంది.

"అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః" - అన్నట్లు పరమాత్మ ప్రతి వస్తువునందు లోపటా, బయటా వ్యాపించి ఉన్నాడు. ఒకే వస్తువు లోపటా బయటా ఒకే సమయంలో ఎలా ఉంటుంది? అంటే అతడు సర్వాత్ముడు. "ఆత్మన్' శబ్దానికి శరీరమని అర్థం. "ఆత్మా యత్నోధృతిర్బుద్ధిః స్వభావో బ్రహ్మ వర్ష్మ చ" (అమరం). జగత్తులోని ప్రతి వస్తువు శరీరంగా కలవాడనీ; ఆశరీరంలో ఆత్మగానూ ఉన్నాడనీ అర్థం. జీవాత్మకూడా అందులో వెలసిన పరమాత్మకు శరీరమే అని ఉపనిషత్తులు బోధిస్తున్నాయి. "యస్యాత్మా శరీరం".

"సర్వవ్యాపిన మాత్మానం క్షీరే సర్పిరివార్పితమ్" (శ్వే.ఉప.) కఱంద పాలుళ్ నెయ్యేపోల్" - (తిరువాయ్ మొళి) పిండిన పాలలో నెయ్యిలాగా పరమాత్ముడు సర్వత్ర వ్యాపించిఉన్నాడని ఉభయ వేదాంతాల బోధ.

"అయఃపిండే యథా వహ్నిః భిన్నస్తిష్ఠత్యభిన్నవత్।

తథా విశ్వమిదం దేవో హ్యావృత్య పరితిష్ఠతి॥"

'అగ్గి' అనేవస్తువు వేరే. అయినా బాగా కాలిన ఇనుపగుండులోపలా, వెలుపలా వ్యాపించి ఉంటుంది అగ్గి. ఇనుపగుండును ముక్కలు చేసి ఒక ముక్కను గడ్డివాములో వేస్తే అది కాలిపోతుంది. ముక్కలోపలా, బయటా అగ్గి వ్యాపించి ఉంది కదా! ఇక కొలిమిలోని అగ్గి వేరే బయట ఉండనే ఉంది. భౌతికమైన అగ్గికే లోపటా, బయటా ఏకకాలంలో ఉండేశక్తి ఉన్నప్పుడు, అగ్గికి దాహకశక్తి నిచ్చిన సర్వేశ్వరునికి అంతర్బహిర్వ్యాప్తి ఉండడంలో ఆశ్చర్యమేమి?

'ఆదిమబ్రహ్మ' నారాయణుడే. "ఆదిజుడైన బ్రహ్మ ఉదయం బునకాస్పదమైనవాడు" (భారతం)

యో బ్రహ్మాణం విదధాతి పూర్వం
యో వై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై"। (శ్వే.ఉప)

చతుర్ముఖబ్రహ్మజన్మకు కారణుడై, ఆయనకు వేదాలను బోధించి జ్ఞాన జన్మనూ ప్రసాదించాడు. కాబట్టి ఆదిమబ్రహ్మ నారాయణుడు.

"తదండ మభవద్ధైమం సహస్రాంశుసమప్రభమ్।
తస్మిన్ జజ్ఞే స్వయం బ్రహ్మా సర్వలోకపితామహః"

తేజోమయమైన బ్రహ్మాండమందు జన్మించాడు కాబట్టి 'హిరణ్య గర్భుడు' అంటే చతుర్ముఖబ్రహ్మ అన్నది 'మనుస్మృతి'.

విష్ణు సహస్రనామ భాష్యంలో శ్రీశంకరభగవత్పాదులు

"హిరణ్మయాండాంతర్వర్తిత్వాత్ హిరణ్యగర్భో బ్రహ్మా విరించిః తదాత్మా" 'అండమందున్న చతుర్ముఖబ్రహ్మకు ఆత్మభూతుడు కాబట్టి హిరణ్యగర్భుడంటే విష్ణువు' అని వివరించారు. ఆదిబ్రహ్మపదమిట్టిదే.

"పురా నారాయణో దేవః స్వయంభూః ప్రపితామహః।
తతస్స భగవాంస్తోయే బ్రహ్మాణ మసృజత్ స్వయమ్" (భారతం).

బ్రహ్మకు పితామహుడని పేరు. ఆయనను సృజించిన నారాయణుడు ప్రపితామహుడు. కాబట్టి బ్రహ్మతండ్రియే ఆదిమబ్రహ్మ. "అహమాదిర్హి దేవానాం" (భ.గీ.11-2) ఆదిదేవుడు నారాయణుడే.

తత్త్వాలు మూడు. చిత్తు, అచిత్తు, ఈశ్వరుడు. జీవవర్గాన్ని - చిత్తును 'పరాప్రకృతి' అనీ, అచిత్తు అనే జడప్రకృతిని 'అపరాప్రకృతి' అనీ, ఈ రెండు ప్రకృతులతో ప్రపంచాన్ని సృజించేవాడు నారాయణుడు. "యయేదం ధార్యతే జగత్" (7అ 4, 5) అని భగవద్గీత పరతత్త్వాన్ని బోధిస్తుంది.

'తత్త్వ'మంటే ప్రమాణంచే బోధింపబడి భూతభవిష్యద్వర్తమానకాలాల్లోనూ వర్తించే పదార్థం. అదే 'భూతభవ్యభవత్ప్రభువు' గా వాచ్యమయింది. తత్త్వాలు మూడైనా - ప్రకృతి కంటె పరుడైన జీవునికంటెనూ, పరుడైనప్పటికీ - జీవప్రకృతులతో కూడిన నారాయణుడనే పరతత్త్వమొక్కటే అని వేదశాస్త్ర ప్రమాణాల వల్ల బోధపడుతుంది.

సాత్త్విక, రాజస, తామసా లనే మూడింటిలో రాజస, తామస పురాణాలు, శాస్త్రాలు దేవతాంతరాలకు పరత్వాన్ని బోధిస్తున్నాయి. నారాయణుడు అప్రాకృతశుద్ధ సత్త్వగుణి, కాబట్టి సాత్త్విక పురాణాశాస్త్రాలు త్రిమూర్తులలో శ్రీహరికే మహిమ

అధికమంటున్నాయి. "సాత్త్వికేష్వథ కల్పేషు మాహాత్మ్యమధికం హరేః" అని మత్స్య పురాణం పేర్కొన్నది. "నారాయణ పరం బ్రహ్మ తత్త్వం నారాయణః పరః" (నారా.ఉప) "మత్తః పరతరం నాన్యత్ కించిదస్తి ధనంజయ" (భ.గీ.7.7) 'అర్జునా! నాకంటె గొప్పదైన తత్త్వం ఒక్కటి కూడా లేదుసుమా! అన్న భగవంతుని ఉపదేశాన్ని ఆదరించి నమ్మిన అర్జునుడు,

"న త్వత్సమోఽ స్త్యభ్యధికః కుతోఽన్యః
లోకత్రయేఽప్యప్రతిమప్రభావ!"(భ.గీ.11-43)

ముల్లోకాల్లో ఎక్కడా నీతో సమానుడే లేడు, స్వామీ! ఇకనీకన్న అధికుడెలా ఉంటాడు? అని ప్రస్తుతించాడు.

"వేదాహమేతం పురుషం మహాన్తం" (పురుషసూక్తం).

"పరాత్పరం పురుష ముపైతిదివ్యమ్" (ముం.ఉప)

అనే వేదవాక్కులు చెప్పినట్లే "త్వమక్షరం పరమం వేదితవ్యం, త్వమస్య విశ్వస్య పరంనిదానమ్ - - - సనాతనస్త్వం పురుషో మతో మే". (భ.గీ.11-18) అక్షర వస్తువుల్లో కెల్ల గొప్పవాడవు, సర్వప్రపంచానికి నీవే ఆధారభూతుడవు. ధర్మరక్షకుడవైన సనాతన పురుషుడవు నీవే అని నా అభిప్రాయమన్నాడు అర్జునుడు.

అండాధిపతియైన చతుర్ముఖ బ్రహ్మను, ఆబ్రహ్మయొక్క ఆజ్ఞానువర్తియైన శివుణ్నీ విశ్వరూపశరీరంలో ఒక భాగాన ఇమిడి యున్నట్లు దర్శించి "బ్రహ్మాణ మీశం కమలాసనస్థం" (భ.గీ.11-15) అని అర్జునుడు వర్ణించాడు.

"జన్మాద్యస్య యతః"(బ్ర.సూ.2)"యతో వా ఇమాని భూతాని జాయంతే. యేన జాతాని జీవంతి. యత్ప్రయంత్యభిసంవిశంతి.తద్బ్రహ్మ" (భృగువల్లి).

"యతస్సర్వాణి భూతాని భవన్త్యా దియుగాగమే।
యస్మింశ్చ ప్రళయం యాంతి పునరేవ యుగక్షయే॥" (వి.స.నా.పూర్వపీఠిక)
"ఎవ్వనిచే జనించు జగమెవ్వనిలోపలనుండు లీనమై
ఎవ్వనియందు డిందు" (ఆం.భాగ.)

అనే మొదలైన వేదశాస్త్ర పురాణవాక్యాలు ఏకకంఠంగా సృష్టి, స్థితి, సంహార, మోక్షప్రదానాలను చేసే వాడే పరబ్రహ్మ అని ప్రకటించాయి. ఇట్టి పరతత్త్వ లక్షణాలు కలవాడే కృష్ణభగవానుడు కాబట్టి అర్జునుడు "పరంబ్రహ్మ పరంధామ పవిత్రం పరమం భవాన్" (భ.గీ.10-12) అని ప్రస్తుతించాడు.

కోటి నామాలు నారాయణుని యందు విశేషణంగా అన్వయిస్తాయి. కాని నారాయణ శబ్దం విశేష్యమైనందువల్ల వేరే దేవతకు పేరుకు కూడా చెల్లదు కదా!

ఉద్దండ పండితుడైన శ్రీ అప్పయ దీక్షితులు 'నారాయణ' శబ్దానికి 'శివ' పరంగా అర్థం చెప్పడానికి చాలా ప్రయత్నించాడు. చివరకు 'ణ'త్వం చెప్పనీయకుండా బాధిస్తున్న దన్నాడు. కాబట్టి, ఆశబ్దమే దేవతాసార్వభౌముడని పరతత్వబోధచేస్తుంది.

"అజస్య నాభావధ్యేకమర్పితం యస్మిన్నిదం విశ్వం భువనమధిశ్రితమ్" (శ్రుతి).

"యత్తత్పద్మమభూత్పూర్వం తత్ర బ్రహ్మ వ్యజాయత।
బ్రహ్మణశ్చాపి సంభూతః శివఇత్యవధార్యతామ్।
శివాత్ స్కందమభవ దేతత్సృష్టిచతుష్టయమ్॥"

నారాయణుడు తన నాభికమలమందు చతుర్ముఖ బ్రహ్మను సృజించాడు. ఆ చతుర్ముఖుడు శంకరుణ్ని సృజించాడు. శంకరుడు కుమారస్వామిని సృజించాడు. ఇలాగే లోక సృష్టి పైపైగా జరిగింది. కాబట్టి బ్రహ్మాండావళికెల్ల నాభికమలమే మూలకందం. అని శ్రుతి స్మృతులు బోధిస్తున్నాయి. భవ్యాధినాథుడైన ఈ పద్మనాభుడు తన పరిబ్రఢిమస్వభావాన్ని - పరతత్వధర్మాన్ని తన మాయాబలం (గుణమయమైన ప్రకృతియొక్క సామర్థ్యం) చేత జనులకు తెలియకుండా కప్పిపుచ్చుకొంటాడు.

"ఆత్మానం మానుషం మన్యే రామం దశరథాత్మజమ్।" (రామాయణం).

నేను దశరథ పుత్రుడను. మానవుడ నని శ్రీరాముడు చెప్పినాడు. "అహం వోబాంధవో జాతః" నేను దేవుడనుగాను, మీ బంధువునే అని శ్రీకృష్ణుడు యాదవులతో చెప్పి, తన పరత్వాన్ని మరుగు పరచుకొన్నాడు కదా, నారాయణుడు ఇలా స్వేచ్ఛతో కల్పించుకొనే అంతర్వ్యాప్తి, బహిర్వ్యాప్తియే 'జిహ్మవ్యాప్తు' లని కవి హృదయం.

"తవాంతరాత్మా మమ చ యే చాన్యే దేహసంజ్ఞికాః।
సర్వేషాం సాక్షిభూతోఽసౌ న గ్రాహ్యః కేనచిత్ క్వచిత్॥"

నారాయణుడు నీకూ, నాకూ, జీవులందరికీ అంతరాత్మయై, సాక్షిభూతుడుగా ఉన్నారు. ఆయన ఎవ్వరికీ, ఎప్పుడూ తెలుసుకొనశక్యం కాని వాడు అని బ్రహ్మ రుద్రునితో అన్నాడు.

కాబట్టి బ్రహ్మేంద్రామరపతులకుగానీ, వాయువే ఆహారంగా ఉన్న అనంతుడు, వాసుకి, గుళికుడు, తక్షకుడు, కర్కోటకుడు, పద్మడు, శంకుడు అనే సర్పరాజులకుగానీ ఆదిమబ్రహ్మయొక్క జిహ్మవ్యాప్తులు తెలియవు.

మహామహులకే తెలియని పరబ్రహ్మయొక్క సూక్ష్మస్థూలరూప ధర్మాలను తనకు వర్ణింప శక్యం కాదని కవి విన్నవించుకొన్నాడు.

"భాగవతము తెలిసిపలుకుట చిత్రంబు
శూలికైన తమ్మిచూలికైన।
విబుధ జనుల వలన విన్నంత కన్నంత
తెలియ వచ్చినంత తేటపరతు"॥(భాగ.)
అంటూ జీవవేదనను పోతపోశాడు పోతరాజు

**మ. ధర సింహాసనమై నభంబు గొడుగై తద్దేవతల్ భృత్యులై**
**పర మామ్నాయములెల్ల వందిగణమై బ్రహ్మాండమాగారమై**
**సిరి భార్యామణియై విరించి కొడుకై శ్రీ గంగ సత్పుత్రియై**
**వరుస న్నీ ఘన రాజసంబు నిజమై వర్ధిల్లు, నారాయణా॥** 10

అర్థం: ఓ నారాయణా! ధర = భూమి; సింహాసనమై = రాజపీఠమై; నభంబు = ఆకాశం; గొడుగై = ఛత్రమై; తత్ దేవతల్ = ఆకాశవిహారులైన దేవతలు; భృత్యులై = సేవకులై; పరమ + ఆమ్నాయములు + ఎల్ల = ఉత్కృష్టమైనవేదాలన్ని; వందిగణమై + స్తుతిపాఠకులసమూహమై; బ్రహ్మాండం = ప్రపంచం; ఆగారమై = భవనమై; సిరి = లక్ష్మీదేవి; భార్యామణియై = ధర్మపత్నియై; విరించి = చతుర్ముఖబ్రహ్మ; కొడుకై; శ్రీగంగ = సంపత్కరమైనగంగాదేవి; సత్పుత్రియై = ఉత్తమపుత్రికయై; వరుసన్ = క్రమంగా; నీఘనరాజసంబు = నీగొప్పరాజఠీవి; నిజమై = సత్యమై వర్ధిల్లు = వృద్ధిబొందును.

తా: ఓ నారాయణాః నీ సింహాసనం భూలోకం. నీ ఛత్రం ఆకాశం. నీభృత్యులు దేవతలు, నీ వందిమాగధులు వేదాలు, నీనగరు బ్రహ్మాండం. నీ పత్ని లక్ష్మి. నీ పుత్రుడు విరించి. నీ పుత్రిక గంగ. నీ ప్రాభవం క్రమంగా వర్ధిల్లుతుంది.

**వ్యాఖ్య: ఉభయవిభూతి నాయకుని ప్రాభవవైభవాలను ఉగ్గడించే పద్యమిది.** రాజ్యంలో ఎందరో రాజులు మారవచ్చు కాని వారు కూర్చుండే సింహాసనం మారదు. అది స్థిరంగా ఉంటుంది. ఇది పారమేష్ఠ్యం రాజ్యం'. "స్థిరా ధరా ధరిత్రీ ధరణిః" (అమరం).

ఆచలమై, స్థిరమైన భూమియే నారాయణుడు అధిష్ఠించిన సింహాసనం. "భూమిర్ధేను ర్ధరణీ లోకధారిణీ" అన్నది వేదం.

కృతకాకృతకాకృతకృల్లోకాలన్నిటికీ ఆధారపీఠం భూమి.

"ప్రణవో హి ధనుః" శ్రుతిరీత్యా ఓంకారమే ధనుస్సు. సర్వసిద్ధిని కలిగించే భూమి ఆధనుస్సును ధరించేది కాబట్టి భూమి 'ధనుర్ధర'

"ధనుర్ధరాయై విద్మహే, సర్వసిద్ధ్యై చ ధీమహి, తన్నో ధరా ప్రచోదయాత్".

"తస్య వాచకః ప్రణవః" "ఓం తత్సదితి నిర్దేశః బ్రహ్మణ స్త్రివిధఃస్మృతః"(భ.గీ)

భగవంతుని వాచకమైన ప్రణవాన్ని ధరించింది కాబట్టి 'ధర' రాజాసనం.

"త్వం వ్యాహృతిః ప్రథమతః ప్రణవః ప్రియస్తే" (భూస్తుతి).

"ఓం భూర్భువస్సువః" - అనే మూడు (భూః, భువః సువః) వ్యాహ్రుతులలో మొదటి వ్యాహృతి భూమి. దానిపైన ఓంకార వాచ్యుడైన నారాయణుడ ధిష్ఠితుడయ్యాడు. కాబట్టి ఆయనకు 'ధర' సింహాసనం కదా!

రాజలక్షణమైన ఛత్రం ఆకాశం. ఆఛత్రచ్ఛాయలో సర్వద్రవ్య రాశి ఉంది. ఈ వసుంధర సర్వసస్యాఢ్యగా ఉంటుంది ఆయన గొడుగు నీడలోనే కదా!

ఆకాశ సంచారులైన దేవతలు ఆది దేవుని ఆధిపత్యాన్ని అతిశయింపజేసే సేవకులు.

"నమో రాజ్ఞేఽనమోఽధిపతయేఽధిపతిరసి"

"నిష్కళంకో నిరంజనో నిర్వికల్పో దేవ ఏకో నారాయణః న ద్వితీయోఽస్తి కశ్చిత్. స విష్ణురేవభవతి" - "నమో విష్ణవే సుమతిం భజామహే". మొదలైన వాక్యాలు వైదికస్తుతులు.కాబట్టి రాజును మేల్కొలిపే వైతాళిక - వంది-గణమే వేద బృందం. అది భగవద్వైభవాన్ని స్తుతిస్తుంది.

అండకోటి గల ప్రపంచమే నారాయణుని రాజభవనం.

"శ్రియఃపతిః శ్రీమతి శాసితుం జగజ్జగన్నివాసః" (మాఘకవి)

నారాయణునికి అభిమతమైన, అనురూపమైన స్వరూపరూపగుణవిభవై శ్వర్య శీలాదులు కలిగిన శ్రీదేవి దివ్య మహిషి - పట్టపురాణి.

పితృవాక్య పరిపాలకుడై, తండ్రి రాజ్యాన్ని విస్తరింపజేసిన నలువ - నాలుగు దిక్కులను మెడత్రిప్పకుండా సమీక్షించే చతుర్ముఖుడు పుత్రుడు.

తాను పుట్టిన తావునుంచి బయటపడి ఆప్యాయతతో ముల్లోకాలకు అమృతప్రాయమైన జీవనాన్ని - ఉదకాన్ని - ప్రసాదించి సర్వేంద్రియ సంతృప్తిని కలిగించే గంగాదేవి నారాయణుని పుత్రిక.

"పీతా ధర్మద్రవీ మర్త్యై ర్యైర్గంగా భక్తితః సకృత్।
తేషాం కులానామయుతం భవాత్తారయతే ధ్రువమ్॥"

గంగలో స్నానం చేస్తే మలనిర్మోచనమవుతుంది. గంగోదకాన్ని పానం చేసిన భక్తులకు భవరోగం పోతుంది. సద్గతి కలుగుతుంది - అని బ్రహ్మాండపురాణం చెబుతుంది.

"రజో రాగాత్మకం విద్ధి" (భ.గీ.) రాజసం రజోగుణ సంబంధి. రజోగుణం ఉబికితే కోరికలు కార్యరూపాన్ని దాల్చడం పరిపాటి.

ఒక్కడే తనయుడు. తనయ యొక్కతె. పరిమితమైన సంతానం, తనతో మొదలైన సామ్రాజ్యం తన సంతానం వల్ల రాజసం పెరిగి, అపరిమిత కీర్తి

ప్రతిష్ఠలను పొందుతూ వైరాజ్యమే తద్ధర్మంగా వర్ధిల్లుతున్నది. లక్ష్మీపతి రాజసం నిజంగా ఘనమైనదే కదా!

కరీం నగర్ జిల్లాలోని ముప్పిరి తోట గ్రామంలో శ్రీవేంకటేశ్వరస్వామి బ్రహ్మోత్సవం వైశాఖ శుద్ధ మందు జరుగుతుంటుంది. వీధ్యుత్సవమప్పుడు భగవత్సేవకు ముందు, వెనుక ద్రవిడ, వేద పారాయణం జరుగుతుంది. ఇంక యజమానుడు శ్రీరామిడి రాఘవరెడ్డితో పాటు భజన పరులు మేళతాళాలతో భజనచేస్తుండేవారు పూర్వం. మధ్యమధ్యన వారు "ధరసింహాసనమై" అనే ఈ పద్యాన్ని పలుమారులు రాగయుక్తంగా గళమెత్తి పఠించే వారు. పద్యావర్తికి ఒకసారి "సమస్త రాజహరిబలగోవిందా". అంటూ ఎలుగెత్తి, బాహువులు పైకెత్తి కీర్తిస్తూ కేల్మోడ్చేవారు. ఆ దృశ్యం సకలజన మనోనయనానందకరంగా ఉండేది.

ఈ పద్యశైలి ప్రసాదగుణశోభితం. మాటలు నిర్బీజద్రాక్షలు కదా!

## అవతార దశకం

**మ. మగమీనాకృతి వార్ధిఁ జొచ్చి యసురన్మర్దించి యవ్వేదముల్**
**మగుడం దెచ్చి విరించి కిచ్చి యతని న్మన్నించి యేపారఁగాఁ**
**బగ సాధించిన దివ్యమూర్తి వని నే భావింతు నెల్లప్పుడున్**
**ఖగరాజధ్వజ భక్తవత్సల జగత్కారుణ్య, నారాయణా॥ 11**

అర్థం : ఖగరాజధ్వజ = పక్షీంద్రుడైన గరుడుడు టెక్కెంగా కలవాడా! భక్త వత్సల = ఆశ్రితులయందు మక్కువెక్కువగా ఉన్నవాడా! జగత్ కారుణ్య = ప్రపంచమందు- ప్రాణులందు - దయకలవాడా! నారాయణా! మగ మీన+ఆకృతిన్ = మగటిమిగల చేప ఆకారంతో; వార్ధిన్ = సముద్రమందు; చొచ్చి = ప్రవేశించి; అసురన్ = రక్కసుణ్ని; మర్దించి = తొక్కిపెట్టి (సంహరించి), ఆవేదముల్ = దొంగిలించిన వేదాలను, మగుడన్ = మళ్ళీ, తెచ్చి; విరించికి = బ్రహ్మదేవునికి; ఇచ్చి; అతనిన్ = ఆబ్రహ్మను; మన్నించి = క్షమించి; ఏపారంగా = విజృంభించినవాడుగా; పగసాధించిన = పగదీర్చుకొన్న; దివ్యమూర్తివి = తేజోమూర్తివి; అని, నేను, ఎల్లప్పుడు, భావింతును = తలుస్తాను.

తా: ఓ గరుడధ్వజ! భక్తవత్సల! జగత్కారుణ్యా! నారాయణా! నీవు చేపరూపంతో మున్నీటిలో మునిగి, వేదాపహారియైన రాక్షసుణ్ని సంహరించావు. ఆవేదాలను తెచ్చి, మళ్ళీ చతుర్ముఖుని కిచ్చి, అతనిని మన్నించావు. ఈ ప్రక్రియను బట్టి, నీవు ఎసకమెసగి పగ సాధించిన దివ్యమూర్తివని నేను సర్వదా స్మరిస్తాను.

**వ్యాఖ్య: మత్స్యావతారమూర్తిని స్తుతించే పద్యం.**

ఈ శతకంలో మొదట పదిపద్యాలతో కవి, నారాయణుని స్వరూప స్వభావాలను వర్ణించాడు. ఆది దశకం తర్వాత అవతారదశకం వర్ణితం.

"యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత।

అభ్యుత్థాన మధర్మస్య తదాఽఽత్మానం సృజామ్యహమ్"॥ (భ.గీ)

అని భగవానుడు ఉపదేశించిన విధంగా, అధర్మం చెలరేగి ధర్మానికి గ్లాని కలుగుతున్నప్పుడు తాను అవతరించడం వల్లనే ప్రపంచం సద్గతిని పొందుతున్నది. పరబ్రహ్మ పరమాకాశంనుంచి దిగి రావడంకంటె ప్రపంచానికి సంభవించే పరమోపకారం మరొకటి లేదు కదా!

మొదటి ఉపకారం వేదోద్ధరణం. "వేదోఽఖిలోధర్మమూలం". సకల ధర్మాలకు మూలకారణం వేదం, అన్నది గౌతమధర్మసూత్రం. 'వేదైశ్చ సర్వైరహమేవ వేద్యః' అన్నట్లు వేదాలే భగవంతుని విచిత్ర ప్రవృత్తులను బోధిస్తాయి. అందుకే నారాయణుడు మొదట బ్రహ్మను సృజించాడు. కొడుకును కన్న తర్వాత అతనికి చదువు నేర్పకుంటే కొడుకు సమాజానికి చీడపురుగవుతాడు. తండ్రి గుణాలనే చెరచేవాడవుతాడు.

లోకంలో ఎవడైనా తనకంటె మరొకడు గొప్పవాడు కాకూడదనుకొంటాడు. కానీ 'పుత్రాదిచ్ఛేత్ పరాజయ' మన్నట్లూ తనయుడు మాత్రం తనను మించినవాడుకావాలని తండ్రి కోరుకోవడం ఆజానజం.

"తేనే బ్రహ్మ హృదా య ఆదికవయే" (భాగ)

బ్రహ్మను సృజించిన పద్మనాభుడే సమస్త వేదాలను అతనికి ప్రదానం చేశాడు. జన్మదాతయే జ్ఞానదాత అయితే జన్మసార్థకమవుతుంది. జగన్నాథుడైన పితృదేవుని ఆజ్ఞను అక్షరాలా పాటించిన బ్రహ్మ సృష్టికర్త అయ్యాడు. వేద విద్య మూర్తీభవించింది.

అవతారాలెన్నో ఉన్నా ముఖ్యంగా పది చెప్పితే చాలు. దివ్యజ్ఞానం కలుగుతుందని అపాంతరతముడు ఆలోచించాడు. కావ్యాలలో తరచుగా దశావతారాలనే వర్ణించారు కవులు.

భగవంతుని పది అవతారాలలో మొదటిది మీనావతారం.

"తదైక్షత, బహుస్యాం ప్రజాయేయేతి" (ఛాం-ఉప)

సృష్టికి ఉన్ముఖుడైన పరబ్రహ్మ తాననేకరూపాలుగా వ్యాపించాలని సమీక్షించాడు. జలాన్ని సృజించిన విభుడే జలశరీరకుడై సమీక్షించి పృథివిని సృజించాడని ఛాందోగ్యోపనిషద్వాక్యాలవల్ల తెలుస్తుంది.

"తపసా చీయతే బ్రహ్మ" - (ముం.ఉ.)"స తపోఽతప్యత, తత్సృష్ట్వా" (తై.ఉప) "తప - ఆలోచనే" అని ధాత్వర్థం. చింతించడం, ధ్యానించడం, సంకల్పించడమని (తపస్సుకు) అర్థం. 'చీయతే' అంటే లావవడం, ఉబ్బడం, అంకురించే బీజం ఉబ్బినట్లు" అని శంకరభాష్యం వివరించింది. సంకల్పమే సృష్టికి కారణం.

మీనం జలచరం, చేపచూపుచురుకైనది. స్వచ్ఛమైనది. నీటిలో నుంచి చెంగున పైకి ఎగిరినప్పుడు తళుక్కుమెరిసే కన్నులతో దరులమీద ఉన్న వస్తురూపగుణాలను గమనిస్తుంది. చేపకు'ఈక్షణ' క్రియయే ప్రధానం. నీటిలో దాచిన వేదాలను వెదుకడానికి వీక్షణమే అవసరం కాబట్టి మీనావతారానికి ప్రాథమ్యం.

పద్యంలో వేదాలను అపహరించిన రక్కసుని పేరును నొక్కిచెప్పలేదు. పురాణాల్లో సోమకుడని ఒకచోట, హయగ్రీవుడనే రాక్షసుడని మరొక చోట ఉండడం వల్ల కవి, ఆ పేరు చెప్పలేదేమో!

ఒక అసురుడు వచ్చి ఏమరుపాటుతో ఉన్న చతుర్ముఖబ్రహ్మనుంచి వేదాలను అపహరించాడు. వెంటనే సముద్రగర్భంలో దాగుకొన్నాడు.

వేదాలు లేకపోతే భగవంతుని'సత్తా'కే ముప్పుకదా! అందుకే పౌరుషంతో అప్రాకృతమీనాకారుడై అబ్ధిలోకి ప్రవేశించాడు. నల్దిక్కుల నిరీక్షించాడు. మీనమూర్తి వేదాలను వెదుకుతూ వీక్షిస్తుంటే కమలనయనాలు కడలిలో పలుతావుల కమలవనమే సంభవించినట్లుండిందని దేశికులు అన్నారు.

"నిర్మగ్నశ్రుతిజాలమార్గణదశాదత్తక్షణైర్వీక్షణై
రంతస్తన్వ దివారవిందగహనా న్యౌదన్వతీనామపామ్" (దశావతారస్తోత్రం)

సముద్రంలో తన చూపులకానిన రక్కసుణ్ని తొక్కిచంపాడు మీనమూర్తి. వేదాలను తెచ్చి మళ్ళీ ఇచ్చినందువల్ల బ్రహ్మ బతికి బట్టకట్టాడు.

జ్ఞానమూర్తులకు హాని కలిగించినవాడు బతికిచావడు. కాబట్టి, దుష్టులను స్వయంగా అణచి పగ దీర్చుకొంటాడు భగవంతుడనే భావాన్ని సర్వదా స్మరిస్తానంటున్నాడీ కవి.

ఖగరాజధ్వజ, భక్తవత్సల, జగత్కారుణ్య అనే మూడు విశేషణ పదాలు పద్యభావానుగుణంగా ప్రయోగించడంలో ఔచిత్యముంది.

కశ్యప ప్రజాపతియజ్ఞానికి దేవతలూ, మునులూ సహకరించారు. వారు సమిధలూ, దర్భకట్టలూ మోసుకొచ్చారు. వాలఖిల్యమునులు అంగుష్ఠప్రమాణశరీరులు. వారు యథాశక్తి ఒకటి, రెండు పుల్లలు మోసుకొస్తుంటే, కట్టెలమోపు మోసుకొని వస్తున్న ఇంద్రుడు వారిని చూచి అవహేళన చేశాడు. వాలఖిల్యులు ఇంద్రునికి ప్రతిభటంగా

మరొక ఇంద్రుణ్ని ఉద్భవింపజేయడానికి ప్రయత్నించారు. దేవేంద్రుడు భయపడి కశ్యపుణ్ని ప్రార్థించాడు. కశ్యపుడు మునులతో విజ్ఞాపనచేశాడు. వారు "మా ప్రతిజ్ఞ రిత్తపో" దన్నారు. కశ్యపుని ప్రార్థన వల్ల వాలఖిల్యులు తమ ప్రతిజ్ఞను, 'పక్షులకు ఇంద్రుడు' గా మార్చుకొన్నారు. తత్ఫలితంగా కశ్యపప్రజాపతికి తనయుడుగా వినతకు ద్వితీయగర్భమందు గరుత్మంతుడు జన్మించాడు. కనకగిరిసమానదేహుడు, అవక్రవిక్రముడైన గరుడుడు మాతృదాస్యవిముక్తికోసం అమృతాన్ని హరించి తెస్తుండగా ఇంద్రుడు అతని మీద వజ్రాయుధాన్ని ప్రయోగించాడు. గరుడుడు ఆ వజ్రాయుధాన్ని గౌరవించడానికి తన ఒక ఈకను మాత్రం అర్పించాడు. పక్షీంద్రునికి దేవేంద్రుడు మిత్రుడయ్యాడు.

గరుత్మంతుడు వేదాత్ముడు. ఆయన శిరస్సు త్రివృత్ అనే సామవేదభాగం. నయనేంద్రియం గాయత్ర్యాఖ్యమైన సామం. పంచదశస్తోమమే ఆయన ఆత్మ. వామదేవ్యమనే సామవేదశాఖయే ఆయన శరీరం. బృహత్సామం, రథంతరసామం అనేవి రెండురెక్కలు. యజ్ఞియాఖ్యమైన సామం ఆయన తోక. గాయత్ర్యాద్యేకవింశతి ఛందస్సులు ఆయన హృదయాద్యవయవాలు. వేదికయందుండే అగ్నిహోత్రాదులాయనకు గోళ్ళు. అంతరిక్షంలో ఎగురుతూ స్వర్గానికి చేరగల సమర్థుడు గరుత్మంతుడు.

అమృతభాండాన్ని అపహరించి, ఒక్క చుక్కబొట్టైనా ఆస్వాదించని అలౌల్యుడు. కన్నతల్లికోసం తన ప్రాణాన్ని లక్ష్యపెట్టకుండా శ్రద్ధతో సేవ చేసే కొడుకును చూచి, మెచ్చుకొన్న నారాయణుడు ప్రసన్నుడై వరమడుగుమన్నాడు. "స్వామీ! అజరామరుడనై మీకు వాహనంగా ఉండగల" నని గరుడుడు కోరినాడు. 'నాకు ధ్వజంగా కూడా నీవే ఉండా' లన్నాడు నారాయణుడు. వేదమయుడే ధ్వజంగాకల నారాయణుడు వేదాలను ఉద్ధరించి జగదుపకారకుడయ్యాడనే సాభిప్రాయసంబోధనాంతపదం 'ఖగరాజధ్వజ'.

భక్తవత్సల: తాను అంతకుముందుకన్న దూడలను సైతం దగ్గరకు రానీయక, అప్పుడే పుట్టిన లే దూడ శరీరానికి అంటియుండే మరికినంతా నాలుకతో భోగ్యంగా నాకుతూ లాలించే ఆవును 'వత్సలా' అంటారు. ఆవుకు ఉండే ఈ ప్రేమ గుణానికే 'వాత్సల్యం' అని పేరు. తననాశ్రయించిన భక్తుల పట్ల భగవంతుడు వాత్సల్యం కలవాడు. అంటే, ఆశ్రితుల దోషాలను గుణాలుగా గ్రహించే ప్రేమకలవాడని అర్థం.

చిరకాలం తపస్సుచేసి సృష్టిరహస్యాలను తెలియజేసే వేదాలను, తండ్రినుంచి పొందిన బ్రహ్మ తంద్రితుడై పోగొట్టుకోవడం, ఆయనకు కలిగిన దోషం. నారాయణుడు ఈ దోషాన్ని భోగ్యగుణంగా మలచుకొని జ్ఞానపేటికలను తెచ్చి, పోగొట్టుకొన్న బ్రహ్మకే తిరిగి ఇచ్చి, ఆయనను మన్నించడం ప్రేమచేతనే కదా!

జగత్కారుణ్య: విచిత్ర భోగ్య, భోక్తృవర్గ, భోగోపకరణ, భోగస్థానరూపమే 'జగత్తు'. దీనికి 'లీలావిభూతి' అని పేరు. ఇది భగవంతుని కృపచే నిర్మితమయింది.

"క్రీడాతూలికయా స్వస్మిన్ కృపారూషితయా స్వయమ్।
ఏకోవిశ్వమిదం చిత్రం విభుః శ్రీమానజీజనత్॥" (యాదవాభ్యుదయం).
శ్రీమంతుడు సంకల్పమనే కుంచికను దయ అనే రంగులో ముంచి రచించిన చిత్రమే విశ్వం.

నిత్య సూరులకు, ముక్తపురుషులకు ఆపదగానీ, దుఃఖంగానీ ఉండదు. కాబట్టి వైకుంఠంలో 'దయ' కు ప్రయోజనం లేదు.

'జగతి కాలమేఘాయితం' అన్నట్లు మేఘం నీటిభారాన్ని మోయలేక కొండలయందు దిగి భూమి మీద వర్షించిన రీతిగా, నారాయణుడు కారుణ్య భారాన్ని మోయలేక పరమాకాశంనుంచి దిగుతాడు. వేదాలు, అంటే శబ్దమనే జ్యోతిస్సు లేకపోతే జగత్తు అంధకారమయమే. కాబట్టి, తమోగుణియైన అసురుణ్ని అణచి, వేదాలనుద్ధరించి, జగత్తును జ్యోతిర్మయం చేసిన నారాయణుడు జగత్కారుణ్యమూర్తి.

**మ. అమరుల్ రాక్షసనాయకుల్ కడఁకతో నత్యంతసామర్థ్యులై**
**భ్రమరీదండము మందరాచలముగాఁ బాథోనిధిం ద్రచ్చఁగా**
**దమకించెన్ భువనత్రయంబును గిరుల్ దంతావళుల్ మ్రొగ్గినం**
**గమఠంబై ధరియించి మించిన జగత్కల్యాణ, నారాయణా ॥ - 12**

అర్థం : నారాయణా! అమరుల్ = దేవతలు; రాక్షసనాయకుల్ = పూర్వ దేవతలు; కడకతోన్ = పట్టుదలతో; అత్యంత సామర్థ్యులై = మిక్కిలి శక్తి మంతులై; మందరాచలము = మందర మనే పర్వతం; భ్రమరీదండము = కవ్వం; కాన్ = కాగా; పాథస్ + నిధిన్ = జలనిధిని; త్రచ్చఁగా = చిల్కగా; భువనత్రయంబును = ముల్లోకాలుకూడ; తమకించెన్ = అదరిపోయెను; గిరుల్ = పర్వతాలు, దంతావలుల్ = ఏనుగులు; మ్రొగ్గినన్ = ముందుకు వంగగా; కమఠంబై = తాబేలువై; ధరియించి = మందరాచలాన్ని మోసి; మించిన = శోభించిన; జగత్కల్యాణ = జగన్మంగళుడా!

తా: ఓ నారాయణా! సురాసురులు శ్రద్ధతో గొప్పసామర్థ్యం కలవారై మందరమనే పెద్దకొండను కవ్వంగా చేసి సముద్రాన్ని మథించగా, గిరులూ, కరులూ మ్రొగ్గినాయి. ముల్లోకాలూ కంపించాయి. అప్పుడు నీవు మేటి తాబేటి రూపాన్ని దాల్చి, మందర పర్వతాన్ని నీవీపుమీదనిల్పుకొని కుదురుగా శోభించిన జగత్కల్యాణుడవు.

**వ్యాఖ్య: నారాయణుడు కూర్మావతారుడై జగత్కల్యాణుడయ్యాడు.**

కూర్మం ఉభయచరం. భూమిమీదనూ నీటిలోనూ తన అవయవాలను బయల్పరచి

సంచరిస్తుంది. ఏదైనా అలికిడి వింటే, తపోనిష్ఠుడైన యోగి సకలం ముకుళించుకొని ధ్యానమగ్నుడైనట్లూ, తన అంగాలను లోపలికి ముడుచుకొని నిశ్చలస్థితిలో ఉంటుంది.

"ఈక్షణధ్యానసంస్పర్శైః మత్స్యకూర్మవిహంగమాః।
రక్షంతి స్వాన్యపత్యాని".

చేపలు ఈనుతూ (పిల్లలనుకంటూ), ఈదుతూ, పోయిపోయి ఒక్కసారి వెనుకకు తిరిగి చూస్తే, తాబేళ్ళు తమ మనస్సులో తలచుకుంటే, పక్షులు పొదిగితే, వాటి పిల్లలు బాగా ఎదుగుతాయని విజ్ఞుల మాట.

దేవదానవులు అమృతంకోసం మందర పర్వతంతో కలశోదధిని మథించగా భగవంతుడు మహాకూర్మమై ఆ కవ్వపుకొండక్రింద కుదురుగా నిలిచాడు.

"దుర్వాసాః శంకరస్యాంశః" (వి.పు.1-9-2)

శంకరుని అంశతో అవతరించిన మహర్షి దుర్వాసుడు. ఆయన ఒక విద్యాధరి చేతిలోని సంతాన మనే దేవతరువు యొక్క పూలమాలను చూచి, దాని వాసనకు ఉన్మత్తుడై, ఆమెనుంచి ఆపూలదండను తీసుకొన్నాడు. ఆదండను తన కంఠంలో ధరించి సంచరిస్తుండగా, ఐరావతగజాన్ని అధిరోహించిన దేవేంద్రుడు కనబడితే, ఆయనను తన పుష్పహారంతో అనుగ్రహించాడు దుర్వాసోముని. మమతాహంకారాలు కలిగిన వ్యక్తి మర్యాదలెరుగడు. దేవరాజు మహాప్రసాదమని పుష్పహారాన్ని తన శిరస్సున ధరించక హస్తిమస్తకంమీద పడవేశాడు. అది తొండంతో ఆమాలను దీసి వాసనజూచి నేలమీద వేసి తొక్కుకుంటూపోయింది. ముని(కి)ఆగ్రహం అంబరాన్ని అంటుకొంది.

"ఐశ్వర్యమదంతో నన్నవమానించిన నీవు నిశ్శ్రీకుడవగుదువుగాక" అని దుర్వాసుడు శచీపతిని శపించాడు. దేవతలందరు నిర్వీర్యులయ్యారు. త్రైలోక్యరాజ్యసంపత్తు నిస్తేజమయింది. దేవాంతకులు అమరావతిపైన దండెత్తారు. దితిజులకూ, దివిజులకూ విరోచననందనుడైన మహాబలియే చక్రవర్తి అయ్యాడు.

నిలింపులందరూ నీరజాసనుణ్ని ముందుంచుకొని పాల్కడలికి ఉత్తర తీరానికి వెళ్ళి, నారాయణుణ్ని ప్రార్థించారు. కాసేపటికి ప్రత్యక్షమైన పరాత్పరుడు అమృతోత్పాదనకోసం దేవదానవులు కలసి సముద్రమథనం చేసేవిధానాన్ని విశదపరచాడు. అజరామరత్వాలను కలిగించే నూతనద్రవ్యలాభంకోసం జ్ఞాతివైరాన్ని మరచి మహేంద్రుడూ, మహాబలీ ఒక్కటయ్యారు.

ఓషధులనన్ని తెచ్చి క్షీరాబ్ధిలో వేశారు. కడలికడవలో చిల్కే కవ్వంకోసం తవ్వి ఎత్తిన మందరనగం నెత్తిన పడి సగం మిగిలారు. ఖగవాహనుడు దయచేసి

మందరగిరిని కందుకం లాగా ఎత్తి గరుడునిమీద పెట్టాడు. అతడు హరిగిరులను మోసుకొనివచ్చి కడలిగట్టుమీద దించాడు.

ఒక తలగల పాములకు దొరయైన వాసుకిని కవ్వపు తాడుగా చేశారు. పుచ్ఛంవైపు పట్టే తుచ్ఛవృత్తి మాకు వద్దని దైత్యులు పడగవైపు పట్టారు. వేల్పులు తోకవైపు పట్టారు. భుజబలంకొలది కలశోదధిని తరచారు. మందరాగంక్రింద కుదురు లేనందువల్ల, అది హఠాత్తుగా బుడబుడ శబ్దంతో పయోధిలో మునిగింది. పయస్సు పైకి కెరలింది. దిగ్గజాలు మ్రొగ్గినాయి. ప్రపంచం కంపించింది. ఈ విపత్కర పరిస్థితిలో నారాయణుడు మేటి తాబేటి రూపమెత్తి, కాళ్ళను వెలికి, లోనికి ఆడిస్తూ కొండను ఎత్తి, దానికి ఆధారంగా కుదురై నిల్చాడు. బలంతగ్గిన తరచేవారిలోనూ, తాడులోనూ తానే వ్యాపించాడు.

"క్షీరోదమధ్యే భగవాన్ కూర్మరూపీ స్వయం హరిః।
మంథనాద్రే రధిష్ఠానం భ్రమతోఽభూన్మహామునే॥ (వి.పు)

" తరిగాంౘలోన నొకఁడఁట
తరికడవకు కుదురు నాక త్రాడును చేరుల్
తరికవ్వంబును తానఁట
హరి హరి హరిచిత్ర లీల హరియే యెరుఁగున్॥" (ఆం.భాగ.8-205)

సురాసురులు మళ్ళీ తరచారు. హాలాహలమనే కాలకూటవిషం పుట్టి పొంగింది. అందరు అహీనుణ్ని (వాసుకిని) విడిచి పరుగెత్తారు. కైలాసగిరీశుణ్ని ప్రార్థించారు. దయాళువైన శంకరుడు వచ్చి హుంకరించి, నేరెడు పండులాగా గరళాన్ని గళంలో వేసుకొన్నాడు. స్ఫటికసంకాశుడు గరళకంఠుడయ్యాడు. సజ్జనులకు సాధురక్షణమే భూషణం కదా!

దేవదానవులు నిర్భయులై ఉత్సాహంతో తరువగా పాలవెల్లినుంచి మొదట కామధేనువు ఉద్భవించింది. తర్వాత ఉచ్చైఃశ్రవం, ఐరావతం, కల్పతరువు, అప్సరోగణం, చంద్రుడు, పద్మాసన పద్మహస్తయైన లక్ష్మీదేవి, వారుణీదేవి, శ్వేతాంబరధారియైన ధన్వంతరి అమృతపూర్ణకలశంతో ఉద్భవించిన క్రమమిది.

"సిరియు సుధయుఁ బడయ శ్రీవల్లభుఁడుదక్క
నొరుఁడు శక్తి మంతుఁడొకఁడు గలఁడె" (ఆం.భాగ.8-206)

సిరి స్వయంగా హరిని వరించి ఆయన వక్షఃస్థలంలో చేరడంవల్ల జగత్కల్యాణం సిద్ధించింది. మంగళపదం లక్ష్మికి నిరుపాధికం. మంగళదేవతాస్పర్శవల్ల శ్రీవల్లభుడు జగన్మంగళుడయ్యాడు.

"తవ స్పర్శాదీశం స్పృశతి కమలే మంగళపదం
తవేదం నోపాధేరుపనిపతితం శ్రీరసి యతః"॥ (శ్రీగుణరత్నకోశం)

ధ్వని గలది ఉత్తమకావ్యం. సంసారమే సముద్రం. కరణకళేబరాది ప్రదానం, శాస్త్రప్రదానప్రయత్నం సముద్రమథనం లాంటిది. "అమృతాక్షరం హరః" నిత్య జ్ఞానానందామలస్వరూపమైన జీవరాశిని అమృతశబ్దంచేత ఉపనిషత్తు బోధిస్తుంది. సంసారసముద్రంనుంచి జీవవర్గాన్ని ఉద్ధరించి, ముక్తిని పొందించే నారాయణుని ప్రయత్నమే వ్యంగ్యార్థం.

**శా. భీమాకారవరాహమై భువనముల్ భీతిల్లి కంపింప ను**
**ద్దా మోర్విం గొనిపోయి నీరనిధిలో దాఁగున్న గర్వాంధునిన్**
**హేమాక్షాసురు వీఁకఁదాకి జయలక్ష్మిన్ గారవింపంగ నీ**
**భూమిం దక్షిణదంష్ట్ర నెత్తిన నినుం బూజింతు నారాయణా॥ 13**

అర్థం: ఓ నారాయణా! భీమ + ఆకార వరాహమై = భయంకరమైన రూపం గల క్రోడమవై; భువనముల్ = లోకాలు; భీతిల్లి = భయపడి; కంపింపన్ = వణకగా; ఉద్దామ + ఉర్విన్ = కట్టులేని, సర్వసస్యాఢ్యయైన భూమిని; కొనిపోయి; నీరనిధిలో = సముద్రంలో; దాగియున్న; గర్వాంధునిన్ = గర్వంచేత కండ్లుకనపడని; హేమ + అక్ష + అసురున్ = హిరణ్యాక్షుడనే రాక్షసుణ్ని; వీఁకన్ = శౌర్యంతో; తాకి = మార్కొని; జయలక్ష్మిన్, గారవింపంగన్ = సంహరించి, విజేతవుగా; ఈ భూమిన్ = కనబడుతున్న ఈ భూదేవిని; దక్షిణ దంష్ట్రన్ = సమర్థమైన కోర (కొమ్ము)తో; ఎత్తిన = ఉద్ధరించిన; నినున్ = నిన్ను; పూజింతును.

తా: ఓనారాయణా! హిరణ్యాక్షుడు గర్వాంధుడు. లోకాలన్నీ వడవడ వణుకుతుండగా సర్వసస్యాలచే ఒప్పియున్న విశాలభూమిని తీసికొనిపోయి సముద్రంలో దాచుకొన్నాడు. అప్పుడు నీవు భయంకరమైన వరాహరూపాన్ని దాల్చావు. ఆరాక్షసునితో పోరాడి విజయం సాధించావు. వాడియైన నీ కొమ్ముతో ఈ భూదేవిని ఉద్ధరించావు. కాబట్టి నిన్ను సర్వదా పూజిస్తాను.

**వ్యాఖ్య: నారాయణుడు వరాహావతారుడై భూమిని ఉద్ధరించాడు.**

"హ్రీశ్చ తే లక్ష్మీశ్చ పత్న్యౌ" (పురుషసూక్తం). 'హ్రీ' శబ్దం భూవాచకం.

నారాయణునికి భూదేవి, లక్ష్మీదేవి ఇద్దరు భార్యలు. సపత్నులైనా జగడమాడరు. భూదేవి అచ్యుతునికి చాలా ప్రియమైనది. ఆమె విపుల సుఫల. కాబట్టి మాధవి, ఉర్వి అని భూమికి పేర్లు.

"విష్ణుపత్నీం మహీం దేవీం మాధవీం మాధవప్రియామ్।
లక్ష్మీ ప్రియసఖీం దేవీం నమామ్యచ్యుతవల్లభామ్॥" (మేదినీసూక్తం).

"త్వన్మయాఽహం త్వదాధారా త్వత్సృష్టా త్వత్సమాశ్రయా।
మాధవీమితి లోకోఽయ మభిధత్తే తతో హి మామ్॥"(వి.పు.)

నేను నీ ఆశ్రితురాలను. నీవు నన్ను సృజించావు. లోకం నన్ను 'మాధవి' అంటుంది అని భూదేవి జగదాధారుడైన నారాయణుణ్ని స్తుతించిందన్నాడు శ్రీ పరాశరమహర్షి.

పత్ని పాతాళంలో పడి నికృష్టదశలో ఉన్నప్పుడు పతి తగినపాటు పడి పత్నిని ఉద్ధరించక ఉపేక్షిస్తాడా?

బ్రహ్మకు గల నూరుదివ్యసంవత్సరాల ఆయుఃకాలాన్ని 'పర' అంటారు. అందులో సగం కాలాన్ని 'పరార్ధం' అంటారు.

"నిజేన తస్య మానేన ఆయుర్వర్షశతం స్మృతమ్।
తత్పరాఖ్యం; తదర్ధం చ పరార్ధమభిధీయతే"॥(వి.పు.)

నారాయణుని నాభికమలంనుంచి చతుర్ముఖుడు పుట్టడమూ, తద్వారా పద్మసదృశమైన లోక సృష్టి జరుగడమూ 'పాద్మ' కల్పవ్యవహారమే. మత్స్య కూర్మావతారాలు పాద్మకల్పంలోనే జరిగినాయి.

"ఏకమస్య వ్యతీతం తు పరార్ధం బ్రహ్మణోఽనఘ।
తస్యాంతేఽభూన్మహాకల్పః పాద్మఇత్యభివిశ్రుతః॥"
"ద్వితీయస్య పరార్ధస్య వర్తమానస్య వైద్విజ।
వారాహ ఇతి కల్పోఽయం ప్రథమః పరికీర్తితః॥" (వి.పు.)

'పాద్మ' మనే మహాకల్పం ముగియడంతో 'పరార్ధం' గడచింది. "ద్వితీయ పరార్ధం' వరాహ కల్పంతో ఆరంభమై ఇప్పుడూ గడుస్తున్నది.

సనక, సనంద, సనాతన, సనత్కుమారులు బ్రహ్మమానసపుత్రులు. మహాయోగులు. ఒకప్పుడు వారు వైకుంఠుని దర్శనార్థం వెళ్ళారు. ఒక చెక్కగాక రెండు చెక్కలు కలదే 'ద్వారం' అనబడుతుంది. ద్వార పాలకులైన జయవిజయులు ఆ యోగులను లోనికి ప్రవేశింపనీయక తరుమసాగారు. సనక సనందాదులు కామానుజులయ్యారు.

"ఊచుః సుహృత్తమదిదృక్షితభంగ ఈషత్
కామానుజేన సహసా త ఉపప్లుతాక్షాః"॥ (భాగ.3-15-31)

పురుషోత్తముణ్ని చూచే డింభకుల కోరికను భంగపరచడం వల్ల వారు కన్నెర్రచేసి జయవిజయులను "భగవద్వైరంగల మూడు రాక్షస జన్మలనెత్తండి" అని శపించారు. యోగులను పరాభవిస్తే యోగక్షేమాలుండవు కదా!

జయవిజయులు మొదట దితిగర్భంలో హిరణ్యాక్షహిరణ్య కశిపులు - కవలలు-గా జన్మించారు. రెండవ జన్మలో రావణకుంభకర్ణులుగా, మూడవ జన్మలో శిశుపాల దంతవక్త్రులుగానూ ప్రఖ్యాతులయ్యారు. హిరణ్యాక్షుడు విపులంగా ఉన్న భూమిని చాపను చుట్టినట్లు చుట్టి పారావారంలో పడవేశాడు. నారాయణుడు యజ్ఞవరాహరూపాన్ని దాల్చి, హిరణ్యాక్షుణ్ని వధించి, భూమిని తనవాడికోరతో పైకెత్తినాడని పౌరాణికగాథ. 'ఉపనిషద్వాక్యమూ ఉంది. ఉద్ధృతాఽసి వరాహేణ కృష్ణేన శతబాహునా" (తై.నా.ఉప.) 'పృథివ్యప్సు లీయతే' ప్రళయంలో నీళ్లు ముంచుకొని వస్తుంటే భూమి - చాపను చుట్టుతున్నట్లే - కనబడుతుంది. తామసప్రకృతిగల హిరణ్యాక్షునిగా, భూగోళం - బ్రహ్మాండం- వ్యక్తీకరింపబడింది. పునఃసృష్టియే భూమిని ఉద్ధరించడం. 'అద్భ్యః పృథివీ (ఉప.)

మాధవుడు, రొంపిలోకి దిగి చరించే సత్వం వరాహం కాబట్టి, రోత యనక రొంపిలోకి దిగి దేహమంతా బురదనీరు కారుతుండగా స్తబ్ధరోముడై, దాక్షిణ్యంతో ధరణిని పైకి ఎత్తుకొని రావడం వరాహావతారవైలక్షణ్యం. సనకసనందాది మునులు యజ్ఞవరాహమూర్తిగా స్తుతించారని మిత్రసమ్మితం హృద్యంగా బోధిస్తుందికదా!

**శా. స్తంభంబందు నృసింహమై వెడలి యచ్చండాట్టహాసధ్వనుల్**
**దంభోళిం గడువంగ హేమకశిపోద్దండాసురాధీశ్వరున్**
**శుంభద్గర్భము వ్రచ్చి వానిసుతునిన్ శోభిల్ల మన్నించి య**
**జ్జంభారాతిని బ్రీతిఁ దేల్చిన నినుం జర్చింతు, నారాయణా॥ 14**

అర్థం: ఓ నారాయణా! స్తంభంబు + అందు = రాజనగరులోని స్తంభమందు; నృసింహమై = నరసింహనామరూపాలుకలవాడవై; వెడలి = ఆవిర్భవించి; ఆ చండ + అట్టహాస ధ్వనుల్ = శౌర్యంతో భయంకరంగా అరచిన అరపులు; దంభోళిన్ = పిడుగు (చప్పుడు)ను; కడువంగ = మించగా; హేమ కశిప + ఉద్దండ + అసుర + అధి + ఈశ్వరున్ = హిరణ్యకశిపు డనే గొప్పరాక్షసరాజుయొక్క; శుంభత్ + గర్భము = శోభించే కడుపును; వ్రచ్చి = చీల్చి; వాని సుతునిన్ = అతని కొడుకైన ప్రహ్లాదుణ్ని; శోభిల్ల = ప్రకాశించునట్లుగా; మన్నించి = ఉజ్జీవింపజేసి, ఆ + జంభ + అరాతిని = జంభాసురునికి పగవాడైన ఆ దేవేంద్రుణ్ణి; ప్రీతిన్ + తేల్చిన = సంతోషపరచిన; నినున్ = నిన్ను; చర్చింతును = స్మరిస్తాను.

తా : ఓనారాయణా! రాక్షసరాజభవనమందున్న స్తంభంలోనుంచి నరసింహుడని పేర్కొన దగిన రూపంతో ఆవిర్భవించావు. ప్రచండమైన అట్టహాసధ్వనులు పిడుగుచప్పుళ్ళను అతిశయించగా హిరణ్యకశిపుడనే రాక్షసరాజు కడుపును చీల్చి

వేశావు.ఆరాజుకు తనూజుడైన ప్రహ్లాదుణ్ని, అతనిమాట సత్యమయ్యే రీతిగా రక్షించావు. దేవేంద్రుణ్ని స్వర్గాధిపతిని చేసి సంతోషపరచావు. అట్టి నిన్ను ఎల్లకాలం స్మరిస్తాను.

**వ్యాఖ్య: భగవంతుని అంతర్వ్యాప్తిని ప్రకటించే నరసింహవతారవర్ణన.**

తల్లి! నీసుతుడు హిరణ్యాక్షుడు మహాశూరుడు. ఆయన వియోగానికి ఎందుకు దుఃఖిస్తావమ్మా? సర్వజ్ఞుడీశుడు, సర్వాత్ముడు, అవ్యయుడు యోగవియోగాలను కల్పిస్తాడని మాతృమూర్తియైన దితికి నీతులు చెప్పినవాడు హిరణ్యకశిపుడు. ఇతరులకు బోధించిన నీతిని తమ జీవనరీతిలో పాటించని వారూ అవకాశవాదులూ రాక్షసులేకదా!

"నారాయణుండేత ద్విశ్వములోన లే" డని తానేలోకారాధ్యుడని తననే కీర్తించుమని సజ్జనులను హింసించిన చండశాసనుడు హిరణ్యకశిపుడు. "త్రిదశైస్త్రి సంధ్యం" అని మాఘకవి చెప్పినట్లు దేవతలు ముప్పొద్దులు సంధ్యావందనంలో చేసే దిజ్నమస్కారాలను మాని వేసి, హిరణ్యకశిపుడేదిక్కున ఉంటే ఆదిక్కే నమస్కారంచేస్తుండేవారు.

పెరటియందు తులసి మొక్కలాగా హిరణ్యకశిపుని పుత్రునిగా జన్మించినవాడు ప్రహ్లాదుడు. తాను తల్లిగర్భంలో ఉన్నప్పుడు నారదమహర్షి జ్ఞానోపదేశం చేశాడు. భగవద్భాగవతకథలు వినేగర్భవతులకు సత్సంతానమే కలుగుతుంది.

"ప్రహ్లాద నారద పరాశర పుండరీక" అనే భక్తుల ప్రథమపంక్తిలో నారదుడు ద్వితీయుడై, ప్రహ్లాదుడు అద్వితీయుడుగా కీర్తింపబడినాడు.

అంబుజోదరదివ్యపాదారవిందచింతనామృతపానవిశేషమత్తచిత్తుడు ప్రహ్లాదుడు. 'జీవునికీ, దేవునికీ విడదీయరాని సంబంధం ఉంది' అనే దృఢ మైన అధ్యవసాయంగల పరమభక్తుడు ప్రహ్లాదుడు.

డింభకా! చక్రి సర్వోపగతుడంటున్నావు కదా! ఇందున్నాడా? అని హిరణ్యకశిపుడు ఒక స్తంభాన్ని కొట్టాడు. వెంటనే పెళపెళార్భటులతో నిలువున చీలిపోయిన ఆస్తంభంనుంచి నరసింహమూర్తి ఆవిర్భవించాడు.

"సత్యం విధాతుం నిజభృత్యభాషితం
వ్యాప్తిం చ భూతే ష్వఖిలేషు చాత్మనః ।" (భా.గ.7-8-18)

బ్రహ్మదత్తవరాలకు భంగం కలుగకుండా, భక్తుడైన ప్రహ్లాదునిమాట సర్వాంతర్యామిగా సర్వత్ర వ్యాపించినవాడు నారాయణుడు. ఎందువెదకి చూస్తే అందేఉంటాడన్న మాట - సత్యమని ప్రకటించడానికే అహోరాత్రాలసంధికాలంలో చరాచరవస్తువులలో కేవలం నరసింహమూర్తిగా వ్యాపించిఉన్నప్పుడు, యాదృచ్ఛికంగా జడమైన స్తంభమే బ్రహ్మకు నాయనమ్మయై శోభించింది.

ఆ నృసింహం ప్రచండంగా గర్జిస్తూ హిరణ్యకశిపుణ్ని తన తొడలమీద చేర్చుకొని, వజ్రాల్లాంటి గోళ్ళతో ఉదరాన్ని చీల్చి సంహరించిన దృశ్యాన్ని చూస్తున్న దేవతలూ, దేవర్షులూ "అహో బలం! అహోబలం!" అమూర్తిని, స్ఫూర్తిని ప్రస్తుతించారు.

"శీత్తత్తోడరుళ్ పెత్తు " - (నమ్మాళ్వార్ల శ్రీసూక్తి) అన్నట్లూ, ఒక కన్ను హిరణ్యకశిపునిపైన ఆగ్రహాన్ని ప్రస్రవిస్తుంటే, ఆక్షణానే మరొక కన్ను ప్రహ్లాదుని మీద అనుగ్రహాన్ని ప్రస్రవించింది.

పోతనకూడా ఇలాగే పెద్ద వచనంలో చివర -

"ప్రహ్లాద హిరణ్య కశిపు రంజన భంజన నిమిత్తాంతరంగ బహిరంగ జేగీయమాన కరుణావీరరససంయుతుండును మహాప్రభావుండును నైన శ్రీ నృసింహదేవుండు"- అన్నాడు.

నృసింహతాపిన్యుపనిషత్తు బోధించినట్లు, శరీరసంబంధంలేకుండా జ్యోతిర్మయుడై అంతర్వ్యాప్తిని ప్రకటిస్తూ , స్వయంగా తీక్ష్ణదంష్ట్రలతోనూ, వజ్రనఖాలతోనూ, భీషణ సటా పటలంతోనూ, సరభసాట్టహాసంతోనూ ఆవిర్భవించిన వైకుంఠ కంఠీరవుడు భక్తులను విలక్షణంగా కటాక్షించి, తన దివ్యరూపాన్ని ప్రదర్శించాడు. ప్రహ్లాదవరదుడైన నరసింహస్వామి కృపవల్లనే, హిరణ్యకశిపుని వధానంతరం, జంభారాతియైన దేవరాజు నిర్భీకుడై మళ్ళీ స్వారాజ్యాన్ని ఏలుకొన్నాడు.

నృసింహావతారం కొన్ని నిమిషాలు మాత్రమే ఉన్నా అఘటిత ఘటనకు ప్రథమోదాహరణం అయింది. దేవుడు సర్వాంతర్యామి అని నిరూపించే సామర్థ్యం జీవునికి ఉన్నదని ప్రకటించింది. సాధు పరిత్రాణమే ముఖ్య ప్రయోజనం, దుష్కృద్వినాశనం ఆనుషంగికమనీ స్పష్టపరచింది. వైదికులు ప్రతి త్రయోదశినాడు ప్రదోషకాలంలో మౌనవ్రతాన్ని పాటిస్తూ శ్రీ నృసింహస్వామిని ధ్యానిస్తారు.

"ఉగ్రం వీరం మహావిష్ణుం జ్వలంతం సర్వతోముఖమ్।
నృసింహం భీషణం భద్రం మృత్యుమృత్యుం నమామ్యహమ్"॥

అనే శ్లోకాన్ని మాన్యులూ, సామాన్యులూ శుచిర్భూతులై సర్వదా పఠించడం సంసారతరణోపాయం.

**మ. మహియున్నాకసముం బద ద్వయపరీమాణంబుగాఁబెట్టి యా**
**గ్రహమొప్పం బలి మస్తకం బొక పదగ్రస్తంబుగా నెమ్మితో**
**విహరిం చింద్రవిరించిశంకర మహావిర్భూతదివ్యాకృతిన్**
**సహజంబై విలసిల్లు వామనలసచ్చారిత్ర నారాయణా ॥ 15**

అర్థం: ఓనారాయణా! మహియున్ = భూమియు; ఆకసమున్ = ఆకాశంకూడా; పదద్వయపరీమాణంబుగాన్ = రెండడుగుల కొలతకు సరిపోవునట్లుగా; ఆగ్రహము =

కోపము; ఒప్పన్ = ఒప్పునట్లుగా; బలిమస్తకంబు = వైరోచనునితల; ఒక పదగ్రస్తంబుగా = ఒక అడుగుచే ఆక్రమింపబడినట్లు; పెట్టి; నెమ్మితో = సంతోషంతో; విహరించి, లీలగా గ్రహించి; ఇంద్ర, విరించి ,శంకర, మహావిర్భూత దివ్య+ఆకృతిన్ = శతమఖుడు, చతుర్ముఖుడు, పంచముఖుడు గొప్పగా ఆవిర్భవించి. అప్రాకృతమైన ఆకారంతో; సహజంబై = స్వాభావికమై; విలసిల్లు = శోభించే, వామన = పొట్టి అందగాడా! లసత్+చారిత్ర = సొబగైన చరిత్ర కలవాడా!

తా: ఓ నారాయణా! ఒక అడుగును నేలకొలతకూ, రెండవ అడుగును నింగిని కమ్ముకొన్నట్లు, మూడవ అడుగును బలిచక్రవర్తి శిరస్సును కోపందీర కప్పివేయునట్లు పెట్టి, నెమ్మదిగా విహరించావు. నాకేశుడు, సత్యలోకేశుడు, భూతేశుడు ఆవిర్భవించిన నీ దివ్యరూపం సహజమై వెలసింది. నీ చరిత్ర బ్రహ్మాండమంత ప్రకాశించింది.

**వ్యాఖ్య : త్రివిక్రమావతారంగా పర్యవసించిన వామనావతారప్రాశస్త్యమిది.**

మహాబలి దేవరాజును త్రోసివేశాడు. మూడులోకాలకు తానే అధిపతి అయ్యాడు. ఇంద్రుని కష్ట నష్టాలను చూచిన తల్లి (అదితి) కడుపు చుమ్మలు చుట్టుకొంది. భర్త - కశ్యప బ్రహ్మ - చెప్పిన రీతిగా పంద్రెండు రోజులు అదితి క్షీరవ్రతనిష్ఠతో భగవంతుణ్ణి ధ్యానించింది. నారాయణుడు ప్రత్యక్షమయ్యాడు. బద్ధాంజలియై స్తుతించి తనకొరతను విన్నవించింది. "నేను నీకు కుమారునిగా జన్మిస్తాను. బలిమిన్ దైత్యుల జంపరాదు. వినయోపాయాలతో వారి రాజ్యాన్ని హరించి ఇంద్రునికిస్తాను. దుఃఖపడకు" అని అంతర్హితుడయ్యాడు భగవానుడు.

కొంతకాలానికి అదితినోములపంటగా, ఇంద్రునికి తమ్ముడుగా వామన మూర్తి అవతరించాడు. వామనుడు మరుగుజ్జు అయినా చాలా అందగాడు. ఆయన మాటలూ, చేష్టలూ అద్భుతరసానికి ఆటపట్టులయ్యాయి.

తన స్వరూపంచేత రక్షించే తనసొత్తును, మరొకడు జగత్త్రయీభువనశాసనకర్త నని మమకారంతో అభిమానిస్తున్నప్పుడు అతనిని దండించి, స్వాధీన పరచుకోవడం న్యాయమే. కాని మహాబలి 'నానా మఖ వ్రతదానప్రవణానువర్తి, సత్యకరుణా ధర్మోల్లసన్మూర్తి'కదా! "యజ్ఞో వై విష్ణుః" (శ్రుతి)యజ్ఞపురుషుడైన తనను యజ్ఞ విధానంతో ఆరాధిస్తున్న వాడే కదా! అడిగిన వస్తువును లేదనకుండా మిడుకకుండా దానంచేస్తే యజ్ఞఫలం లభిస్తుంది.

'మహియున్నాకసముం బదద్వయ పరీమాణంబుగా, బలిమస్తకంబొక పదగ్రస్తంబుగాఁ బెట్టి' - అనే మాట క్రియాసాపేక్షకమై అర్థశక్తిభరితమయింది. "నాకు నొకటి రెండడుగులమేరయిమ్ము - కోర్కెదీర బ్రహ్మకూకటి ముట్టెద" (భాగ) అని

పోతన రచన, రెండింటిలోనూ త్రివిక్రమస్ఫురణ ప్రతీతమవుతున్నది. పోతన మాటలో తెలుగునుడికారపుసొంపు, శబ్దశక్తి పెంపు, ఇంపుగా ఉంది.

సంస్కృత భాగవతంలో - ద్వితీయస్కంధంలో - క్ష్మాం వామనేన జగృహే త్రిపద చ్ఛలేన" అని ఉంది. "బలిం ఛలయతే" అన్నాడు గీతగోవిందకర్త.

"ఏకక్రియా ద్వ్యర్థకరీ" అన్నట్లు మూడులోకాలకు శాసకుడైన బలిని మూడడుగునేల నిమ్మని యాచించాడు. "తూలాదపి చ యాచకః" అన్నట్లు, యాచకుడు దూదికన్న తేలిక, చులకనైనవాడు. ఇది పొట్టి వడుగు రూపంలో స్పష్టంగా కనబడుతూనే ఉంది. యాచ్ఞాఫలం అమోఘం. దాతకు యజ్ఞఫలాన్నీ, ప్రతిగ్రహీతకు అభీష్టసిద్ధిపథకాన్నీ ఆచరణలో పెట్టాడు వామనుడు. దానవులకు ఆచార్యుడైన శుక్రాచార్యులు 'నీ సంపదనపహరింప వచ్చిన మాణవకుడు విష్ణుమూర్తి కాబట్టి దానమీయకు' మని బోధించినా, సత్యవర్తనుడై బలి ధరణిని దానమిచ్చాడు.

దానజలధార నేలమీద పడడమే తడవుగా, వామను డింతింతై బ్రహ్మాండాంతసంవర్ధి అయ్యాడు.

భూమ్యాకాశాలు రెండడుగులచే విక్రాంతాలైతే, మూడవ అడుగుకు స్థలమేది? అని అడిగాడు త్రివిక్రముడు. "ప్రాప్తనిగ్రహమునకు వెరవ' నన్నాడు బలి. వెంటనే దాన వీరానికి పరాకాష్ఠగా "నీ తృతీయ పదము నిజము నాశిరమున, నెలవుసేసి పెట్టు నిర్మలాత్మ" అంటూ తన తలను వంచాడు. 'ఆగ్రహమొప్ప' బలితలమీద అడుగు పెట్టి సుతలానికి పంపాడు.

బలిచక్రవర్తి దాతృత్వబలంతో "శ్రీపతికరంబు క్రిందగుట మీఁ దైనాకరం బుంట మేల్గాదే" అంటూ అహంకరించాడు. కాబట్టి తానే క్రిందికి నెట్టబడినాడు.

"ఒక పదంబుక్రింద నుర్వి పద్మమునంటికొనిన పంకలవముకొమరు దాల్చె । నొకటి మీద తమ్మికొదిగిన తేటినా వెలసె మిన్ను" అన్నాడు పోతన.

రెండవపాదం సత్యలోకంలో చేరినప్పుడు బ్రహ్మ, ఇదే తనపుట్టిల్లని ఆబ్బుహత్వాదాన్ని అత్యాదరంతో ధర్మతీర్థాలచేత అభిషేకించాడు.

"విష్ణోః పదే పరమే మధ్వ ఉత్సః" శ్రుతి.

మనోజ్ఞమైన ఆపాదపద్మంనుంచి స్రవించిన మధుధారలు ఆధర్మతీర్థాలతో కలిసి "విను వీథిన్ ప్రవహించె దేవనదినా విశ్వాత్ముకీర్తిప్రభన్ " (భాగ.)

ఆకాశానికెత్తిన పాదం ధ్వజమై, మందాకినీ సలిలం రెపరెపలాడే ధ్వజపటమై, బలిచక్రవర్తి ఔదార్యాన్ని ఊర్ధ్వలోకాల్లో ప్రకటించడానికి ఎత్తిన పతాకగా ఉన్న దన్నారు దేశికులు.

పరత్వాన్ని మరుగుపరచి సౌలభ్యమే ప్రకాశించే విధంగా వామనుడై అవతరించినా, లోకాలూ, లోకేశులూ ఆవిర్భవించిన అప్రాకృతమైన ఆకారం - త్రివిక్రముడై బ్రహ్మాండమంతా నిండిన స్వరూపం - బహిర్వ్యాప్తిని ప్రకటిస్తూ సహజమై విలసిల్లింది.

"త్రిరిత్యేవం త్రయో వేదాః కీర్తితాః మునిసత్తమైః ।
క్రమతే తాన్ తథా సర్వాన్ త్రివిక్రమ ఇతి స్మృతః॥

అనే నిరుక్త రీతిగా, మూడువేదాలలో వ్యాపించి ఉన్న వాడు త్రివిక్రముడు.

"మధ్యే కదా తు న విచక్రమిషే జగచ్చేత్
త్వద్విక్రమైః కథమివ శ్రుతి రంచితా స్యాత్" (అతిమానుషస్తవం)

స్వామీ, మధ్యన ఒకప్పుడు ఈలోకాలను భిక్షావ్యాజంతో కొలువకపోతే వేదం నీ విక్రమాలచే ఎలా పూజింపబడుతుంది? అన్నారు శ్రీవత్సాంకమిశ్రులు.

అనేక విషయాలను చెప్పి ఎంగిలినోరైన వేదం భగవంతుని విక్రమాలను ప్రశంసించి పవిత్రం కావడానికే మూడడుగులచే ముల్లోకాలను కొలిచాడు.

"విష్ణోః కర్మాణి పశ్యత యతో వ్రతాని పస్పశే, ఇంద్రస్యయుజ్య స్సఖా"ఇంద్రుని తోబుట్టువు ఉపేంద్రుడు. ఆయన నియమాలను చూచాను. మీరు ఆ విష్ణువు చేష్టలను చూడండి అన్నది వేదం.

"యః పార్థివాని విమమే రజాంసి, యోఽస్కభాయత్ ఉత్తరం సదస్థం విచక్రమాణ స్త్రేధోరుగాయః" (ఋగ్వేదం).

గొప్ప ఆకారంతో విష్ణుమూర్తి పృథివికి సంబంధించిన పదార్థాలన్నీ ఒక్క అడుగుక్రింద ఇమిడే విధంగా కొలిచాడు. రెండవ అడుగును ఆకాశానికెత్తి అట్టను అతికించినట్లు కొలిచాడు. త్రివిక్రముడు. "యస్యోరుషు త్రిషు విక్రమణేషు, అధిక్షియంతి భువనాని విశ్వా"

'పాదాభిమానియైన త్రివిక్రముని అడుగులక్రింద అఖిలభువనాలు విలసిల్లాయి.' అన్నది 'విష్ణుసూక్తం'.

"చరణం పవిత్రం వితతం పురాణం యేన పూత స్తరతి దుష్కృతాని" అన్నట్లు, వామన చరిత్ర అద్భుతంగా శోభించింది.

వామనుడు, త్రివిక్రముడై తన పాదముద్రను చిన్న - పెద్ద అనే భేదం లేకుండా ఒక్కఅణువునైనా వదలక, చీమ మొదలుకొని సత్యలోకాధిపతి వరకు, సమస్త వస్తువులమీద మృదువుగా ముద్రించి సర్వం శ్రీవైష్ణవం అని సైద్ధాంతికంగా ఆచరించి ప్రచారం చేశాడు. కాబట్టి 'ఉరుచారిత్రుడు'.

**మ. ధరణిన్ రక్తమహాహ్రదంబులెలమిం ద్రైలోక్యనిర్దిష్టమై**
**పరగం బైతృకతర్పణంబుకొఱకై ప్రఖ్యాతిగాఁదీవ్రతన్**
**నిరువ య్యొక్కటి మారు క్షత్రవరులన్నేపార నిర్జించి త**
**త్పరశుభ్రాజితరామనామము కడున్ ధన్యంబు నారాయణా॥ 16**

అర్థం: ఓనారాయణా! తీవ్రతన్ = ఉద్వేగంతో; ఇరువయ్యొక్కటి మారు = 21 సార్లు; క్షత్రవరులన్ = రాజప్రముఖులను; ఏపార = విజృంభణంగా; నిర్జించి = సంహరించి; పైతృక తర్పణంబుకొరకై = తండ్రి ఆత్మకు తృప్తి కలుగడంకోసం; ఎలమిన్ = వికాసంగా; ధరణిన్ = భూమియందు; రక్తమహాహ్రదంబులు = పెద్ద నెత్తురు మడుగులు; ప్రఖ్యాతిగాన్ = ప్రసిద్ధిపొందగా; త్రైలోక్యనిర్దిష్టమై = ముల్లోకాలచే నిర్దేశింపఁ (వేలెత్తి చూప) బడినదై; పరగన్ = ఒప్పుగా; తత్ పరశుభ్రాజిత రామనామము = (రాజులను నరికిన) ఆ గండ్ర గొడ్డలిచే బాగా ప్రకాశించిన 'పరశురాముడు' అనే పేరు; కడున్ = మిక్కిలి; ధన్యంబు = కృతార్థమైనది.

తా: ఓ నారాయణా! క్షత్రియసంబంధమైన ఉద్వేగంతో పరశురాముడు ఇరువయ్యొక్క సార్లు తిరిగి తిరిగి రాజులను సంహరించాడు. ఆ రాజుల రక్తంతో తండ్రికి తర్పణం విడువడానికి నేలమీద తొమ్మిది నెత్తురు మడుగులను ఏర్పరచాడు. ~~ఈ~~ కార్యం జగత్ప్రసిద్ధమయింది. క్షత్రియులను నరికిన పరశువును - గండ్రగొడ్డలిని - ధరించినందువల్ల 'పరశురాము' డనే పేరు ధన్యమయింది.

**వ్యాఖ్య : పరశురామావతారప్రవృత్తి వర్ణితం.**

ఋచీకుడు భృగువంశోద్భవుడైన మహాముని. ఆయన పత్ని గాధిరాజు పుత్రికయైన సత్యవతి. ఆమె తనకూ తన తల్లికీ పుత్రులు కావాలని భర్తను వేడుకొన్నది. ఋచీకుడు రెండు వేర్వేరు మంత్రాలతో వేల్పించిన రెండు చరుపాత్రలను సిద్ధంచేసి, మాధ్యాహ్నికస్నానానికి వెళ్ళాడు. పతి వచ్చేలోపల సత్యవతి బ్రహ్మమంత్రసిద్ధ చరుపాత్రను తల్లికిచ్చింది. తాను క్షాత్ర మంత్ర సిద్ధచరువును భక్షించింది. ఋచీకుడు గమనించి తన భార్యకు క్రూరుడైన కొడుకు పుడతాడని, అత్తకు బ్రహ్మవిదుడు పుడతాడని తెలిపాడు. సత్యవతి తన కొడుకు సాధువై ఉండాలని పతిపాదాలు పట్టుకొంది. సరె! నీ కొడుకు సాధువై, నీమనుమడు తీవ్ర స్వభావుడవుతాడని అనుగ్రహించాడు. తత్ఫలితంగా సత్యవతికి జమదగ్ని పుట్టాడు. ఆమెతల్లికి విశ్వామిత్రుడు జన్మించాడు. జమదగ్నికి రేణుకయందు భార్గవరాముడు క్షత్రియతేజస్సుతో జన్మించాడు.

హైహయాధీశుడైన కార్తవీర్యార్జునుడు దత్తాత్రేయుని పూజించి సహస్రబాహుడై సూర్యుని లాగా వెలిగాడు. ఆరాజు వేటకు పోయినప్పుడు జమదగ్ని ఆశ్రమానికి

వెళ్ళాడు. అలసిపోయిన రాజుకూ, అతని అనుచరులకూ జమదగ్ని హోమధేనువు ద్వారా ఇష్టాన్నాలను కురిపించి ఆతిథ్యమిచ్చాడు. రాజు ధేనువును ఒంటికంటితో చూచాడు. అసూయ సర్వానర్థకంకదా! ఆహోమధేనువును బలాత్కారంగా హరించి రాజు మాహిష్మతీపురానికి చేరుకొన్నాడు.

ఆశ్రమానికి వచ్చి హోమధేనువు లేమిని గమనించిన భార్గవరాముడు కుఠారభీముడై పోయి కార్తవీర్యార్జునుణ్ణి చిత్రవధచేశాడు. తమ తండ్రిని చంపిన రాముడు లేని సమయాన కార్తవీర్యునిపుత్రులు వచ్చి ధ్యానమగ్నుడైన జమదగ్నితలను నరికి వెళ్ళారు.

"మహారాజును చంపినపాపం పోవడానికి నిన్ను తీర్థయాత్రకు పంపిన నీ తండ్రిని వైరంతో ఆరాజకుమారులు చంపిపోయారు రామా!" అని తల్లి రేణుక ముయ్యేడు **(3×7=21)** మారులు రొమ్ము బాదుకొంటూ ఏడ్చింది. ఉగ్రుడైన జామదగ్న్యుడు బ్రహ్మఘాతకులైన ఆరాకుమారులందరినీ గండ్రగొడ్డలిచే నరికి వేశాడు. జగతిలో దుష్టప్రవృత్తిగల రాజులను ఇరువైయొక్క మార్లు వెదకి వెదకి వధించాడు. వారిరక్తంతో తన తండ్రికి తర్పణం విడిచాడు.

శమంతక పంచక మనే ప్రదేశంలో రాజులరక్తపుటేరులతో తొమ్మిది మడుగు లేర్పరచాడు. తండ్రి తలను మొండెంతో సంధించి గొప్ప యాగం చేశాడు. హోతకూ, ఋత్విక్కులకూ భూమిని దానం చేశాడు; పితౄణం తీర్చుకొన్నాడు పరశురాముడు.

అంతరిక్షంలో జమదగ్ని సప్తర్షిమండలంలో సప్తముడుగా ప్రకాశిస్తున్నాడు. త్రేతాయుగంలో సీతారాముల కల్యాణానంతరం శ్రీరాముని శక్తిని పరీక్షించడానికి తన ధనుస్సు నిచ్చాడు. పరశురామునినుంచి అందుకొన్న విల్లుతోపాటు, అతని యందావేశించి యున్న వైష్ణవ తేజస్సును శ్రీరాముడు పరిగ్రహించాడు.

"అక్షయ్యం మధుహంతారం జానామి త్వాం సురేశ్వరమ్" (రామాయణం).

'ఓరామచంద్రా! నీవు మధుసూదనుడవు, పరమాత్ముడవని గ్రహించాను; అని స్తుతించి సర్వశక్తులుడిగి సామాన్య మానవుడైపోయిన పరశురాముడు మహేంద్రపర్వతంమీద తపోధనుడై వెలిగాడు.

సదసద్వివేకం లేని వారు పశువులు. క్షత్రియ మర్దనమనే యజ్ఞంలో పరశువును పశువధకు ఉపయోగించాడు. పరశురాముడనే పేరుగాంచి ధన్యుడయ్యాడు. నారాయణుని ఆవేశావతారుడు పరశురాముడు.

**మ. వరుసం దాటకిఁ జంపి కౌశికు మఖస్వాస్థ్యంబు గావించి శం**
**కరుచాపం బొగిఁ ద్రుంచి జానకిఁదగం గల్యాణమై తండ్రి పం**
**పరు దారన్ వనభూమి కేఁగి జగదాహ్లాదంబుగా రావణున్**
**ధరణిం గూల్చిన రామనామము కడున్ ధన్యంబు నారాయణా ॥ 17**

అర్థం: ఓ నారాయణా! వరుసన్ = క్రమంగా; తాటకిన్ = ఆపేరుగల రాక్షసిని; చంపి; కౌశికు = విశ్వామిత్రునియొక్క; మఖ స్వాస్థ్యంబున్ = యజ్ఞ రక్షణను; కావించి= చేసి; శంకరు చాపంబు = శివుని ధనుస్సును; త్రుంచి = విరిచి; ఒగిన్ = వరుసగా; జానకిన్ = జనకరాజు పుత్రిని (సీతను); తగన్ = యోగ్యంగా; కల్యాణమై = పెండ్లాడి; తండ్రి పంపు = పిత్రాజ్ఞ; అరుదారన్ = నెరవేరునట్లుగా; వనభూమికి = అడవికి; ఏగి = పోయి; జగత్+ఆహ్లాదంబుగా = లోకరంజకంగా; రావణున్ = లంకాధిపతిని; ధరణిన్ కూల్చిన = నేలగూల్చిన (చంపిన); రామనామము = రాముడనేపేరు; కడున్ = మిక్కిలి; ధన్యంబు = సంపత్కరమైనది.

తా: ఓనారాయణా! శ్రీరాముడు తాటకిని చంపాడు. వరుసగా విశ్వామిత్రుని యాగాన్ని సంరక్షించాడు. శివధనుస్సునూ విరిచాడు. జానకిని పరిణయమాడాడు. తండ్రి ఆజ్ఞను పాటించి అడవికేగి లోకం సంతోషించేరీతిగా రావణుణ్ని సంహరించాడు. ఆరాముని పేరు సంపత్కరమయింది.

**వ్యాఖ్య : శ్రీరామావతార ఉదంతమిది.**

"నృసింహరామకృష్ణేషు షాడ్గుణ్యం పరిపూరితమ్"

నరసింహ రామ కృష్ణావతారాలు పూర్ణావతారాలని విజ్ఞులమాట.

సూర్యవంశపురాజైన దశరథుడు పుత్రకామేష్టి చేశాడు. యజ్ఞపురుషుడిచ్చిన పాయసాన్ని తన ముగ్గురు పత్నులకు లక్షణంగా పంచి ఇచ్చాడు.

నారాయణుడు నిజాంశతో నాలుగు విధాలుగా అవతరించాడు. కౌసల్యకు శ్రీరాముడు, కైకేయికి భరతుడు, సుమిత్రకు లక్ష్మణ శత్రుఘ్నులు జన్మించారు. కైకేయి దశరథునికి చిన్న భార్య. కొడుకులకు మధ్యమాంబ. సౌమిత్రులిర్వురిలో పెద్దవాడు పెద్దన్న తోనూ, చిన్నవాడు చిన్నన్నతోనూ జతగా పెరిగారు.

విశ్వామిత్రమహర్షి తన యాగరక్షణకోసం శ్రీరాముణ్ని తన వెంట పంపుమని అడిగినందువల్ల దశరథుడు కులగురువైన వసిష్ఠుని అనుమతితో రామలక్ష్మణులను మునివెంట పంపాడు. దారికి అడ్డం వచ్చిన తాటకి అనే మహారాక్షసిని శ్రీరాముడు విశ్వామిత్రుని ఆజ్ఞాప్రకారం చంపి వేశాడు. మహర్షి రాకుమారులకు అస్త్ర శస్త్రవిద్యలను బోధించాడు. యాగానికి అంతరాయం కలుగకుండా తాటకీ తనయులైన సుబాహుణ్ని

బుగ్గిచేశాడు. మారీచుణ్ని దేశాంతరానికి ఎగుర గొట్టాడు దాశరథి. కౌశికుడు, యజ్ఞాన్ని యథావిధిగా పూర్తి చేశాడు.

"అరక్షన్మునీంద్రం క్రతో రంతరాయా
దఖండీచ్చ చండీశకాండాసనం యః॥"

రామలక్ష్మణులు మునివెంట మిథిలానగరానికి వెళ్ళారు.

"వత్స రామ ధనుః పశ్య" అన్న విశ్వామిత్రుని మాటను పాటించి, శివుని వింటిని విరిచి, శ్రీరాముడు సీతమ్మను వైభవంగా వివాహమాడాడు.

కైకేయికి వరాలిచ్చిన తండ్రిని సత్యవంతునిగా చేయడానికి శ్రీరాముడు సీతాలక్ష్మణులతో వనవాసం చేశాడు. అక్కడ మహర్షుల గోడు విన్నాడు. సత్యం ధర్మం అనే రెండు పాదాలతో సంచరించాడు. లోకకంటకుడైన దశకంఠుని కంఠ దశకాన్ని లుంఠనంచేసి వైకుంఠానికి పంపి, జగత్తుకు ఆహ్లాదం కలిగించిన రాముడు సకల గుణాభిరాముడు.

భావనాసిద్ధమైన మనుష్యత్వమందు స్వాభావికమైన పరత్వాన్ని అభిమానించిన మర్యాదా పురుషోత్తముడు శ్రీరాముడు. మహర్షిసేవచేస్తూ తమోగుణాన్ని నిరసించాడు. యాగరక్షణతో సత్వగుణాన్ని సమృద్ధపరచి, వైదేహికల్యాణానికి సిద్ధమైన భద్రమూర్తి చండీశకాండాసనాన్ని ఖండించకలిగాడు. ఖండనప్రక్రియ హృదయంగమం.

'శివచాపం' పవిత్రమైన, వేదవేద్యుని వాచకమైన ప్రణవమే.

"తస్య వాచకః ప్రణవః" "ప్రణవో హి ధనుః" అనే వాక్యాలు ప్రామాణికాలు.

హస్తంతో లస్తకం పట్టి ఎత్తడమే కల్యాణం. ఈ ప్రక్రియ, భారాన్ని మోయనూకలడు, దూరమూచేయగలసమర్థుడు అని రాముని పూర్వోత్తరచరిత్రను సూచిస్తుంది.

విల్లు విరిగింది. మీది ముక్క తనచేతిలోనే ఉంది. ఇది అకారం. "అకారేణోచ్యతే విష్ణుః". నారాయణుడని దీని అర్థం.విడిపోయిన క్రింది ముక్క మకారం. ఇది జీవవాచకం. "మకారేణోచ్యతే జీవః" ఈ రెండు ముక్కలను సంధించుకొన్నది నారి. అత్యంతాభావంకాకుండా, దేవజీవులను కలిపే గుణమిది. గుణమంటే అర్థం నారి కదా! ఈ గుణం - పురుషకారం - తో శోభించే లక్ష్మీదేవి ఉకారం. "ఉకారేణ రమోచ్యతే"

అ, ఉ, మ్ = ఓమ్. ఓంకారలక్షణలక్షితం సీతారామకల్యాణం.

దేహాన్ని అభిమానించక, కర్మజ్ఞానానుష్ఠానపరుడైనవాడు జనకుడు. అతడు విదేహుడు. అతడు కన్నకీర్తి జానకి. అది అప్రమేయమైన వైష్ణవతేజస్సు. "అప్రమేయం హి తత్తేజః యస్య సా జనకాత్మజా".

బాలరాముని దెబ్బతిన్న మారీచుడు రావణునికి చెప్పిన హితవాక్యమిది. రాముడు మూర్తీభవించిన ధర్మమే. "రామో విగ్రహవాన్ ధర్మః" అన్నాడు. ధర్మమంటే ధనుస్సు. ధనుస్సు ఓంకారమే. అది కేవలం "ద్రష్టవ్యశ్శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్యః" - అన్నట్లు బృహదారణ్యకం లోనే చూడదగినది.

"అగ్రే ప్రయయౌ రామః సీతా మధ్యే సుమధ్యమా।

పృష్ఠతశ్చ ధనుష్పాణిః లక్ష్మణోనుజగామ హ॥" (రామాయణం)

శ్రీరాముడు ముందు, సీత మధ్యన, తర్వాత లక్ష్మణుడు, ఇలా ఓంకారమే రూపందాల్చి అడవిలో సంచరిస్తుండగా చూచిన వాల్మీకి 'హ'అని చకితుడయ్యాడు.

"అగ్రతస్తే గమిష్యామి" రాయి రప్ప, రెల్లు ముల్లు రాముని పాదాలకు తగులకుండా, దారిని సుగమంచేస్తూ తానే ముందు నడువగలనని చెప్పిన రీతిగానే సీతమ్మ రామునికంటె ముందే లంకకు చేరుకొంది.

"నాగ్ర్యహతస్య లోకోఽస్తి"

"యశ్చ హంతి ద్విజన్మానం యశ్చ విప్రేణ హన్యతే।

తావుభావధమౌ జ్ఞేయౌ పరలోకపరాఙ్ముఖౌ॥

బ్రాహ్మణుణ్ణి చంపిన వానికీ బ్రాహ్మణునిచే చంపబడిన వానికీ - ఇద్దరికీ - సద్గతి లేదని శాస్త్రం చెబుతుంది.బ్రహ్మపుత్రుడైన పులస్త్యునివంశంలో పుట్టిన రావణుని చేత హింసింపబడినవాఢు జటాయువు.

'మీరు సీతను చూచారా? తెల్పండి' అని రాముడు అడవుల్లో తిరుగుతూ దుఃఖించడం మానుషకృత్యంకాదా! సీతపోయినదారి తెలియని ఆరాముడు అధికారంలేని ఒక తిర్యక్ జంతువు - జటాయువు-కు "గచ్ఛ లోకాన్ అనుత్తమాన్" - 'ఉత్తమోత్తమలోకాలకు పొ'మ్మని మోక్షమార్గాన్ని చూపడం అతిమానుషకృత్యమేకదా!

"నానా విష్ణుం మోక్షదో నాస్తి దేవః" శ్రీమహావిష్ణువుతప్పమోక్ష మిచ్చే దేవుడు లేడు.

"అప్సు ప్లవంతి పాషాణాః మానుషా ఘ్నంతి రాక్షసాన్।

కపయః కర్మ కుర్వంతి కాలస్య కుటిలా గతిః॥"

రాళ్ళు నీళ్ళల్లో తేలడం, మనుష్యులే రాక్షసులను చంపడం, కోతులు ఆర్జవంతో పనులుచేయడం ఆశ్చర్యంగా ఉందే! ఇది కుటిలగతిగల కాల ప్రభావంకాక మరేమి? లోకవ్యవహారమంతా తారుమారుగా కనబడుతున్న దనుకొన్న రావణుడు, నిర్భీకుడై రామునితో యుద్ధానికే తలపడ్డాడు. "గగనం గగనాకారం, సాగరః సాగరోపమః రామరావణయోర్యుద్ధం రామరావణయోరివ". (రామా)

గగనానికి గగనమే, సాగరానికి సాగరమేసాటి. రామరావణులయుద్ధం రామరావణులలాగా అనన్యంగానే ఉంది అన్నాడు వాల్మీకి.

ఆమోధ్యలో మొలచిన గరికితోపాటు చరాచరపదార్థాలను తన వెంట వైకుంఠానికి తీసుకొని వెళ్ళిన పరంధాముడు శ్రీరాముడు.

రాముని ఘనకార్యాలన్నీ ఆకాలంలో ఉన్నవారికి ఉపయోగపడినవే. కాని తమకు లవణసముద్ర తరణానికి హేతువైన సేతువు, ఎల్లకాలం సర్వజనులకు సంసార సముద్రతరణానికి హేతువవుతున్నది కదా!

"సేతుం దృష్ట్వా సముద్రస్య బ్రహ్మహత్యాం వ్యపోహతి"

సేతువును చూస్తే బ్రహ్మహత్యలాంటి క్రూర పాపాలు కూడా పంచబంగాలమవుతాయి.

"యత్పురా పాపదశకచ్ఛేదసాధనతాం గతః ।

ససేతు ర్నకథం శక్తః పాపపంచకభంజనే॥"(వి.గు.చంపువు) పదిపాపాలను (దశకంఠుని) కూల్చడానికి సాధనమైన ఆరామసేతువు ఐదు పాపాలను - పంచమహాపాతకాలను తొలగింపజాలదా! అని చమత్కరించాడు విద్వత్కవి వేంకటాధ్వరి.

"తం వీక్ష్య సేతుమధునాఽపి శరీరవంతః

సర్వే షడూర్మి బహుళం జలధిం తరంతి"॥ అన్నారు దేశికులు.

శరీర ధారులెల్లరు ఈనాటికి కూడా సేతువును దర్శించి, గర్భంలో ఉండడం, పుట్టడం, పెరుగడం, మారడం, తరుగడం, నశించడం అనే ఆరుతరంగాల బాహుళ్యంగల సంసారసముద్రాన్ని తరిస్తున్నారు. భగవద్గీత లక్షణ గ్రంథం. రామాయణం లక్ష్యగ్రంథం. "జన్మ కర్మ చ మే దివ్యం" అన్నట్లు మాయామానుష విగ్రహుడైన రాముని దివ్య చేష్టలను తెలుసుకొంటే శ్రేయస్కరమనడం నిర్వివాదాంశం. కాబట్టి రాముని నామం ఇంకెంతో ధన్యమైనది. మధురమైనది.

**మ. యదువంశంబునఁ గృష్ణుకగ్రజుఁడవై యాభీలశౌర్యోన్నతిన్**
**మదవద్ధేనుకముష్టికాద్యసురులన్ మర్దించి లీలారసా**
**స్పదకేళీరతి రేవతీవదనకంజాతాంతభృంగంబనన్**
**విదితంబౌ బలరామమూర్తి వని నిన్ వీక్షింతు నారాయణా॥ 18**

అర్థం: ఓ నారాయణా! యదువంశంబునన్ = యాదవకులమందు; కృష్ణుకు = శ్రీకృష్ణునికి; అగ్రజుఁడవై = ముందు పుట్టినవాడవై; అన్నవై; ఆభీలశౌర్య+ఉన్నతిన్ = భయంకరమైన శూరత్వపుగొప్పతనంచేత; మదవత్+ధేనుక, ముష్టిక+ఆది+అసురులన్ =

మదం కలిగిన ధేనుకుడు, ముష్టికుడు మొదలైన రాక్షసులను; మర్దించి = సంహరించి; లీలారస+ఆస్పద కేళీరతి = శృంగార రసానికి స్థానమైన క్రీడానందమందు; రేవతీ వదన కంజాత+అంత భృంగంబు+అనన్ = రేవతీ దేవి ముఖమనే కమలకర్ణిక యందున్న తుమ్మెద యో అన్నట్లు; విదితంబు+ఔ= తెలియబడుతున్న; బలరామమూర్తివి, అని; నిన్ = నిన్ను; వీక్షింతును = దర్శింతును.

తా: ఓనారాయణా! యదువంశమందు కృష్ణునికి, ముందు జన్మించి అన్నవయ్యావు. భీతిగొల్పే మహాశౌర్యంచేత, మదించిన ధేనుకాసురుణ్ని, ముష్టికాసురుణ్ని, ఇంకా రాక్షసులనెందరినో నేలమట్టం చేశావు. శృంగారక్రీడయందు రేవతీముఖకమల మందలి కర్ణికయందుండే తుమ్మెదవో అన్నట్లు విదితమవుతున్న బలరామమూర్తి వని నిన్ను దర్శనం చేసుకొంటాను.

**వ్యాఖ్య : బలరామావతార ప్రశస్తి ఇది.**

భారతం దశావతారాలను "మత్స్యః కూర్మో వరాహశ్చ నారసింహశ్చ వామనః। రామో రామశ్చ రామశ్చ బుద్ధః కల్కీతి తే దశ" అని పేర్కొన్నది. కొందరు "రామో రామశ్చ కృష్ణశ్చ" అంటారు. మరికొందరు "రామో రామశ్చ రామశ్చ కృష్ణః కల్కిరేవ చ" అంటారు.

'శ్రీలక్ష్మీనృసింహ సహస్రనామస్తోత్రం'లో "నమో మత్స్యస్వరూపాయ కచ్ఛపాయ నమోనమః । నమో యజ్ఞవరాహాయ శ్రీనృసింహాయ తే నమః ॥ విక్రమక్రాంత లోకాయ వామనాయమహౌజసే। నమో భార్గవరామాయ, రావణాంతకరాయ చ॥నమస్తే బలరామాయ కంస ప్రధ్వంసకారిణే । బుద్ధాయ బుద్ధరూపాయ తీక్ష్ణరూపాయ కల్కినే॥" అని దశావతారాలస్తుతి ఉంది. శ్రీకృష్ణస్తుతి ప్రత్యేకంగా లేదు కదా!

ఈ శతక కవి 'కృష్ణకగ్రజుడవై' అన్నాడు. బలరామకృష్ణులు ఒకరి కొకరు తోడుగా ఉండి అవతారప్రయోజనాన్ని నెరవేర్చినారు. భాగవతోత్తముణ్ని గొప్పగా గౌరవించేవాడు భగవంతుడు. భక్తనామసాహచర్యం భగవన్నామం, భగవంతుని పేరుతోకూడి భక్తుని పేరు ఉంటుంది. లక్ష్మణాగ్రజః 'నమోఽస్తు రామాయ సలక్ష్మణాయ' అన్నట్లు ఆన్నదమ్ములిద్దరిని తలచి, తలపింప జేస్తున్నాడీ కవి.

"ఏష నారాయణః శ్రీమాన్ క్షీరార్ణవనికేతనః।

నాగపర్యంక ముత్సృజ్య హ్యాగతో మథురాం పురీమ్॥" (హరివంశం)

క్షీరాబ్ధిశాయి యైనశ్రీమన్నారాయణుడు మొదట శేషుడనే తన పడకను ఎత్తి పంపి, తర్వాత తాను మథురాపురికి వచ్చాడట. ఆదిశేషుని అవతారాలను 'కృష్ణోపనిషత్తు' పేర్కొన్నది.

"స ఏవ భగవాన్ భగవంతం బహుధా విప్రీయమాణః, అఖిలేన స్వేన రూపేణ యుగే యుగే తేనైవ జాయమానః స ఏవ సౌమిత్రి రైక్ష్వాకః .....స ఏవ భగవాన్ సంధికాలే శారదాభ్రసన్నికాశో రౌహిణేయో వాసుదేవః సర్వాణి గదా ద్యాయుధశాస్త్రాణి వ్యాచక్షోనైకాన్ రాజన్య మండలాన్నిరాచికీర్షుః భూభారమఖిలం నిచఖాన"?

ఆది శేషుడు ప్రతియుగంలోనూ భగవంతుని తోడ అవతరిస్తాడు. అతడే ఇక్ష్వాకు వంశమం దవతరించిన సౌమిత్రి - లక్ష్మణుడు. ద్వాపర కలియుగ సంధికాలాన వసుదేవుని కుమారుడూ, రోహిణీ పుత్రుడూ, శరత్కాల మేఘంతో సమానమైన తెల్లని శరీర వర్ణం కలవాడూ అయిన బలరాముడు గదాద్యాయుధశాస్త్రాలను బోధించి, అనేకరాజుల సముదాయాన్ని నిర్జించి, అఖిల భూభారాన్ని తొలగించాడు.

"అనంతః ప్రథమం రూపం, లక్ష్మణశ్చ తతః పరమ్।
బలభద్రస్తృతీయశ్చ, కలౌ కశ్చి ద్భవిష్యతి॥"

అనంతుడనే పేరుతో ఉన్న ఆదిశేషుడే తర్వాత లక్ష్మణునిగానూ, ఆ పిమ్మట బలభద్రునిగానూ అవతరించాడని ' నారదీయపురాణం' లో శ్రీమన్నారాయణుడే మహర్షులతో చెప్పాడు.

భూదేవి ప్రార్థనా ఫలమే శ్రీకృష్ణావతారం

"భూమిర్దృప్త నృపవ్యాజ దైత్యానీక శతాయుతైః
ఆక్రాంతా భూరి భారేణ బ్రహ్మాణం శరణం యయౌ॥"(భాగ.10-1-17)

అది ద్వాపరయుగం, 'ద్వాపరం' అంటే సందేహం. ధర్మాధర్మ విషయం సందేహాత్మకంగా ఉండినకాలమది. రాక్షసులు రాజులరూపంలో వచ్చి గర్వంతో అతలాకుతలంచేస్తుంటే, భూమి భరించజాలలేదు. సజ్జనులను దూషించి వారి పాపాలను ఒడిగట్టుకొంటూ, పురవీధులను శుద్ధి చేయడానికే పందులు పుట్టినట్లు, వారిని పరిశుద్ధులుగా చేయడానికి దుర్జనులు పుడతారు.

"సాధుపాపవిశుద్ధ్యర్థం దుర్జనః పరికల్పితః ।
గ్రామవీథీవిశుద్ధ్యర్థం సూకరః పరికీర్తితః "

రాజు రాక్షసుడైతే మంత్రులు పెద్దపులులు. అతని భృత్యులు కుక్కలే. ఆరాజుపాలనలో ప్రజలు అలాగే ఉంటారు.

"రాజా రాక్షసరూపేణ వ్యాఘ్రరూపేణ మంత్రిణః।
సేవకాః శ్వానరూపేణ, యథా రాజా తథా ప్రజా॥"

తండ్రిని చెరసాలలో బంధించిన వాడు కంసుడు. అతనిమామ రాజులనే బలి ఇచ్చే నరరూపరాక్షసుడు-జరాసంధుడు. ప్రాగ్జ్యోతిషాధిపతి యైన నరకుడు అదితి కుండలాలను తెంచి తెచ్చిన క్రూరుడు, పదహారు వేల కన్యకలను తెచ్చి చెరపట్టిన కామాతురుడు. శిశుపాలదంతవక్త్రులు దుష్టులు. జనుషాంధుడైన ధృతరాష్ట్రుడు ధర్మమందు ప్రవృత్తి, అధర్మమందు నివృత్తి లేని వ్యామోహ పరవశుడు. అతని కొడుకులు నూర్గురు దురభిమానులు. సజ్జనులకు ఊపిరాడనీయని దుర్మతులు.

కాబట్టి భూదేవి గోరూపం ధరించి బ్రహ్మను ప్రార్థిస్తే , ఆ బ్రహ్మ దేవతలతో వెళ్ళి, పాలకడలిగట్టున ప్రత్యక్షమైన పరమాత్మునితో "అత్యంతభారపీడితయైన భూమిని కాపాడుమని వేడుకొన్నాడు."

"ఏవం సంస్తూయమానస్తు భగవాన్ పరమేశ్వరః।
ఉజ్జహారాత్మనః కేశౌ సితకృష్ణౌ మహామునే॥
ఉవాచ చ సురానేతౌ మత్కేశౌ వసుధాతలే।
అవతీర్య భువో భారక్లేశహానిం కరిష్యతః ॥" (వి.పు.5-1-60,61)

భూభారాన్ని తొలగించుమని స్తుతింపబడిన సర్వేశ్వరుడు ఆలోచిస్తూ తలమీద చేతినిపెట్టి, తెల్లని, నల్లని శిరోజాలను రెండింటిని పెరికాడు. ఈ నా రెండు కేశాలు నేల మీద అవతరించి భూమికి భారరూపమైన క్లేశాన్ని దూరం చేయగలవని దేవతలతో చెప్పాడన్నారు శ్రీపరాశరులు.

'తౌ చాపి కేశౌ విశతాం యదూనాం
కులే స్త్రియౌ రోహిణీం దేవకీం చ॥
తయోరేకో బలభద్రో బభూవ
యోఽసౌ శ్వేతస్తస్య దేవస్య కేశః ।
కృష్ణో ద్వితీయః కేశవస్సంబభూవ
కేశోయోఽసౌ వర్ణితః కృష్ణవర్ణః॥" (భారతం)

'ఆరెండు కేశాలలో తెల్లనిది యదుకుల కాంతలైన రోహిణియందు, నల్లనిది దేవకియందు ప్రవేశిస్తుంది. ఒకడు బలభద్రుడైతే రెండవవాడు శ్రీకృష్ణుడు' అని పారాశర్యసూక్తి.

"కళయా సితకృష్ణకేశః, జాతః కరిష్యతి జనానుపలక్ష్యమార్గః" -
పరమపురుషుని శ్వేత కృష్ణకేశాలే బలరామకృష్ణులని శ్రీశుకసూక్తి.
"శంఖచక్రభృదీశే తు శ్వేతవర్ణో మహాభుజః।
ఆవిష్టః శ్వేతకేశాత్మా శేషాంశం రోహిణీసుతమ్"

'విష్ణుమూర్తి యొక్క శ్వేత కేశరూపం రోహిణీసుతుడైన రాముని యందు శేషావతారమై ఆవేశించింది. కృష్ణుడు సాక్షాత్తు వాసుదేవుడే' అంటుంది వరాహపురాణం.

కశ్యపప్రజాపతియే వసుదేవుడు. కశ్యపుని పత్నులైన అదితి, కద్రువలే దేవకిగా, రోహిణిగా అవతరించి, వసుదేవుని భార్యలయ్యారు.

కంసుడు పూర్వజన్మలో కాలనేమి అనే రాక్షసుడు. అతని ఆర్గురు పుత్రులు విష్ణుభక్తులు. వారు హిరణ్యకశిపుణ్ణి గౌరవించలేదు. కాబట్టి అతడు కోపంతో 'మీ తండ్రి చేతితోనే చంపబడుదురుగాక' అని వారిని శపించాడు. (హరివంశం)

ఈ అర్గురిని వరుసగా దేవకీ గర్భంలో ప్రవేశపెట్టుమని శ్రీమన్నారాయణుడు యోగనిద్రను ఆజ్ఞాపించాడు.

"హతేషు తేషు కంసేన శేషాఖ్యోఽంశస్తతో మమ".

కంసుడు క్రమంగా వారిని చంపిన తర్వాత నా అంశయైన శేషుడు దేవకీ గర్భంలో ఉంటాడు.

"గోకులే వసుదేవస్య భార్యాఽన్యా రోహిణీ స్థితా।
తస్యాస్సంభూతిసమం దేవి! నేయస్త్వయోదరమ్॥" (వి.పు.)
"గర్భ సంకర్షణాత్ సోఽథ లోకే సంకర్షణేతి వై।
సంజ్ఞామవాప్యతే వీరః శ్వేతాద్రి శిఖరోపమః॥"(వి.పు.5-1-76)

'ఓ మాయాదేవీ! దేవకీసప్తమగర్భాన్ని (కుక్షిస్థజంతువును) సంకర్షించి, గోకులంలో ఉన్న రోహిణీగర్భంలో నీవు స్థాపించు. సంకర్షితుడైనందువల్ల, శ్వేతశైలశిఖరంలాగా ఉండే ఈ వీరుణ్ని లోకం సంకర్షణుడని వ్యవహరిస్తుంది. దేవకికి అష్టమగర్భంలో నేను వర్షర్తువులో భాద్రపద కృష్ణ అష్టమినాడు నడిరేయి జన్మిస్తాను. వెంటనే ప్రవేశించే నవమీతిథియందు నీవు యశోదా గర్భంలో జన్మించు. వసుదేవుడదే రాత్రి నన్ను గోకులంలో యశోద ప్రక్కన చేర్చి, నిన్ను దేవకి ప్రక్కన చేరుస్తాడు. కంసుడు నిన్ను బండకు గొట్టడానికి యత్నించగానే, నీవు ఆకాశంలోకి ఎగిరిపోవాలి' అని చెప్పినట్లే యోగమాయచేసింది.

దేవకిది పిల్లలు పుట్టి చచ్చిపోయే కడుపు. నష్టసంతానంగల ఆమె గర్భంలో నాగప్రతిష్ఠచేసినందువల్ల, అష్టమగర్భం నిలిచిందంటారు విజ్ఞులు. నేటికీ నాగసర్పాన్ని, పుట్టలో పాలుపోసి పూజిస్తే సత్సంతానంకలిగి క్షేమంగా ఉంటుందన్న భారతీయుల అధ్యవసాయం విస్మరింపరానిది.

"జ్ఞాన శక్తి బలైశ్వర్య వీర్య తేజాంస్య శేషతః ।
భగవచ్ఛబ్దవాచ్యాని వినా హేయైర్గుణాదిభిః ॥" (వి.పు)

జ్ఞానం, శక్తి, బలం, ఐశ్వర్యం, వీర్యం, తేజస్సు అనే షడ్గుణాలు కలవాడే భగవంతుడు. ఇతరులయందు ఉపయోగింపబడే భగవచ్ఛబ్దం గౌణం.

"తత్ర పూజ్య పదార్థోక్తిపరిభాషాసమన్వితః।
శబ్దోఽయం నోపచారేణ త్వన్యత్ర హ్యుపచారతః॥" (వి.పు)

భగవాన్ పతంజలిః, వ్యాసభగవానుడు అన్నచోట - ఆవ్యక్తులయందు షాడ్గుణ్య పూర్తిలేదు. కాని ప్రతిభా ప్రభావసంపన్నులైన మహాత్ములు. కాబట్టి ఔపచారికంగా, గౌరవంగా భగవచ్ఛబ్దం వారియందు ప్రయుక్తమవుతుంది.

ఆరుగుణాలు పూర్ణంగా ఉన్మిషితాలు కాబట్టి శ్రీకృష్ణావతారం పూర్ణావతారం.

1. జ్ఞానం అంటే సర్వవస్తుసాక్షాత్కారం.

"అహం సుతో వామభవం పృశ్నిగర్భ ఇతి శ్రుతః" (భాగ.10-3-41)

శ్రీకృష్ణుడు చెరసాలలో శంఖచక్రాద్యాయుధాభరణాలతో ఆవిర్భవించిన వెంటనే తల్లి దేవకితో ఇలా అన్నాడు.

అమ్మా! స్వాయంభువమన్వంతరకాలాన నీవు 'పృశ్ని'గా వసుదేవుడు 'సుతపా' అనే ప్రజాపతిగా ఉండి మీరు ఘోరతపస్సుచేశారు. అప్పుడిదే రూపంతో ప్రత్యక్షమైన నన్ను మోక్షమడుగలేదు. నీలాంటి పుత్రుడు మా గర్భమందు జన్మించాలని మూడుసార్లు ప్రార్థించారు. నాలాంటివాడు మరొకడు లేడు కదాః కాబట్టి నేనే మీకుమారుడనై 'పృశ్నిగర్భుడ'నవే పేరుపొందాను. రెండవసారి అదితి కశ్యపులుగా ఉన్న మీకు పుత్రుడనై వామనుడు (ఉపేంద్రుడు)అనే పేరు పొందాను. ఇప్పుడు, మూడవసారి మీకు పుత్రుడనయ్యాను.

నా అవతారాలు జ్ఞాపకానికి రావాలనే మీకు నేనీరూపాన్ని చూపాను, అని తెల్పిన సంగతి జ్ఞానగుణానికి తార్కాణం.

పూర్వం వివస్వంతునికి ఉపదేశించిన యోగశాస్త్రం, లోపించినందువల్ల మళ్ళీ, నీకు ఉపదేశించానన్నాడు. వివస్వంతుని జన్మ ప్రాచీన మాయె. నీ జన్మఅర్వాచీనం కదా! నీ మాట పొసగే దెట్లా? అంటూ అర్జునుడాశ్చర్యపడితే, 'నాకూనీకూ అనేక జన్మలు గడిచాయి. నాకు తెలుస్తుంది, నీకు తెలియద'ని శ్రీకృష్ణుడు బోధించడమూ జ్ఞాన గుణ లక్షణమే కదా!

2. శక్తి, అంటే అఘటితఘటనాసామర్థ్యం

శ్రీకృష్ణునికి విద్యను బోధించినగురువు 'సాందీపని'. ఎప్పుడో మరణించిన గురు పుత్రుణ్ని తెచ్చి సాందీపని కిచ్చాడు. అంతేకాదు; పుట్టగానే గిట్టిన ఒక బాపనయ్యకొడుకులను, తాను వైకుంఠంపోయి తనదేవేరులను మెప్పించి, తెచ్చి వారి తలిదండ్రుల కర్పించి, వారిని ఆనందపరచినందువల్ల శక్తి ప్రకాశితమయింది.

3. బలం, అంటే శ్రమలేకుండ ్స్నంటిని ధరించే గుణం.

గోవర్ధన గిరిని గొడుగులాగా ధరించాడు కదా:

4. ఐశ్వర్యం, అంటే తనను తప్ప తక్కిన వస్తువులను, వ్యక్తులను నియమించే కర్తృత్వం. లెక్కించలేని యాదవజనాన్ని తన అదుపాజ్ఞలలో ఉంచడం వల్ల 'ఐశ్వర్యం' ప్రకటితం.

5. వీర్యం, అంటే సర్వజగత్కారణమైన, వికారరాహిత్యం.

గోవులను, గోపాలకులను బ్రహ్మమాయంచేసినా, అతడు చకితుడయ్యే రీతిగా, తానే ఆవులుగానూ, లేగలుగానూ, ఆలకాపరులుగానూ, చద్దిమూటలతో కూడిన కోలలుగానూ అనేక రూపాలను ధరించాడు, గోగోపరక్షకుడు శ్రీకృష్ణుడు. అయినా నిర్వికారుడు.

6.తేజస్సు, అంటే పరాభిభవనసామర్థ్యం.

శ్రీకృష్ణుని ఎదుట బ్రహ్మరుద్రేంద్రాదిదేవతలందరు నిస్తేజస్కులయ్యారు.

"ఏతే చాంశకళాః పుంసః కృష్ణస్తు భగవాన్ స్వయమ్" - (1-3-28)

అనే భాగవతంలోని ఈ శ్లోకం చైతన్య సంప్రదాయులకు ప్రాణంలాంటిది. శ్రీకృష్ణుడే పరబ్రహ్మ. ఆయన ఇతరావతారాలు అంశావతారాలనీ, కళావతారాలనీ ఈ శ్లోకం చెబుతుంది. ఇక్కడ 'అంశ' అంటే గుణభాగం.

శ్రీమన్నారాయణుడు సృష్టి స్థితిలయాదికార్యాలకోసం 'పర, వ్యూహ, విభవ, అంతర్యామి, అర్చారూపం' అనే పంచావతారుడవుతాడు.

శ్రీమన్నారాయణుడే పరుడు. వ్యూహం చతుర్విధం

'వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధ' అనే నల్గురు వ్యూహమూర్తులు.

వీరిలో షడ్గుణాలు ఉన్నా, ఆయాకార్యానుసారంగా కొన్ని గుణాలే స్ఫుటంగా ప్రకాశిస్తాయి. మిగిలినవి అనువృత్తాలైనా స్ఫుటంగా ప్రకాశించవు. 'అహిర్బుధ్న్యసంహిత' లో గుణోన్మేషానున్మేషాలు వివరించబడినాయి.

"తత్ర జ్ఞానబలద్వంద్వాద్రూపం సాంకర్షణం విదుః ।
ఐశ్వర్య వీర్యసంభేదా ద్రూపం ప్రాద్యుమ్నముచ్యతే॥
శక్తి తేజస్సముత్కర్షా దనిరుద్ధీ తనుర్హరేః
ఏతే శక్తి మయా వ్యూహాః గుణోన్మేషస్వలక్షణాః॥"

1. సంకర్షణునికి 'జ్ఞానం, బలం' అనే రెండుగుణాలు ముఖ్యమైనవి. శాస్త్రప్రదానం, జగత్సంహారం ముఖ్యకార్యాలు. సంకర్షణుడు రుద్రుని యందు అనుప్రవేశించి జగత్సంహారంచేస్తాడు. చేతనా చేతన మైన జగత్తును తనలో చేరే రీతిగా ఆకర్షించే వాడు కాబట్టి సంకర్షణుడని పేరు. "సంకృష తీతి సంకర్షణః".

2. ప్రద్యుమ్నునికి ఐశ్వర్యం, వీర్యం అనే [illegible] లు ముఖ్యమైనవి. ధర్మోపదేశం, జగత్సృష్టి ముఖ్యకార్యాలు. 'ప్రకృష్టం ద్యుమ్నం యస్య సః = ప్రద్యుమ్నః' - వికారం పొందకుండా ఉండేవాడని అర్థం.

3. అనిరుద్ధునికి శక్తి, తేజస్సు అనే రెండు గుణాలు ప్రధానమైనవి. తత్త్వబోధ, జగద్రక్షణం ప్రధానకార్యాలు.

"అవతారా హ్యసంఖ్యేయా హరేః సత్త్వనిధేర్ద్విజాః"(1-3-26)

"సత్త్వనిధేః = అనిరుద్ధాత్. ఏతదనిరుద్ధాఖ్యం రూపం నానావిధానామవతారాణాం నిదానం". 'అనిరుద్ధ వ్యూహమూర్తి నానావిధాలైన అవతారాలకు మూలకారణం, బీజభూతు'డని వీరరాఘవీయవ్యాఖ్య.(భాగ)

4. ఈ మూడుమూర్తులకు మూలకందం షాడ్గుణ్యమూర్తి పరవాసుదేవుడు.

"ఛాదయామి జగత్సర్వం భూత్వా సూర్య ఇవాంశుభిః
సర్వభూతాధివాసశ్చ వాసుదేవస్తతః స్మృతః॥"

సూర్యుడు తన కిరణాలచేత సర్వజగత్తును కప్పివేసేరీతిగా ప్రపంచమంతా ఆవరిస్తున్నాను. సర్వభూతాలకు ఉనికి పట్టైన నన్ను వాసుదేవుడంటారని 'వాసుదేవ' శబ్దార్థాన్ని విశదం చేసింది భారతం.

"వాసుదేవః సంకర్షణః ప్రద్యుమ్నః పురుషః స్వయమ్।
అనిరుద్ధ ఇతి బ్రహ్మన్, మూర్తి వ్యూహోఽభిధీయతే॥"(భాగ.12 స్కం.)

శ్రీశంకర భగవత్పాదులు 'వి.స.భాష్యం'లో "చతుర్వ్యూహః" అనేచోట

"వ్యూహాత్మానం చతుర్ధా వై వాసుదేవాదిమూర్తిభిః
సృష్ట్యాదీన్ ప్రకరోత్యేష విశ్రుతాత్మా జనార్దనః॥ ఇతి వ్యాసవచనాత్ చతుర్వ్యూహః"

వ్యాసుని మాటనుబట్టి, భగవంతుడు వాసుదేవాది మూర్తులతో చతుర్విధవ్యూహాలను పొంది సృష్ట్యాది కార్యాలను నిర్వహిస్తాడు అనడం గమనీయం.

శ్రీకృష్ణుడే సర్వకారణకారుడని 'బ్రహ్మసంహిత పేర్కొన్నది.

'ఈశ్వరః పరమః కృష్ణః సచ్చిదానందవిగ్రహః।
అనాది రాదిగోవిందః సర్వకారణకారణమ్॥"

"బ్రహ్మణ్యో దేవకీపుత్రో బ్రహ్మణ్యో మధుసూదనః-"

'అథర్వవేదశిఖ' శ్రీకృష్ణుడే 'పరబ్రహ్మ' అని స్పష్టపరచింది.

"ఓ మిత్యేకాక్షరం బ్రహ్మ" - (భ.గీ.8-13) అనే చోట "తాత్పర్యచంద్రిక" లో

"త్రిరాత్మా త్రిస్స్వభావశ్చ తథా త్రివ్యూహ ఏవ చ।
పాంచరాత్రే తథా హ్యేషః భగవద్వాచకః స్మృతః॥"

సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధరూప భగవద్వ్యూహత్రయం అ,ఉ,మ అనే మూడక్షరాలు కలిగిన ఓంకారంవలె, భగవద్వాచకమైనట్లు వివరింపబడింది.

రథంమీదనూ, నీళ్ళల్లోనూ, దర్శన మిచ్చిన బలరామకృష్ణులను

"ఓం నమో వాసుదేవాయ నమః సంకర్షణాయ చ।

ప్రద్యుమ్నాయ నమస్తుభ్య మనిరుద్ధాయ తే నమః॥"

అని అక్రూరుడు స్తుతించాడు.

బలరాముడు అనంతుడు, హలాయుధుడు, సునంద అనే ముసలాన్ని - రోకలిని - ఆయుధంగా ధరించేవాడు, తాలాంకుడు, గదా విద్యావిశారదుడు. నీలాంబరుడు, ఆయన స్వరూపగుణలీలాదులు లోకమర్యాదచే విలక్షణమైనవి.

ధేనుకముష్టికాద్యసురులన్ మర్దించినవాడు బలరాముడు.

గోపాలురు గోవులను మేపుతూ, తాళవనంలో తాటిపండ్లను తెంపుతుంటే, ఆపండ్లు రాలిన చప్పుడు విని వచ్చిన, గర్దభాకారంలో ఉన్న, ధేనుకుడనే రాక్షసుడు బలరామునిరొమ్ముమీద తన్నినాడు. బలరాముడు ఆరెండుకాళ్ళను బట్టి గిరగిర త్రిప్పి తాటి చెట్టుకు విసరికొట్టి చంపాడు.

ప్రలంబుడనే రాక్షసుడు గోపవేషంతో వచ్చాడు. జంటలు జంటలుగా పరుగెత్తే పందెంలో పాల్గొన్నాడు. ఓడినవాడు గెల్చినవాణ్ని భుజాలమీద ఎక్కించుకొని భాండీరవటవృక్షానికి చేరే లక్ష్యంగా ఆడే ఆట ఇది. శ్రీదాముడు శ్రీకృష్ణుణ్ని ఎక్కించుకొన్నాడు. ప్రలంబుడు బలరాముణ్ని ఎక్కించుకొని ఆకాశానికెగిరి అగ్ని పర్వతాకారుడయ్యాడు. రాక్షసుడని గ్రహించిన బలభద్రుడు ప్రలంబుని తలమీద పిడికిలితో గ్రుద్ది చంపాడు.

శ్రీకృష్ణుడు మల్లయుద్ధంలో చాణూరుణ్ని చావగొడ్తే, బలరాముడు ముష్టికుడనే రాక్షసమల్లుణ్ని తలపైన, రొమ్ముమీద మోకాటితో పొడిచి, ఎత్తి, నేలకు విసరి కొట్టి చంపాడు. శ్రీకృష్ణుడు కంసుని జుట్టు పట్టి ఈడ్చి ప్రాణం తీస్తే, వాని తమ్ముడైన సుమాలిప్రాణాలను బలరాముడు తోడేశాడు. రుక్మి అనే వ్యక్తి బలరామునితో జూదమాడి ఓడిపోయినప్పటికీ 'నేనే గెల్చాను' అని వాదించగా, వాని మిత్రులు పండ్లిగిలించి హేళనగా నవ్వినప్పుడు, బలరాముడు పాచికలతో రుక్మిని కొట్టి చంపాడు. ద్వివిదుడనే వానరుడు నరకాసురుని మిత్రుడు. పదివేల ఏనుగులబలంగలవాడు. రైవతక పర్వతంమీద విహరిస్తున్న బలరాముని హలాన్ని, ముసలాన్ని లాగుకొని తిరస్కరిస్తున్న ద్వివిదుని ఆయువుపట్టుమీద గ్రుద్ది మట్టి కరిపించాడు.

జాంబవతీ పుత్రుడైన సాంబుడు సుయోధనుని పుత్రిక యైన లక్ష్మణను వరించి హరించాడు. కౌరవులు దారిలో సాంబుణ్ని బంధించి తీసుకొనిపోయారు. బలరాముడు ఒక్కడే వెళ్లి 'ఉగ్రసేనుని ఆజ్ఞాప్రకారం సాంబుణ్ని విడిచి పెట్టం'డన్నాడు. రాజ్యార్హత లేని యాదవులు కౌరవులను ఆజ్ఞాపించడమా!! అని అధిక్షేపించారు. క్రుద్ధుడైన హలాయుధుడు 'కౌరవులతో పాటు హస్తినాపురిని గంగలో కలుపుతా' నంటూ ఒక్క పెట్టున ఆపురికోటపునాదిలోకి సీరాన్ని దించాడు. నగరం దొల్లింది.

"అద్యాప్యాఘూర్ణితాకారం లక్ష్యతే తత్పురం ద్విజ।
ఏష ప్రభావో రామస్య బలశౌర్యోపలక్షణః॥ (వి.పు.5-35-37)

ఈనాటికీ గంగవైపు డొల్లినట్లు కనబడే హస్తినాపురం (ఢిల్లీ) బలరాముని అభీలశౌర్యాన్ని గుర్తుకు తెస్తుంది.

సూర్యవంశపు రాజైన శర్యాతికి ఆనర్తుడు, ఆనర్తుని పుత్రుడు రైవతుడు, ఆరైవతుని పుత్రిక రేవతి. రైవతుడు తన పుత్రికకు తగిన మగడెవ్వడో చెప్పుమని బ్రహ్మదేవుణ్ని అడిగాడు.

"దేవదేవుండు హరి బలదేవుఁడనఁగ, భూమి భారంబు మాన్పంగఁబుట్టినాఁడు.
సకల భూతాత్మకుఁడు నిజాంశంబుతోడ, యువతిమణి నిమ్ము జనమణికున్న తాత్మ" (ఆం.భాగ.9-3-73) అని బ్రహ్మ చెప్పాడు.

'ఆవనజ గర్భుపంపున' రైవతుడనేరాజు, తాను నీరధిలో నిర్మించిన కుశస్థలి అనే నగరానికి వచ్చి, బలభద్రునికి రేవతిని ఇచ్చాడు. కాబట్టి బలరాముడు రేవతీ రమణుడు. అతడు కామపాలుడు.

శృంగారక్రీడలో రేవతీ దేవి ముఖపద్మాన్ని అలంకరించే తుమ్మెదయో అన్నట్లు శోభించేవాడు బలరామమూర్తి.

సతీపతుల సమాగమాన్ని ప్రకృతిసంపదయైన పద్మభృంగరూపసన్నివేశంగా వర్ణించడం రసౌచిత్యం.

రేవతీవదనం ఒక కంజాతంగా ఆరోపింపబడింది. 'కంజాతం' అంటె నీట పుట్టిన కమలం. సుఖాన్ని కలిగించేది.

రేవతి - 'రేవృప్లవగతౌ'. అటూ, ఇటూ కదలుతూ తేలి యాడడమని అర్థం. 'అంతం'అంటే దగ్గర, లోపల. 'భృంగం' అంటే నలుపును భరించే తుమ్మెద. వదనం ఉపమేయం. కంజాతం ఉపమానం. బలరాముడు ఉపమేయం. భృంగం ఉపమానం. తెల్లని దేహంమీద నల్లని వస్త్రాలను ధరించేవాడు కాబట్టి నీలాంబరుడు భృంగంగా ఆరోపింపబడినాడు. ఇది రూపకాలంకారం.

ఉపమానోపమేయాలను రెంటిని వ్యవహరించి అభేదాన్ని చెప్పేది ఆరోపపద్ధతి. ఉపమేయాన్ని చెప్పక, ఉపమానంతోనే ఆఉపమేయాన్ని వ్యవహరించడం అధ్యవసాయపద్ధతి.

'అనన్' - సంభావనావాచకం. 'భృంగంబనన్' అని వర్ణించడవవల్ల ఇది ఉత్ప్రేక్షాలంకారం. ఉపమానం యొక్క గుణక్రియల సంబంధంచేత ఉపమేయం ఉపమానంగా తర్కింపబడింది. తాదాత్మ్యం సంభావితం.

వికసించిన కమలంయొక్క పరిమళంచేత ఆకర్షితమైన గండుతుమ్మెద, దాని సౌందర్యసౌకుమార్యాలకు ముగ్ధయై, ఆకమలంమీద వ్రాలీ, వ్రాలనట్లు పరిభ్రమిస్తూ, స్నిగ్ధహృదయంతో మకరందాన్ని ఆస్వాదించి ఆనందించడం అనుభవైకవేద్యం కదా!

కాబట్టి రూపకాలంకారానుప్రాణితమైన ఉత్ప్రేక్షాలంకారమున్న పద్యమిది, బలమూ రూపసంపదా కలవాడు బలరాముడని విదితం.

'బలం' ద్వితీయపాదమందు 'రమణం' తృతీయపాదమందు వర్ణించాడు కవి. వీరశృంగారరసాలను సముచితంగా ఆవిష్కరించిన అవతారమూర్తిగా బలరామమూర్తిని వీక్షించడం కైతకైవు.

**మ. పురము ల్మూడును మూడులోకములు నే ప్రొద్దున్విచారింపఁద**
**త్పురనారీమహి మోన్నతుల్ సెడుటకై బుద్ధుండ వై బుద్ధితో**
**వరబోధద్రుమసేవఁ జేయుటకునై వారిం బ్రబోధించి య**
**ప్పురముల్ గెల్చిన మీ యుపాయము జగత్పూజ్యంబు నారాయణా॥ 19.**

అర్థం: ఓ నారాయణా! మూడులోకములు; ఏ ప్రొద్దున్ = ఎంతోకాలంనుంచి; పురముల్ మూడును = త్రిపురాలును; తత్ పురనారీమహిమ+ఉన్నతుల్=ఆ త్రిపురా(సురు)ల స్త్రీల పాతివ్రత్యం యొక్క ప్రభావాలును; చెడుటకై = నశించేకోసం; విచారింపన్ = ఆలోచింపగ; బుద్ధుండవై; బుద్ధితో = ప్రజ్ఞతో; వరబోధద్రుమసేవన్ చేయుటకునై = ఉత్తమజ్ఞానమనే బోధవృక్షాన్ని సేవించడానికి; వారిన్ ప్రబోధించి = వారికి ఉపదేశించి; ఆపురముల్ గెల్చిన = ఆత్రిపురా(సురు)లను జయించినట్టి; మీ, ఉపాయము = మీపథకం, యుక్తి; జగత్ పూజ్యంబు = లోకమాన్యమైనది.

తా: ఓ నారాయణా! మూడుపట్టణాలకు అధిపతులైన త్రిపురాసురులూ, వారినారీమణులూ అధిక ప్రభావంకలవారు. ఆస్త్రీల పాతివ్రత్యప్రభావం చెడిపోవడానికి లోకాలన్ని చాలాకాలం ఆలోచించాయి. తత్ఫలితంగా, లోకక్షేమంకోసం నీవు బుద్ధునిగా అవతరించి, ఆత్రిపురవాసులకు 'చక్కగా బోధవృక్షాన్ని సేవించి తరించండి' అని జ్ఞానోపదేశం చేశావు. వారు నీ బోధ వృక్షాన్ని అక్షరాలా సేవించి నశించారు.

త్రిపురాలకు అపాయాన్ని తలపెట్టిన నీ ఉపాయంవల్ల లోకం హర్షించింది. నీయుక్తి స్తుతిపాత్రమయింది.

**వ్యాఖ్య: బుద్ధుని బోధ జగత్పూజ్యమని ప్రశంసితం.**

త్రిపురాసురసంహారవృత్తాంతం వేదంలోనూ ఉంది.

"తేషామసురాణాం తిస్రః పుర ఆసన్నయ స్మయ్యవమాథ

రజతాథ హరిణీ తా దేవా జేతుం నాతిశక్నువన్ --

--తిస్రః పురోభిత్వైభ్యో లోకేభ్యో ఽసురాన్ ప్రాణుదత".

(తై-సం.6కాం2 ప్ర.3.అనువాకం)

రాక్షసులకు పృథ్వీలోకంలో ఇనుముతోనూ, అంతరిక్షలోకంలో వెండితోనూ, ద్యులోకంలో బంగారంతోనూ దుర్గరూపంగా నిర్మింపబడిన మూడు పెద్ద పట్టణాలున్నాయి. అవి కామగమనం కలవి. దేవాసురయుద్ధంలో త్రిపురాలను దేవతలు జయింపజాలలేదు. దేవతలందరు కలిసి తమ తేజస్సుతో ఒక బాణాన్ని సిద్ధం చేశారు. ఆబాణం యొక్క ముఖమందు అగ్నిదేవుడు, శరీరమందు సోమదేవుడు, అలుగున విష్ణుమూర్తి ఆవేశించారు. ఆక్రూరబాణాన్ని నిర్దయుడైన రుద్రుడు ప్రయోగించి త్రిపురాలను భస్మంచేశాడు అని సంక్షిప్తార్థం.

యుగభేదంచేత పురాణాల్లో వేర్వేరుగా వర్ణింపబడిన ఈ విషయంలో విరోధపరిహారాలను గమనించాలి.

తారకాసురునికుమారులైన విద్యున్మాలి, తారకాక్షుడు, కమలాక్షుడనే ముగ్గురు అధిపతులు ఈ మూడు పట్టణాలతోపాటు సంచరించేవారు. ఆవి వ్రాలినచోట నగరాలన్ని నేల మట్ట మవుతుండేవి. రుద్రుడు సర్వదేవతాకమైన బాణాన్ని ప్రయోగించి త్రిపురాలను కాల్చివేశాడని మహాభారత కథ.

యథా హి చోరస్స తథా హి బుద్ధ స్తథాగతం నాస్తిక మత్ర విద్ధి ।

తస్మాద్ధి యశ్శంక్యతమః ప్రజానాం, న నాస్తికే నాభిముఖో బుధః స్యాత్॥"

(రామా.అయో-10-9-34)

'చోరుని వంటివాడు బుద్ధుడు.అతడు నాస్తికుడు. ప్రజలకు శంకింపదగినవాడు. కాబట్టి ధీమంతుడు నాస్తికునితో ప్రసంగించరాదు' అని రాముడు జాబాలితో అన్నాడు.

రామాయణంలో బుద్ధుని ఉదంతం ఉంది కాబట్టి, బుద్ధావతారుడువేరు, గౌతమ బుద్ధుడు వేరు, అంటారు కొందరు. రామునికంటె ముందు బుద్ధావతారం అసంగతమైనందువల్లనూ, ఛందోభేదమున్నందువల్లనూ ఈ శ్లోకం ప్రక్షిప్త మంటారు.

"తతః కలౌ సంప్రవృత్తే సంమోహాయ సురద్విషామ్ ।
బుద్ధో నామ్నా జినసుతః కీకటేషు భవిష్యతి॥" (భాగవతం)

కలియుగం వచ్చినప్పుడు రాక్షసులను సంమోహనంచేయడానికి కీకటదేశ మందు నారాయణుడు జనుడనే వ్యక్తికి పుత్రునిగా అవతరించి, బుద్ధుడనే పేరుతో వ్యవహరించగలడు.

"కలియుగాద్యవసరంబున రాక్షస సంమోహనంబు కొరకు (మధ్యగయా ప్రదేశంబున) కీకట దేశంబున జినసుతుండై బుద్ధనామధేయంబునం దేజరిల్లు" నని భవిష్యదవతారంగా చెప్పబడింది. (ఆంధ్రభాగ).

'శ్రీ వేంకటేశ్వర సుప్రభాతం'లో "మీనాకృతేకమఠకోలనృషింహవర్ణిన్" అనే దశావతార వర్ణనగల శ్లోకంలో 'బౌద్ధావతారం' లేదు.

శ్రీవేదాన్తదేశికులవారి 'దశావతారస్తోత్రం' లోనూ, 'దయాశతకం'లోనూ తొమ్మిదవ అవతారంగా శ్రీకృష్ణావతారమే వర్ణింపబడింది.

"వనజౌ వనజౌ ఖర్వః త్రిరామీ సకృపోఽకృపః।
అవతారా దశైవైతే కృష్ణస్తు భగవాన్ స్వయమ్॥"

అనే దశావతార శ్లోకం 'సకృపః, అకృపః' అంటే దయాళువు బుద్ధుడు, నిర్దయుడు కల్కి అని స్పష్టపరచింది.

గీత గోవింద కర్త యైన జయదేవుని చేత 'కారుణ్యామాతన్వతే' అని బుద్ధావతారం సుశ్లోకితం.

'అగ్ని పురాణం' శాంతాత్ముడు, లంబకర్ణుడు, గౌరాంగుడు, అంబరావృతుడు, ఊర్ధ్వ పద్మస్థితుడు, వరదాభయదాయకుడని బుద్ధమూర్తిని వర్ణించింది.

మాయాదేవీశుద్ధోదనుల పుత్రుడైన గౌతమ సిద్ధార్థుడే బుద్ధావతారుడని లోకం అంగీకరించడం గమనార్హం.

బ్రహ్మాండపురాణం 'బుద్ధుడు జినసుతుడూ కాడు' అంటుంది.

"మోహనార్థం దానవానాం బాలరూపీ పథి స్థితః।
పుత్రం తం కల్పయామాస మూఢబుద్ధి ర్జినః స్వయమ్॥"

రాక్షసులను సంమోహనం చేయడం కోసం త్రోవలో హరి బాలరూపుడై యుండగా మూఢబుద్ధిగల జినుడు అతనిని పుత్రునిగా కల్పించుకొన్నాడట.

"తతః సంమోహయామాస జినాద్యా నసురాంశకాన్।
భగవాన్ వాగ్భి రుగ్రాభి రహింసావాదిభిర్హరిః॥

'అహింసా పరమో ధర్మః' - "మాహింస్యాత్సర్వా భూతాని" లాంటి వాక్యాలతో హరి, పశువులను హింసించే యాగాలను నిరసిస్తూ జినుడు మొదలైన రాక్షసాంశగల వ్యక్తులను మోహింపజేశాడని బ్రహ్మాండపురాణం విశదపరచింది.

రాక్షసులు తపస్సు, యజ్ఞయాగాదిక్రతువులూ చేసేవారు. వరాలను పొంది దౌర్జన్యంతో సాధుసత్పురుషులను హింసించేవారు. జిహ్వారుచి మెండై, యాగాలపేరుతో జీవహింస చేస్తున్నప్పుడు భగవానుడు కరుణావరుణాలయుడైన బుద్ధమూర్తిగా అవతరించి వేదబాహ్యావాక్యాలతో వాదించి, సమాజాన్ని సంస్కరించాడు.

రాక్షసుల ఆగడాలవల్ల లోకాలు తల్లడిల్లుతుండేవి. త్రిపురాసురులను, వారి భార్యలు పాతివ్రత్య మహిమవల్ల, జయింపనెవ్వరికీశక్యం కాకపోయేది. పత్నులవ్రతం భంగమయ్యే విధంగా బోధించిన అవతారమే బుద్ధావతారం.

'ద్రుమ' శబ్దం శాఖలుకలది, వృక్షం అని అర్థం. "వృక్షశ్ఛేదనాత్" - ఛేదింప బడేది వృక్షమని వ్యుత్పత్త్యర్థం. బోధద్రుమసేవ చేయడంవల్ల అసురపత్నుల పాతివ్రత్యం పరిచ్ఛిన్నమయింది. తత్ఫలితంగా, త్రిపురాసురులు చస్తేగాని ప్రపంచానికి శాంతి కలుగలేదు. కాబట్టి, ఉపాయంతో త్రిపురాలను గెల్చిన బుద్ధదేవుడు లోకారాధ్యుడయ్యాడు - కూచిపూడి నట్టువలు "రంగుగ పురికాంతలవ్రతములు, భంగపరచు బౌద్ధావతారా" అంటూ నర్తిస్తారు.

**మ. కలిధర్మంబునఁ బాపసంకలితులై గర్వాంధులై తుచ్ఛులై**
**కులశీలంబులు మాని హేయగతులం గ్రొవ్వారు దుష్టాత్మలం**
**బలిగాఁ జేయఁదలంచి ధర్మమెలమింబాలించి నిల్పంగ మీ**
**వలనం గల్క్యవతార మొందఁగల నిన్ వర్ణింతు నారాయణా॥ 20**

అర్థం : ఓ నారాయణా! కలిధర్మంబునన్ = కలియుగ ధర్మంవల్ల; పాపసంకలితులై = పాపకార్యాలతోకూడిన వారై; గర్వ+అంధులై = గర్వం చేత గుడ్డివారై; తుచ్ఛులై = నీచులై; కులశీలంబులు మాని = వంశాచారమర్యాదలను వదలివేసి; హేయగతులన్ = విడువదగిన - అసహ్యమైన నడవడుల చేత; క్రొవ్వారు = మదించే; దుష్ట+ఆత్మలన్ = దుర్జనులను; బలిగాఁ జేయన్ తలంచి = నశింపజేయబూని; ధర్మము, ఎలమిన్, పాలించి = ధర్మాన్ని - పుణ్యకర్మకలాపాన్ని బాగా పోషించి; నిల్పంగ = స్థిరంగా ఉంచునట్లు; మీ వలనన్ = మీ సామర్థ్యంతో; కల్కి+అవతారం, ఒందగల = కల్కి భగవానుడవై ఇకముందు అవతరించగల; నిన్, వర్ణింతును.

తా: ఓనారాయణా! కలియుగ మహిమవల్ల పాపాత్ములై, గర్వాంధులై, నీచులై, కులక్రమాగత ఆచార సంప్రదాయాలను పాటించకుండా దుర్భరమైన నడవడుల

చేత బాగా బలసిన దుష్టాత్ములను నిఖడ్గానికి ఎరగా చేయగలుగుతావు. అధర్మాన్ని రూపు మాపి, మళ్ళీ ధర్మం స్థిరంగా నిల్పడానికి నీ సామర్థ్యం వల్ల 'కల్కి'గా అవతరించగల నిన్ను వర్ణిస్తాను.

**వ్యాఖ్య: కలియుగంలో అవతరించే కల్కి భగవానుని వర్ణన ఇది.**

కల్కి భగవానుని అవతారం ఇంకా రాలేదు. త్రికాలజ్ఞులైన ఋషులు భవిష్యత్కాల విషయాలను పురాణాలలో తెలిపారు. కలిప్రభావంవల్ల ఈయుగంలో చేయవలసిన పనులను చేయక, చేయరాని పనులను చేస్తూ ప్రజలు పాపిష్ఠులవుతారు. ఏలికలూ, ఏలుబడిలో ఉన్న జనులూ, అందరు గర్వాంధులై అవినీతికి, అధర్మానికి పాటుపడుతారు.

నారాయణుడు కల్క్యవతారమందు అశ్వారూఢుడై, కరవాలంతో దుష్టాత్ములను సంహరిస్తాడు. అధర్మాన్ని తొలగించి, ధర్మసంస్థాపన చేస్తాడని భవిష్యత్పురాణకథనం.

"అథాసౌ యుగసంధ్యాయాం దస్యుప్రాయేషు రాజసు।

జనితా విష్ణుయశసో నామ్నా కల్కిర్జగద్గురుః॥" (భాగవతం)

కృతయుగంలో ధర్మం నాలుగుపాళ్ళు, త్రేతాయుగంలో మూడుపాళ్ళు, ద్వాపరయుగంలో రెండుపాళ్ళు, కలియుగంలో ఒక్కపాలే ఉంటుందనేది ఆర్షవాక్యం.

ఈ శ్వేతవరాహకల్పంలో 28వ మహాయుగమిది. ఇక్కడ యుగసంధి అంటే కలియుగానికి చివరిభాగం, కృతయుగానికి ఆరంభకాలం. ఈ మధ్య కాలంలో పాలకులూ, పాలితులూ సామాన్యంగా దొంగలై జీవిస్తారు. అధర్మం విజృంభించే ఈ సందర్భంలో నారాయణుడు 'విష్ణుయశు'డనే వ్యక్తికి పుత్రునిగా అవతరించి 'కల్కి' అనే పేరుతో సమాజసంక్షేమంకోసం వ్యవహరిస్తాడు. తత్పర్యవసానంగా, సామాజికులు ఆదర్శజీవనులై, విశ్వశ్రేయోభిలాషులై చారిత్రక పురుషులవుతారు అని పురాణాలు ప్రకటిస్తున్నాయి.

"హరే రామ హరే రామ రామ రామ హరే హరే।

హరే కృష్ణ హరే కృష్ణ కృష్ణ కృష్ణ హరే హరే॥ (కలిసంతరణోపనిషత్)

విభవావతీర్ణులైన రామకృష్ణనామాలు (4+4=8), పరతత్త్వమైన హరి నామాలు (8) కలిసి యున్న ఈ షోడశనామమంత్రాన్ని శుచి ర్భూతులై, ఏకాగ్రచిత్తులై నిత్యం జపించేవారికి కలికల్మషం నశిస్తుందని హిరణ్యగర్భుడు తన పుత్రుడైన నారదమహర్షికి ఉపదేశించాడు.

దశావతారాలే కాక, భగవంతుని అనేకావతారాల ప్రశంస పురాణాల్లోనేకాదు, వేదాలలో కూడా స్పష్టంగా ఉంది.

# దివ్యరూపదశకం

**మ. ఇరవొందన్ సచరాచరప్రతతుల న్నెన్నంగ శక్యంబు కా**
**కరయన్ పద్మభవాండభాండచయము న్నారంగ మీకుక్షిలో**
**నరుదార న్నుదయించు ( బెంచు నడ(గున్న న్నారికేళోద్భవాం**
**తరవాఃపూరముచందమొంది యెపుడున్ దైత్యారి నారాయణా ॥ 21**

అర్థం: దైత్యారి = అసురులకు శత్రువైన; ఓ నారాయణా! పద్మభవ+అండ భాండ చయమున్ = బ్రహ్మాండకటాహసముదాయాన్ని; ఇరవు+ఒందన్ = స్థిరంగా ఉంచుటకు; సచరాచరప్రతతులన్ = చేతనాచేతనాలతో కూడిన ద్రవ్యరాశులను; ఎన్నంగ = లెక్కింప; ఊహింప; శక్యంబు కాక = సామర్థ్యం చాలక; అరయన్ = విచారింపగా; ఆరంగన్ = హితంగా; ఎపుడున్ = ఎల్లప్పుడు; ఆనారికేళ+ఉద్భవ+అంతర వాఃపూరము, చందము+ఒంది = ప్రసిద్ధమైన టెంకాయలో ఉదయించే లోపలి జలపూరం రీతిగా; అరుదారన్ = అద్భుతంగా; అప్పుడప్పుడు; మీకుక్షిలో = మీకడుపులో; ఉదయించున్ =ఉద్భవిస్తుంది; పెంచున్ = పెరుగుతుంది; కాపాడుతుంది; అడ(గున్=ఇమిడిపోతుంది.

తా: ఓ నారాయణా! బ్రహ్మాండమంతా స్థావరజంగమాత్మకమే. దానిలోని చరాచరవస్తుసముదాయాలను లెక్కింపశక్యంకాదు. అది స్థిరంగా ఉండదు. కొబ్బరికాయలో నీరు పుట్టి, పెరిగి, అడగారినట్లు మీ బొజ్జలో బ్రహ్మాండం ఉద్భవిస్తుంది, వృద్ధి చెందుతుంది. లీనమవుతుంది.

**వ్యాఖ్య: నారాయణుని దివ్యరూప వర్ణన.**

చరాచరపదార్థాలతో నిండి, పంచాశత్కోటి విస్తీర్ణమైనది బ్రహ్మాండం.

1. చర పదార్థమంటే చేతనకోటి. జీవాత్మలు, బద్ధులు, ముక్తులు, నిత్యులు అని జీవాత్మలు మూడువిధాలు. అనాదికర్మబంధంవల్ల సంసారంలో పరిభ్రమించే వారు బద్ధులు. మోక్షోపాయాన్ని అనుష్ఠించి, మోక్షం పొందిన వారు ముక్తులు. కర్మబంధంలేకుండా, సంసారగంధశూన్యులై, వైకుంఠంలో భగవంతుణ్ణి సేవిస్తూ, ఆనందానుభవపరీవాహంలో మగ్నులైన అనంతగరుడవిష్వక్సేనాదులు నిత్యాత్మలు.

జీవుడు అణువుగానూ, జ్ఞానానందామలస్వరూపుడుగానూ ఉంటాడు. శరీరంకంటె భిన్నుడు. ఉత్పత్తివినాశరహితుడు.

"ఏషోఽణురాత్మా చేతసా వేదితవ్యః" (ముం.ఉ.) అన్నట్లు జీవాణుత్వం స్వాభావికం.

2. అచర పదార్థం అంటే అచేతనం. జ్ఞానంలేని వస్తువు. దీనిచేత ఏర్పడే ఫలాన్ని చేతనుడనుభవిస్తాడు. అజ్ఞానియైన జీవుడు ప్రాకృతిక ఫలాన్ని ఆసక్తితో అనుభవిస్తాడు.

జ్ఞానియైన జీవుడు దాన్ని అనుభవించి, ఇది నిస్సారం, క్షణభంగురమని గ్రహించి త్యాగం చేస్తాడన్నది శ్వేతాశ్వతరోపనిషత్తు.

"అజో హ్యేకో జుషమాణోఽనుశేతే
జహాత్యేనాం భుక్తభోగా మజోన్యః॥"

అచర పదార్థం మూడు విధాలు 1. త్రిగుణం 2. కాలం 3. శుద్ధసత్త్వం.

1. త్రిగుణం : సత్త్వ రజస్తమోగుణాలు కలిగిన ప్రకృతి సతతపరిణామంకలది. ప్రకృతి, మూడుగుణాలు ఎక్కువ తక్కువగా ఉన్నప్పుడు, మహదహంకారాది అనేక తత్త్వాలుగా మారుతుంది. ప్రపంచంలో దేహాద్యచేతనపదార్థాలన్ని పంచభూతాలతో కూడినవే. సత్వరజస్తమోగుణాలు మూడు సమానంగా ఉంటే ప్రళయమేర్పడుతుంది.

2. కాలం : జడవస్తువు. అయినా విభువు, అంటే విశ్వమంతా వ్యాపించి ఉంటుంది. కాలానికి సత్వరజస్తమోగుణాలు లేవు. నిమిషాలు మొదల్కొని యుగాంతం వరకు కాలవిభాగాలున్నాయి. ప్రపంచంలో కలిగే పరిణామాలు - మార్పులు - కాలాధీనాలే. భూతభవిష్యద్వర్తమానవ్యవహారాలన్నిటికి కారణం కాలమే. భగవత్సంకల్పాధీనపరిమాణం తప్ప, కాలపరిణామం వైకుంఠంలో లేదు.

3. శుద్ధసత్వం : రజస్తమోగుణాలు లేని ఒకే ఒక శుద్ధ సత్వగుణానికి ఆధారమైన ఈ ద్రవ్యం వైకుంఠంలోనే ఉంటుంది. భగవంతుడు ఈ లోకంలో అవతరించినప్పుడు ఆయన రూపం శుద్ధసత్వమయమే. వైకుంఠంలోని చట్లు, చెట్లు, గోపురాలు, నూపురాలు సకల వస్తువులూ శుద్ధ సత్వమయాలై ప్రకాశిస్తుంటాయి. పరబ్రహ్మ సృష్టి స్థితిలయాలనే మూడు దశల్లోను చరాచరవస్తువులతో కూడి ఉంటాడు. కాబట్టి, చిదచిద్విశిష్టుడు నారాయణుడు. చరాచరమయమైన బ్రహ్మాండాన్ని నియమించేవాడు కాబట్టి నారాయణుడు అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుడు. ఈ బ్రహ్మాండభాండచయం స్థిరంగా మార్పు లేకుండా ఉండదు. ఇది సూక్ష్మ రూపంలోనో, స్థూలరూపంలోనో ఏదో ఒక రూపంలో ఎప్పుడూ ఉండనే ఉంటుందనే మాట సత్యం.

సర్వభూతాలకు షడ్భావవికారాలు ఉంటాయి.

1. ఉండడం 2. పుట్టడం 3. పెరగడం 4. మారడం 5. తరుగడం 6. నశించడం అంటే అదృశ్యమవడం. ఇది సృష్టివైచిత్రి.

అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రళయస్తథా"- (భ.గీ. 7.6)

"జంగమాజంగమం చేదం జగన్నారాయణోద్భవమ్" (భారతం)

సూక్ష్మరూపంగా నిక్షిప్తమైన బ్రహ్మాండం నారాయణుని కుక్షిలో నుంచి క్రమంగా ఉద్భవిస్తుంది, వృద్ధి పొందుతుంది. తిరిగి ఆయన కుక్షిలోనే క్రమంగా లీనమవుతుంది.

ఇది చక్షురింద్రియగోచరమయ్యేది కాదు. ఎంతో ఎత్తుగా ఉన్న కొబ్బరి చెట్టుమీది బొండాలోనికి నీరెలాచేరుతుందో? ఆ ప్రక్రియ కంటికి కనబడదుకదా! నీటితో నిండిన కాయలోని నీరు క్రమంగా అణగారి, కొబ్బరి ఘనంగా ఏర్పడుతుంది.

"నారికేళఫలస్యాంతర్బీజం బాహ్యదళైరివ" (వి.పు.1-2-60) చిప్ప, జుట్టుతో దట్టంగా కప్పబడిన కొబ్బరి బీజంతో, ప్రాకృతిక సప్తావరణాలతో వ్యాపించిన బ్రహ్మాండాన్ని పోల్చాడు శ్రీపరాశరమహర్షి.

కొబ్బరి చెట్టుకు 'నాళికేరం' అని పేరు. నీటికి 'తలతన్యత' అంటే ప్రదేశంలో ప్రాకే గుణం ఉంది. చెట్టుకు వేర్లు మొదల్కొని కాండంలోనూ, కొమ్మల్లోనూ, రెమ్మల్లోనూ, కాయవరకు సన్నని రంధ్రాలు ఉండే నాళికలుంటాయి. నేలలోని నీరు 'తలతన్యత' వల్ల చెట్టువేర్లను పట్టుకొని నాళికల ద్వారా ఎత్తుకు ఎగబ్రాకి కాయలోకి చేరుతుంది.

ఈ ప్రక్రియ చెట్లకన్నిటికీ సామాన్యమే. అయినా నేలలో ఉండే నీరు, నాళికీయత వల్ల ఎత్తులో ఉన్న కాయలోనూ కనబడుతున్న కారణంగా టెంకాయను 'నాళికేరం' అంటారు. ఈ పదం (నాళికేరం) వ్యత్యస్తమై 'నారికేళం' గా రూపొందింది.

ఈ పద్యంలో ఉపమాలంకారం భాసిస్తుంది.

నారాయణుని కుక్షిని నారికేళంతోనూ, దానిలో ఉద్భవించే భాండచయం నారికేళంలోని వాఃపూరంతోనూ పోల్చబడింది.

ఉపమేయం 'కుక్షి'. ఉపమానం 'నారికేళం'.

'భాండచయం' ఉపమేయం 'వాఃపూరం' ఉపమానం.

'చందం' ఉపమావాచకం. 'ఉదయించు' సాధారణధర్మం.

ఉపమానోపమేయాలకు మనోజ్ఞంగా సాదృశ్యాన్ని వర్ణిస్తే ఉపమాలంకారమవుతుంది. తెలియని విషయాన్ని ప్రసిద్ధమైన విషయంతో పోల్చి బోధించడం కవి(తా) చమత్కృతి.

**మ. దళదిందీవరనీలనీరదసముద్యద్భాసితాకార, శ్రీ**
**లలనాకౌస్తుభచారువక్ష విబుధశ్లాఘోద్భవస్థానకో**
**మలనాభీచరణారవిందజనితామ్నాయాద్యగంగా! లస**
**జ్జలజాతాయతనేత్ర నిన్ను మదిలోఁ జర్చింతు నారాయణా॥ 22**

అర్థం = దళత్ - ఆకార! దళత్ = వికసిస్తున్న; ఇందీవర = నల్లకలువపూవు వలె; నీలనీరద = నల్లని మేఘం వలె; సముద్యత్ = పైకి వ్యాపిస్తూ; భాసిత = ప్రకాశించిన; ఆకార = రూపం కలవాడా! శ్రీలలనా -వక్ష! శ్రీ లలనా = లక్ష్మి అనే స్త్రీచేత; కౌస్తుభ

= కౌస్తుభమణిచేత; చారు = అందమైన; వక్ష = ఉరస్సు కలవాడా! విబుధశ్లాఘా+ఉద్భవస్థాన = దేవతలచే కొనియాడబడే కారణ దేహంకలవాడా! కోమల-గంగా! కోమల = మృదువైన; నాభీ = పొక్కిలి నుంచి; చరణ+అరవింద = పాదకమలం నుంచి; జనిత = ఉదయించిన; ఆమ్నాయ+ఆద్య = వేదాభ్యాసం చేసిన మొదటి వాడైన బ్రహ్మ, గంగా = గంగకలవాడా! లసత్-నేత్ర! లసత్ = ప్రకాశిస్తున్న; జలజాత = కమలాలవలె; ఆయత = విశాలమైన; నేత్ర = కన్నులు కలవాడా! ఓ నారాయణా! మదిలో = హృదయంలో; నిన్ను చర్చింతును.

తా: నారాయణుడు ఇందీవరదళశ్యాముడు. మేఘవర్ణశరీరుడు. లక్ష్మీదేవి, కౌస్తుభమణికలిగిన రమణీయోరస్కుడు. ప్రపంచోద్భవానికి కారణమైనదని దేవతలు కొనియాడే రూపం కలవాడు. ప్రప్రథమంగా చతుర్వేదాల నభ్యసించిన చతుర్ముఖ బ్రహ్మ జనించిన కోమల పద్మనాభుడు. గంగజనించిన పాదపద్ముడు, కమలాయతనేత్రుడు. దివ్యావయవసౌందర్యం గల నారాయణమూర్తిని ధ్యానించే సహృదయుడీ కవి.

**వ్యాఖ్య : నారాయణుని అంగ ప్రత్యంగవర్ణన.**

సౌందర్యవర్ణనం రెండు రకాలు. ఒకటి ఏయంగానికి ఆయంగాన్నే వర్ణించడం. రెండవది సర్వాంగ సౌందర్యాన్ని సాముదాయికంగా వర్ణించడం. అంగసౌందర్య వర్ణనం అంగిసౌందర్యద్యోతకంగానూ, అంగిసౌందర్యవర్ణనం అంగసౌందర్యోద్దీపకంగా, పదసముదాయాన్ని ఉపయోగించి కవులు వర్ణిస్తారు. అంగాంగిభావసంకలనమందే సౌందర్యముంటుంది.

ఇక్కడ, కవికల్పనాప్రభావం ప్రథమచరణంలోనే భావుకుల హృదయాన్ని రంజింప జేస్తుంది. సర్వేశ్వరుని అభిరామరూపాన్ని ఇందీవరం, నీలనీరదం ప్రపంచానికి స్ఫురింపజేయడం స్పృహణీయం. ప్రాకృతికశోభగల ఆ రెండు ఉపమానవస్తువుల సౌందర్యప్రయోజనం భోగం కాలేదు. సర్వేశ్వరునికే సమర్పితమయింది.

దళదిందీవరం - వికసిస్తున్న నల్లకలువ, నిత్యనూత్న వికాసాన్ని, సౌరభ సౌకుమార్య సౌందర్యాలను స్ఫురింపజేస్తుంది. నీలనీరదం అంతస్సారాన్నీ ప్రకటిస్తుంది. బలవంతుని అధికారాన్ని అందరు శిరసా వహిస్తారు కదా! నీటితో నిండిన మేఘాన్ని పెనుగాలికూడ ఏమి చేయజాలదు. "అంతస్సారం ఘన! తులయితుం నానిలః శక్ష్యతి త్వాం" (మేఘ సందేశం). పూర్ణత్వం వల్ల గౌరవమూ సిద్ధిస్తుంది. అంతేకాదు. నీలనీరదం అనంత సౌందర్యవ్యంజకం కదా! "యేన శ్యామం వపురతితరాం కాంతిమాపత్స్యతే తే" అన్నాడు కాళిదాసు. ఘనశ్యాముడు సమస్తసంతప్తసృష్టికి శాంతినీ చేకూరుస్తాడు. కాబట్టి "సంతప్తానాం త్వమసి శరణం" అని ప్రస్తుతించడం పురుషార్థసాధకం.

తరులు, ఓషధులు ఊర్జంగా పెరిగి వీర్యవంతమవడానికీ, జంతుజాలం ఆనందోద్రేకాన్ని చెందడానికీ మొగులువన్నెయే కారణం. ఇలాంటివన్నెకాడు నారాయణుడు.

"నీలతోయదమధ్యస్థా విద్యుల్లేఖేవ భాస్వరా" అన్నట్లు నీలమేఘం మధ్యలోని మెరుపులాగా, శ్రీ రామామణి నారాయణుని వక్షఃస్థలంలో శోభిస్తుంది. "లక్ష్మీ విద్యుల్లలితం" (రా.చం.) "లక్ష్మీ విద్యుల్లలిత వపుషం" (హంససందేశం). సువిశాలమైన శ్రియఃపతివక్షఃస్థలం సకలచేతనులకు చైతన్యస్తన్యమిచ్చే లక్ష్మీదేవికి నివాసస్థలం.

"వేదాంతాస్తత్త్వచింతాం మురభిదురసి యత్పాదచిహ్నైస్తరంతి" (శ్రీగు.ర.) ఉపనిషత్తులు పరతత్త్వచింతను, నారాయణుని వక్షఃస్థలమందున్న లక్ష్మీదేవి పాద చిహ్నాలను చూచి విరమించుకొన్నాయట. జీవవర్గానికి చిహ్నమైన కౌస్తుభమణికూడా శోభించే మహోరస్కుడు శ్రీమన్నారాయణుడు.

"ఆత్మాన మస్య జగతో నిర్లేపమగుణామలమ్।
బిభర్తి కౌస్తుభమణిస్వరూపం భగవాన్ హరిః॥"
శ్రీవత్ససంస్థానధరం అనంతేచ సమాశ్రితమ్।
ప్రధానం" (1-22)

చిత్కళాచైతన్యచిహ్నమైన కౌస్తుభమణియే కాక, విచిత్రమైన మూలప్రకృతికి - అచిత్తు అనే తత్త్వానికి సంకేతమైన, ప్రదక్షిణ క్రమంలో ఉండే తెల్లని రోమాలతో కూడిన శ్రీవత్సమనే సుడికూడా నీలనీరదశ్యాముని ఉరఃస్థలమందు రాజిల్లుతుంది అని విష్ణు పురాణం అస్త్రభూషణాధ్యాయంలో విశదీకరిస్తున్నది.

భోక్తా భోగ్యం ప్రేరితారం చ మత్వా (శ్వే.ఉ.) "ప్రధానపురుషేశ్వరః" - (వి.స.నా) అన్నట్లూ భోక్తయైన చేతనుణ్నీ, భోగ్యమైన ప్రకృతినీ, ఈ రెంటినీ స్వతంత్రంగా నిర్వహించే ఈశ్వరత్వాన్నీ, ఒకే చోట ఒకే సమయాన సేవించే విధంగా చారువక్షం వర్ణింపబడింది కదా!

పొక్కిలి పసిబిడ్డడు ఆమ్నాయాద్యుడు. ఆమ్నాయ, "సమామ్నాయశబ్దో వేదే ఏవ రూఢా" అని 'లఘుశబ్దేందుశేఖరం'లో నాగేశభట్టు చెప్పినాడు.

'మ్నా' ధాతువుకు 'అభ్యాసం' అని అర్థం. ఎల్లప్పుడు అభ్యసింపబడేది కాబట్టి వేదానికి 'ఆమ్నాయ' మని పేరు.

"యో వై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై" (శ్రుతి) "తేనే బ్రహ్మహృదాయ ఆదికవయే" (భాగవతం). అనే ప్రమాణానుసారంగా, బ్రహ్మదేవుడు తన తండ్రి నుంచి వేదాలను మొదటనేర్చుకొన్నాడు. కాబట్టి, వేదరాశి "బ్రహ్మవిద్య"గా ప్రఖ్యాతమయింది.

అండాంతర్వర్తియైన దేవమనుష్యాదిసృష్టికంతటికీ కర్తయైన చతుర్ముఖబ్రహ్మను, ప్రతి బ్రహ్మాండమందూ సృష్టించిన పద్మం నాభియందు కలవాడు; పద్మంలాంటి మృదువైన నాభికలవాడు నారాయణుడు.

భవభంగ, ధవళాంగ, కమల సంగ, విమల తరవారి పూరసంభృత తరంగ యైన గంగను ఉద్భవింపజేసిన సుకుమారాంఘ్రిపద్ముడు నారాయణుడు. వికసిస్తున్న కెందామరలలాంటివి ఆయన విశాల నయనాలు. బహుముఖప్రయోజనాలు గల ఈ దివ్యావయవాల పొలకువలే పృథగ్భావనగా పద్యంలో వర్ణింపబడినాయి. చక్కని అంగసౌష్ఠవంగల ఈ సుందరమూర్తిని చమకంగా తిలకించి, పులకించి, నమకం చెప్పని వాడెవడు? తలచిన మాత్రాన ఘోరాఘరాశులను భస్మంచేసే భద్రమూర్తి, బుధులేమిటి? విబుధులచేతనూ శ్లాఘ్యమానుడేసుమా!

**మ. జగదాధారక భక్తవత్సల కృపాజన్మాలయాపాంగ, భూ**
**గగనార్కేందుజలాత్మపావకమరుత్కాయా, ప్రదీపప్రయో**
**గిగణస్తుత్య మహాఘనాశన, లసద్గీర్వాణసంసేవితా,**
**త్రిగుణాతీత, ముకుంద, నాదుమదిలో దీపింపు నారాయణా॥ 23**

అర్థం : జగత్+ఆధారక = పుట్టుతూ గిట్టుతూ ఉండే ప్రపంచానికి కారణమైన వాడా! భక్తవత్సల = భక్తులయందు ప్రేమకలవాడా! కృపాజన్మ+ఆలయ+అపాంగ = దయకు పుట్టిల్లైన కడకన్నులు కలవాడా! భూగగన - కాయా! భూ = నేల; గగన = నింగి; అర్క = సూర్యుడు, ఇందు = చంద్రుడు; జల = నీరు; ఆత్మ = జీవుడు; పావక = అగ్ని; మరుత్ = గాలి; కాయా = శరీరంగా కలవాడా! ప్రదీప ప్రయోగి గణస్తుత్య = దీపాలను వెలిగించిన పరమయోగుల సమూహం చేత స్తోత్రం చేయదగినవాడా! మహా+అఘనాశన = పెద్ద పాతకాలను నశింప జేసేవాడా! లసత్ + గీర్వాణ, సంసేవితా = ప్రకాశించే దేవతలచే, సేవింపబడేవాడా! త్రిగుణ+అతీత = సత్వగుణరజోగుణ తమోగుణాలనే మూడింటిని మించిన వాడా! ముకుంద = మోక్ష ఫలాన్ని ఇచ్చేవాడా! నారాయణా! నాదు = నా యొక్క; మదిలో = హృదయంలో; దీపింపు = ప్రకాశింపుము.

తా: విశ్వసృష్టిస్థితి లయాలకు కారణుడు కాబట్టి నారాయణుడు జగదాధారుడు. భక్తులయందు వాత్సల్యంకలవాడు. కృపాకటాక్షం కలవాడు. జగచ్ఛరీరుడు. ఉజ్జ్వలుడు, మహాయోగులచే స్తుతింప దగిన వాడు. మహాపాపనాశకుడు. దేవరాజులచే సేవింపబడేవాడు. త్రిగుణాత్మకమైన ప్రకృతికి అధ్యక్షుడు. మోక్షదాత. జ్యోతీరూపుడైన సర్వేశ్వరుణ్ని, సంబోధనతో ప్రార్థిస్తూ, కవి తన హృదయంలో ప్రకాశించుమన్నాడు.

**వ్యాఖ్య : కల్యాణగుణాలతో దీపించే నారాయణుడు తన ఎదలో దీపించాలని కవి ప్రార్థించే పద్యమిది.**

జగదాధారకుడు నారాయణుడు అనడం అర్థవాదమూ కాదు. అతివాదమూ కాదు. "సర్వస్య లోచనం శాస్త్రం" ఇంద్రియాలకు గోచరించని పరమాత్ముణ్ణి చూడడానికి, అందరికి కన్నులాంటి శాస్త్రాన్ని భగవంతుడే ప్రసాదించాడు. "మానం ప్రదీపమివ కారుణికో దదాతి" - "శాస్త్రాద్వేద్మిజనార్దనం" అన్నట్లు ఆప్తవాక్యం. శబ్దప్రమాణంవల్ల భగవంతునిగుణవిభూతులను గ్రహించడం లోకపరిపాటి.

ద్యౌస్సచంద్రార్కనక్షత్రం ఖం దిశో భూర్మహోదధిః।
వాసుదేవస్య వీర్యేణ విధృతాని మహాత్మనః॥" (భారతం)

నారాయణుడు సర్వత్ర వ్యాపించి, వసించి, ప్రకాశిస్తున్నందువల్ల వాసుదేవ నామం ఆయనకు అన్వర్థమయింది. ఆయన తన వీర్యం - ప్రభావం - చేతనే స్వర్గాన్నీ, సూర్య చంద్ర నక్షత్రాలతో కూడిన ఆకాశాన్నీ, భూమినీ, సముద్రాన్నీ, దిక్కుల నన్నిటినీ ధరిస్తున్నాడు. కాబట్టి జగదాధారకుడాయన. భక్తుల దోషాలను భోగ్యంగా స్వీకరించి, వారిని ప్రేమతో సాకేవాడు భక్తవత్సలుడు. (ఈ పదవివరణం ప్రథమావతార పద్యంలోనే దర్శనీయం). వస్తువుయొక్క స్వరూపస్వభావాలను చూచేది నయనేంద్రియం.

తనను ఇష్టపడేవారినీ, తనకిష్టమైన వస్తువులనూ చూడగానే అవి కంటిలో ప్రవేశించి పరావర్తనం చెందుతాయి. తన నాశ్రయించిన రూపగుణక్రియలన్నీ స్పష్టంగా కనబడుతాయి. వెంటనే దయారసం ఉద్గమిస్తుంది. కంటిమీది రెప్పల క్రిందినుంచి జాలువారి, కంటినిండా వ్యాపించి, కడకన్నులద్వారా ప్రసరిస్తుంది. కాబట్టి కడకంటి చూపును 'అపాంగదృష్టి' అంటారు. అపాంగం కృపకు జన్మస్థానం. 'దయ' అనేది భగవంతుని ప్రధానగుణం. "తదైక్షత". అనే శ్రుతి సంకల్పరూపమైన ఆయన దయాగుణాన్నే ప్రకటిస్తుంది.

"స్వధ్యానాయ మనశ్చ బుద్ధి మనఘాం దత్వాఽనుగృహ్ణాతి నః
సంసారే తదపి భ్రమేమ యది, కిం కుర్వీత సర్వేశ్వరః?"

దయాళుడైన నారాయణుడు తన స్వరూపాన్ని తెలుసుకోవడానికి శాస్త్రాన్నీ, తన నారాధించడానికి శరీరాన్నీ, తనను మనస్సున నిల్పుకొని ధ్యానించడానికి పరిశుద్ధమైన బుద్ధినీ మనకు అనుగ్రహించాడు. అయినా మనమీ సాంసారిక విషయాలలోనే పరిభ్రమిస్తుంటే, ఇంక భగవంతుడేమి చేయాలి? అంటారు భగవద్గుణానుసంధాన పరులు.

నారాయణుడు జగత్కాయుడు.

'అగ్నిర్మూర్ధా చక్షుషీ చంద్రసూర్యౌ.
దిశశ్శ్రోత్రే వాగ్వివృతాశ్చ వేదాః
వాయుః ప్రాణో హృదయం విశ్వమస్య
పద్భ్యాం పృథివీ హ్యేషసర్వభూతాంతరాత్మా॥ (ముం.ఉ.3-4)

"అసౌ వై లోకోఽగ్నిః - ద్యాం మూర్ధానం యస్య విప్రా వదంతి" అనే శ్రుతి స్మృతి వాక్యాలు 'అగ్ని'ని ద్యులోకంగా బోధించడంవల్ల, పరబ్రహ్మకు ద్యులోకం శిరస్సు. చంద్రసూర్యులు కన్నులు. దిక్కులే చెవులు, వేదాలే మాటలు, వాయువే ప్రాణం, విశ్వాంతరాళం హృదయకోశం, భూమి పాదస్థానీయం, ఆత్మకూడా ఆయనకు శరీరమే. సర్వప్రాణులకు నారాయణుడంతర్యామి, సర్వాత్ముడు. కాబట్టి కవి 'భూగగనార్కేందుజలాత్మపావకమరుత్కాయా!' అని సంబోధించాడు.

ప్రదీప ప్రయోగి గణస్తుత్యుడు నారాయణుడు. యోగీంద్రులు భగవద్దర్శన కాంక్షతో నిద్రాహారాలు మాని గ్రామైకరాత్రంగా సంచరిస్తారు. ఒకనాటిరాత్రి 'సరోయోగి' పెనుగాలివానలో పయనించలేక "తిరుక్కోవలూ"రనే దివ్య క్షేత్రంలో ఒక చిన్న వాకిలి అరుగుమీద పడుకొన్నాడు. 'భూతయోగి' కూడా అలాగే భగవన్నామస్మరణతో తిరుగుతూ అక్కడికే వచ్చాడు. మెరపు తటాలున మెరసినందువల్ల అరుగుమీద పడుకొన్న వ్యక్తి కనబడినాడు. "ఏమండీ! ఇక్కడ, ఈ పెనుగాలివాన కురుస్తున్నందువల్ల, విశ్రమించవచ్చా" అని అడిగాడు. "సర్దుకొందాం రండి" అన్నాడు పడుకొన్న యోగి లేచి కూర్చొంటూ. ఆ చిన్న తిన్నె మీద ఇద్దరు కూర్చొని, ధ్యానమగ్నులయ్యారు. కాసేపటికి 'భ్రాంత యోగి' కటిక చీకట్లో దారి తడవుకొంటూ, ఆవేదిక దగ్గరికే వచ్చాడు. "తలదాచుకోవడానికి ఇక్కడింత చోటు దొరుకుతుందా?" అని అడిగినంతలోనే ఆ గద్దెమీద కూర్చొన్న ఇద్దరు లేచినిలబడి ఆగంతునికి 'స్వాగతం' పలికారు. ఆ ముగ్గురు యోగులు నిలబడి, నిర్లిప్తులై ఉండగా, నారాయణుడు మెచ్చి, ఆ ముగ్గురి నడుమ చొచ్చి ఆనందంతో చిందులు త్రొక్కసాగాడు. ఒత్తిడి పెరిగింది. రాపిడికి ఒడలు నొప్పి మిక్కుటమయింది.

ఈ దుర్దినాన సూర్యుడు కనబడడు. గాలికి దీపమారిపోతుంది. ఏరీతిగ నైనా వచ్చిన వ్యక్తిని చూడాలని తలచారు.

సరోయోగి జ్ఞాన దీపాన్ని వెలిగించాడు. భగవంతుడు ప్రత్యక్షమయ్యాడు.

ఆ సరోయోగి వెలిగించిన జీవం కుంభజ్యోతి. భూమిని ప్రమిదగానూ, సముద్ర జలాన్ని నెయ్యిగానూ, వాడిమయూఖుడైన సూర్యుణ్ని వత్తిగా చేసిన దీపంతో భగవంతుణ్ని సేవించాడు. చక్రధారికి నీరాజన మర్పించాడు.

"ధరణి పంతియ సముద్రంబులు నేయి
యరుణదీపముజేసి యరుణాశుతతుల
గారాబు చక్రంబు కై బూన్చినట్టి
నీరజాక్షునకిత్తు నీరాజనంబు" (పరమ యోగి విలాసం, ద్విపదకావ్యం)

భూత యోగి విశుద్ధ జ్ఞానదీపంతో దర్శించి, నివాళిపట్టాడు. భక్తిని ప్రమిదగానూ, ఆర్తిని నెయ్యిగానూ, శ్రీహరి దర్శన జనితానందాన్నే వత్తిగా చేసి జ్ఞానోజ్జ్వలదీపాన్ని నారాయణునికి అర్పించాడు.

"ప్రేమ పంతియ, మితిలేని భక్తియే చమురు
నానంద భరిత హృదబ్జంబె వత్తి
గానొనరించి వికాసమై యాత్మఁ
దిరమొందు జ్ఞానంబు దీపంబుజేసి
పెరిమె నారాయణార్పితముగావించె" (చిన్నన్న ద్విపదకావ్యం)

ఇద్దరు యోగులు వెలిగించిన జ్ఞాన దీపాల కాంతి ఆధారంగా మూడవ యోగి భగవద్దివ్య మంగళ విగ్రహ సౌందర్యాన్ని చూచి, లక్ష్మీదేవినీ చూచాను. సువర్ణ శరీరుడైన లక్ష్మీనాథుణ్నీ చూచాను. స్వామి ధరించిన సుదర్శన పాంచజన్యాలనూ దర్శించాను. ఇంక నాకు కోరదగినదే ముంటుంది? అని మురిసిపోయాడు.

"సిరిగంటి, చెన్ను మించిన మేనుగంటి" అని శ్రీ తాళ్ళపాక తిరువేంగళనాథకవి 'దివ్యప్రబంధ' చ్ఛాయను సంగ్రహించాడు.

ముదలాళ్వారు అని పేరుగాంచిన దైవీ గుణ ప్రపూర్ణులైన ముగ్గురు యోగులు, ప్రాకృత నేత్రాలతో శ్రీమన్నారాయణ మూర్తిని ఈ లోకంలో దర్శించిన, సాంధృష్టిక మనే దీపార్చనతో స్తుతించిన భాగ్యవంతులు.

మహాయోగుల జ్ఞాన వైరాగ్య దీపకాంతులలో ప్రకాశిస్తూ నతులూ, నుతులూ పొందదగినవాడు నారాయణుడు.

"యథాఽగ్ని రుద్ధతశిఖః కక్షం దహతి సానిలః।
తథా చిత్తస్థితో విష్ణుః యోగినాం సర్వకిల్బిషమ్॥" (వి.పు.)

జ్వాలతో కూడిన అగ్ని గాలితో కూడి, గడ్డివామును కాల్చివేసే రీతిగా యోగుల హృదయంలో ఉండే విష్ణుమూర్తి సర్వపాపాలను నశింపజేస్తాడు.

ఇందిరా సుందరీ వరుడు వందారు బృందారక సందోహ సంసేవితుడు. ప్రకృతిలో సర్వత్ర వ్యాపించి ఉన్నా, దాని గుణత్రయం లేపనం కోసమైనా లేశ మాత్రం అంటని వాడు కాబట్టి నారాయణుడు త్రిగుణాతీతుడు.

"పరమాత్మని గోవిందే భక్తి రవ్యభిచారిణీ।
ప్రయచ్ఛతి నృణాం ముక్తిం మా తే భూదత్రసంశయః॥ (వైష్ణవధర్మం)

పరమాత్ముడు గోవిందుడు. ఆయనను స్థిరమైన భక్తితో సేవిస్తే, మోక్షమనే పురుషార్థాన్ని ప్రసాదిస్తాడనడంలో సందేహమే ఉండవద్దు. సత్కవులీ నారాయణ పరంజ్యోతిని పద్మకోశ ప్రతీకాశమైన తమ హృదయంలో ప్రకాశించాలని ప్రార్థించడం ప్రశంసనీయమే కదా!

**శా. భూతవ్రాతమునంబుజాసనుఁడవై పుట్టింతు విష్ణుండవై**
**ప్రీతింబ్రోతు హరుండవై చెఱుతు నిర్భేద్యుండవై త్రైగుణో**
**పేతం బై పరమాత్మవై నిలుతు నీ పెంపెవ్వరుంగానర**
**బ్జాతోద్భూత సుజాతపూజితపదాబ్జశ్రేష్ఠ నారాయణా॥ 24**

అర్థం : అబ్జాతో - పదాబ్జ, అప్+జాత = నీటపుట్టిన కమలంనుంచి; ఉద్భూత = పుట్టిన బ్రహ్మచేతనూ; సుజాత = దేవతల చేతనూ; పూజిత = పూజింపబడిన; పద+అబ్జ = పద్మాలవంటి పాదాలు కలవాడా! శ్రేష్ఠ = మిక్కిలి తేజస్సు కలవాడా! ఓనారాయణా! అంబుజ+ఆసనుడవై = కమలమే పీఠంగా కల బ్రహ్మవై; భూతవ్రాతమున్ = భూత సముదాయాన్ని - జగత్తును; పుట్టింతు = సృజిస్తావు. విష్ణుండవై; ప్రీతిన్ = దయతో; ప్రోతు = కాపాడుతావు. హరుండవై = రుద్రుడవై; చెఱుతు = సంహరిస్తావు; నిర్భేద్యుండవై = భేదింపరానివాడవై; త్రైగుణ+ఉపేతంబై = మూడు గుణాలతో కూడిన ప్రకృతియుక్తుడవై; పరమాత్మవై = స్థిరచరాలకు ఆత్మవై; నిలుతు = ఉంటావు. నీ పెంపు = నీ మహిమ; ఎవ్వరున్ కానరు = ఎవరికీ తెలియదు.

తా: బ్రహ్మాది దేవతలు పూజించే పాదపద్మాలు కలిగిన, అమిత తేజశ్శాలివైన ఓ నారాయణా! నీవు చతుర్ముఖబ్రహ్మవై పృథివ్యాదిభూతవర్గాన్ని సృజిస్తావు. విష్ణుమూర్తివై శ్రద్ధతో ప్రపంచాన్ని పాలిస్తావు. రుద్రుడవై సంహరిస్తావు. దేశకాలాదులచే అపరిచ్ఛేద్యుడవు. ప్రకృతిసంసర్గుడవు. జీవ ప్రకృతులను నియమించే పరమాత్ముడవు. నీ మహిమ ఎవరికీ తెలియదు.

**వ్యాఖ్య : భగవంతునివిభూతివర్ణన**

"తత్సృష్ట్వా, తదేవానుప్రావిశత్" అనే శ్రుతిరీతిగా విశ్వాన్ని సృజించి, దానిలో అంతర్యామిగా ఉన్నవాడు నారాయణుడు. బ్రహ్మను సృజించి, అతనిలో అంతర్యామిగా వెలసి ప్రపంచాన్ని సృజిస్తాడు. ప్రపంచాన్ని పాలించే సామర్థ్యం విష్ణుమూర్తిదే. రుద్రునిలో ఆవేశించి ప్రళయం చేస్తాడు.

"సృష్టిస్థిత్యంతకరణీం బ్రహ్మవిష్ణుశివాత్మికాం।
ససంజ్ఞాం యాతి భగవానేక ఏవ జనార్దనః॥" (వి.పు.1-2-66)

ఒక్క జనార్ధనుడే జగత్తు యొక్క సృష్టి స్థితి లయాలకోసం బ్రహ్మ విష్ణురుద్రులనే మూడు సంజ్ఞలను ధరిస్తాడని శ్రీ పరాశరమహర్షి సూక్తి.

ఈ చోట ఇలా ఉంటాడని గానీ, ఈ సమయాన ఉంటాడని గానీ, ఈ రూపంలో ఉంటాడనిగానీ చెప్పనలవి కాదు కాబట్టి నిర్భేద్యుడు భగవంతుడు.

"మ యాఽధ్యక్షేణ ప్రకృతిః సూయతే సచరాచరమ్।
హేతునాఽనేన కాంతేయ! జగద్విపరివర్తతే॥" (భ.గీ. 9-10)

ఓ అర్జునా! నేనే ఈ జగద్వ్యాపారానికి అధ్యక్షుడను. నానిమిత్తంగా ప్రకృతి స్థిరచరరచనను చేస్తుంది. ఈ కారణంగా జగన్నాటకం అవిచ్ఛిన్నంగా సాగుతున్నది. కాబట్టి త్రైగుణోపేతుడు భగవానుడు.

పరా మా యస్య సః = పరమః. పరమశ్చాసౌ ఆత్మాచ = పరమాత్మా, అని విగ్రహవాక్యం. ఉత్కృష్టసంపదగల లక్ష్మి గలవాడు పరమాత్ముడు. ఆయన ఉభయ విభూతులకు నాయకుడు. కాబట్టి నారాయణుని ప్రాభవ వైభవాలు ఎవరికీ గోచరించవు.

ఈ విషయాన్నే శ్రీ వ్యాస భగవానుడు ఎలా విశదీకరించాడో గమనిద్దాం.

"స ఏవేదం జగద్ధాతా భగవాన్ ధర్మరూపధృత్।
పుష్ణాతి స్థాపయన్విశ్వం తిర్యఙ్నరసురాదిభిః॥
తతః కాలాగ్నిరుద్రాత్మా యత్సృష్టమిదమాత్మనః।
సన్నియచ్ఛతి తత్కాలే ఘనానీక మివానిలః॥" (భాగ. 2-10-428,43)

పోతనామాత్యుడు దీని భావాన్ని పోతపోశాడు. (భా.గ. ద్వి.స్కం. 274)

"ఇరవొందన్ ద్రుహిణాత్మకుండయి రమాధీశుండు విశ్వంబును
స్థిరతంజేసి హరిస్వరూపుఁడయి రక్షించున్ సమస్త ప్రజో
త్కర సంహారముసేయునప్పుడు హరాంతర్యామియై యింతయున్
హరియించున్, పవనుండు మేఘముల మాయం జేయుచందంబునన్॥

**మ. వరనాభీధవళాంబుజోదరమునన్ వాణీశుఁ గల్పించి య**
**ప్పురుషశ్రేష్ఠుని ఫాలమందు శివునింబుట్టించి యామేటికిం**
**బరమోత్తంసముగా వియత్తలనదిం బాదంబులంగన్న మీ**
**సరి యెవ్వారలు మీరు దక్కఁగ రమా సాధ్వీశ నారాయణా॥ 25**

అర్థం : రమా సాధ్వీ+ఈశ = సాధ్వియైన రమాదేవికి భర్తయైన వాడా! ఓ నారాయణా! వర -నన్, వర = శ్రేష్ఠమైన; నాభీ = పొక్కిలి యందలి; ధవళ + అంబుజ = తెల్లని కమలం యొక్క, ఉదరమునన్ = గర్భమునందు; వాణీ+ఈశున్ = సరస్వతీపతియైన

బ్రహ్మను; కల్పించి = వేడుకతో పుట్టించి; ఆ+పురుషశ్రేష్ఠుని ఫాలమందు = ఆ బ్రహ్మనుదుటినుంచి; శివునిన్; పుట్టించి; ఆ మేటికిన్ = ఆ శ్లాఘ్యమూర్తికి; పరమ+ఉత్తంసముగా = ఉత్కృష్టమైన భూషణంగా; వియత్‌తల నదిన్ = ఆకాశ గంగను; పాదంబులన్ = (స్వీయ) చరణాలయందు; కన్న = పుట్టించిన; మీసరి = మీతో సమానం; మీరుదక్కగ = మీరు కాక; ఎవ్వారలు = ఎవరు ఉన్నారు?

తా: ఓ లక్ష్మీపతీ! నారాయణా! నీనాభియందున్న స్వచ్ఛమైన కమలంయొక్క గర్భమందు వాగీశుడైన బ్రహ్మను, ఆ బ్రహ్మ ఫాల ప్రదేశంనుంచి శివుణ్ని పుట్టించావు. ఆ శివునికి భూషణంగా ఆకాశగంగను నీ పాదాలయందు కన్నావు. మీకు సాటివారు మీరే కాక మరెవ్వరున్నారు.

**వ్యాఖ్య : నారాయణుడు నిస్సమాభ్యధికుడని వర్ణన.**

"యన్నాభిజాతా దరవిందకోశాత్" అన్నట్లు చతుర్ముఖ బ్రహ్మనారాయణుని నాభీకమలగర్భమందు ఆవిర్భవించాడు. ఆ బ్రహ్మఫాలతలమందు శివుడు ఉద్భవించాడు. ఆ శివునికి శిరోభూషణంగా నారాయణుని వామచరణం నుంచి గగనగంగ ఉద్గమించింది. ఇదంతా నారాయణుని సంకల్పంవల్ల సంభవించిందే కాబట్టి, ఆయనకు ఆయనే సాటి అని అనన్యాలంకారోక్తి వైచిత్రిగల పద్యమిది.

**మ. ప్రభ మీనాభి జనించినట్టి విలసత్పద్మోరుసద్మంబునం**
**బ్రభవంబైన విరించిఫాలజనితప్రస్వేదసంభూతుఁడై**
**యభిధానంబును గోరి కాంచెను భవుండార్యేశులూహింపఁగా**
**నభవాఖ్యుండవు నిన్నెఱుంగ వశమే యబ్జాక్ష నారాయణా॥ 26**

అర్థం : అప్+జ+అక్ష = తామరసాక్ష! ఓ నారాయణా! ప్రభ = తేజస్సువల్ల; మీ నాభిజనించినట్టి = మీ బొడ్డునుంచి పుట్టిన; విలసత్, పద్మ+ఉరు, సద్మంబునన్ = వికసిస్తున్న కమలమనే గొప్ప భవనమందు; ప్రభవంబైన = జన్మించిన; విరించి -భూతుండై, విరించి = బ్రహ్మయొక్క, ఫాల = నుదుటినుంచి; జనిత = ఉదయించిన; ప్రస్వేద = చెమటవల్ల; సంభూతుండై = ఉద్భవించి; భవుండు = శివుడు; అభిధానంబును = పేరును; కోరి = వాంఛించి, కాంచెను = పొందెను. ఆర్యా+ఈశులు = రుద్రులు; ఊహింపగా = తర్కింపగా; అభవ+ఆఖ్యుండవు = పుట్టనివాడు అనే పేరు కలవాడవు; నిన్ను ఎరుంగవశమా!

తా: పద్మనయనా! ఓ నారాయణా! తేజస్సువల్ల మీ నాభినుంచి జనించిన పద్మ మనే భవనమందు ఉద్భవించిన బ్రహ్మయొక్క నొసట పుట్టిన చెమట నుంచి శివుడు పుట్టినాడు. నాకు పేరు పెట్టమని కోరగా, బ్రహ్మ శివునికి నామకరణం చేశాడు. ఏకాదశరుద్రులు భావించినట్లు జన్మ లేని వాడవు నీవే. నిన్ను తెలియ వశమా!

**వ్యాఖ్య : నారాయణుడు 'అభవుడు' అని వర్ణన.**

అబ్జాక్షుడు, ఆబ్జనాభుడు నారాయణుడే. ఆయన ప్రభ అనవధికం. అబ్జయోని విరించి, అంటే భూతాలను సృజించే బ్రహ్మదేవుడు, పద్మంనుంచి ప్రభవించిన విరించి, మొదట సనక సనంద సనాతన, సనత్కుమారులను సృజించిన, వారిని 'ప్రజాస్సృజత' అని ఆదేశించాడు.

నారాయణ పరాయణులైన ఆ పరమ యోగులు ప్రజను సృజించమన్నారు. బ్రహ్మకు కోపం వచ్చింది. "ధియా నిగృహ్యమాణోఽపి భ్రువోర్మధ్యాత్ ప్రజాపతేః" (భాగ. 3-12-7). బుద్ధితో ఎంతో నిగ్రహించినా, కోపం విజృంభించింది. చెమట పట్టింది. కనుబొమలు ముడిపడినాయి. అప్పుడే -

"భ్రుకుటీకుటిలాత్తస్య లలాటాత్ క్రోధదీపితాత్।
సముత్పన్నస్తదా రుద్రో మధ్యాహ్నార్కసమప్రభః॥" (వి.పు. 1-7-12)

"నామ దేహీతి తం సోఽథ ప్రత్యువాచ ప్రజాపతిః।
రుద్రస్త్వం దేవ నామ్నాసి మారోదీర్ధైర్యమావహ॥" (వి.పు. 1-8-4)

బ్రహ్మయొక్క ఫాలప్రదేశం నుంచి మధ్యాహ్నమార్తాండునితో సమానమైన ప్రచండతేజస్సుగల నిసుగు జనించింది. నాకు పేరు పెట్టుమని క్రమంగా ఏడ్వడంవల్ల 'రుద్రు'డని నామకరణం చేశాడు బ్రహ్మ. ఏడ్వకు, ధైర్యంగా ఉండుమన్నాడు.

"నామాని కురు మే ధాతః! స్థానాని చ జగద్గురో!" (భాగ. 3-12-8)

నాకు పేర్లు పెట్టి, స్థానాలను కల్పించుమన్నాడు. పదకొండు పేర్లను పెట్టి, స్థానాలనూ ఏర్పరచాడు విధాత. వీరే ఏకాదశరుద్రులు.

ఏకాదశరుద్రులు :

మన్యు, మను, మహాకాల, మహత్, శివ, ఋతధ్వజ, ఉరురేతస్, భవ, కాల, వామదేవ, ధృతవ్రతులని (ఏకాదశరుద్రుల)పేర్లు.

ఏకాదశ రుద్రాణులు :

ధీ, వృత్తి, అశనా, ఉమా, నియుత్, సర్పిః, ఇలా, అంబికా, ఇలావతీ, సుధా, దీక్షా - అనేవి రుద్రుల పత్నులనామధేయాలు.

ఏకాదశస్థానాలు : చంద్రుడు, సూర్యుడు, అగ్ని, వాయువు, జలం, ఆకాశం, భూమి, ప్రాణం, తపస్సు, హృదయం, ఇంద్రియాలు.

'ఓ రుద్రా! ఏకాదశ నామ పత్నులతో ఆయా స్థానాల్లో నివసించి, ప్రజను సృజించు'మని పితామహుడు నిర్దేశించాడు. ఇది రౌద్రసృష్టి

పుట్టుక కలవాడు 'భవుడు', పుట్టుక లేనివాడు అభవుడు.

శివుడు 'భవుడు', నారాయణుడు 'అభవుడు' అనడానికి పద్యంలో భవుడు 'విరించి ఫాలజనిత ప్రస్వేద సంభూతు'డని హేతువాక్యాన్ని కూర్చాడు కవి. కాబట్టి, ఇది వాక్యార్థహేతుక కావ్యలింగాలంకారం.

తాను మాత్రం 'అభవుడై' అందరినీ ప్రభవింపజేసిన నారాయణుని ప్రభావం ఎవరికీ తెలియశక్యం కాదు.

**మ. పటుగర్భాంతరగోళభాగమున నీ బ్రహ్మాండభాండంబు ప్రా**
**కటదివ్యాద్భుతలీలఁదాల్చి మహిమం గల్పాంత మంభోధిపై**
**వటపత్రాగ్రముఁజెంది యొప్పిన మిము న్వర్ణింపఁగా శక్యమే**
**నిటలాక్షాంబురుహాసనాదికులకు న్నిర్వాణ నారాయణా॥** 27

అర్థం : నిటలా - కున్! నిటల+అక్ష = ఫాలనేత్రుడైన శివుడు; అంబురుహ+ఆసన = కమలాసనుడైన బ్రహ్మ; ఆదికులకున్ = మొదలైన వారికి కూడా; నిర్వాణ = పరమగతియైనవాడా! ఓ నారాయణా! కల్ప+అంతము = ప్రళయ కాలంలో; మహిమన్ = సామర్థ్యంతో; పటుగర్భ+అంతర, గోళభాగమునన్ = సమర్థమైన కుక్షిలోపలి గోళ ప్రదేశమందు; ఈ బ్రహ్మాండభాండంబు; ప్రాకట దివ్య+అద్భుత లీలన్ = వెల్లడించే దివ్యమైన, ఆశ్చర్యకరమైన విలాసంతో; తాల్చి = ధరించి; అంభోధిపై = సముద్రమందు; వటపత్ర +అగ్రమున్ = మఱ్ఱి ఆకుమీద; చెంది, ఒప్పిన = ఉండి శోభించిన; మిమున్ = మిమ్ము; వర్ణింపగా = ప్రశంసింపగా; శక్యమే = సామర్థ్యం కలదా?

తా: భవునికీ, పద్మభవునికీ, అందరికీ పరమగతియైన ఓ నారాయణా! ప్రళయకాలాన అద్భుతమైన దివ్యలీలను వెల్లడించే మహిమతో ఈ బ్రహ్మాండభాండాన్ని మీ కుక్షిలోపల నిక్షేపించుకొని ఏకార్ణవమందు వటపత్రంమీద శాంతంగా ఉండే మిమ్ము వర్ణించడానికి ఎవరికీ శక్తి చాలదు.

**వ్యాఖ్య : వటపత్రశాయిశాంతరూపం వర్ణితం.**

సర్వజగజ్జననరక్షణజక్షణలకు ఏకైకకారణుడు నారాయణుడే. సృష్టికి ఉదయకల్పమనీ, ప్రళయానికి క్షయకల్పమనీ పేరు.

"ఆబ్రహ్మస్తంబపర్యంతాః జగదంతర్వ్యవస్థితాః।
ప్రాణినః కర్మజనితసంసారవశవర్తినః॥" (వి.ధ. 75)

బ్రహ్మదేవుడు మొదలు తృణంవరకు ప్రకృతిమండలంలో ఉన్నవారే. సమస్త ప్రాణులు కర్మచేత ఏర్పడే సంసారానికి వశ్యులై ఉండడం ఆజానజం. కాబట్టి బ్రహ్మరుద్రేంద్రాదిజీవులందరికీ పరమచరమగతి పరమాత్ముడే. ప్రళయకాలంలో

జగమంతా ఏకార్ణవంగా మారుతుంది. అప్పుడు ఒక్క నారాయణుడే తప్ప బ్రహ్మరుద్రులుగానీ, చంద్రసూర్యులుకానీ, భూమ్యాకాశాలుగానీ ఏవీ ఉండవని శ్రుతి. "ఏకో హ వై నారాయణ ఆసీత్, న బ్రహ్మ నేశానో, నాగ్నీషోమౌ నేమే ద్యావాపృథివీ".

ప్రళయ కాలంలో ప్రపంచాన్ని ఉపసంహారంచేసి నారాయణుడు తన గర్భగోళంలో భద్రపరచి నిర్భరుడై ఉంటాడు. మైనానికి అద్దిన బంగారు పిసర్ల లాగా, కర్మవాసనాబీజాలతో సమస్తవస్తుమయమైన జగజ్జాలాన్ని జక్షించిన ఆ బొజ్జ ఎంత విశాలమయిందో! కుక్షినిక్షిప్తమైన బ్రహ్మాండాన్ని క్షయకల్పాంతంవరకు భరించే ఆ మూర్తి ఎంత సహనశక్తి కలదో!

"వటస్య పత్రస్య పుటే శయానం" అన్నట్లు ఆ బృహద్రూపి పాల కడలిలో తేలియాడే మఱ్ఱి యాకు మీద ప్రశాంతంగా ఉంటాడట. అంటే విశ్వంభరుణ్ని తనపైన భరించే ఒక్క చిన్న మఱ్ఱియాకే పెద్దదైన ఆ మహిమ ఎంత దివ్యమైనదో! ఎంత అద్భుతమైనదో! ఆ నిర్వాణస్థితిని ఎవ్వరూ వర్ణింప సమర్థులు కారని కవి తలపోత.

"నైతే స్వరూపం విదురాత్మనస్తే
అజాదయోऽనాత్మతయా గృహీతాః।
అజోऽనుబద్ధః సగుణైరజాయా
గుణాత్పరం వేద న తే స్వరూపమ్॥" (భాగ. 10-40-3)

అజాదులన్నీ అనాత్మలే. అంటే, జడరూపాలుగా ఉన్నవాటికీ నీవే ఆత్మవు. బ్రహ్మ దేవుడు కూడా రజోగుణయుక్తుడు. జీవజడప్రకృతుల గుణాలకన్న పరంగా ఉన్న నీ (శ్రీమన్నారాయణ) స్వరూపమహిమను ఆ బ్రహ్మదేవుడూ తెలుసుకొనజాలడు అని అక్రూరుడు స్తుతించాడు కదా!

"ముక్తిః కైవల్యనిర్వాణశ్రేయోనిశ్శ్రేయసామృతమ్" (అమరం). తుదకు, సమస్త వస్తువులముక్తికి నిమిత్తమైనవాడు నిర్వాణుడు. అతడు నారాయణుడే.

**మ. సవిశేషోరుసువర్ణబిందువిలసచ్చక్రాంకలింగాకృతిన్**
**భవుచే నుద్ధవుచేఁ బయోజభవుచేఁ బద్మారిచే భానుచే**
**ధ్రువుచే నా దివిజాధినాయకులచే దీవ్యన్మునీంద్రాళిచే**
**నవదివ్యార్చనలందుచుందువు రమానారీశ నారాయణా॥ 28**

అర్థం : రమానారీ+ఈశ = లక్ష్మీపతీ! ఓ నారాయణా! సవిశేష - ఆకృతిన్! సవిశేష = విశేషంగా; ఉరు = గొప్పదైన; సువర్ణ = మంచివన్నె - బంగారంతో; బీజాక్షరాలతో; బిందు = చిద్రూపంతో, బిందురూపంతో; విలసత్ = శోభిస్తున్న; చక్ర+అంక = సుదర్శన

రూపంతోనూ; లింగ+ ఆకృతిన్ = లింగరూపంతోనూ; భవుచేన్ = శంకరునిచేతనూ; ఉద్ధవుచేన్ = ఉద్ధవునిచేతనూ; పయోజభవుచేన్ = కమలోద్భవుడైన బ్రహ్మచేతనూ; పద్మ+అరిచేన్ = తమ్ముల పగవాడైన చంద్రునిచేతనూ; భానుచే = సూర్యునిచేతనూ; ధ్రువునిచేతనూ; ఆ దివిజ+అధినాయకులచే = ఇంద్రాద్యమరవరులచేతనూ; దీవ్యత్+మునీంద్ర + ఆళిచే = ప్రకాశించే మునీశ్వరుల సమూహాలచేతనూ; నవదివ్య+అర్చనల్ = కొత్తగా శోభించే పూజలను; అందుచు ఉందువు = పొందుతుంటావు.

తా: లక్ష్మీపతీ! ఓ నారాయణా! శివుడు, ఉద్ధవుడు, చతురాననుడు, చంద్రుడు, సూర్యుడు, ధ్రువుడు, దేవతలు, మునులు విశేషంగా బీజ బిందువులతో శోభించే బంగారు సుదర్శనరూపాన్ని, లింగాకృతిని, కొత్తగా దివ్యమైన అర్చనలను చేస్తుంటే అద్భుతంగా స్వీకరిస్తుంటావు.

**వ్యాఖ్య : ఉపాసనకు సులభమైన నారాయణరూపం వర్ణితం.**

భక్తులు మనసార పూజించడానికి యోగ్యమైన విధానాలుగల శాస్త్రప్రమాణాలను భగవంతుడు కృపజేశాడు. ఆ ప్రమాణదీపంచేత భగవంతుని మంత్ర యంత్ర తంత్ర రూపాలను తెలుసుకొని అర్చించడానికి జీవులకు కరణకళేబరాలిచ్చాడు.

మంత్ర బీజాక్షరాలనూ, తేజోనాదధ్యాన బిందువులనూ ఆయా (షట్) కోణాలలో లిఖించి, ఆ పైన చక్రాకారంలో ఉండే ఆవరణాలతో నిర్మింపబడిన సుదర్శనాది యంత్రాలను ప్రతిష్ఠించి, ఆరాధించడం దేవతార్చన. కొందరు ద్వాదశలింగాలలో ఇష్టమైన ఒక లింగాకృతినీ దివ్యంగా అర్చిస్తుంటారు. సహస్రనామాలతోనూ, మంత్ర బీజాక్షరాల పునశ్చరణతోనూ, చిద్రూపమైన బిందువును ప్రాణాయామంలో, భ్రూమధ్యన దృష్టి నిలిపే ధ్యానయోగంతో, మానసపూజ చేయడమూ శాస్త్రవిధి.

"భ్రువోర్మధ్యే ప్రాణమావేశ్య సమ్యక్
స తం పరం పురుషముపైతి దివ్యమ్॥" (భ.గీ.8-10)

ప్రకృతిబద్ధమైన ఆత్మకు అంటే తనను మంత్రజపంతో (అంగన్యాసకర న్యాసవిధితోపాటు) శుద్ధిని కల్పించుకొని దేవుణ్ని పూజించడం ఆచారవిధి. "దేవో భూత్వా దేవం యజేత్" అనేది నియతి కదా!

నవవిధాలైన భక్తిరూపప్రక్రియలలో 'అర్చనం' మధ్యస్థానం వహించింది.

"శ్రవణం, కీర్తనం, విష్ణోఃస్మరణం, పాదసేవనం,
అర్చనం, వందనం, దాస్యం, సఖ్య, మాత్మనివేదనమ్॥"

'అర్చన'లో 'కీర్తనం' వాచికం. 'ప్రపదనం' (ప్రార్థనామతి) మానసికం; 'ప్రసూనార్పణం' కాయికం; ఈ మూడు ప్రక్రియలు ముడిపడి ఉంటాయి.

షోడశోపచారాలలో 'ఔపచారికం' అంటే కొంచెం ఎడంగా ఉండి, తాకక, కర్పూరనీరాజనాలర్పించడం, వీవనలు విసరడం ఉంటుంది. 'సాంస్పర్శికం' తాకి అభిషేకించడం, చందనం, పూవులు సమర్పించడమూ, 'ఆభ్యవహారికం' అంటే అన్న ఫల క్షీరాదులను నివేదనగా అర్పించడమూ, 'సాందృష్టికం' అంటే, ధూపదీపాలుంచడం మొదలైన పూజా విశేషాలు నిత్యప్రత్యగ్రంగా ఉంటాయి.

"జ్ఞానినో జ్ఞానయజ్ఞేన యజంతి జ్ఞానవిగ్రహమ్॥
అన్యే చ సంస్కృతాత్మానః విధినా విహితేన తే।
యజంతి త్వన్మయాస్త్వాం వై బహుమూర్త్యేకమూర్తికమ్॥
త్వామే వాన్యే శివోక్తేన మార్గేణ శివరూపిణమ్।
బహ్వాచారభేదేన భగవన్ సముపాసతే ॥ (భా.గ. 10-40-6,7,8)

జ్ఞానయజ్ఞంతో జ్ఞానవంతులు, జ్ఞానవిగ్రహాన్ని పూజిస్తారు. ఇతరులు విధి విహితంగా అనేక మూర్తులుగానూ, ఏకమూర్తిగానూ ఉన్న నిన్ను త్వన్మయులై పూజిస్తారు. మరికొందరు శివుడు చెప్పిన పద్ధతిలో శివరూపుడవైన నిన్నే అనేక ఆచారవిశేషాలచేత ఉపాసిస్తారు, అని అక్రూరుడు స్తుతించాడు కదా! బ్రహ్మోత్సవాల్లో నవాహ్నికంగా బ్రహ్మ రుద్రేంద్రాది దేవతలూ, ఋషులూ, భక్తజనులూ నవరాత్రులుగా చేసే అర్చనలను అత్యాదరంతో స్వీకరిస్తాడు శ్రీమన్నారాయణుడు.

"పరిపూర్ణోఽపి భగవాన్ భక్తైర్యత్కించిదీరితమ్।
సాపేక్షవ త్తదా దత్తే తేన ప్రీతో దదాత్యలమ్॥"

అన్నట్లు, పూర్ణుడూ, అవాప్తసమస్తకాముడైన పురుషోత్తముడు "తత్కురుష్వ మ దర్పణమ్" అంటూ, భక్తులు అర్పించిన అల్పవస్తువులనూ ప్రీతితో స్వీకరించడంవల్ల ఆయన సౌలభ్యంయొక్క యాదార్థ్యం ప్రకటితం. ఈ పద్యంలో ధ్రువుచే - దీవ్యత్ అనే మూడవ పాదంలో యతిమైత్రి చింత్యమే.

**మ. సర్వంబున్ వసియించు నీతనువునన్ సర్వంబునందుండఁగా**
**సర్వాత్మా! వసియించుదీవని మదిన్ సార్థంబుగాఁ జూచి యా**
**గీర్వాణాదులు వాసుదేవుఁడనుచున్ గీర్తింతు రేప్రొద్దు నా**
**శీర్వాదంబు భవన్మహామహిమ లక్ష్మీనాథ నారాయణా॥ 29**

అర్థం : ఓ లక్ష్మీనాథ! నారాయణా! నీతనువునన్ = నీ రూపమందు; సర్వంబున్ = సమస్తం; వసియించు = ఉంటుంది; సర్వాత్మా! = అన్నిటికీ ఆత్మయైనవాడా! ఈవు = నీవు; సర్వంబునందు = ప్రతిపదార్థము నందు; ఉండగా, వసి+యించుదు = నివసిస్తూంటావు, అని, మదిన్ = మనస్సునందు; సార్థంబుగా = అర్థవంతంగా; చూచి;

ఆ గీర్వాణ+అదులు = ఆ దేవతలు మొదలైనవారు; వాసుదేవుడు, అనుచున్; ఏప్రొద్దున్ = ఎల్ల కాలం; కీర్తింతురు; భవత్+మహామహిమ = నీ గొప్ప వైభవం; ఆశీర్వాదంబు = యోగక్షేమాలను కల్పిస్తుంది.

తా: ఓ లక్ష్మీనాథ! నారాయణా! నీ యందు అన్నీ ఉంటాయి. నీవు అన్నిటియందు ఉంటావు. నీవు సర్వాత్ముడవని సహృదయులైన దేవతలు మున్నగువారు అర్థవంతంగా 'వాసుదేవు' డంటూ సర్వదా నిన్ను కీర్తిస్తుంటారు.

నీ మహామహిమ ప్రపంచానికి ఆశీర్వాదమే.

**వ్యాఖ్య: నారాయణుడు సర్వాత్ముడని వర్ణితం.**

నారాయణునికి జగమంతా శరీరమనీ, జగత్తున కంతటికీ నారాయణుడు 'ఆత్మ' అనీ 'సర్వాత్మన్' శబ్దానికి అర్థం.

"ఆత్మాయత్నో ధృతిర్బుద్ధిః స్వభావో బ్రహ్మ వర్ష్మ చ" (అమరం) అని, 'ఆత్మన్' శబ్దానికి అనేకార్థాలున్నాయి.

"అంతః ప్రవిష్టః శాస్తా జనానాం సర్వాత్మా" జనులందరిలోపల ప్రవేశించి శాసించే వాడు కాబట్టి నారాయణుడు సర్వాత్ముడని శ్రుత్యర్థం.

"సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మని ।
ఈక్షతే యోగయుక్తాత్మా, సర్వత్ర సమదర్శనః॥" (భ.గీ.6-29)

యోగసిద్ధుడైన మహాత్ముడు సర్వభూతాలయందు పరమాత్మను, పరమాత్మయందు సర్వభూతాలను, అంటే ఏకత్వంలో నానాత్వాన్ని, నానాత్వంలో ఏకత్వాన్ని దర్శిస్తాడు. కాబట్టి ఎచ్చుతగ్గులు లేకుండా అతడు అన్నింటిని సమానంగా చూస్తాడు.

'సమదర్శనుడు' అంటే, మా - లక్ష్మి - తో కూడియున్నవాడు 'సముడు' సర్వత్ర 'లక్ష్మీసనాథు'ని దర్శిస్తాడని అర్థం.

"మయి తే తేషు చాప్యహం" (భ.గ.9-29) నాయందు వారు, వారియందు నేను ఉంటాను.

"సర్వం సమాప్నోషి తతోఽసి సర్వః" (భ.గీ.11-40) అంతటా నీవే వ్యాపించి ఉంటావు. కాబట్టి 'సర్వ' శబ్దవాచ్యుడవు నీవు అంటుంది గీతామాత.

"మనోఽస్య దైవం చక్షుః" మహాత్ములకు మనస్సే దివ్యనేత్రం.

'సర్వాత్ముడు' నారాయణుడే అని మనోనేత్రంతో చూచిన దేవతలూ, ఋషులూ సార్థకమైన 'వాసుదేవు'డనే పేరుతో కీర్తించారు.

"వసత్యాత్మా జగత్యత్ర తస్మిన్వసతి వా జగత్"

జగమందు ఆత్మగా వసించేవాడు, జగత్తు తనయందు వసించేవాడు 'వాసువు'.

'దీవ్యతీతి దేవః' అంతటా ప్రకాశించేవాడు దేవుడు. 'వాసుశ్చాసౌ దేవశ్చ = వాసుదేవః' జగమంతటా ఉండే, ప్రకాశించే వాడు వాసుదేవుడని వ్యుత్పత్త్యర్థం.

"వాసుదేవ స్సర్వమితి స మహాత్మా సుదుర్లభః" (భ.గీ.)

లోకంలో కన్నులకు కనబడుతున్నా, అద్భుతలీలలను ప్రదర్శిస్తూ నోరారా ఉపదేశిస్తున్నా, సర్వం వాసుదేవుడే అనే అధ్యవసాయంగల మహాత్ముడు చాలా అరుదు. అని వాపోయాడు శ్రీకృష్ణభగవానుడు.

వాస్తవంగా, వాసుదేవునిమహిమ లోకాలకు యోగక్షేమాలను కలిగిస్తుంది, అనడం రెండు వాదాలకు తావులేని మాట.

"వాసనా ద్వాసుదేవస్య వాసితం తే జగత్త్రయమ్।
సర్వభూతనివాసోఽసి వాసుదేవ నమోఽస్తు తే॥"

అన్న వ్యాసమహర్షి ననుసరించి, మనమూ ముప్పొద్దులు "ఓమ్ నమో భగవతే వాసుదేవాయ" అనే 'ద్వాదశాక్షరి'ని జపం చేద్దాం.

**మ. గగనాద్యంచితపంచభూతమయమై కంజాతజాండావళిన్**
**సగుణబ్రహ్మమయాఖ్యతం దనరుచున్ సంసారివై చిత్కళా**
**సుగుణంబై విలసిల్లుదీవు విపులస్థూలంబు సూక్ష్మంబునై**
**నిగమోత్తంసగుణావతంస సుమహానిత్యాత్మ నారాయణా॥ 30**

అర్థం : నిగమ+ఉత్తంస = వేదాలే భూషణాలుగా కలవాడా! గుణ+అవతంస = కల్యాణగుణాలే అలంకారంగా కలవాడా! సుమహా = గొప్ప మహస్సు (తేజస్సు) కలవాడా! నిత్య+ఆత్మ = మార్పులేని - ప్రకృతిబద్ధంకాని - ఆత్మ కలవాడా! ఓ, నారాయణా! ఈవు = నీవు; కంజాతజ + అండ + ఆవలిన్ = బ్రహ్మాండ సముదాయమందు; గగన+ ఆది + అంచిత, పంచభూతమయమై = ఆకాశం మొదలైన వాటిచే ఒప్పిన ఐదు భూతాల వికృతియై; సగుణ బ్రహ్మమయ+ఆఖ్యతన్ = గుణాలతో కూడిన బృహద్రూపంచేత పూర్ణుడ వనే పేరుతో; తనరుచున్ = ఒప్పుతూ; సంసారివై = ప్రపంచ మందున్న వాడవై; చిత్ కళా సుగుణంబై = జ్ఞానకళతో సుగుణమై; విపుల స్థూలంబునై = విస్తారమైన స్థూలరూపమై; సూక్ష్మంబునై = మిక్కిలిచిన్న రూపమై; విలసిల్లుదు = ప్రకాశింతువు.

తా: వేదశాస్త్ర ప్రతిపాద్యుడా! కల్యాణగుణాలంకారుడా! బృహద్రూపమూ, తేజస్సూ కలవాడా! నిత్యాత్మ! నారాయణా! నీవు బ్రహ్మాండమందు ఆకాశాదులచే ఒప్పిన పంచభూతాల రూపమై 'సగుణబ్రహ్మం' అనే పేరుతో వ్యాపిస్తూ, సంసారివై, చిత్కళా సంపన్నుడవై, స్థూల సూక్ష్మ రూపాలతో శోభిస్తుంటావు.

**వ్యాఖ్య : నారాయణుని విరాడ్రూపవర్ణన.**

శబ్దప్రమాణగమ్యుడు నారాయణుడు. "అజాయమానో బహుధా విజాయతే" పుట్టుక లేనివాడు అనేక రూపాలను ధరిస్తాడు అన్నది పురుషసూక్తం. "బృహత్త్వం చ స్వరూపేణ గుణైశ్చ" (శ్రీభాష్యం). నిరవధిక స్వరూపమూ, నిరతిశయగుణాలూ కలవాడు. పరబ్రహ్మ తేజస్సుకు ఎల్లలు లేవు. "అజో నిత్యః శాశ్వతోఽయం పురాణః" అంటుంది ఉపనిషత్తు. కాబట్టి పుట్టడం, పెరుగడం, మారడం లాంటి షడూర్ములు లేని, నిత్యాత్ముడు, నారాయణుడు. ఆయనకు స్వరూప గుణ విభూతులు లేవని భావించరాదు. ప్రపంచమంతా నారాయణుని స్వరూపమే.

"భూస్తోయమగ్నిః పవనః ఖమాది ర్మహానజాదిర్మన ఇంద్రియాణి।
సర్వేంద్రియార్థా విబుధాశ్చ సర్వే యే హేతవస్తే జగతోఽంగభూతాః॥"

నేల, నీరు, నిప్పు, గాలి, నింగి, అహంకారం. మహత్తత్వం, ప్రకృతి, పురుషుడు, మనస్సు, ఇంద్రియాలు, ఇంద్రియ విషయాలు, వాటికధిష్ఠాన దేవతలు, సమస్త చరాచర జగత్తు, దాని వ్యవహారకారణం మొదలైనవన్నీ నారాయణుని అంగరూపాలే.

"అగ్నిర్ముఖం తేఽవని రంఘ్రి రీక్షణం
సూర్యో నభో నాభి రథో దిశః శ్రుతిః।
ద్యౌః ఖం సురేంద్రా స్తవ బాహవోఽర్ణవాః
కుక్షి ర్మరుత్ప్రాణబలం ప్రకల్పితమ్॥"
"రోమాణి వృక్షౌషధయ శ్శిరోరుహా
మేఘాః పరస్యాస్థినఖాని తేఽద్రయః।
నిమేషణం రాత్ర్యహనీ ప్రజాపతి
ర్మేఢ్రస్తు వృష్టిస్తవ వీర్య ఇష్యతే॥" (10స్కం. 40 అధ్యా. 13, 14)

అగ్ని నారాయణునిముఖం, భూమి పాదాలు, సూర్యచంద్రులు నయనాలు, ఆకాశం నాభి, దిక్కులే చెవులు, స్వర్గమే తల, దేవేంద్రాదిదేవతలు బాహువులు, సముద్రం కడుపు, గాలి ప్రాణశక్తిరూపంగా సంకల్పితాలు.

ఓషధులూ, తరువులూ భగవంతునిరోమాలు, మేఘాలు తలవెంట్రుకలు, పర్వతాలు ఎముకలు గోళ్ళు, రేయింబవళ్ళు రెప్పలు మూయడం తెరువడం, ప్రజాపతి శేఫం, వృష్టియే వీర్యం - ఇలా విశ్వమంతా నారాయణుని శరీరమనీ, ఇదే ఆయన స్థూలకార్యరూపమనీ శ్రీమద్భాగవతం విశదీకరిస్తుంది. విశ్వమే సగుణబ్రహ్మగా సంభావితం.

సూక్ష్మరూపంగా సర్వభూతాలహృదయంలో అంతర్యామిగా ఉన్నాడు. ప్రపంచానికీ పరమాత్మకూ శరీరశరీరిభావసంబంధముంది.

"ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశేఽర్జున! తిష్ఠతి।
భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా॥" (భ.గీ)
సర్వభూతాలహృదయంలో పరమాత్ముడున్నాడు
"అధోనిష్ట్యావితస్త్యాం తు నాభ్యాముపరితిష్ఠతి" (తై.నా.ఉ.)

శరీరంలో కంఠానికి క్రింద, నాభికి జేనెడుమీద తామరమొగ్గలాంటి, అంగుష్ఠమంత మాంసపుముద్ద అధోముఖంగా ఉంటుంది. ఇదే హృదయపద్మకోశం. దీనిలోపల జీవాత్మతోపాటు పరమాత్మ ప్రవేశిస్తాడు. శరీరమొక బస్సు. పరమాత్మ చోదకుడు డ్రైవరు. కర్మ అనే ధనంతో దాని ఫలమనే టిక్కెట్టు కొని జీవుడనే ప్యాసెంజర్ ఆబస్సెక్కుతాడు. టిక్కెట్టుకు తగినంత దూరపుస్టేజీవరకు బస్సుమీద త్రిప్పి దించేస్తాడు.

నారాయణుడూ సంసారియే. గొప్పకుటుంబి. ఆయనకు కర్మల ఫలమందు అపేక్ష లేదు కాబట్టి కర్మలు ఆయనను అంటుకోవు. "న మాం కర్మాణి లింపంతి, న మే కర్మఫలే స్పృహా" (భ.గీ.4-14)

జీవుడు కర్మపరాధీనుడైన సంసారి కాబట్టి దాని ఫలరూపమైన సుఖదుఃఖభోగాన్ని అనుభవించి తీరుతాడు.

కుమ్మరి పురుగు బురదలోనే తిరుగుతున్నా, దాని శరీరానికి బురద అంటుకోదుకదా! తామరాకు నీటిలోనే ఉన్నా, నీటి తడి తామరాకుకు అంటదు. అలాగే తామరసాక్షునికి కర్మ అంటదు. నారాయణుడు సంసారమందు ఏరూపంలో ఉన్నా ఆయనది శుద్ధ సత్త్వగుణం కలిగిన రూపం. అది పంచోపనిషన్మయం. "పరమేష్ఠీ పుమాన్విశ్వో నివృత్త స్సర్వ ఏవ హి" ఇది బీజాక్షరాలతోనూ సంకేతితం. 1. షాం, పరమేష్ఠ్యాత్మకం 2. యాం, పురుషాత్మకం 3. రాం, విశ్వాత్మకం 4. వాం, నివృత్తాత్మకం 5. లాం, సర్వాత్మకం. ఇలా సగుణబ్రహ్మమయమైన బ్రహ్మాండమందు నారాయణుడు స్థూలసూక్ష్మరూపాలతో, చిత్కళాసుగుణంగా విలసిల్లుతాడని ఈ సుకవి విశదతమంగా స్తుతించాడు.

# నామప్రభావదశకం

**మ. ఎలరారన్ భవదీయనామకథనం బేమర్త్యుచిత్తంబులోఁ**
**బొలుపారం దగిలుండెనేని యఘముల్ పొందంగ నెట్లోపెడున్**
**కలయం బావకుచేతఁబట్టువడు నక్కాష్ఠంబుపైఁ గీటముల్**
**నిలువన్నేర్చునె భక్తపోషణకృపా నిత్యాత్మ నారాయణా॥** 31

అర్థం : భక్తపోషణకృపా = ఆశ్రితజనులనుపోషించడమందు దయగల వాడా! నిత్య+ఆత్మ = స్థిరమైన ఆత్మకలవాడా! నారాయణా! ఎలరారన్ = ఉత్సాహంగా, భవదీయ నామకథనంబు = నీనామ సంకీర్తనం; ఏ మర్త్య చిత్తంబులో = ఏ మనిషియొక్క మనస్సునందు, పొలుపారన్ = అందంగా; తగిలి+ఉండెన్+ఏని = పీడకున్నట్లైతే; అఘముల్ = పాపాలు; ఎట్లు, పొందంగన్, ఓపెడున్ = ఎలా ఉండజాలును? కలయన్ = అంతటా వ్యాపించి; పావకుచేత = అగ్నిచేత; పట్టుబడు = తగులబడే; ఆ+కాష్ఠంబుపైన్ = ఆకట్టెమీద; కీటముల్ = పురుగులు; నిలువన్, నేర్చునే = నిలువశక్యమా? బ్రతుకజాలునా?

తా: భక్తులను రక్షించే దయగలవాడా! నిత్యాత్మ! ఓ నారాయణా! మనిషి హృదయంలో నీనామజపం తగిలి ఉంటే, పాపాలు ఎలా పట్టుకొని ఉంటాయి? అగ్గి తగుల్కొని అంతటా మండుతున్న కట్టెమీద క్రిమికీటకాదులు నిలిచి బ్రతుకజాలునా?

**వ్యాఖ్య : నారాయణ నామమాహాత్మ్యం వర్ణితం.**

భగవంతుని అనుగ్రహానికి పాత్రమైన పాండవుల వంశంలో జన్మించిన 'శతానీకు' డనేరాజు ప్రజారంజకంగా రాజ్యాన్ని పాలించేవాడు. ప్రజలకు పారమార్థికమైన శ్రేయస్సును కూడా కలిగించాలనే భావనతో 'శౌనకమహర్షి' దగ్గరికి పోయి ప్రార్థించాడు. "రాగాదిభి రనిర్జితైః" (విష్ణుధర్మం). రాగద్వేషాది దుర్గుణాలచే ఇంద్రియలోలురై, సంసారంలో అట్టడుగున పడియున్న ఈలోకులు సులభంగా ఉజ్జీవించే ఉపాయమేదైనా ఉందా? అని అడిగాడు. 'పాపం ఎక్కువగా ఉన్నందువల్ల కర్మజ్ఞానభక్త్యాది సాధనాలను అనుష్ఠించజాలరు. పాపభూయిష్ఠులైన వారు కూడా ఈ కలికాలంలో సులభంగా పవిత్రులై ఉజ్జీవించడానికి భగవన్నామ సంకీర్తనమే ఉపాయ'మని ఆ మహర్షి చెప్పాడు.

"ధ్యాయన్ కృతే, యజన్ యజ్ఞైః త్రేతాయాం, ద్వాపరేఽర్చయన్।
యదాప్నోతి తదాప్నోతి కలౌ సంకీర్త్య కేశవమ్॥ (వి.పు.6.2.)

కృతయుగంలో ధ్యానిస్తూ, త్రేతాయుగంలో యజ్ఞాలుచేస్తూ, ద్వాపరయుగంలో పూజిస్తూ, పొందిన ఫలాన్ని, కలియుగంలో భగవన్నామాన్ని కీర్తించినంతమాత్రంచేతనే పొందుతాడు మానవుడు అని మహర్షులతో చెప్పాడు వ్యాసమహర్షి.

"అత్యంతదుష్టస్య కలే రయమేకో మహాన్గుణః।
కీర్తనాదేవ కృష్ణస్య ముక్తబంధః పరం వ్రజేత్॥" (వి.పు. 6.3.31)

కడు దుష్టమైన కలియుగంలో ఇదొక్కటే గొప్పగుణం. శ్రీకృష్ణభగవానుని

నామాన్ని కీర్తించడంవల్లనే ప్రకృతి బంధం విడిపోతుంది. పరమపదం లభిస్తుంది అన్నాడు పరాశరమహర్షి.

"నందంత్యుదిత ఆదిత్యే నందంత్యస్తమితే రవౌ।

మనుష్యా నావబుద్ధ్యంతే ఆత్మనో జీవితక్షయమ్॥" (రామాయణం)

లోకంలో మనుష్యులు ప్రొద్దు పొడవగానే సంపాదించుకోవడానికి అవకాశం వచ్చిందనీ, ప్రొద్దు క్రుంకగానే సుఖించడానికి వీలుకలిగిందనీ సంతోషిస్తారు. కానీ ఆయుష్యం వ్యర్థంగా గడచిపోతున్నదని విచారపడరన్నాడు వాల్మీకి.

"సంసారే కిం సారం? కంసారేశ్చరణకమలపరిభజనమ్"

కంసారియైన శ్రీకృష్ణుని పాదారవింద భజన చేయడమే సంసారంలో సారమన్నాడు లీలాశుకుడు.

శాస్త్రంచేతమాత్రమే బోధింపబడే మోక్షానందం అప్రత్యక్షం. భగవన్నామ సంకీర్తనానందంమాత్రం ప్రత్యక్షసిద్ధంకదా!

"తద్యథేషీక తూలమగ్నౌ ప్రోతం ప్రదూయేత"

శుద్ధమనస్సుతో భగవంతుణ్ని ధ్యానిస్తూ, నోరారచేసే నామసంకీర్తనం, నిప్పురవ్వ బూరుగుదూదికుప్పను కాల్చినట్లు, పాపరాశిని బుగ్గి, బూడిదచేస్తుంది. మూడక్షరాల నామాన్ని స్మరిస్తే ముక్తి లభిస్తుంది.

సూర్యవంశీయుడైన విశ్వరథునిపుత్రుడు, క్షత్రబంధువు మహాపాపిష్ఠుడు. ఋషులను హింసించేవాడు. నరమాంసభక్షకుడు. ఒకప్పుడు ఒక మహర్షి దప్పికతో సరస్సుదగ్గరకు పోయి కాలు జారి అందులో పడ్డాడు. ఈ పాపిష్ఠుడు ఆ మహర్షిని చూచిన వెంటనే క్రూరభావం సన్నగిల్లింది. కాబట్టి ఆయనను నీటినుంచి వెలికితీశాడు. అడవిలోనే ఉపచారాలు చేశాడు. మహర్షిని స్పృశించిన క్షణంలోనే ప్రశాంతత ఏర్పడింది.

యోగదృష్టితో ఘోరాకారుని వృత్తాంతాన్ని తెలుసుకొన్న మహర్షి, అతనితో క్రూరకృత్యాలను మానుమని చెప్పాడు. అతడు వీలుగాదన్నాడు.

"చింతాం చకార స మునిః క్షత్రబంధౌ దయాపరః"

మహర్షి ఎలాగైనా క్షత్రబంధువును సన్మార్గునిగా చేయతలచాడు.

'బంధు' ఉత్తర పరమైతే నీచార్థకం. నీచుడైన క్షత్రియుడనే అర్థం కలది 'క్షత్రబంధు' నామం. "ఓయి, క్షత్రబంధూ! నీవు తుమ్మినప్పుడు, దగ్గినప్పుడు, గోవిందా! అంటుండవయ్యా" అని గోవిందనామోపదేశం చేశాడు. అతడు అలాగే, గోవింద నామాన్ని ఉచ్చరించడంవల్ల తర్వాతి జన్మలో ఉత్తమజన్మాన్ని పొందాడు. పూర్వజన్మ స్మరణ కలిగి ఉండడంవల్ల గోవింద నామాన్ని కీర్తించాడు. మోక్షం పొందాడు. (విష్ణుధర్మ పురాణం 97 అధ్యాయం)

పాపిష్ఠుల్లో అగ్రేసరుడైన క్షత్రబంధువు నిత్య సూరులనుభవించే మోక్షసామ్రాజ్యభోగాన్ని పొంద గలిగాడు. అంటే ఇదేమి కొత్తగా లభించినది కాదు. తాను అజ్ఞానంచేత పోగొట్టుకొన్న వస్తువును భగవన్నామ సంకీర్తన మహిమచేత తిరిగి పొందగలిగాడని భావం.

"పార్శ్వద్వయేఽగ్ని సందీప్తే యథాకాష్ఠే పిపీలికా!" అన్నట్లూ రెండువైపులా అగ్ని తగిలిమండే కట్టెమీద చీమలు, కీటకాలు నిలిచి బ్రతుకజాలవు. అలాగే, మానవుని మనస్సు నారాయణనామకీర్తనమందు మగ్నమైతే పూర్వోత్త రాఘాలన్నీ అతనియందు పొందికగా ఉండజాలవు. కీటకాలవలె పాపాలు నశించి పోతాయని భావం.

'కీటకాలు నిల్వవు. పాపాలు నిల్వవు' అనే రెండు, వేర్వేరు సామాన్య ధర్మాలను రెండు వాక్యాల్లో బింబ ప్రతిబింబరూపంగా చెప్పడంవల్ల ఈ పద్యం (సాధర్మ్య) దృష్టాంతాలంకారసజ్జితం.

**మ. కలయం దిక్కులు నిండి చండతరమై కప్పారు మేఘౌఘముల్**
**వెలయన్ ఘోరసమీరణస్ఫురణచే వే పాయుచందంబునన్**
**జలదంభోళిమృగాగ్నితస్కరరుజాశత్రూరగవ్రాతముల్**
**దొలఁగు న్మీదగు దివ్యమంత్రపఠనన్ దోషఘ్న నారాయణా॥ 32**

అర్థం : దోషఘ్న = పాపాలను నశింపజేయువాడా! నారాయణా! కప్పారు, మేఘ+ఓఘముల్ = నల్లని మొగుళ్ళ గుంపులు; దిక్కులు, కలయన్ = దిక్కులంతట; నిండి = వ్యాపించి; చండతరమై = కడుతీవ్రమై; వెలయన్ = మెరువగా; ఘోర, సమీరణ, స్ఫురణచే = దారుణమైనగాలి వీచడంచేత; వే = వేగంగా; పాయు, చందంబునన్ = తొలగిపోయే రీతిగా; జల-వ్రాతముల్! జల = నీటియొక్క; దంభోళి = పిడుగులయొక్క; మృగ = క్రూరజంతువులయొక్క; అగ్ని = నిప్పుయొక్క; తస్కర = దొంగలయొక్క; రుజా = రోగాలయొక్క; శత్రు = పగతురయొక్క; ఉరగ = పాముల యొక్క; వ్రాతముల్ = సముదాయాలు; మీదగు, దివ్య మంత్ర పఠనన్ = గుణాలు ప్రకాశించే మీనామ మంత్రాన్ని చదువడం చేత; తొలగున్ = విడిపోతాయి.

తా: దోషాలను పోగొట్టే ఓ నారాయణా! నల్లని మేఘాలు దిక్కుల నిండా వ్యాపించి ప్రచండమై వెలయగా మహావాయువు వీచడంచేత వేగంగా తొలగిపోయే రీతిగా నీరు, పిడుగులు, మృగాలు, అగ్ని, దొంగలు, రోగాలు, శత్రువులు, పాములు వీటన్నిటివల్ల కలిగే బాధలన్నీ నీ నామ మంత్రాన్ని పఠించడంచేత తొలగిపోతాయి.

**వ్యాఖ్య : నారాయణ మంత్ర జపంవల్ల ఈతి బాధలన్నీ తొలగుతాయని వర్ణితం.**

పరులను హింసించడం, పరస్త్రీలను పరిగ్రహించడం, పరద్రవ్యాన్ని అపహరించడం,

అసత్యం పలుకడం, తిన దగని వాటిని తినడం, తనను తాను గొప్పగా చెప్పుకోవడం లాంటి అకృత్యాలను చేయడం దోషం. సర్వప్రాణులను తననువలె చూడడం, ఇతరులకు సహాయపడడంలాంటి కృత్యాలను చేయకపోవడమూ దోషమే. తన దోషాలను తాను తలచుకోవడం భయహేతువు. భగవంతుని గుణాలను అనుసంధించడం అభయహేతువుకదా! మొదట అవివేకంచేత చెప్పరానన్ని పాపాలను చేసి తర్వాత నేనెన్ని నరక బాధలను అనుభవించాలో, అని దిగులు పడుతుంటారు. చేసిన దోషాలకు కలిగే ఫలం అనుభవించక తప్పదు. ఆ పాపాల ఫలమే నీరు, నిప్పు, మృగ, వ్యాళ, శత్రు, తస్కర, వ్యాధి రూపంగా కలిగే బాధలు. వాటిని అనుభవిస్తున్నప్పుడు మహాదుఃఖం కలుగుతుంది. మనస్సులో పెనుభూతంలాగా భయమావరిస్తుంది. అందుకే

"యన్నామసంకీర్తనతో మహాభయాత్
విమోక్షమాప్నోతి న సంశయం నరః॥"

మహర్షులు, నామసంకీర్తనమే మహాభయాన్ని నివారించడానికి ప్రబల హేతువని నిస్సంశయంగా నమ్ముమంటున్నారు.

"యత్రాష్టాక్షరసంసిద్ధో మహాభాగో మహీయతే।
న తత్ర సంచరిష్యంతి వ్యాధిదుర్భిక్షతస్కరాః॥"

నారాయణ మంత్ర - అష్టాక్షరీమంత్ర సిద్ధుడు సర్వలోకపూజ్యుడు. ఆయన ఉన్న పరిసరాల్లో కరువు, కాటకాలు, రోగాలు, ఈతి బాధలుండవన్నారు.

"సంకీర్త్య నారాయణశబ్దమాత్రం
విముక్తదుఃఖాస్సుఖినో భవంతి॥"

నారాయణ అనే నామాన్ని కీర్తించినంత మాత్రాన సకల దుఃఖాలు తొలగినవారై సుఖంగా జీవిస్తారని మహానుభావుల మాట.

ఈ పద్యమందు వస్తుప్రతివస్తూపమాలంకారం ఉంది.

'దివ్య మంత్ర పఠనం, సమీరణ స్ఫురణం' అనే పదాలకు సాదృశ్యం ఉంది.

'శత్రూరగ వ్రాతముల్, మేఘౌఘముల్' అనే శబ్దాలకు సాదృశ్యం ఉంది.

'పాయు, తొలగు' అనే ఒకే అర్థం గల రెండు క్రియా పదాలచే సామాన్య ధర్మం చెప్పబడింది. 'చందంబునన్' - ఉపమావాచకం ఉంది. పెనుగాలి వీచుటచే మేఘాలు పాయుచందాన, దివ్య మంత్ర పఠనచే శత్రూరగ వ్రాతముల్ తొలగును; అని ఏక వాక్యంగా ఉంది కదా! ఈ పద్యంలో 'శత్రోరగ' అచ్చు తప్పు ఉంది. 'శత్రూరగ' (సవర్ణ దీర్ఘమేకాదేశమైన) పదం సాధువు.

మ. కలుషాగాధవినాశకారి యగుచుం గైవల్యసంధాయియై
నలి నొప్పారెడు మంత్రరాజమగు నీ నామంబు ప్రేమంబుతో
నలరన్నెవ్వని వాక్కునం బొరయదే నన్నీచుఘోరాత్మయున్
వెలయన్ భూరుహకోటరం బదియ సూ వేదాత్మ నారాయణా॥ 33

అర్థం : వేదాత్మ = వేదమే ఆత్మగా కలవాడా! నారాయణా! కలుష+అగాధ వినాశకారి, అగుచున్ = ఎన్నరాని పాపాన్ని నశింప జేస్తూ; కైవల్య సంధాయియై = మోక్ష మొసగూర్చేదై; నలిన్+ఒప్పారెడు = గౌరవంగా ఉండే; మంత్ర రాజము+అగు = మంత్రాలలో శ్రేష్ఠమైన; నీ నామంబు; ప్రేమంబుతో = భక్తితో; అలరన్ = ప్రకాశింపగా; ఎవ్వని; వాక్కునన్ = వాగింద్రియం - నాలుక - ఉన్న నోటియందు; పొరయదేని = పలుకబడక పోతే; ఆ నీచు, ఘోర+ఆత్మయున్ = ఆ అధముని దుర్భరమైన శరీరం కూడా; వెలయన్ = ప్రకాశించగా; అదియ = అదే - ఆనోరే; భూరుహ, కోటరంబు, సూ = చెట్టుతొఱ్ఱసుమా!

తా : వేదాత్మ! నారాయణా! అనంత పాపరాశిని నశింపచేసేదవుతూ మోక్షాన్నీ ప్రసాదించే, గౌరవంతో కూడిన మంత్రరాజమూ అయిన నీ నామాన్ని ఎవడైనా నోట పలుకక పోతే, ఆ నీచుని ఘోర శరీరం చెట్టుగానూ, నోరు చెట్టు తొఱ్ఱగానూ చూడతగినదే.

**వ్యాఖ్య : నారాయణనామం ప్రేమతో అనుసంధేయం.**

ధర్మాధర్మాలను తెలిపేది వేదం. "విందంతి యతో ధర్మాధర్మావితి వేదః" వేదం శబ్దరూపం. శబ్దం శరీరమైతే, అర్థం ఆత్మ. అర్థసహితమైనదే శబ్దం. వేదాత్ముడంటే వేదమే శరీరంగా కలవాడు. వేదానికి విషయమైనవాడని భావం. "నాఽవేదవిన్మనుతే తం బృహంతమ్" అనే శ్రుతిరీతిగా, వేదం తెలియని వ్యక్తి వేదవిషయమైన దైవస్వరూపాన్ని తెలుసుకొనలేడు.

వేదశాఖాగ్రమందు వికసితమంత్రపుష్పం ఇలా పరిమళిస్తుంది.

"నారాయణాయ విద్మహే, వాసుదేవాయ ధీమహి, తన్నో విష్ణుః ప్రచోదయాత్"

పూచేదీ, పరిమళించేదీ పుష్పం. మననం చేస్తే రక్షించేది మంత్రం.

"ఓమిత్యగ్రే వ్యాహరేత్ । నమ ఇతి పశ్చాత్। నారాయణాయేత్యుపరిష్టాత్" - ఓమ్ మొదట, తర్వాత 'నమః', ఆ పైన 'నారాయణాయ' అని నారాయణ నామమంత్రాన్ని ఉచ్చరించే విధానాన్ని వేదం బోధిస్తుంది.

1. 'ఓమ్ నమో నారాయణాయ' - అష్టాక్షరి
2. 'ఓమ్ నమో భగవతే వాసుదేవాయ' - ద్వాదశాక్షరి

3. 'ఓమ్ నమో విష్ణవే' - షడక్షరి

అంతటా వ్యాపించి ఉండే భగవంతుని స్వరూప స్వభావాలను తెలిపేవి కాబట్టి, ఈ మూడింటిని 'వ్యాపక మంత్రా' లంటారు వేదవిదులు.

అవ్యాపకమంత్రాలకంటె వ్యాపక మంత్రాలు శ్రేష్ఠమైనవి.

ఈ మూడు వ్యాపకమంత్రాలలో పరమార్థాన్ని - జీవేశ్వరసంబంధాన్ని బోధించే అష్టాక్షరినే 'మంత్రరాజ' మంటారు. దీనికే తిరుమంత్రమనీ మూల మంత్రమనీ పేరు. తక్కిన రెండు వ్యాపకమంత్రాలలో 'రక్ష్యరక్షకభావం' పూర్ణంగానూ, విశదతమంగానూ లేదంటారు విజ్ఞులు. 'ఓమ్' శబ్దం అత్యల్పమయినా, నిగూఢమైన అర్థం కలది.

i. మంత్రార్థం : 'ఓమ్' భగవద్వాచకం. 'అ, ఉ, మ' అనే మూడక్షరాలున్న శబ్దమిది. 'కా దీప్తిః', 'కిం పరాయణమ్' అనే ప్రశ్నకు అక్షరాద్దీప్తి రుచ్యతే' 'వాతాద్విష్ణోర్బలమాహుః' అని సమాధానం. ప్రకాశించేది అక్షరం. గాలికి స్పర్శగుణం ఉంది. కాబట్టి అక్షరాన్ని ఉచ్చరించడం స్పర్శవల్ల. అది సర్వత్ర వ్యాపించే శీలం కలిగిన భగవంతుని ప్రయత్నానికి బలమిస్తుందంటారు భగవద్విషయవేత్తలు.

'అవ' రక్షణే - అని ధాత్వర్థం. అన్ని శబ్దాలకు కారణమైన అకారం "అక్షరాణా మకారోఽస్మి" (భ.గీ) అన్నట్లు సర్వలోకరక్షకుడైన నారాయణుడనే అర్థమిస్తుంది. ఉకారం లక్ష్మీవాచకం. మకారం జీవవాచకం.

"అకారేణోచ్యతే విష్ణుః ఉకారేణ రమోచ్యతే।
మకారేణ తయోర్దాస ఇతి ప్రణవలక్షణమ్॥"

మకారం, కకారంనుంచి 25వ అక్షరం. ప్రకృతికి చేతనత్వం లేని లక్షణాలు 24 ఉన్నాయి. మహత్తు, అహంకారం, బుద్ధి, మనస్సు (4). పంచమహాభూతాలు (5) జ్ఞానేంద్రియాలు (5) కర్మేంద్రియాలు (5) శబ్ద స్పర్శ రూపరసగంధాలనే ఇంద్రియార్థాలు (5) జీవుడు మాత్రమే చేతనత్వంగల 25 వ తత్త్వం.

లక్ష్మీదేవి పతికీ, సుతునికీ మధ్యన ఉండి వారి ఆలన, పాలన చూస్తుంది నారాయణుడు సర్వదా లక్ష్మీసమేతుడు కాబట్టి నారాయణునికి జీవుడు కూడి యుంటేనే ఆనందం. "అకారార్థాయైవ స్వమహమ్" - విశేష మేమంటే, ఉకారానికి 'ఏవ' కారార్థమూ ఉంది.

అ = శ్రియః పతికొరకు, ఉ = మాత్రమే, మ్ = జీవుడు దాసుడై ఉన్నాడు. పరమాత్మకు దాస్యం చేయడమే జీవాత్మ స్వరూపం.

రక్షింపబడే జీవుడు, రక్షకుడైన నారాయణునికే సేవచేయడమే మోక్షఫలమని ఓంకారార్థం.

ఉకారార్థం నమః పదంలో ఉంది.

అకారార్థం నారాయణ పదంలో ఉంది.

మకారార్థం 'ఆయ' (చతుర్థీ విభక్తి ప్రత్యయం)లో ఉంది.

ii. 'నమః' పదంలో రెండక్షరాలున్నాయి. (అవి రెండు పదాలే) మః = నాకు గానీ, ఇతరులకు గానీ దాసుడను, న = కాను. భగవంతుణ్ని పొందడానికి మూడు ఆటంకాలున్నాయి.

1. స్వరూపవిరోధి : జీవుడు నారాయణునికే దాసుడను అనుకోక 'నేను, నాది' అని అహంకరించడం.

2. ఉపాయ విరోధి : నారాయణుడే ఉపాయమని విశ్వసించక కర్మ, జ్ఞాన, భక్తులే ఉపాయాలని నమ్మడం.

3. ప్రాప్య విరోధి : పొందదగిన మోక్షానందాన్ని కోరక, లౌకిక సుఖాలను పొందగోరడం.

ఈ మూడు రకాల విరోధులను నశింపజేసేది 'నమః' పదం. 'నాకేమీ లేదు, అంతా నీదే, నేను నీవాడనే' అని ప్రార్థిస్తూ భగవద్దాస్యం చేస్తుంటే రక్షకుడు మోక్షమిస్తాడని అర్థం.

iii. నారాయణ = నార+అయన

1. పదార్థాలన్నిటికి పరమ గతియైనవాడు.

2. అన్ని వస్తువులకు అంతర్యామియైనవాడు నారాయణుడు.

"ఆయ" = కొరకు సర్వదేశ, సర్వకాల, సర్వావస్థలయందు శ్రీమన్నారాయణుని కొరకు సర్వకైంకర్యం చేస్తుంటాను అని భావం.

"దీయమానార్థశేషిత్వం సంప్రదానత్వమిష్యతే"

ఈయబడే వస్తువుకు ప్రతిగృహీతగా ఉండడం సంప్రదాన మనబడుతుంది. పరులిచ్చిన దాన్ని గ్రహించడమూ, తెలుపడమూ ఉచితం కాదు. అయినా, సర్వేశ్వరుడు తనకు సమర్పించినంతమాత్రాన తనకు శేషభూతమైన వస్తువును తానే రక్షించుకొనే రీతిగా సమర్పించడాన్నిబట్టి వ్యాపకమంత్రాలయందున్న చతుర్థీవిభక్తిని సంప్రదానార్థపరంగా అహిర్బుధ్న మహర్షి వ్యాఖ్యానం చేశాడు.

"పదత్రయేఽత్ర సంక్షేపాద్భావ్యాఽనన్యార్హశేషతా।
అనన్యోపాయతా స్వస్య తథా ఽనన్యపుమర్థతా॥"

'ఓమ్ నమో నారాయణాయ' అనే ఈ మంత్రరాజమందున్న మూడు పదాలచేత 1) అనన్యార్హశేషత్వమూ 2) అనన్యోపాయత్వమూ 3) అనన్య ప్రయోజనత్వమూ సంగ్రహంగా తెలుపబడినాయి.

ఎనిమిది అక్షరాలు అనే ఎనిమిది దారాలతో, మూడు పదాలు అనే మూడు పురులు వేసిన మంగళసూత్రం లాంటిది 'మంత్రరాజం'. ఇది భర్తయైన నారాయణునిచేత భార్యయైన జీవునిగళమందు బంధింపబడిన పవిత్రబంధం.

దేవుడు స్వతంత్రుడు, జీవుడు పరతంత్రుడు. కాబట్టి తిరుమంత్రాన్ని అనుసంధించుకొంటూ, "దేవరవారికైంకర్యంకోసం దాసుణ్ని అంగీకరించండి. స్వామీ!" అని ప్రార్థించి, దండం సమర్పించి ఆత్మనివేదనం చేయాలి "మూలమంత్రేణ స్వాత్మానం దేవాయైవ నివేదయేత్" అని భగవద్రామానుజులు 'నిత్యగ్రంథం' లో అనుగ్రహించారు.

తన ఆనందంకోసం కాక, భగవంతుని ఆనందంకోసమే భగవంతుడు తనతో సేవ చేయించుకొనే రీతిగా, జీవుడు ప్రార్థించడం పరమార్థం. దీన్నే భరన్యాసం, శరణాగతి అంటారు.

నారాయణునికంటె అధిక మహిమ కలది ఆయన నామం. 'నామి' బంగారు ముద్ద అయితే 'నామం' గళంలో ధరింపదగిన ఆభరణమే.

"ఐహలౌకికమైశ్వర్యం స్వర్గాద్యం పారలౌకికమ్।
కైవల్యం భగవంతం చ మంత్రోఽయం సాధయిష్యతి॥"

ఈ మంత్రం ఆయా అధికారులకు ఇహలోకైశ్వర్యాన్నీ స్వర్గాదిపరలోకైశ్వర్యాన్నీ, ఆత్మానుభవరూపమైన కైవల్యాన్నీ, భగవత్కైంకర్యరూపమైన మోక్షఫలాన్నీ సాధించిపెడుతుంది.

"సాంకేత్యం పారిహాస్యం చ స్తోభం హేళనమేవ చ।
వైకుంఠనామగ్రహణ మశేషాఘవినాశనమ్॥ (భాగవతం)

తన సంతానానికి పేరు పెట్టి పిలిచినా, పరిహాసంగానో, హేళనగానో ఆ పేరు చెప్పినా, భగవన్నామం సంపూర్ణంగా పాపాలను అణచివేస్తుంది.

ఈ మంత్రరాజం కలుషౌఘవినాశకారి.

అనాదిగా చేయబడిన పలురకాల పాపాలన్నీ తేనెతెట్టెకు ఈగలు ముసరినట్లు ఆత్మను ఆవరించి, నేనేముందు అనే భావంతో ఫలమీయడానికి సిద్ధంగా ఉంటాయి నేతి కుండకు పట్టిన చీమల రీతిగా పాపాలు వ్యాధిరూపంగా దేహాన్ని ఆవరించి ఉంటాయన్నారు శ్రీవిష్ణుచిత్తులు. అణుపరిమాణంగా ఉండే జీవుడు అగాధమైన పాప సముద్రంలో పడి దరిచేరలేక దుఃఖపరంపరచే క్షోభిస్తుంటాడు. జీవుడు అంతపాపం చేసే శక్తి కలవాడా? అంటే, కొన్ని వేల బ్రహ్మ కల్పాలకాల మనుభవించినా తీరనంత పాపరాశిని జీవుడు అర్ధక్షణంలో చేయగలుగుతాడు. "యద్బ్రహ్మకల్పనియుతాను భవేఽప్యనాశ్యం" అన్నారు శ్రీవత్సాంకమిశ్రులు.

"మేరుమందరమాత్రోఽపి రాశిః పాపస్య కర్మణః।
కేశవం వైద్య మాసాద్య దుర్వ్యాధిరివ నశ్యతి॥"

మేరుపర్వతం, మందరపర్వతంలాగా పెరిగిన పాపరాశి కూడా, గొప్ప వైద్య ప్రభావంచేత గడ్డువ్యాధి నశించినట్లు, భగవంతుని సంకల్పశక్తిచేత నిశ్శేషంగా నశించిపోతాయట.

"రోగాపద్భయదుఃఖేభ్యో ముచ్యంతే నాత్ర సంశయః।
అపి నారాయణేత్యేత చ్ఛబ్దమాత్రప్రలాపినః॥" (నారదీయమ్ 1.38)

'నారాయణ' శబ్దాన్ని ఉచ్చరించినంతమాత్రాన మానవులకు రోగాలూ, ఆపదలూ ఉండవు. జీవితంలో భయమూ, దుఃఖమూ లేకుండా వారు సుఖంగా బతుకుతూ, అంతంలో ముక్తిని పొందుతారు.

"వ్యక్తం హి భగవాన్ దేవః సాక్షాన్నారాయణః స్వయమ్।
అష్టాక్షరస్య రూపేణ ముఖేషు పరివర్తతే॥" (నారదీయమ్ 1-32)

నారాయణుడే స్వయంగా భగవంతుడనే విషయం స్పష్టం. ఆతడే అష్టాక్షర మంత్రస్వరూపుడుగా జపించేవారివాక్కులందు నివసిస్తుంటాడు.

ఇంత ప్రభావమున్న మంత్రరాజమైన నామం వాక్కునందాలపించనివాడు ఘోరాత్ముడుకదా! అతనినోరు చెట్టు తొఱ్ఱయే అంటున్నాడు కవి. తరుకోటరం, నిష్ప్రయోజక మని భావం.

ప్రకృతి అనే వృక్షానికి అహంకారం కొమ్మలైతే, ఇంద్రియాలు తొఱ్ఱ(లు)గా చెప్పింది భారతం.

"అవ్యక్తబీజప్రభవో బుద్ధిస్కంధమయో మహాన్।
మహాహంకారవిటపః ఇంద్రియాస్తరుకోటరః॥" (అశ్వమేధపర్వం)

వాగింద్రియం 'భూరుహకోటర' మన్నాడు కవి.

మానవజన్మ నెత్తి కూడా, నారాయణనామస్మరణ చేయని దయనీయ స్థితిని పొందడం శోచనీయమే కదా!

"నారాయణేతి నామాస్తి, వాగస్తి వశవర్తినీ।
తథాఽపి నరకే ఘోరే పతంతీతి కి మద్భుతమ్॥"

పవిత్రమైన నారాయణ మంత్రముంది. దాన్ని పలుకడానికి తగిన నాలుక తన వశంలోనే ఉంది. అయినా లోకులు దాన్ని ఉచ్చరించక నరకంలో పడుతున్నారే! ఏమాశ్చర్యం! 'భూరుహకోటరం' అనడంవల్ల ఆత్మస్వరూపనాశక మని సారార్థం. వస్తూత్ప్రేక్షాలంకారం.

**మ. పరమంబై పరతత్త్వమై సకలసంపత్సారమై భవ్యమై**
**సురసిద్ధోరగయక్షపక్షిమునిరక్షోహృద్గుహాభ్యంతర**
**స్థిరసుజ్ఞానసుదీపమై శ్రుతికళాసిద్ధాన్తమై సిద్ధమై**
**సరి లేకెప్పుడు నీదునామమమరున్ సత్యంబు నారాయణా॥ 34**

అర్థం : ఓ నారాయణా! పరమంబై = ఉత్కృష్టమై; పరతత్త్వమై = పరత్వాన్ని బోధించేదై; సకల సంపత్ సారమై = సమస్త సంపదలలో శ్రేష్ఠమై; భవ్యమై = మంగళకరమై; సుర-దీపమై! సుర = దేవతల; సిద్ధ = సిద్ధుల; ఉరగ = నాగుల; యక్షుల; పక్షుల; మునుల; రాక్షసుల; హృత్+గుహ+ అభ్యంతర = హృదయమనే గుహలోపల; స్థిర = చలించని; సుజ్ఞాన = మంచిజ్ఞానమనే; సుదీపమై = సుజ్యోతియై; శ్రుతికళా సిద్ధాంతమై = వేదవేదాంతశాస్త్రాలచే నిశ్చయింపబడినదై; సిద్ధమై = యత్నించకయే పొందదగినదై; నీదు = నీయొక్క; నామము = పేరు; ఎప్పుడు = నిత్యం; సరిలేక = సాటిలేక; అమరున్ = ఒప్పియున్నది. సత్యంబు = సత్యం.

తా : ఓ నారాయణా! నీ నామం చాలా ఉత్కృష్టమైనది. యథార్థవిషయాన్ని బోధించేది. సకలభోగాల సారమైనది. దేవ, దానవ, యక్ష, పక్షి, ముని, సిద్ధుల హృదయాలలో జ్ఞానజ్యోతి యైనది. వేదశాస్త్రాలచే నిశ్చయింపబడినది. సిద్ధమైనది. సత్యమిది.

**వ్యాఖ్య : నారాయణనామంతో సాటియైన నామం లేదు.**

"నోరునొవ్వంగ హరికీర్తి నుడువడేని, కలుగనేటికి తల్లుల కడుపుచేటు" (భాగ) అన్నాడు కదా! భక్తపోతన. శాస్త్రాలు బోధించిన కర్మ, జ్ఞాన, భక్తి యోగాలను ఆచరించడం సామాన్య మానవునికి అసాధ్యమే. మాన్యులైనా జీవితాంతం అనుష్ఠింపగా ఎప్పుడోగాని అవి ఫలితమీయవు. మీదు మిక్కిలి వాటిని ఆచరిస్తుండగా లోపాలేవైనా జరిగితే మహాప్రమాదం. 'భగవంతుడే సిద్ధోపాయ' మని తలచి శరణాగతి ప్రపత్తి చేయడం మంచిదే. కానీ, దానికి గొప్ప విశ్వాసం ఉండాలి. ఆ విశ్వాసం శిథిలమైతే బ్రహ్మాస్త్రం లాంటి ఆ శరణాగతి కూడా ఫలించదు. కాబట్టి మాన్యులకూ, సామాన్యులకూ దేశ, కాల, నియమాలేవీ లేకుండా భగవన్నామసంకీర్తనం చేయడానికి అధికారం ఉంది. "యాతి బ్రహ్మ సనాతనమ్" అన్నట్లు ధర్మార్థులకు ధర్మాన్నీ, ధనార్థులకు ధనాన్నీ, కామార్థులకు కోరిన వాటినీ ఇస్తూ, చివరకు మోక్షప్రాప్తికి సాక్షాదుపాయమైన భగవన్నామసంకీర్తనమే పరమోపాయం.

"కిం మృష్టం? సుతవచనం. పునరపి మృష్టం తదేవ సుతవచనం" అన్నట్లు తండ్రికి తన కొడుకు ముద్దుమాటలకంటె అతిప్రియమైనది వేరే ఉండదు కదా!

అలాగే ప్రియపుత్రప్రాయులైన మానవుల నోటినుంచి తననామసంకీర్తనవైభవాన్ని వినడంకంటె వేరే ఆనందం జగత్పితయైన భగవంతునికి ఉండదు. శ్రీరామచంద్రస్వామి, కుశలవులు గానం చేసిన రామాయణాన్ని విని ఆనందపరవశుడై "మమాపి తద్భూతికరం ప్రచక్షతే" (నాకు కూడా శుభాన్ని కలిగిస్తుంది) అని ప్రశంసించాడు కదా! మహర్షులు అనేకమార్గాలచేత ఉపాస్యుడెవడో పురాణాలలో ప్రకటించారు. వాల్మీకిమహర్షి శ్రీరామావతారవైభవాన్నీ, పరాశరమహర్షి శ్రీ కృష్ణావతార వైభవాన్నీ కీర్తించారు. శ్రీ శౌనకమహర్షి అర్చావతార వైభవాన్నీ "తాం భజేత్తాం విచింతయేత్" అని ప్రశంసించాడు. శ్రుతులూ బోధించాయి.

"స బ్రహ్మ స శివస్సేంద్రః సోఽక్షరః పరమస్స్వరాట్" అని సామాన్యశబ్దాలతో తెల్పినా, సందేహం తీరక చివరకు "ఏకో హ వై నారాయణ ఆసీత్" అని స్పష్టపరచాయి. అంటే, నారాయణ నామమే పరతత్త్వమని ఉపనిషత్సమన్వయసిద్ధాంతంవల్ల తెలుస్తుంది.

"కిం తత్ర బహుభిర్మంత్రైః కిం తత్ర బహుభిర్వ్రతైః।
నమో నారాయణాయేతి మంత్రస్సర్వార్థసాధకః॥" (నారదీయం. 1-41)

సరిలేని ఈ మంత్రాన్ని వదలి వేరే వివిధమంత్రాలచేత ప్రయోజనమేమి "నమో నారాయణాయ" అనే మంత్రం సకల సంపత్సారమైనది, సర్వప్రయోజనాలనూ సిద్ధింపచేస్తుందని ఆర్షసూక్తి.

"అశుభాని నిరాచష్టే తనోతి శుభసంతతిమ్।
స్మృతిమాత్రేణ యత్పుంసాం బ్రహ్మ తన్మంగళం పరమ్॥" (వి.పు.)

'బ్రహ్మ'అంటే పరమాత్మా తపో వేదో బ్రహ్మ బ్రహ్మబ్జజే ద్విజే" (నా.ర.మాల) నిఘంటువును బట్టి, నారాయణుడని అర్థం.

స్మరించినంతమాత్రాన అశుభాలను తొలగించి శుభపరంపరలను కూర్చే స్వభావం కలవాడు నారాయణుడు. ఆయన మాంగల్యభాక్కు. ఆయన నామం భవ్యవాక్కు.

"నారాయణ పరం జ్యోతిః" అన్నట్లు, దేవదానవ సిద్ధోరగయక్షపక్షిమునుల హృదయాల్లో సమ్యక్జ్ఞానదీపమైనది నారాయణశబ్దం. సర్వవేదాంతవిజ్ఞాన సునిశ్చితార్థమయింది నారాయణపరబ్రహ్మతత్త్వం. కాబట్టి శ్రుతికళాసిద్ధాంత మన్నాడు కవి.

"జలధిసుతయా సార్థం దేవో జగత్పరిపాలయన్।
పరమపురుషః సిద్ధోపాయః ప్రతీష్టభరః సతామ్॥"

సర్వజ్ఞుడూ, సర్వశక్తుడూ, పరమకారుణికుడూ, లక్ష్మితో కూడి నిత్య విభూతినీ, లీలావిభూతినీ పరిపాలించే పరమ పురుషుడు, భక్తుల రక్షణ విషయ భారాన్నంతా తనపైన పెట్టుకొన్నవాడు కాబట్టి నారాయణుడే సిద్ధోపాయం. భక్తి ప్రపత్తులు సాధ్యోపాయాలు కాగా, వాటిచే సంతోషించి సర్వభారాన్ని వహించే నారాయణుడే నిత్యమైన, నిరపాయమైన ఉపాయమని భావం.

"ప్రసాదన స్యోపాయత్వే శాస్త్రీయేఽపి ఫలం ప్రతి।
కర్తృత్వావ్యవధానాద్యైః సిద్ధోపాయప్రధానతా॥"

శాస్త్రంలో చెప్పబడిన ఫలాలను పొందడం కోసం సాధ్యోపాయమే కారణం. అయినా ఫలాన్ని ప్రసాదించడంలో ఫలదాత, ఆలస్యం చేయవచ్చు. "సర్వరక్షణభారం నీదే స్వామీ! నిరంతరం నేను నిన్నే స్మరించే విధంగా నీవే సంకల్పించుకో, ప్రభూ!" అని తన రక్షణ విషయమై తన ప్రయత్నాన్ని వదలుకొని ఆర్తితో, నామసంకీర్తన చేయడమే సిద్ధోపాయ మని రహస్యత్రయసారం లోని సిద్ధోపాయశోధనాధికార మనే భాగం విశదీకరిస్తుంది.

"యథా సర్వేషు దేవేషు నాస్తి నారాయణాత్పరః।
తథా సర్వేషు మంత్రేషు నాస్తి చాష్టాక్షరాత్పరః॥" (1-42)

సకల దేవుళ్ళలో నారాయణుణ్ని మించిన దేవుడు లేడు. అలాగే సర్వ మంత్రాల్లో నారాయణమంత్రాన్ని మించిన మంత్రమే లేదు అని నారదీయ కల్ప గ్రంథం బోధిస్తుంది.

గజేంద్రుడు స్వగతనిష్ఠలో ఉండి, అంటే తనను తాను రక్షించుకొంటానని పెక్కేండ్లు నీరాటంతో పోరాటం సలిపాడు. చివరకు 'లావొక్కింతయు లేద'ంటూ 'నీవే తప్ప ఇతః పరంబెరుగ' నని పరగతనిష్ఠను అనుష్ఠించాడు. అంటే సిద్ధోపాయనిష్ఠుడయ్యాడు. రక్షితుడయ్యాడు.

'న తత్సమశ్చాభ్యధికశ్చ దృశ్యతే' అన్నట్లు, నారాయణనామమంత్రానికి దీటైన, మేటియైన మంత్రమే లేదు. ఇది సత్యం.

"సకారో జీవనిర్దేశ స్తకారః పరవాచకః।
తయో స్సంసర్గశక్తిర్యస్తస్మాత్సత్యముదాహృతమ్॥"

సకారం జీవుడు, తకారం పరబ్రహ్మ. ఆరెంటిని చేర్చేశక్తియే యకారం. ఇది 'సత్య' శబ్దార్థమంటారు ప్రాజ్ఞులు.

"తాని హ వా ఏతాని త్రీణ్యక్షరాణి. సతీయ మితి. తద్యత్సత్తదమృత మథ యత్తి న్మర్త్యమథ యద్యం తేనోభేయచ్ఛతి యదనేనోభే యచ్ఛతి తస్మాద్యమ్" (ఛాం.ఉ.)

సత్యమనేది మూడక్షరాలపదం. 'సకారం' అమృతం అంటే చేతనం. 'తకారం' మర్త్యం అంటే అచేతనం. 'యమ్' అంటే చేతనాచేతన పదార్థాలను నియమించేది. పరబ్రహ్మవాచకమే 'సత్య' మని బోధ.

'సత్యం' శపథాన్ని బోధిస్తుంది.

"భూత్వోర్ధ్వబాహురద్యాత్ర సత్యపూర్వం బ్రవీమి వః।
హే పుత్రశిష్యాః! శృణుత నమంత్రోఽష్టాక్షరాత్పరః॥"

ఓ శిష్యులారా! పుత్రులారా! రెండు చేతులను జోడించుకొని ఎత్తి (ప్రమాణం) శపథంచేస్తూ చెబుతున్నాను. అష్టాక్షరమంత్రంకంటె ఉత్కృష్టమైన మంత్రం లేదుసుమా! వినండి? అని ఋషులు ఈ నామాన్ని ఆదరించి, మనలను ఆదరించుమని బోధించారు.

**మ. అధికాఘౌఘతమోదివాకరమునై యద్రీంద్రజాజిహ్వకున్**
**సుధయై వేదవినూత్నరత్నములకున్ సూత్రాభిధానంబునై**
**బుధసందోహమనోహరాంకురమునై భూదేవతాకోటికిన్**
**విధులై మీ బహునామరాజి వెలయున్ వేదాత్మ నారాయణా॥ 35**

అర్థం : వేదాత్మ = వేదజ్ఞానస్వరూపా! ఓనారాయణా! మీబహునామరాజి = మీ, అసంఖ్యాకమైన నామసముదాయం; అధిక+అఘ+ఓఘ, తమస్+దివాకరమునై = గొప్పపాపరాశి అనే కటిక చీకటికి వేవెలుగై; అద్రి+ఇంద్రజా, జిహ్వకున్ = పర్వతరాజ పుత్రిక యొక్క నాలుకకు; సుధయై = అమృతమై; వేద వినూత్న రత్నములకున్ = వేదమంత్రాలనే నవ రత్నాలకు; సూత్ర+అభిధానంబునై = సూత్రనామధేయమై; బుధసందోహ మనస్+హర, అంకురమునై=విద్వత్ బృందాల మనస్సును చూరగొనే మొలకయై; భూదేవతా కోటికిన్ = బ్రాహ్మణుల సమూహానికి; విధులై = అవశ్యాచరణీయాలై; వెలయున్ = శోభించును.

తా: వేదాత్మ! ఓ నారాయణా! మీ బహునామావళి మహాపాపరాశులనే అంధకారానికి ఆదిత్యరశ్మియై, పార్వతీరసనకు అమృతమై, వేదమంత్రాలనే నూత్న రత్నాలకు సూత్రనామమై, పండితుల మనస్సునాకర్షించే అంకురమై, బ్రాహ్మణులనిత్య కర్మ విధానాలై విరాజిల్లుతుంది.

**వ్యాఖ్య : నారాయణ నామావళిప్రభావం ఉల్లేఖితం.**

మనం కొన్ని తెలిసిచేస్తాం. కొన్ని తెలియక చేస్తాం. చేసే కర్మలలో దోషాలెన్నో లోపాలెన్నో కలుగుతుంటాయి. పాపకర్మలవల్ల కలిగే శోకమోహాదులనూ, కష్టనష్టాదులనూ, ఆధివ్యాధులనూ అనుభవించడమే తప్ప ఈ పని చేసినందువల్లనే ఈ ఫలమిప్పుడనుభవిస్తున్నామన్న జ్ఞానమూ లేదు. మనను ఆవరించియున్న

అవిద్యామహిమ అంతగొప్పదన్న మాట. అనుభవిస్తున్నది ఏ కర్మఫలమో మనకు తెలియనప్పుడు, నారాయణనామాన్ని స్మరిస్తూ పనులు చేయడం శ్రేయస్కరం. సూర్యరశ్మివల్ల కటిక చీకటి చీలిపోయే రీతిగా భగవన్నామస్మరణవల్ల పాపరాశి తొలగిపోతుంది. అవిద్యాంధకారం అణగిపోతుంది. అఘౌఘమనే తిమిరతతికి భగవన్నామావళి ప్రభాకరదీప్తిలాంటిదన్నాడు కవి.

పార్వతి శ్రీవిష్ణుసహస్రనామాలను పారాయణం చేస్తుంటే వచ్చిన మహేశ్వరునికి సేవచేసి, సేదదీర్చి, 'ప్రభో! విష్ణుసహస్ర నామావళిని లఘువుగా పారాయణం చేసే ఉపాయం ఉంటే తెల్పండి' అని ప్రార్థించిందట. వరాననే! ఎంతమంచి విషయాన్ని కోరినావో! నా మనస్సున రమించే రామునియందే శ్రీరామరామరామ అంటూ నేనూ రమిస్తాను. ప్రతిరామనామం సహస్రనామాలకు సమానం అన్నాడట మహేశ్వరుడు.

'విష్ణుః పర్వతానామధిపతిః' అన్నట్లు శ్రీమహావిష్ణువు కొండలకు అధిపతికదా! కాబట్టి, కొండరాచూలు భూతభవ్యభవత్ప్రభునామసుధనే ఆస్వాదిస్తుంది.

"సూత్రే మణిగణా ఇవ" అన్నట్లు రత్నాలు, సూత్రానికి కూర్చబడి దానియందు ఆధారపడి ఉంటాయి. అలాగే వేదమంత్రాలకు బ్రహ్మసూత్రం ఆలంబనం. "జన్మాద్యస్య యతః" అనే జగత్కారణత్వాన్ని సూచించే బ్రహ్మసూత్రమందు "యతో వా ఇమాని భూతాని జాయంతే" ఇత్యాది వేదమంత్రరత్నాలన్నీ ఆధారపడిఉన్నాయి. సూత్రమే నామం. ఆ నామధారి కాబట్టి నారాయణుడు సూత్రధారి.

"తస్య ధీరాః పరిజానంతి యోనిమ్" (శ్రుతి). బుధులంటే ధీరులు. సమ్యక్ జ్ఞానసంపన్నులు. బుధవర్గంయొక్క మనోభూమికలో ఉద్భిదమైనదే భగవన్నామరాజి. 'అంకురం' అంటే కనబడేది, లక్ష్యమన్న మాట. "ధ్యానావస్థితతద్గతేన మనసా పశ్యంతి యం యోగినః" (భాగ. 12స్కం.) ధ్యానావస్థలో ఉన్న యోగుల మనస్సుకు లక్ష్యమైనది ధ్యేయమూర్తియే కదా!" కారణం తు ధ్యేయః అన్నట్లు అఖిలభువన జన్మస్థేమభంగాదిలీలలకు కారణమైన పరబ్రహ్మమే ధ్యేయం కదా!

'భూదేవతలంటే బ్రాహ్మణులు. ఎవరి నోట బ్రహ్మ (వేదం) ధ్వనిస్తుందో వారు బ్రాహ్మణులు. తమ వర్ణఆశ్రమాలకు తగిన కర్మలను ఆచరించడం విధి. సమస్త కర్మలు సర్వేశ్వరుని ఆరాధనలే. పుండరీకాక్షుణ్ని స్మరించేవాడు బయటా లోపలా శుచిర్భూతుడవుతాడు.

"ధ్యాయేన్నారాయణం దేవం స్నానాదిషు చ కర్మసు।
బ్రహ్మలోకమవాప్నోతి న చేహావర్తతే పునః॥

స్నానంతోనే కర్మ ఆరంభమవుతుంది. కాబట్టి స్నానాది కర్మల నాచరిస్తున్నప్పుడు కూడా నారాయణనామాన్ని స్మరిస్తుండాలని దక్షస్మృతి బోధిస్తున్నది.

ముప్పొద్దులు అనుష్ఠించే సంధ్యావందనంలోనూ కేశవాదిచతుర్వింశతి (24) నామాలను అనుసంధించడం విధియే. ప్రతికర్మను, అది ముగిసిన వెంటనే 'సకలం పరస్మై నారాయణాయేతి సమర్పయామి' అని భగవంతునికి సమర్పించడం లాంటివి విధులే కదా! నారాయణ నామచింతనచేత మానవుడు ఇహపరసుఖాలను పొందుతాడు. అతనికి పునర్జన్మ ఉండదని శ్రుతిస్మృతులు బోధిస్తున్నాయి. ఉల్లేఖాలంకారం.

**మ. పొనర న్ముక్తికిఁ ద్రోవ వేదములకుం బుట్టిల్లు మోదంబునం**
**దునికి స్థానము నిష్టభోగములకున్నుత్పత్తి యే ప్రొద్దునున్**
**ఘనపాపంబులవైరి షడ్రిపులకున్ గాలావసానంబు మీ**
**వినుతాంఘ్రిద్వయపద్మసేవనగదా విశ్వేశ నారాయణా॥** 36

అర్థం : విశ్వ+ఈశ = స్థిరచరరూపమైన విశ్వాన్ని నియమించేవాడా! ఓ నారాయణా! పొనరన్ = పొల్పుగా; మీ వినుత+అంఘ్రిద్వయపద్మసేవన = స్తుతింపబడే మీ పాదకమలయుగళ సేవయే కదా! ముక్తికిన్, త్రోవ = మోక్షానికి దారి, వేదములకున్, పుట్టిల్లు = వేదాలకు జన్మస్థానం; మోదంబునందు = ఆనందవిషయంలో; ఉనికి స్థానము = నివాస స్థలం; ఇష్టభోగములకున్, ఉత్పత్తి = కోరిన సుఖాలను కలిగించే తావు; ఏ ప్రొద్దునున్ = సర్వకాలాల్లోనూ; ఘనపాపంబులవైరి = మహాపాపాలకు విరోధి; షట్ రిపులకున్ = ఆర్గురు శత్రువులకును; కాల+అవసానంబు = కాలాంతకం.

తా: విశ్వనియామకుడవైన ఓనారాయణా! యోగ్యంగా స్తుతింపబడే మీ పాదకమల ద్వయాన్ని సేవించడమే మోక్షమార్గం. అది వేదాలకు పుట్టిల్లు. ఆనంద ధామం. ఇష్టసుఖానుభవాలకు ఇరవు. సర్వదా మహాపాతకాలకు విరోధి. కామాదిశత్రు షడ్వర్గపుబతుకు ముగిసే తావు.

**వ్యాఖ్య : నారాయణచరణకమలపరిభజనం ఉల్లేఖితం.**

ఇది నామప్రభావసందర్భం. అష్టాక్షరి లోని మధ్యమ నమః - పదార్థ వివరణమే ఈ పద్యం.

"ద్వ్యక్షరస్తు భవేన్మృత్యుః, త్ర్యక్షరం బ్రహ్మ శాశ్వతమ్।
మమేతి ద్వ్యక్షరో మృత్యుః న మమేతి చ శాశ్వతమ్॥"

(భారతం. శాంతిపర్వం (13-4)

మృత్యువుకు కారణం 'మమ' (నాది) అనే రెండక్షరాలపదమే. శాశ్వతబ్రహ్మప్రాప్తికి 'న మమ' (నాది కాదు) అనే మూడక్షరాలే హేతువు. ప్రతివస్తువు భగవంతునిదే.

"మమ నాథ యదస్తి యోఽస్మ్యహం సకలం తద్ధి తవైవ మాధవ।"

(స్తోత్రరత్నం) అన్నట్లు 'నేను, నాది అనేదంతా నీదే కదా స్వామీ' అని అను సంధానం చేయడమే 'నమః' పదార్థం.

"నంతవ్యః పరమశ్శేషీ, శేషా నంతార ఈరితాః।

నంతృనంతవ్యభావోఽయం నప్రయోజనపూర్వకః॥" (అహిర్బుధ్న్యసం.)

గొప్పవాడూ, నమస్కరింప దగినవాడూ 'శేషి' అనబడుతాడు. నమస్కరించేవారు 'శేషభూతులు'. నమస్కరించడం, సమస్కరింపబడడమనే భావం ఒక ప్రయోజనాన్నిబట్టికాక, గొప్పవానిపట్ల కొద్దివానికి స్వభావసిద్ధంగా ఉండవలసిన పద్ధతి. సర్వానర్థాలకు మూలమైన అహంకారమమకారాలు రెండూ నశించే క్రమమిది.

'నమః' పదం అఖండం. ఇది అవ్యయం. 'న,మః' అనేది సఖండం.

1) అఖండ 'నమః' పదాన్ని ఓంకారంతో అన్వయించి, 'ఓమ్‌నమః' అనుసంధిస్తే భగవత్ప్రాప్తికి ఉపాయం నమస్కారమని అర్థం.

నమస్కారం, శరణాగతి సమానార్థకాలు.

"సర్వేషామేవ లోకానాం పితా మాతా చ మాధవః।

గచ్ఛధ్వమేనం శరణం శరణ్యం పురుషర్షభాః॥" (భారతం అరణ్య.)

సమస్తలోకాలకు మాధవుడే తల్లి, తండ్రి కాబట్టి, ఓ పురుష పుంగవులారా! మీరు శరణ్యుడైన ఈయనను శరణు పొందండి అని మార్కండేయుడు ఉపదేశిస్తే.

"ఏవముక్తాస్త్రయః పార్థాః యమౌ చ భరతర్షభ।

ద్రౌపద్యా సహితాస్సర్వే నమశ్చక్రుర్జనార్దనమ్॥" (అరణ్యపర్వం 192-56)

ద్రౌపదితో కూడి పాండవులందరు జనార్దనునికి నమస్కరించారు. శరణాగతి చేశారు.

2) 'నమో నమః' - సఖండపదాన్ని అఖండపదంతో అన్వయిస్తే రక్షణోపాయం. నన్ను రక్షించుకొనే స్వాతంత్ర్యం నాకు లేదు. అది భగవంతునికే ఉన్నదని అర్థం.

'అమృతస్యైష సేతుః' (శ్రుతి). సినోతి - బధ్నాతి - స్వస్మిన్ సర్వం చిదచిద్వస్తు జాతం ఇతి, సేతుః.

చిదచిద్విశిష్టమైన జగత్తునంతా తనయందు బంధించుకొనేది అనే వ్యుత్పత్తినిబట్టి పరబ్రహ్మను సేతువుతో పోల్చింది ఉపనిషత్తు. ఈవలిగట్టునుంచి ఆవలిగట్టుకు చేరడానికి సేతువెట్లు ఉపాయమో, అట్లే ప్రకృతి మండలంనుంచి పరమ పదం చేరడానికి పరమాత్మయే ఉపాయం. "నాన్యః పంథా అయనాయ విద్యతే" మోక్ష ప్రాప్తికి 'నమః' పదార్థమైన భగవత్పాదసేవకన్న వేరే మార్గం సున్న(లేదు) కదా!

3) 'న,మః' - సఖండపదాన్ని నారాయణపదంతో అన్వయించి, నమో నారాయణాయ అని ఉచ్చరిస్తే కైంకర్యమందు స్వార్థత్వనివృత్తి సిద్ధిస్తుంది. నా కోసం కాక, శ్రీమన్నారాయణునికోసమే సర్వవిధసేవలను చేయగలనని అర్థం.

"భవాంస్తు సహ వైదేహ్యా గిరిసానుషు రంస్యతే।
అహం సర్వం కరిష్యామి జాగ్రతః స్వపతశ్చ తే॥" (రామా)

'స్వామీ! నీవు సీతతో కూడ కొండ చరియలయందు విహరించు, నీవు మెలకువతో ఉన్నా, నిద్రిస్తున్నా నీకు సర్వవిధకైంకర్యాలను చేయగలనన్నాడు లక్ష్మణుడు.

"బద్ధాంజలిపుటాస్సర్వే నమ ఇత్యేవ వాదినః"

వైకుంఠంలో నిత్యసూరులూ, ముక్తపురుషులూ అందరు చేతులు జోడించుకొని దోసిలొగ్గి - 'నమః' అని స్తుతిస్తుంటారట. "తద్విప్రాసో విపన్యవో జాగృవాంస స్సమింధతే" అన్నది వేదం.

"పంథా నకారఉద్దిష్టో మః ప్రధాన ఉదీర్యతే।
విసర్గః పరమేశస్తు తత్రార్థోఽయం నిరుచ్యతే।
అనాదిః పరమేశోఽయం శక్తిమాన్ పురుషోత్తమః।
తత్ప్రాప్తయే ప్రధానోఽయం పంథా నమననామవాన్॥"

న కారానికి మార్గమనీ, మకారానికి ప్రధానమనీ, విసర్గకు పరమాత్మ అనీ అర్థం. భగవంతుణ్ని పొందడానికి నమస్కారం ప్రధానమైన మార్గమని భావం. (అహిర్బుధ్న్యసంహిత.)

"చిత్తాలంఘనసౌకర్యకృపోత్తంభకతాదిభిః।
ఉపాయత్వమిహ స్వామిపాదయో రనుసంహితమ్॥"

ధ్యాన విషయమై గ్రహించడానికి సుకరమవడంవల్లనూ, కృపోద్బలక మవడంవల్లనూ, భోగ్యతాతిశయంవల్లనూ భగవత్పాదాలయందే ఉపాయత్వం అనుసంధింపదగినది.

"లోకవిక్రాంతచరణౌ శరణం తేఽవ్రజం విభో॥" (శ్రీతంత్రం.)

లోకాలను కొల్చిన మీ పాదాలనే ఉపాయం - రక్షకం - శరణం- గా పొందాను. ఇలా పాదాలను అనుసంధించడం దివ్యమంగళవిగ్రహానికి ఉపలక్షకం. విశ్వేశుని పాదాలే చేతనులు ఆశ్రయించడానికి యోగ్యమైనవి. హస్తగ్రహణంకంటె పాదగ్రహణం దయాహేతువు కదా! అపరాధచక్రవర్తిని శ్రియఃపతి విడిచినా, ఆయన పాదాలు విడనాడక దృఢంగా రక్షించే గుణాధిక్యం కలవి. "సన్యాసస్త్యాగ ఇత్యాహుః ప్రపత్తిః శరణాగతిః" న్యాసం, త్యాగం, ప్రపత్తి, శరణాగతి అనే పదాలన్నీ

భగవత్పాదపద్మద్వయాన్ని సేవించాలనే భావాన్నే బోధిస్తాయి. కాబట్టి, విశ్వాత్మకుని పాదాలు ముక్తినివాసకవాటభేదాలు. నమకపాఠమంతా అందెలరవళిలాగా ఆనందనిలయమయిందే కాబట్టి వినుతవినూత్ననూపురితవేదాలసదనం భగవత్పాదద్వయం. మోదప్రమోద ఆనందాలకు నిలయం. వేదం ప్రమాణమయితే పాదం ప్రమేయం కదా! ఇష్టభోగోత్పాదక మైనందువల్ల పాదద్వయం విశ్వజనానుమోదనం. "ప్రపన్నాఘౌఘవిధ్వంసి చరణౌ శరణం గతః" అన్నట్లు శరణాగతుల ఘనపాపాలను ధ్వంసం చేస్తుంది శ్రీపాదద్వయం. కామక్రోధలోభమోహ మదమాత్సర్యాలనే అంతశ్శత్రువులకు అది కాలాంతకం.

"ధర్మార్థకామమోక్షాఖ్యం యఇచ్ఛేచ్ఛ్రేయమాత్మనః।
ఏకమేవ హరేస్తత్ర కారణం పాద సేవనమ్॥" (భాగవతం)

పురుషార్థ చతుష్టయ రూపమైన శ్రేయస్సును పొందగోరే వారికి శ్రీమన్నారాయణుని పాదకమలసేవయే ప్రధానమని నారదమహర్షి బాలధ్రువునికి ఉపదేశించాడు కదా!

"న చలతి భగవత్పాదారవిందాల్లవనిమేషార్ధమపి స వైష్ణవాగ్రః" భగవంతుని పాదారవిందాలను అరనిమిషమైనా విడువక చింతించే వ్యక్తి విష్ణుభక్తుడన్నది శ్రీమద్భాగవతం. ఉల్లేఖాలంకారం.

**మ. భవరోగంబులమందు పాతకతమోబాలార్కబింబంబు క**
**ర్మవిషజ్వాలసుధాంశుగామృతతుషారవ్రాతపాథోధిమూ**
**ర్తివి కైవల్యపదావలోకనకళాదివ్యాంజనశ్రేష్ఠమై**
**భువిలో మీదగు మంత్రరాజమమరున్ భూతాత్మ నారాయణా॥ 37**

అర్థం : భూత+ఆత్మ = ప్రాణులకు ఆత్మ అయినవాడా! ఓనారాయణా! కర్మ-మూర్తివి! కర్మవిషజ్వాల = కర్మఅనే విషజ్వాలకు; సుధా+అంశు గ = చంద్రుణ్ని పొందిన; అమృత తుషార వ్రాత = అమృతం వలె శీతల సముదాయంగల/చల్లని అమృతరాశియైన; పాథోధిమూర్తివి = సముద్రమే ఆకారంగా కలవాడవు; ఓ నారాయణా! మీదు+అగు = మీదైన; మంత్రరాజము = శ్రేష్ఠమైన మంత్రం; భువిలో = భూలోకమందు; భవరోగంబుల మందు = జన్మరోగాలకు సాంసారిక వ్యాధులకు ఔషధం. పాతక తమస్ + బాల +అర్కబింబంబు = పాతకాలనే చీకటిపట్ల ఉదయభానుబింబం. కైవల్య పద+ అవలోకన కళా, దివ్య+అంజన శ్రేష్ఠమై = ముక్తిస్థానాన్ని చూచే కళకు శ్రేష్ఠమైన దివ్యాంజనమై; అమరున్ = ఒప్పియున్నది.

తా: సర్వభూతాలకు ఆత్మయైనవాడా! కర్మ అనే విషజ్వాలకు చంద్రుణ్ని పొందిన శీతలామృతరాశియైన సముద్రరూపం కలవాడవు. ఓ నారాయణా! మీ

మంత్రరాజం సంసారవ్యాధులకు ఔషధం. పాతకమనే అంధకారానికి ఉదయ భానుబింబమై, మోక్షస్థానాన్ని దర్శించే కళకు కండ్లకు పెట్టుకోగా బాగా ప్రకాశించే కాటుకగా ఒప్పియుంది.

**వ్యాఖ్య : - మంత్రరాజమహిమ ఉల్లేఖాలంకారసజ్జితం.**

భగవంతుడు ఆత్మగాలేని ప్రాణిగానీ, పదార్థంగానీ లేనేలేదు. సర్వభూతాలు భగవంతునికి శరీరాలేకదా!

"ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి" (భ.గీ.) అనడం వల్ల నారాయణుడు భూతాత్ముడు. సకలభూతాలు ఈ సంసారసముద్రంలోనే తమ తమ కర్మలకు తగిన ఫలాన్ని అనుభవించడానికి జన్మిస్తాయి, నశిస్తాయి.

నారాయణుడు పాథోధిస్వరూపుడు 'పా-రక్షణే' ధాత్వర్థంవల్ల 'పాతి భూతానితి పాథః' భూతాలను రక్షించేది. కాబట్టి 'పాథః' అంటే నీరు. లేదా 'పీయతే ఇతి పాథః' అనే వ్యుత్పత్తినిబట్టి త్రాగేనీరు అని అర్థం. పాథోనిధి అంటే సముద్రమన్నమాట.

'అంభోనిధి' (వి.స.నా.) అనే పదానికి 'భగవద్గుణదర్పణం' వివరించినవాక్యమిలా ఉంది. "పాతాళాంభసి అఖిలజగదాధారపీఠకమఠాత్మనా నిధీయతే - స్వయం నిక్షిప్యతే' ఇతి 'అంభోనిధిః' పాథోధి కూడా అంతే. పాతాళజలమందు అఖిలజగత్తుకు ఆధారపీఠంగా తాబేటిగా, తనను తానుంచుకొన్నాడు కాబట్టి పాథోధిమూర్తి నారాయణుడే.

విషంగానీ అమృతంగానీ జనించింది సముద్రంలోనే కదా! అలాగే సంసారంలో సుకృతదుష్కృతాలూ సంభవిస్తాయి. అందులోనూ మొదట విషరూపమైన పాపకర్మ ఫలమే సంభవిస్తుంది. విషమూ, అమృతమూ రెండు పరస్పర విరుద్ధపదార్థాలు. విషానికి విరుగుడు మందు అమృతం. ఈ సంసారంలో అవిద్య అనే విషమెక్కినందువల్ల సర్వేశ్వరునికి చెందిన ప్రతివస్తువు, నేను కానిది నేనుగానూ, నాది కానిది నాదిగానూ కనబడుతుంటాయి. విషం మింగినవాణ్నే చంపుతుంది కానీ విషయాలు, వాటిని తలచుకొన్నంతనే చంపుతాయి. తలచిన కోరిక తీరడానికి ఆటంకమేర్పడితే కన్నులు నిప్పులు చెరుగుతాయి. కోపంవల్ల వివేకం నశిస్తుంది. దానివల్ల బుద్ధి చెడి ఆత్మ వినాశనానికి హేతువవుతుంది. కాబట్టి నారాయణ నామామృతాన్ని సేవిస్తే అవిద్య అనే కర్మరూపవిషం విరిగిపోతుంది.

"హా నః పూర్వం వాక్ప్రవృత్తా న తస్మిన్,
తేన ప్రాప్తం గర్భవాసాదిదుఃఖమ్॥" (ముకుందమాల)

పూర్వజన్మలో మనవాగింద్రియం - నాలుక - నారాయణమంత్రాన్ని జపించలేదు

కాబట్టి ఈ జన్మ ప్రాప్తించింది. జపిస్తే జన్మలేక పోయేది కదా! అని శ్రీకులశేఖరులకు పశ్చాత్తాపం కలిగింది.

'భవ' మంటే జన్మ. జన్మిస్తే మరణం తప్పదు. జననమరణరూపమైన పరిభ్రమణమే 'భవం'. సంసారమని అర్థం. దేహం ప్రకృతియొక్క వికారమే. ఎల్లప్పుడు మారుతుంటుంది. ఎన్నడో ఒక నాడు పాత 'చొక్కా' లాగా విడువదగిన ఈ దేహంలో ఉన్న జీవుడు ' ఆదేహమే ఆత్మ' యని భ్రమపడడం భవరోగం. అది చచ్చిపోతుందేమో అని మందులు తింటూ దేహాన్ని కాపాడుకొనే యత్నంచేస్తుంటాడు. ఎన్నిమందులు తిన్నా తుదకు కృశించి నశించిపోయేదే కాని దేహం స్థిరంగా నిల్చేది కాదు. జీవాత్మ పరమాత్మతో చేరి సుఖంగా ఉండాలంటే మంత్రరాజమే మహౌషధం. ఇది భవరోగాలనూ, జనన మరణాలనూ దూరం చేస్తుంది. భవరోగాలు ఆరు.

1. దేహాన్నే ఆత్మగా అభిమానించడం. 2. తానే స్వతంత్రుడనే బుద్ధి. 3. భగవంతునికంటె ఇతరులకు చెందిన వాడననే భావం. 4. తనను తానే రక్షించుకొంటాననుకోవడం. 5. ఆభాసబంధువులపై అంటే, బంధువులలాగా కనబడే దేహబంధువులపైన ఆసక్తి. 6. విషయాలను అనుభవించాలనే ప్రీతి. ఈ రోగాలెన్నిమందులు తిన్నా తగ్గవు. "చేతసి నమో నారాయణా యేత్యముం మంత్రం సప్రణవం ప్రణామసహితం ప్రావర్తయధ్వం ముహుః" (ముకుందమాల).

'ఓమ్ నమో నారాయణాయ' అనే సర్వశ్రేష్ఠమైన మంత్రాన్ని జపిస్తూ మనస్సులో అర్థాన్ని భావిస్తుండాలి. ఈ మంత్రరాజమే 'భవభయప్రధ్వంసనైకౌషధం.'

రాశీభూతపాతకం గాఢంగా పేరుకొన్న చీకటిలాంటిది. అది పదార్థాన్ని యథార్థంగా ఉన్నదున్నట్లుగా కనబడనీయదు. సమ్యక్ జ్ఞానానికి ప్రతిబంధకంగా ఉండేది దురితం. ఉదయభానుబింబం చీకటిని తొలగించినట్లే, సూర్యమండలమధ్యవర్తియైన నారాయణుని మంత్రం మహాపాతకరాశిని ధ్వంసం చేస్తుంది.

"నమో నారాయణాయైవ ముచ్చరన్ భక్తిభావతః।
రజస్తమోమోహజాతాన్ జాగ్రత్స్వప్నసుషుప్తికాన్।
వాఙ్మనఃకాయజాన్ దోషాన్మంత్రేణైతేన నిర్దహేత్॥"

మంత్రరాజం, దాన్ని జపించే వ్యక్తి పాతకాలనన్నిటినీ భస్మం చేస్తుందని 'వాయుపురాణం' బోధిస్తుంది.

'తజ్జపస్తదర్థభావనమ్' (పతంజలియోగసూత్రం). 'జపం' అంటే మంత్రాన్ని అనుసంధిస్తున్నప్పుడు దానిఅర్థాన్నికూడా భావించడం.

"జకారో జన్మవిచ్ఛేదః, పకారః పాపనాశనః।
తస్మాజ్జప ఇతిప్రోక్తః జన్మపాపవినాశకః॥"

జపమనే పదానికి జన్మపాపాలను నశింపజేసేదని అర్థం. 'అంజనం' అంటే కన్నులకు పెట్టేకాటుక. అది వస్తువును స్పష్టంగా చూపే కళాప్రక్రియ. దివ్యాంజనం కని, విని, ఎరుగని నిధి నిక్షేపాలను కనబరుస్తుంది. 'అష్టాక్షరి' మోక్షస్థానాన్ని కనబరచే కళాత్మకమైన దివ్యాంజనం. కాబట్టి మంత్రరాజం శ్రేయఃప్రాప్తికరౌషధమే. రూపకాలంకారప్రాణితోల్లేఖాలంకారం.

**మ. వరుసన్ కర్మపిపీలికాకృతతనూవల్మీకనాళంబులోఁ**
**బరుషాకారముతో వసించిన మహాపాపోరగశ్రేణికిం**
**బరమోచ్చాటనమై రహస్యమహిమం బాటింపుచున్నుండు మీ**
**తిరుమంత్రంబగు మంత్రరాజమమరుందివ్యాత్మ నారాయణా॥ 38**

అర్థం : దివ్య+ఆత్మ = అప్రాకృత స్వరూపంగల; ఓ నారాయణా! వరుసన్ = క్రమంగా; కర్మ-లోన్, కర్మ పిపీలికా = కర్మలు అనే చీమలచేత; కృత = చేయబడిన; తనూ వల్మీక నాళంబులోన్ = శరీరమనే పుట్టయొక్క రంధ్రంలోపల; పరుష+ఆకారముతో = ఘోరరూపంతో; వసించిన = కాపురమున్న; మహాపాప+ఉరగశ్రేణికిన్ = గొప్ప పాపాలు అనే పాముల సమూహానికి; పరమ + ఉచ్చాటనమై = లేపి దూరంగా తరిమి వేసే మహామంత్రమై; రహస్య మహిమన్ = గోప్యమైన మాహాత్మ్యాన్ని; పాటింపుచున్, ఉండు = ఆచరిస్తున్న; మీ; తిరుమంత్రంబు+అగు = 'తిరుమంత్ర' మనే వైష్ణవ పరిభాషఉన్న; మంత్రరాజము గొప్పమంత్రం; అమరున్ = ఒప్పియున్నది.

తా: దివ్యాత్మ! ఓ నారాయణా! క్రమంగా కర్మలనే చీమలచేత చేయబడిన పుట్ట అనే దేహం యొక్క రంధ్రంలో క్రూరమైన ఆకారాలతో నివసించిన ఘోర పాపాలనే పాముల సమూహాన్ని లేపి దూరంగా·తరిమి వేసే మహామంత్రమై రహస్య మహిమను పాటిస్తున్న మీ తిరుమంత్రమనే పరిభాష గల మంత్రరాజం ఒప్పియుంది.

**వ్యాఖ్య : తిరుమంత్రం రహస్యమహిమ కలది.**

దేహం ఒక పుట్ట. పుట్టకు రంధ్రాలున్నట్లు దేహానికి నవ(9) రంధ్రాలున్నాయి. చీమలవల్ల పుట్ట ఏర్పడుతుంది. కర్మలవల్లదేహం మొలకెత్తుతుంది. దేవ, మానవ, పశు, పక్ష్యాదులుగా జన్మించడానికి పూర్వజన్మలలో చేసిన కర్మయే బీజమని 'కపూయచరణాః' అనే శ్రుతివాక్యాల వల్ల విశదమవుతుంది. క్రమంగా "చీమలు పెట్టిన పుట్టలు పాములకిరవైనయట్లు" కర్మలవల్ల కలిగిన దేహాలు పాపాలకు నెలవులు. 'పాప' శబ్దార్థం పాము. 'పాపతేడు' అంటే సర్పరాజుకదా! అది

పాములపుట్ట. దేహం పాపాలబుట్ట. ఏ పుట్టలో ఏ శేషుడో అన్నట్లు దేహంలో ఏవో ఘోరపాతకాలుంటాయి. మాంత్రికుల మంత్రోచ్చాటనతో పాములు పుట్టలోనుంచి లేచి పారిపోతాయి. మంత్రరాజం, దాని ననుసంధించే వ్యక్తిశరీరంలో ఆవహించి ఉన్న మహాపాపరాశిని తొలగించి, తిరిగి దరిచేరకుండా చేస్తుంది.

"బ్రహ్మహత్యాం తరతి, తరతి వీరహత్యాం, స్వర్ణస్తేయాత్ పూతో భవతి. వృషలీగమనాత్ పూతో భవతి. పితృదేవమనుష్యాణామపకారాత్ పూతో భవతి. సర్వధర్మ పరిత్యాగ పాపాత్ సద్యః శుచితా మాప్నుయాత్" అనే తొలిపలుకుల రీతిగా, మంత్రరాజానుష్ఠాత సకలపాపాలనుంచి విముక్తుడవుతాడు.

పాపాలకు పరిహారముందికదా! అని తెలిసి చేసిన పాపాలకు మాత్రం నిష్కృతి లేదు సుమా! "బుద్ధిః కర్మానుసారిణీ" అన్నట్లు పాపకర్మల ప్రాబల్యం మంచి పనులను చేయనీయదు, మంత్రోపదేశం పొందేబుద్ధి పుట్టనీయదు కదా! అందుకే "ఉత్తిష్ఠ! జాగ్రత!" అన్నది వేదం. బుభుక్షువు కాక, ముముక్షువు అంటే మోక్షాన్ని కోరేవాడు తెలుసుకో దగిన రహస్యాలు మూడు. 1. మంత్రరాజం (తిరుమంత్రం) 2. మంత్రరత్నం (ద్వయమంత్రం). 3. చరమశ్లోకం. ఈ మూడింటిలోనూ ప్రథమరహస్యం తిరుమంత్రం.

శ్రియఃపతి, అనాదియైన కర్మప్రవాహంలో పడి లెక్కలేని దుఃఖాలను పొందుతూ క్షుద్రవిషయాలకు ఆశపడిన ఆత్మలనూ, వాటిని సాధించుకోవడానికి వారుపడేపాట్లనూ గమనించాడు. మనసు కరిగింది. వాస్తవంగా పరమ పురుషార్థాన్ని తెలుసుకొన్నట్లైతే బద్ధాత్మలు, సాధనానుష్ఠానం నిత్యాత్మలవలె నిత్యసూరులవలె - తన కైంకర్యం చేసి బాగు పడేఅవకాశముందనుకొన్నాడు శ్రియఃపతి. నరనారాయణరూపంతో అవతరించి, తానే శిష్యాచార్యులుగా వెలసి, తానే తనకు ఉపదేశించుకొని, లోకానికి వెల్లడించిన మూలమంత్రమే తిరుమంత్రం. దీని వివరణలే మిగత రెండు రహస్యాలు. క్రమంగా అనుష్ఠించే శక్తి సన్నగిల్లిన సమాజాన్ని శ్రీమన్నారాయణుడు సమీక్షించాడు.

"యద్యద్విభూతిమత్సత్త్వం శ్రీమదూర్జిత మేవ వా।
తత్తదేవావగచ్ఛ త్వం మమ తేజోఽంశసంభవమ్॥" (భ.గీ.)

'శ్రీమంతమై వృద్ధిపొందే దంతా నా తేజస్సు యొక్క అంశవల్ల కలిగినదే అని గ్రహించు'మని తానే గీతాచార్యుడుగా అవతరించి నొక్కి చెప్పాడు కదా!

"పూర్వోత్పన్నేషు భూతేషు తేషు తేషు కలౌ ప్రభుః।
అనుప్రవిశ్య కురుతే యత్సమీహిత మచ్యుతః॥"

సర్వేశ్వరుడు తానింతకు ముందు సృజించిన వాటిలో ప్రవేశించి తన ఇష్టాన్ని నెరవేర్చుకొంటున్నాడన్నట్లు, పరాంకుశ పరకాలాదిరూపాలతో నూత్న దశావతారాలుగా అవతరించి, మేఘాలు సముద్రజలాన్ని పానంచేసి జీవులకు ఉపయోగపడే మధుర జలాన్ని వర్షించే రీతిగా, వేదాలలోని సారభూతార్థాలను అందరికి తెలియజేశాడు. అంతేకాదు. మన దక్షిణ భారతదేశంలోనే నాథ, యామున, రామానుజ, వేంకట నాథ, రమ్యజామాతృమునీత్యాది అనేకాచార్యులుగా వెలసి, విశిష్టాద్వైత సిద్ధాంతాన్నీ ప్రవర్తింపచేశాడు.

(31వ పద్యం నుంచి పేర్కొన్నదేకాక) మంత్ర రాజ మహిమ చాలా గొప్పది. ఈ మంత్రం జీవాత్మ స్వరూపాన్ని, దానికి తగిన పురుషార్థాన్నీ తెల్పుతుంది. 'స్వరూపం' అంటే పాదాలను పాదరేఖలు వదలని రీతిగా, వస్తువునెన్నడూ వదలని స్థితి. శేషత్వపారతంత్ర్య కైంకర్యాలే స్వరూపానుగుణమైనవి. 'శేషత్వ' మంటే దాస్యం. పరమాత్మకు అధీనుడై మెలగడమే 'పారతంత్ర్యం' కైంకర్యం. అంటే సేవచేయడం. రహస్యం ప్రకటిస్తే సదస్యమవుతుంది.

"ఆద్యం తు త్ర్యక్షరం బ్రహ్మ త్రయీ యత్ర ప్రతిష్ఠితా।
స గుహ్యోఽన్యస్త్రివృద్వేదో యస్తం వేద స వేదవిత్॥" (మనుస్మృతి 11-265)

మూడక్షరాలుగల మొదటి అక్షరమైన వేదం - ప్రణవం - ఓమ్ -లో మాత్రం ఋగ్యజుస్సామవేదాలు మూడు అంతర్గతాలు. ఋగాదివేదాల కంటె విలక్షణమైన, రహస్యమైన వేదం ఇది. దీన్ని తెలుసుకొన్న వాడు మూడు వేదాలను తెలుసుకొన్న వాడవుతాడు.

న్యాసవిద్యయందు ప్రత్యక్షంగా ఆత్మసమర్పణమూ తెల్పబడుతుంది.

"హవిర్గృహీత్వాఽత్మరూపం వసురణ్యేతి మంత్రతః।
జుహుయాత్ప్రణవేనాగ్నౌ అచ్యుతాఖ్యే సనాతనే॥"

'ఆత్మ' అనే హవిస్సును వసురణ్య అనే మంత్రంతో గ్రహించి అచ్యుతుడు అనే అగ్ని యందు 'ప్రణవం' తో హోమం చేయాలి. ఈ న్యాస విధానం (ఆత్మసమర్పణం) 'తపసా మతిరిక్తమాహుః' తపస్సులలోకెల్ల శ్రేష్ఠమైనదని యాజ్ఞిక్యు పనిషత్తు బోధిస్తుంది. జీవునికి సర్వేశ్వరుణ్ని తెలుసుకొనడంవల్ల (పరస్వరూపజ్ఞానంవల్ల) మంచి పరిశుద్ధి కలుగుతుంది. "క్షేత్రజ్ఞస్యేశ్వరజ్ఞానాత్ విశుద్ధిః పరమా మతా" అని (యాజ్ఞవల్క్యస్మృతి3-34), తిరుమంత్రంలోని ఆద్యక్షరం (ఓమ్) శేషత్వానుసంధానాన్ని తెల్పుతుంది. ఇక ప్రణవార్థానుసంధానం ఇలా ఉంది.

"ఈ ద్రుశః పరమాత్మాఽయం ప్రత్యగాత్మా తథేద్రుశః।
తత్సంబంధానుసంధానమితి యోగః ప్రకీర్తితః॥" (శాండిల్య స్మృతి) 5-17).

పరమాత్మస్వరూపమిలాంటిది. ఆత్మస్వరూపమిలాంటిది. ఈ ఉభయులకున్న సంబంధమిటువంటిదనే విధమయిన యోగాన్ని 'ప్రణవం' బోధిస్తుందని శాండిల్య మహర్షి తెల్పాడు.

1) 'ఓమ్' అనే పదం పార్థునిరథాన్ని సమీక్షించుమంటుంది. (అ) శ్రీకృష్ణుడు పరమాత్మ(మ) అర్జునుడు జీవాత్మ. ఈ ఉభయులకూ ఆశ్రయణీయమైన రథం (ఉ) రుక్మిణి స్థానంగానూ భావించాలి. ఇంక ఇది చిదచిదీశ్వరతత్త్వాన్నీ తెల్పుతుంది.

"తదంతర్భావాత్ త్వాం న పృథగభిధత్తే శ్రుతిరపి" (శ్రీగుణరత్నకోశం).

ఓలక్ష్మీ! నీవు సర్వదా నారాయణునితో చేరి యుండడంవల్ల శ్రుతికూడా నిన్ను ప్రత్యేకంగా పేర్కొనడం లేదు. అంటే "భాస్కరేణ ప్రభా యథా" అన్నట్లు సూర్యునితో సూర్యకాంతి విడువక ఉండే విధంగా, లక్ష్మి నారాయణునితో కూడి ఉంటుంది. కాబట్టి భగవంతుణ్ని పేర్కొంటే భగవతిని కూడా పేర్కొన్న భావం ఉంటుంది. భగవద్వాచకమైన 'అ' కారమందు తత్పత్నీసంబంధం అర్థాత్సిద్ధమే కదా! ఇలా మకారం జీవాత్మ అనీ, ఉకారం రథం - ప్రకృతి అనీ, జీవ, ప్రకృతులను రెంటిని నియమించే పరమాత్మ అకారమనీ బోధిస్తుంది. 'ఓమ్' అనే మొదటి పదం.

2) 'నమః' శబ్దార్థం పారతంత్ర్యాన్ని తెల్పుతుంది. పాదుకల నిచ్చి నేను తిరిగివచ్చే దాకా రాజ్యం చేయుమని శ్రీరాముడు ఆదేశిస్తే, భరతుడు రామునికి పరతంత్రుడై ఆయన కోసం కాచుకొని యున్నాడు. అట్లే శత్రుఘ్నుడు భరతునికి పరతంత్రుడైయున్నట్లు రామాయణం వల్ల తెలుస్తుంది.

3) నారాయణశబ్దార్థం పారార్థ్యాన్ని ప్రబోధిస్తుంది.

'నారాణాం అయనః' అనే తత్పురుషవల్ల ఆత్మలకు ఆశ్రయ భూతుడని అర్థం. ఇది ధారకత్వాన్ని తెల్పుతుంది.

'నారాః అయనం యస్య సః' అనే బహువ్రీహివల్ల ఆత్మలనే ఆశ్రయంగా గ్రహించి, వాటిలో అంతరాత్మగా ఉంటాడని అర్థం. ఇది వ్యాపకత్వాన్ని తెల్పుతుంది. ఎలాగైనా, "అపి వృక్షాః పరిమ్లానాః" రామవిరహాన్ని భరించని చెట్లూ జంతువులూ వాడిపోయి, బాధపడినట్లూ - నేను నిన్ను గానీ నీవు నన్ను గానీ విడిచి యుండలేమన్నట్లూ - బోధించేది తిరుమంత్రంలోని మూడవపదం.

4) 'ఆయ' అనే (నారాయణాయ పదమందున్న) చతుర్థీవిభక్తి ప్రత్యయం. లక్ష్మణ స్వామి వలె, జీవుడు ప్రార్థించదగినదీ, దేవుడు ఎక్కువ ఇష్టపడేదీ అయిన కైంకర్య భావాన్ని తెల్పుతుంది. ప్రణవం స్వరూపాన్ని, నమః ఉపాయాన్ని, నారాయణా య తురీయఫలపురుషార్థాన్ని బోధిస్తుంది.

తిరుమంత్రం పరమాత్మతో జీవాత్మలకు గల తొమ్మిది విధాల సంబంధాలనూ తెల్పుతుంది.

| పరమాత్మ | జీవాత్మలు |
|---|---|
| 1. పిత | 1. పుత్రులు |
| 2. రక్షకుడు | 2. రక్ష్యులు |
| 3. శేషి | 3. శేషులు |
| 4. భర్త | 4. భార్యలు |
| 5. జ్ఞేయుడు | 5. జ్ఞాత |
| 6. స్వామి | 6. సొమ్ములు |
| 7. ఆధారం | 7. ఆధేయులు |
| 8. ఆత్మ | 8. శరీరాలు |
| 9. భోక్త | 9. భోగ్యులు |

1. 'ఓంకారం' పితాపుత్ర, రక్ష్యరక్షక, శేషశేషి, భార్యాభర్తృ, జ్ఞాతృజ్ఞేయ సంబంధాలను (5) నిరూపిస్తుంది.

2. 'నమః' పదం స్వస్వామిసంబంధాన్ని తెల్పుతుంది.

3. 'నారాయణాయ' పదం ఆధారాధేయభావ దేహాత్మ భావ భోక్తృభోగ్య భావ సంబంధాలను ప్రతిపాదిస్తుంది.

అర్థపంచకాన్ని పాటించడంకూడా రహస్యమహిమయే.

1. ఆత్మ స్వరూపం - జీవుడు దేవునికే దాసుడు.
2. పరమాత్మ స్వరూపం - దేవుడే అన్ని విధాలా రక్షకుడు.
3. ఉపాయ స్వరూపం - దేవుడే గతి అని విశ్వసించడం.
4. విరోధిస్వరూపం - మోక్షానందానుభవాన్ని ఆటంకపరచే వాటిని త్యజించడం.
5. ఫలస్వరూపం - పొందదగినది మోక్షసామ్రాజ్యం.

తిరుమంత్రరహస్యమహిమను గురువునాశ్రయించి తెలుసుకోవలసిందే.

"మంత్ర రాజమిమం విద్యాద్గురువందనపూర్వకం।
లబ్ధ్వైవం మంత్రరాజానం మాం గచ్ఛేచ్ఛరణం నరః॥
అనే నైవ తు మంత్రేణ స్వాత్మానం మయి నిక్షిపేత్।
మయి నిక్షిప్తకర్తవ్యః కృతకృత్యో భవిష్యతి॥" (సాత్యకితంత్రం)

ఆచార్యునికి దండం సమర్పించి ఈ మంత్రాన్ని ఉపదేశం పొందాలి. ఉపదిష్టుడైన వ్యక్తి శరణాగతిజేసి, తన ఆత్మరక్షణభారాన్ని నా పై ఉంచితే కృతకృత్యుడు కాగలడని భగవంతుడే తెల్పినాడు.

"గురుం ప్రకాశయేత్ ధీమాన్ మంత్రం యత్నేన గోపయేత్,
అప్రకాశప్రకాశాభ్యాం క్షీయేతే సంపదాయుషీ॥"

బుద్ధిమంతుడు గురువును ప్రకాశింపజేయాలి. మంత్రాన్ని శ్రద్ధతో కాపాడుకోవాలి. గురువును ప్రకాశింపజేయకుంటే జ్ఞానసంపద క్షీణిస్తుంది. అనధికారులకు ఉపదేశిస్తే ఆయుస్సు క్షీణిస్తుందని శాస్త్రం చెబుతుంది.

**మ. హరుని న్నద్రిజ నాంజనేయుని గుహున్నయ్యంబరీషున్ ధ్రువుం**
**గరిఁ బ్రహ్లాదు విభీషణాఖ్యుని బలిన్ ఘంటాశ్రవున్నారదున్**
**గర మొప్ప న్విదురున్ బరాశరసుతున్ గాంగేయునిన్ ద్రౌపదిన్**
**నరు నక్రూరునిఁ బాయకుండును భవన్నామంబు నారాయణా॥ 39**

అర్థం : ఓ నారాయణా! భవత్+నామంబు = నీపేరు; హరునిన్ = శంకరుణ్ణి; అద్రిజను =పార్వతిని; ఆంజనేయుని; గుహున్; ఆ+అంబరీషున్; ధ్రువున్; కరిన్ = గజాన్ని; ప్రహ్లాదు; విభీషణ +ఆఖ్యుని = విభీషణుడనే పేరు కలవాణ్ని; బలిన్ = ఇంద్రసేనుణ్ని; ఘంటాశ్రవున్ = ఘంటాకర్ణుణ్ని; నారదున్; విదురున్; పరాశరసుతున్ = వ్యాసుణ్ని; గాంగేయునిన్ = భీష్ముణ్ని; ద్రౌపదిన్; నరున్ = అర్జునుణ్ని; అక్రూరుని; కరము, ఒప్పన్ = చాలా యోగ్యంగా; పాయక, ఉండును = విడువక ఉంటుంది.

తా: ఓ నారాయణా! నీ నామం శివుణ్ని, పార్వతినీ, ఆంజనేయుడు మొదలైన భాగవతోత్తములనూ విడువక వుంటుంది.

**వ్యాఖ్య : భగవన్నామాన్ని అనవరతం అనుసంధించే మహానుభావులను పేర్కొన్న పద్యమిది.**

1. హరుడు : "శ్రీరామస్య మనుం కాశ్యాం జజాప వృషభధ్వజః॥"

కాశీక్షేత్రనాధుడైన విశ్వేశ్వరుడు రామతారకనామాన్ని సదా జప్యంగా గ్రహించాడు. ఆ మంత్రప్రభావంవల్ల శ్రీరామరూపంలో ప్రసన్నుడైన నారాయణుడు శివునితో ఇలా అన్నాడు.

"ముమూర్షోర్దక్షిణే కర్ణే యస్య కస్యాపి వా స్వయమ్,
ఉపదేక్ష్యసి మన్మంత్రం స ముక్తో భవితా శివ!"

'కాశీ నగరంలో మణికర్ణికయందు గంగాతీరంలో ఐదుక్రోసుల దూరంలోపల మృతి జెందే జంతువులకు కుడి చెవిలో నీవు రామతారకమంత్రముపదేశించగలవు. ఆ జంతువు ముక్తి పొందగలదు. (రామతాపిన్యుపనిషత్తు). అందుకే, "కాశీ మరణాన్ముక్తిః" "రేవాతీరే తపః కుర్యాత్, మరణం జాహ్నవీతటే" "నర్మదా నదీ తీరంలో తపస్సు చేయాలి. కాశీక్షేత్ర మందలి గంగా తీరంలో చావాలి" అని ప్రసిద్ధి.

"వైష్ణవానాం యథా శంభుః" పరమశివుడు శుద్ధ శ్రీవైష్ణవుడని భాగవతం (12స్కం.) పేర్కొన్నది.

2. అద్రిజ : భగవన్నామ సంకీర్తనయందు అత్యంతాసక్తికలది పార్వతి. రామచరిత్రను గూర్చి ఆమె అడగడమూ, శివుడు రాముని ప్రాభవవైభవాలనుగూర్చి ఆమెకు వివరంగా చెప్పడమే కాక, "శ్రీరామ రామ రామేతి రమే రామే మనోరమే। సహస్రనామ తత్తుల్యం రామనామ వరాననే॥" అని పురుషోత్తమునిగూర్చి తెలుసుకొన గోరే పార్వతిని ప్రశంసిస్తూ రామనామమాహాత్మ్యాన్ని కూడా ఆమెకు తెలిపాడు కదా!

3. ఆంజనేయుడు : మూర్తీభవించిన రామనామమే ఆంజనేయుడనడం అతిశయోక్తి కాదు. "యత్ర యత్ర రఘునాథకీర్తనం। తత్ర తత్ర కృతమస్తకాంజలిమ్" ఎక్కడ రామనామసంకీర్తన జరిగితే, అక్కడ బాష్ప వారి పరిపూర్ణలోచనుడై, శిరస్సున అంజలి బద్ధుడై వెలసి ఉంటాడు.

4. గుహుడు : ఆటవికులకు రాజైన గుహుడు నాగరికులకు రాజైన శ్రీరామునికి సఖుడు. సీతారామలక్ష్మణులవృత్తాంతాన్ని భరతునికి వివరించిన మహానుభావుడు. "గుహో గహనగోచరః" అన్నాడు వాల్మీకి. వేదాంతవనసంచారియైన పరబ్రహ్మను దర్శించినవాడట గుహుడు.

5. అంబరీషుడు : నాభాగుని కుమారుడైన అంబరీషుడు రాజర్షి. ద్వాదశీవ్రత మాచరించి భాగవతోత్తములకు మృష్టాన్నం పెట్టే సమయంలో దుర్వాసుడు వచ్చాడు. స్నానానికి వెళ్ళిన ముని ఆలస్యం చేశాడు. ద్వాదశి ఘడియలు - తిథి - మించక ముందే పారణ చేయాలి కాబట్టి, పెద్దలు చెప్పిన రీతిగా ఉదక పారణం చేశాడు అంబరీషుడు. దుర్వాసుడు వచ్చి, పారణ చేసినాడనే కోపంతో 'మహాకృత్య'ను సృజించి, అంబరీషునిపైకి ప్రేరేపించాడు. వెంటనే రాజు భగవన్నామస్మరణ చేయడంవల్ల శ్రీ మహావిష్ణుచక్రం వచ్చి కృత్యను సంహరించింది. చక్రం దుర్వాసుని వెంట పడింది. బ్రహ్మరుద్రేంద్రాదులూ మునిని రక్షింప లేకపోయారు. తుదకు విష్ణు మూర్తిని శరణు వేడాడు. 'నా హృదయం నా భక్తుల అధీనంలో ఉంటుంది. కాబట్టి అంబరీషుణ్నే వేడుకొ'మ్మన్నాడు విష్ణుమూర్తి. దుర్వాసుడు రాజును క్షమించుమని ప్రార్థించాడు. రాజు చక్రానికి నమస్కరించి, తపసిని కాపాడుమని ప్రార్థిస్తే చక్రం యథా స్థానానికి చేరుకొంది.

"హరి యని సంభావించును, హరి యని దర్శించు నంటు నాఘ్రాణించున్।
హరి యని రుచి గొనఁ దలఁచును, హరిహరి! ఘనునంబరీషు నలవియె పొగడన్॥"

(భా.గ. 9.86)

6. ధ్రువుడు : ఉత్తానపాదునికి సునీతి యనే భార్య యందు జన్మించాడు. ధ్రువుడు ఒకప్పుడు తండ్రితొడమీద కూర్చున్నాడు. సవతితల్లి సురుచి తనను దూషిస్తుంటే ఏమీ మాటాడని తండ్రి అంకసీమ నుంచి లేచి తల్లిని సమీపించాడు. సునీతి భగవద్ధ్యానమే మహాభాగ్యమని బోధించింది. తపస్సుకోసం బయల్దేరాడు. దారిలో నారదుడు ధ్రువునికి వాసుదేవమంత్రాన్ని ఉపదేశించాడు. అతని ఘోర తపస్సువల్ల దేవతలకు ప్రాణనిరోధమయింది. భగవంతుడు సమాధిస్థుడైన ధ్రువుని కపోలతలాన్ని వేదమయశంఖంచేత అంటించాడు. అతడు చైతన్యాన్ని పొంది భగవంతుణ్ని స్తుతించాడు.

"నీకు మ్రొక్కెదనత్యంతనియమమొప్ప। భవ్యచారిత్ర, పంకజపత్రనేత్ర।

చిరశుభాకార! నిత్యలక్ష్మీవిహార! యవ్యయానంద, గోవింద, హరి, ముకుంద॥" భగవదాజ్ఞా ప్రకారం చిరకాలం రాజ్యమేలాడు. తుదకు అత్యున్నతస్థానమైన ధ్రువ పదాన్ని పొందాడు.

"తారామయం భగవతః శింశుమారాకృతిప్రభోః।

దివిరూపం హరేర్యత్తు తస్య పుచ్ఛే స్థితో ధ్రువః॥" (వి.పు.2.9.1)

ఆకాశమందు, వ్యాపకుడైన భగవంతునినక్షత్రమయమైన మొసలిఆకారం ఉంది. ఆశింశుమారాకృతిచక్రపుచ్ఛమందు ఉండి ధ్రువుడు త్రిలోకచూడామణి అయ్యాడు.

7. కరి : ద్రవిడాధీశుడైన ఇంద్రద్యుమ్నుడు, అగస్త్యమహర్షి వచ్చినప్పుడు లేచి గౌరవించనందువల్ల శప్తుడై ఏనుగయ్యాడు. వనంలో పరివారంతో సంచరిస్తూ దాహం వేసినందువల్ల ఒక సరస్సులోకి దిగాడు. దేవలునిచేత శప్తుడైన హూహూ నామ గంధర్వుడు ఈ సరస్సులో మొసలిగా ఉండి ఏనుగుకాలు పట్టుకొన్నాడు. నీరాట వనాటములకు పెక్కేండ్లు పోరాటం జరిగింది. బలం తగ్గిన కరి దైన్యంతో హరిని 'నీవే తప్ప నితః పరం బెరుగ' 'రావే! ఈశ్వర! కావవే వరద! సంరక్షించు భద్రాత్మకా!' అని మొరపెట్టుకొంది. మకరిని ద్రుంచి హరి కరిని కాపాడాడు.

8. ప్రహ్లాదుడు : హిరణ్యకశిపుడనే రాక్షసునికి కలిగిన హ్లాదుడు, అనుహ్లాదుడు, సంహ్లాదుడు, ప్రహ్లాదుడనే నలుగురు పుత్రులలో సంతతశ్రీనారాయణ పాదపద్మయుగళీచింతామృతాస్వాదసంధానుడైన ప్రహ్లాదుడు, వెదకి చూస్తే నారాయణుడు లోపటా బయటా, అంతటా ఉన్నట్లు తెలుస్తుందని బోధించి, తండ్రిని తరింపజేసిన భక్తాగ్రేసరుడు.

9. విభీషణుడు : రావణాసురునితమ్ముడు విభీషణుడు.

"అపంథానం తు గచ్ఛంతం సోదరోఽపి విముంచతి" (మురారికవి.)

దుర్మార్గప్రవర్తకుణ్ని తోబుట్టువుకూడా వదలుకొంటాడనే న్యాయానికి తార్కాణంగా నిల్చాడు. నిర్భీకుడై హితం చెప్పినా, వినని లంకేశుణ్ని విడిచిపెట్టి, శ్రీరామునికి శరణాగతిచేసి సశ్రీకుడయ్యాడు. అన్న లింగ ప్రతిష్ఠచేశాడు. తమ్ముడు రంగనాథుణ్ని ప్రతిష్ఠించాడు.

10. బలి : ఈరాక్షసునిపేరు ఇంద్రసేనుడు. ప్రహ్లాదునిపౌత్రుడు. విరోచనుని పుత్రుడు. వైరోచని గురువు చెప్పినా వినక, ఆడిన మాటను తప్పక మూడడుగుల నేలను అడిగిన వామనమూర్తికి ధారవోశాడు. నేల అంతా ఒక అడుగుకు, నింగి ఒక అడుగుకు సరిపోయింది. మూడవ అడుగు నీయడానికి స్థలమే లేనందువల్ల త్రివిక్రముని అడుగును తన తలమీద ధరించి రసాతలానికి చేరిన సద్ధర్ముడు. బలికి భంగపాటు లేకుండా అతనివాకిట గదాపాణియై నిల్చాడు భగవానుడు.

11. ఘంటాశ్రవుడు : కుబేరుని పరిచారకుడైన ఘంటాకర్ణుడు మహా భయంకర పిశాచం. మాంసభక్షకుడు. అపరమృత్యువు. విష్ణు దూషకుడు. "సతతం దూషయన్ విష్ణుం ఘంటా మాబధ్య కర్ణయోః" (హరివంశం). విష్ణువు పేరు వినరాకుండా చెవులకు గంటలు కట్టుకొన్నాడు. కైలాసవాసుడైన పరమశివుణ్ణి పూజించి ముక్తి నిమ్మని కోరాడు. అందరికి ముక్తినిచ్చేవాడు ఒక్క విష్ణువే. సంశయం లేదు.

"ముక్తిప్రదాతా సర్వేషాం విష్ణురేవ న సంశయః।
ముక్తిం ప్రాప్నుహి గోవిందాత్ నరనారాయణాశ్రమే॥" (హరివంశం.)

నరనారాయణాశ్రమమైన బదరీవనానికి పోయి నారాయణుణ్ని ఆరాధించి ముక్తిని పొందుమని మహాదేవుడు చెప్పాడు. బదరిలో తపస్సు చేశాడు. శ్రీకృష్ణుడు ప్రసన్నుడై దివ్యరూపాన్ని ప్రదర్శించాడు.

"తలపునఁ జూచిన చూపును, వెలిఁజూచిన చూపునొక్కవిధమయి యున్నన్, నెలకొని ఘంటాకర్ణుడు, నలినాక్షుని నామకీర్తనం బొనరించెన్॥" (ఉ. హరివంశం.)
ఘంటాశ్రవుడు పిశాచరూపాన్ని విడిచాడు. పరంధామానికి చేరుకొన్నాడు.

12. నారదుడు : బ్రహ్మపుత్రుడు. దేవర్షి, త్రిలోకసంచారి. మహతి అనే వీణను ధరించేవాడు. నిరంతరం నారాయణనామసంకీర్తనం చేసేవాడు. 'కలహభోజను'డని ఖ్యాతి బడసిన వాడు. తగవుల చేతనైనా లోకాలకు మేలు చేసేవాడు. మహోపకారి.

13. విదురుడు : 'మాండవ్యు'డనే మునిని రాజభటులు చోరుడని తెస్తే రాజు 'కొఱ్ఱు' వేయించాడు. మరణించిన ముని 'నాకీ శిక్ష ఎందుకు వేశావు?' అని యమధర్మరాజును అడిగాడు. చిన్నతనాన నీవు తూనీగలను పట్టి సూదికి గుచ్చి కొరత వేసి నందువల్ల ఈ శిక్ష నీకు కలిగిందన్నాడు యముడు. అంత మాత్రానికే

ఇంత శిక్ష విధిస్తావా? అని కోపంతో 'నీవు శూద్ర స్త్రీ యందు పుట్టు' మని మాండవ్యుడు యముణ్ని శపించాడు. యముడే విదురుడు. అంబిక యొక్క దాసియందు వ్యాసునికి పుట్టిన పుత్రుడే విదురుడు. ధృతరాష్ట్రుడూ, పాండురాజూ, విదురుణ్ని అనుగు తమ్మునిగానే సంభావించారు. విదురుడు నీతిపరుడు. ధీమంతుడు, కృష్ణభక్తుడు.

14. పరాశరసుతుడు : బ్రహ్మ మాట రీతిగా, వసిష్ఠుని మనుమడైన పరాశర మహర్షికి సత్యవతి యందు సద్యోగర్భాన కృష్ణద్వైపాయనుడు జన్మించాడు. పుట్టిన వెంటనే, తల్లి తలచుకొన్నప్పుడు తాను కనబడుతానన్న మాటను చెప్పి వెళ్ళాడు. "శమ్యాప్రాసం" వ్యాసుని ఆశ్రమం. శ్రీశుకమహర్షికి తండ్రియైన వ్యాసుని మరొక పేరు అపాంతరతముడు. వేదాలను విభజించడంవల్ల వేదవ్యాసుడన్న పేరు రూఢి అయింది. సకలపురాణకర్త. కౌరవవంశాన్ని వృద్ధిని పొందించాడు. భారతీయ సంస్కృతి వైయాసికి. భాగవతాన్ని కీర్తించాడు. 'ధ్యేయో నారాయణస్సదా' అని బోధించాడు.

15. గాంగేయుడు : ఆపుడు, ధ్రువుడు, సోముడు, ధరుడు, అనిలుడు, అనలుడు ప్రత్యూషుడు, ప్రభాసుడనే అష్టవసువులు కళత్రసహితంగా వసిష్ఠుణ్ని సేవించారు. ప్రభాసునిభార్య వసిష్ఠునిహోమధేనువుయొక్క సౌశీల్యానికి ఆశ్చర్యపడి తనకది కావాలని కోరింది. ప్రభాసుడు తోటివారి సహాయంతో ఆ ధేనువును తస్కరించాడు. వసిష్ఠుడు యోగదృష్టితో గ్రహించాడు. వసువులను 'మర్త్యలోకంలో పుట్టు' డని శపించాడు.

ప్రతీపుడనే రాజు తపస్సు చేస్తుంటే గంగానది స్త్రీ రూపంతో వచ్చి అతని తొడమీద కూర్చుంది. ఏకపత్నీవ్రతుడైనందువల్లనూ, పుత్రారోహణకు అర్హమైన కుడితొడమీద కూర్చున్నందువల్లనూ, తన పుత్రునికి భార్యవవుతావన్నాడు ప్రతీపుడు.

బ్రహ్మసభలోకి గంగ వస్తుంటే గాలిచే ఆమె కొంగు తొలగింది. సభ్యులలో మహాభిషుడు గంగను బాగా చూచాడు. బ్రహ్మదేవుడు గమనించి అభిషుణ్ని 'మనుష్య లోకంలో పుట్టు' మని శపించాడు.

అభిషుడు ప్రతీపమహారాజుకు పుట్టి శంతనుడన్న పేరు వహించాడు. యువతిగా విహరిస్తున్న గంగను శంతనుడు చూచి మోహించాడు. ఆమె ఏమి చేసినా తానేమీ అనకూడదనే నియమం పెట్టింది. శంతనుడు ఒడంబడినాడు. గంగను పరిణయించాడు.

వసువులు అంతకు ముందే తమవృత్తాంతాన్ని గంగతో చెప్పి, తమను తొందరగా కడతేర్చుమని ప్రార్థించారు. కాబట్టి పుట్టగానే శిశువులను క్రమంగా

ఏడుగురిని ఆమె గంగలోకి విసరివేసింది. ప్రభాసుడనే వసువు ఎనిమిదవ శిశువు. "పుత్రఘాతీ! ఈ శిశువును చంపనీయ''నన్నాడు శంతనుడు.

రాజు, శపథం తప్పించనదువల్ల తానుండనని గంగ శిశువుతో పాటు వెళ్ళిపోయింది. సకలవిద్యలను నేర్పించి, పెద్దవాడైన తర్వాత గంగ పుత్రుణ్ని శంతనునికి అప్పగించి పోయింది. ఎక్కువ దోషం గల ప్రభాసుడే గాంగేయుడై చిరకాలం జీవించాడు.

శంతనుడు దాశరాజపుత్రియైన సత్యవతిని కామించి కృశిస్తుంటే గమనించిన తనయుడు 'సత్యవతీ సంతానమే రాజసింహాసన మధిష్ఠించడం నిశ్చయం' అని భీష్మ మైన బ్రహ్మచర్యదీక్షను వహించి ఆమెను తెచ్చి తండ్రికి పెండ్లి చేశాడు. దేవవ్రతుడు, భీష్ముడని పొగడుతూ దేవతలు శాంతనవునిపైన పూలవాన కురిపించారు. తండ్రి స్వచ్ఛందమరణుడవవుతావని దీవించాడు. మహాపరాక్రమశాలి. ధర్మాధర్మాలను జీవితంలో అనుభవించిన మహాత్ముడు భీష్ముడు. శ్రీకృష్ణునిఆజ్ఞవల్ల ధర్మరాజుకు రాజధర్మాలను బోధించాడు కురుపితామహుడు. ఉత్తమధర్మంమాత్రం విష్ణువును సహస్రనామాలతో అర్చించడమే అని శ్రీకృష్ణునిముందు శ్రీ విష్ణుసహస్రనామస్తోత్రం చేసినవాడు గాంగేయుడు. దక్షిణాయనంలో (అస్త్రసన్యాసం చేసి) అంపశయ్య మీద పడుకొన్న భీష్మాచార్యులు లోక సంగ్రహార్థం ఉత్తరాయణ కాలందాకా వేచి యుండి స్వచ్ఛంద మరణుడయ్యాడు.

16. ద్రౌపది : పాంచాల రాజైన ద్రుపదుడు సంతానార్థియై క్రతువు చేస్తుంటే, అగ్నికుండంలోనుంచి 'ధృష్టద్యుమ్ను'డనే పుత్రుడూ, 'ద్రౌపది' అనే పుత్రికా పుట్టారు. ఈమెకు యాజ్ఞసేని, కృష్ణ అని పేర్లున్నాయి. మత్స్యయంత్రాన్ని ఛేదించిన అర్జునునికి భార్య అయింది. 'ఒక ఫలం తెచ్చామమ్మా!' అంటే కుంతి 'ఆ ఫలాన్ని ఐదుగురూ అనుభవించండి' అని గమనించక అన్నది. తత్ఫలితంగా ద్రౌపది పంచభర్తృక అయింది. జూదంలో పాండవులు ఓడిన తర్వాత ఏకవస్త్రయైన ద్రౌపదిని సభలోకి ఈడ్పించాడు దుర్యోధనుడు. దుశ్శాసనునిద్వారా వస్త్రాపహరణం చేయించాడు. మానభంగం జరుగుతున్నా, అమరకల్పులైన ఐదుగురు మగలు సభలో నేలగీతలు గీస్తూ కూర్చున్నారు.

"బలవతి సతి దైవే బంధుభిః కిం విధేయమ్?'' భగవంతుడు అండగా ఉంటే బంధువులతో నేమి పని? అనుకొన్నది పాండవపత్ని.

"శంఖ చక్రగదాపాణే! ద్వారకానిలయాచ్యుత!

గోవింద పుండరీకాక్ష! రక్ష మాం శరణాగతామ్''॥ అని శరణాగతి చేసింది ద్రౌపది. శ్రీకృష్ణుడు ఆమెను, మానభంగంకాకుండా వస్త్రరూపంలో వచ్చి, సంరక్షించాడు.

అవతారాన్ని చాలించే సమయంలో శ్రీకృష్ణుడు, "నామసంకీర్తనంతో ప్రపత్తి చేసిన ద్రౌపదికి తగినట్లు సహాయమేమీ చేయనందువల్ల, ఆమె ఋణం చక్రవడ్డీతో పాటు పెరుగుతున్న దని విచారపడినాడట.

17. నరుడు: బదరికాశ్రమంలో నరనారాయణులుగా అవతరించినవారే ద్వాపరయుగంలో నారాయణుడు శ్రీకృష్ణుడుగానూ, నరుడు అర్జునుడుగానూ ఉద్భవించారు. పృథా పుత్రుడు కాబట్టి పార్థుడని పేరు. ఆపదలు ఆపదలు కావు. భగవంతుణ్ని స్మరింపజేసేసంపదలే అవి. దైవాన్ని స్మరించనికాలమే ఆపత్కాలమని దృఢవిశ్వాసంకలవారు పాండవులు, పాండవమధ్యముడు పార్థుడు. తన నాశ్రయించినవారి నమ్మకానికి తగినట్లు శ్రీకృష్ణుడు 'పాండవపక్షపాతి' యని ఖ్యాతి వహించాడు. కురుక్షేత్రయుద్ధంలో శ్రీకృష్ణుడు పార్థసారథియై భగవద్గీతాశాస్త్రాన్ని బోధించాడు. సంశయాత్ముడైన నరునికి విశ్వరూపాన్ని ప్రదర్శించి, నరుడు నిమిత్తమాత్రుడనీ స్పష్టపరచినాడు పార్థసారథి. నరునికి త్రికరణశుద్ధిగా ఆశ్రయించ దగినవాడు నారాయణుడే, నరునికి అతడే బలం అన్న అనుభూతికలవాడు అర్జునుడు. "మా మేకం శరణం వ్రజ' అని శ్రీకృష్ణుడు 'చరమార్థప్రదాత' కావడానికి ముఖ్యకారకుడు నరుడు.

18. అక్రూరుడు: ద్వాపరయుగాన గాందినీ శ్వఫల్కదంపతులకు పుట్టిన పుణ్యపురుషుడు ఆక్రూరుడు. మథురానగరనివాసి. బృందావనంలో ఉన్న రామకృష్ణులను తోడ్కొని రమ్మని కంసుడు తనను పంపినప్పుడు, 'చీకటి తొలగి నామొగాన పొద్దుపొడిచింది. ఈనాడే కదా'! "అద్యమే సఫలం జన్మ సుప్రభాతా చ మే నిశా" గోవిందునిసందర్శనంవల్ల నాజన్మ సఫలమవుతుందని మురిసి పోయినవాడు అక్రూరుడు.

'బృంద' లో బలరామకృష్ణులచే ఆలింగితుడై, ఆతిథ్యాన్నీ పొందిన వాడు. మథురకు వచ్చే సమయాన రథందిగి అక్రూరుడు, యమునాజలంలో స్నానం చేస్తున్నప్పుడు ఆనీటిలో శేషశాయి యైన శ్రీమన్నారాయణుణ్ణి దర్శించాడు. లేచి రథంవైపు చూస్తే, దానిమీద రామకృష్ణులు అలాగే ఉండగా కేల్మోడ్చాడు.

"పన్నగాధీశతల్పా! కృపాకల్పా! వందారు కల్పా! నాకు నీవిలసత్పాదయుగంబు జూపి కరుణ స్వీక్షింపు లక్ష్మీపతీ!" అని స్తుతించిన పరమభక్తుడు.

ఈ 18 గురు, భగవన్నామాన్ని స్మరించక విడువ దలచుకొన్నా, అది వీరి జిహ్వాగ్రాన నర్తించక మానదు కదా! నామవైభవమట్టిది.

'అంకానాం వామతో గతిః అన్నట్లు 18 సంఖ్యలో, 8 జకారాన్ని 1 యకారాన్ని సూచిస్తుంది. భగవన్నామసన్మర్తలకు ఇహపరలోకాల్లోనూ జయం కలుగుతుందనే ధ్వని విలసితమీపద్యం.

**శా. శ్రీకిన్మందిరమైన వక్షము సురజ్యేష్ఠోద్భవస్థాననా**
**భీకంజాతము చంద్రికాంతర సుధాభివ్యక్తనేత్రంబులున్**
**లోకస్తుత్యమరున్నదీజనకమాలోలాంఘ్రియున్ గల్గునా**
**లోకారాధ్యుఁడవైన నిన్నెపుడు నాలో చూతు నారాయణా ॥ 40**

అర్థం: ఓ నారాయణా! శ్రీకిన్ = లక్ష్మీదేవికి; మందిరమైన = స్థిరనివాసమైన; వక్షము = భుజాంతరం; సురజ్యేష్ఠ - జాతము, సురజ్యేష్ఠ = దేవతలలో పెద్దవాడైన బ్రహ్మదేవునికి; ఉద్భవస్థాన = జన్మదేశమైన; నాభీకంజాతము = బొడ్డుతామర; చంద్రికా - నేత్రంబులున్, చంద్రికా+అంతర = చంద్రకాంతిలో ఉన్న; సుధా = అమృతాన్ని; అభివ్యక్త = వెదజల్లుతున్న; నేత్రంబులున్ = కన్నులు; లోకస్తు- ఘ్రియున్, లోకస్తుత్య = జనులచేస్తుతింపదగిన; మరుత్+నదీ జనక = దేవనదికి ఉద్గమస్థానమైన; మాలోల+అంఘ్రియున్ = లక్ష్మిదేవికి ప్రియంగా వశమైన పాదాలున్ను; కలుగు = కలిగియున్న; ఆలోక+ఆరాధ్యుడవైన = సకలలోకాలకు పూజ్యుడవైన; నిన్ను; నాలో; ఎపుడు, చూతు = ఎప్పుడు చూస్తాను? ఎప్పుడు చూస్తుంటాను?

తా: ఓనారాయణా! సిరికి మందిరమైన డెందమూ; బ్రహ్మకు పుట్టుచోటైన నాభీకమలమూ, వెన్నెల ప్రసరించేకన్నులూ, లోకులచే స్తుతింప దగినవీ, లచ్చికి మచ్చికయైన పాదాలూ కలిగి, సకలలోకారాధ్యుడవైన నిన్ను నాలో ఎపుడు చూస్తాను?

**వ్యాఖ్య: నామజపానికి పర్యవసానం నామిస్వరూపదర్శనం.**

భగవంతునినామాలన్నీ ఆయనస్వరూపరూపగుణవిభవైశ్వర్యశీలాదులనే ప్రకటిస్తాయి. ఒక పేరుతో పిలిస్తే ఆపేరుగల వ్యక్తి తనకు అభిముఖుడవుతాడుకదా! కాబట్టి నామప్రభావానికి పరాకాష్ఠ భగవత్సాక్షాత్కారమే. "హృత్పద్మమధ్యే సతతం వ్యవస్థితం" అన్నట్లు హృదయకమలమందున్న నారాయణుణ్ని చూడడానికీ నామజపమే ఆవశ్యకం. బాహ్యదృష్టిని వారించుకొని అంతర్ముఖుడై ధ్యానిస్తే, ధ్యేయమూర్తికి అనుగ్రహం కలుగుతుంది. నారాయణుడు సకలలోకారాధ్యుడు.

సర్వసంపదలు మూర్తీభవించిన శ్రీదేవి, నారాయణుని గుండెలో గూడు కట్టుకొన్నది. సృష్టికర్తయైనబ్రహ్మ జన్మించిన స్థలం నారాయణుని నాభీకమలం. "యథా ప్రహ్లాదనాచ్చంద్రః" అన్నట్లు చల్లని వెన్నెల లాగా దయారసామృతోద్గారాలైనవి ఆయన నేత్రాలు. దేవమానవాది లోకాలకు స్తోత్రపాత్రమైనవి భగవత్పాదాలు. అవి

సకల భూతాలకు ధారక పోషకమైన మిన్నేటి ఊటలు. అంతే కాదు, జగన్మాతను తమ సౌందర్యసౌకుమార్యాలచే ఆకర్షించి, ఆమెచే ప్రియంగా లాలింపబడేవి మాలోలుని పాదాలు. దివ్యావయవసౌందర్యవిశిష్టుడు శ్రీమన్నారాయణుడు. వాగ్రూపంగా మంత్రాన్ని అనుసంధిస్తున్నప్పుడు అంతరంగంలో ఆ మంత్రార్థాన్ని సంభావించడమే, సగుణుడైన, సర్వాంగసుందరుడైన నారాయణుని రూపసందర్శనానికి ముఖ్యహేతువు. "కదా ను సాక్షాత్కరవాణి చక్షుషా" ఎప్పుడు చూస్తానో అని ఆర్తితో అంతర్ముఖుడైతే, ధ్యానమగ్నుడైతే, ధ్యేయమూర్తిని ఎప్పుడూ చూస్తుంటాడు. రూపముంటే నామమేర్పడుతుంది. అయినా, నిలిచేది నామం. రూపాన్ని నిల్పేది నామం. కాబట్టి, నామరూపాలలో నామానికే ప్రభావమూ, ప్రాధాన్యమూ ఉంది.

"ధ్యాయంతి యే విష్ణుమనంత మవ్యయం - తే యాంతి సిద్ధిం పరమాం చ వైష్ణవీమ్॥" సాలోచనులై లోపలి చూపుతో ధ్యానం చేసేవారు, సారసలోచనుని కృపాకటాక్షానికి పాత్రులౌతారు, శ్రీ వైష్ణవసిద్ధినీ పొందుతారన్నాడు శ్రీ కులశేఖరుడు.

## కృష్ణావతార వింశతి

**శా. విందుల్విందులటంచు గోపరమణుల్ వ్రేపల్లెలోఁ బిన్ననాఁ**
**డందెల్ మ్రోయఁగ ముద్దుమోమలర నిన్నాలింగితుం జేయుచో**
**డెందంబుల్ దనివార రాగరసవీటీలీలలన్ దేల్చు మీ**
**మందస్మేరముఖేందురోచులు మమున్మన్నించు నారాయణా॥ 41**

అర్థం : ఓ నారాయణా! వ్రేపల్లెలో = వ్రేతల (గొల్లల) పల్లెలో; గోపరమణుల్ = గోపస్త్రీలు; పిన్ననాడు = చిన్నతనాన; అందెల్ మ్రోయఁగ = నూపురాలు రవళించగా; ముద్దు మోము+అలరన్ = మొగము ముద్దు ముచ్చట గొల్పగా - అందమైన మొగం వికసింపగా; విందుల్విందులు+అట+అంచు = విందులు, విందులు అంటూ; నిన్ను; ఆలింగితున్, చేయుచో = కౌగిలించుకొన్నప్పుడు; డెందంబుల్, తనివార = చిత్తరంజకంగా - హృదయాలు ఆనందించునట్లుగా; రాగరసవీటీలీలలన్ తేల్చు = ప్రేమపూర్ణమైన శృంగార చేష్టలతో ఆనందింప జేయునట్టి; మీ మందస్మేర ముఖ+ఇందు రోచులు = చిరునగవులొలుకు మీ ముఖచంద్రకాంతులు; మమున్ = మమ్ములను; మన్నించున్ = ఉజ్జీవింప జేస్తాయి.

తా: ఓ నారాయణా! నందగోకులంలో చిన్నప్పుడు అందెలు సవ్వడిచేస్తుంటే, ముద్దులొలికే ముఖం చూడముచ్చట గొల్పుతుంటే, గోపికలు విందులు, విందులు అంటూ నిన్ను కౌగిలించుకొన్నప్పుడు వారి మనసుదీర శృంగార క్రియలతో సంతోషింపజేసే నీ మందహాసముఖచంద్రకాంతులు మమ్ము కాపాడుతాయి.

**వ్యాఖ్య : శ్రీ కృష్ణునిబాల్యలీల(ల)ను వర్ణించే పద్యమిది.**

నారాయణుడే శ్రీకృష్ణుడుగా అవతరించాడని హరివంశం చెబుతుంది.

"ఏష నారాయణః శ్రీమాన్ క్షీరార్ణవనికేతనః।
నాగ పర్యంక ముత్సృజ్య హ్యాగతో మథురాంపురీమ్॥"

అనే సూక్తి ఇక్కడ అనుసంధేయం. (ఈ శ్లోకార్థం 18వ పద్యంలో వివృతం)

"కృష్ణం ధర్మం సనాతనమ్" సనాతనధర్మరూపుడు కృష్ణుడని అర్థం.

'సనాతన తమః' అనే నామభాష్యంలో "సనా పురాణేఽపి తనతి రూపం పురాణతమః, పురా అపి నవః పురాణః, సదాతనత్వేఽపి తదాతనత్వవత్ నిత్యనూతన భోగ్యః" పురాణ పురుషుడే అయినా కృష్ణుడు నిత్యనూతనంగా అనుభవింపదగినవాడని శ్రీపరాశరభట్టర్ పలుకడం స్మరణీయం. 'కృష్ణ' శబ్దానికి సదా నందుడని అర్థం. ఆనంది లోకులకు ఆనందాన్నే ప్రసాదిస్తాడు.

శ్రీరామచంద్రస్వామి రూప వైభవాన్ని వాల్మీకి భగవానుడు వర్ణించాడు. "రూపౌదార్య గుణైః పుంసాం దృష్టిచిత్తాపహారిణమ్". ఈ సూక్తికి వ్యాఖ్యానం ఇలా ఉంది. "రూపం విగ్రహః, పుంసాంకఠినచిత్తానామపి, కిముత స్త్రీణామితి భావః యద్వా, పుంశబ్దేన స్త్రీపుంససాధారణ మాత్మమాత్రముచ్యతే; పుమానే కో వ్యవస్థిత ఇతి విష్ణుపురాణే ప్రయోగాత్, తేన సురనరతిర్యగాదిభేదభిన్నానాం స్త్రీ పుంనపుంసకభేద భిన్నానాం సర్వేషాం దృష్టిచిత్తాపహారఉక్తః" (గోవిందరాజీయం).

స్త్రీ పురుష భేదం లేకుండా, సర్వప్రాణుల కన్నులను, మనస్సును చూరగొనే రూప, గుణ సౌందర్య వైభవం కలవాడుగా రాముడు కీర్తింపబడినాడు. దండకారణ్య వాసులైన తాపసులు సర్వాంగ సుందరుడైన శ్రీరామచంద్రస్వామిని సేవించి 'ఆలింగామో భవంతం' మిమ్మాలింగనం చేసుకొంటాం స్వామీ!' అన్నారట.

"భవాంతరే కృష్ణావతారే యూయం గోపికాభూత్వా మా మాలింగథ - కృష్ణావతారంలో మీరు గోపికలుగా జన్మించి నన్ను ఆలింగితుని చేయండి" అన్నాడట. (ఆథర్వణిక కృష్ణోపనిషత్తు).

వ్రేపల్లెలో బాలకృష్ణుడు కాలియందెలు ఘల్లు ఘల్లుమని మ్రోగుతుంటే, ముగ్ధ మోహనమైన ముఖారవిందంతో అందరినీ ఆకర్షించేవాడు. దివ్యావయవాల అమరిక చేత ఏర్పడిన అపూర్వ లావణ్యమనే సాముదాయిక శోభతో అందరికి విందులు కూర్చువాడు బాలకృష్ణుడు.

ముద్దు లొలికే ముఖం కన్నులకు విందు, మంజీరాల శింజితాలు చెవులకు విందు. విచిత్ర స్నిగ్ధ విగ్రహం డెందానికి విందు. మధురగంధిమందహాసం నాసికకు

విందు. 'కృష్ణా!' అనే పసిడి పలుకు రసనకు విందు. సర్వేంద్రియాలు సంతృప్తి చెందినా, త్వగింద్రియానికి తాకితేగాని తృప్తి యుండదు. కాబట్టి మంగళాంగుణ్ని చూచిన వెంటనే విందులు, విందులూ అంటూ గోపాంగనలు ఆలింగనం చేసుకొనేవారు. అప్పుడు కృష్ణుడు బాలుడే అయినా, గోపికల డెందం కందళించి ఆనందభరిత మయ్యేరీతిగా మగ పోడిమితో సింగారపు చేష్టలు చేస్తూ చిరునవ్వుల వెన్నెలను చిందించేవాడు. ఆ మోము, ఆ రవళి, ఆ లీలలు, ఆ చిరునవ్వులు మనకూ విందులై పుష్టినీ, తుష్టినీ కలిగిస్తాయి కదా!

వెల్లపూడి మణి పెద్దామాత్యుని పద్యమూ కమనీయమే.

"అందము గుల్కునీయలసయానము మాటలు తేనె సోనలన్
జిందు మృదుస్మితంబు సుధ జిందు గటాక్షములౌర మించుకున్
విందులు కౌగిలింత కడు వింతయటంచును గోపకాంతలా
నందముతోడ బల్కుదురు నాథ! భవన్మహిమానుభావముల్॥"

(కృష్ణకర్ణామృతం. 1-27)

**శా. విందుల్వచ్చిరి మీయశోదకడకు న్వేగంబె పొమ్మయ్యయో**
**నందానందన! చందనాంకురమ! కృష్ణా! యింకఁ బోవేమి మా**
**మందం జాతర సేయఁబోదమిదె రమ్మాయంచు మిమ్మెత్తుకో**
**చందంబబ్బిన నుబ్బకుండుదురె ఘోషస్త్రీలు నారాయణా॥ 42**

అర్థం : ఓ నారాయణా! మీ యశోద కడకున్ = మీ తల్లియైన యశోదవద్దకు; విందుల్ = చుట్టాలు; వచ్చిరి. వేగంబె పొమ్ము. అయ్య= తొందరగా పోవయ్యా! ఓనంద+ఆనందన = నందునికి ఆనందమైన వాడా! ఓ చందన+అంకురమా = ఓ శ్రీ గంధపు మొలకా కృష్ణా! ఇంకనూ పోవేమి? మా మందన్ = మా రేపల్లెలో; జాతర సేయన్, పోదము, ఇదె రమ్మా, అంచు, మిమ్ము ఎత్తుకో, చందంబు = విధం; అబ్బినన్ = కలిగినచో; ఘోష స్త్రీలు = గొల్లపల్లె పడతులు; ఉబ్బక+ఉండుదురె = పొంగకుందురా!

తా: ఓ నారాయణా! మీ తల్లియైన యశోద దగ్గరికి చుట్టాలు వచ్చారు. శీఘ్రంగా పోవయ్యా! ఓ నందానందన! ఓ చందనాంకురమా! కృష్ణా! ఇంకా పోవేమి? మా గొల్లపల్లెలో జాతర సేయపోదాం, రావయ్యా! అంటూ గొల్లపల్లె పడుచులు నిన్నెత్తుకొనే భాగ్యమబ్బగానే ఉబ్బిపోతారు కదా!

**వ్యాఖ్య : గొల్లపల్లె పడతుల భాగ్యగరిమ వర్ణితం.**

నందనందనుడు మందలో సంచరిస్తూ అందరికి విందుగా ఉండే వాడు. శ్రీ కృష్ణుణ్ని పుత్రునిగా పొందడంవల్ల ఆనందాన్ని అనుభవించిన వాడు కాబట్టి,

నందగోపాలునికి 'నందు'డనే సార్థక నామం కల్గిందని పెరియ వాచ్చాన్ పిళ్లై మూవాయిరప్పడి వ్యాఖ్యలో నంద శబ్దాన్ని వివరించారు. శ్రీకృష్ణుని బాల్య లీలలను చూచి మహానంద సాగరంలో మునిగిన అదృష్టశాలి ఈనందుడు. ఈ అంశాన్ని 'పెరుమాళ్ తిరుమొళి'లో శ్రీకృష్ణుణ్ణి చూచి, నీ తండ్రి ఎవరు? అని అడిగితే, తన వేలితో నందగోపుణ్ని చూపాడని శ్రీ కులశేఖరాళ్వారన్నారు. నందునికి ఆనందాన్ని కూర్చే వాడు కాబట్టి కృష్ణుడు, నందానందుడనే ఖ్యాతిని పొందాడు. "యో నందః పరమానందో యశోదా మౌక్తిగేహినీ" (అథర్వ-కృ-ఉ)

పరబ్రహ్మ శ్రీకృష్ణుడనీ, మోక్షలక్ష్మియే యశోద అనీ, పరమానందమే నందుడనీ ఉపనిషత్తు ఉద్ఘోషిస్తుంది.

భవభూతి చెప్పినట్లు, దంపతుల ఆనందగ్రంథియే అపత్యంకదా! కాబట్టి, నందుని ఆనందమే శ్రీకృష్ణుడు.

గొల్లలు జాతర చేసుకోవడం వారి ఆచారం. తమ దగ్గరికి వచ్చిన కృష్ణునితో ఒక పడతి 'నందానందన! యశోద ఇంటికి విందులు వచ్చారు. త్వరగా పోవయ్యా!' అని చెప్పింది. 'విందు' అంటే మృష్టాన్న భోజనం. ప్రియమైన బంధువునూ 'విందు' అనడం వ్యావహారికం.

కృష్ణుణ్ని చందనాంకుర మని సంబోధించింది ఓ మగువ. అందరినీ, తుదకు తనను నరికిన గొడ్డలిని కూడా, పరిమళంతో ఆహ్లాద పరచేది చందన తరువు. సర్వప్రాణులకూ, కడకు 'యది వా రావణః స్వయమ్' అన్నట్లు తన విరోధికి కూడా అతడాశ్రయిస్తే చాలు, ప్రేయః శ్రేయస్సులను సమకూర్చేవాడు సర్వేశ్వరుడు. శ్రీకృష్ణ భగవానుడు బాలుడు కాబట్టి అతడు చందనపు మొలక. అది ఉన్నతావు నుంచి కదలదు. ఒకరు ఆ మొలకను సున్నితంగా ఎత్తుకొని పెరిగే చోట ఉంచవలసినదే కదా! గోపాలునికీ గొల్లలకూ ఉన్న వాసనా బలమలాంటిది. కాబట్టి, ఓ చందనాంకురమా! చెప్పినా ఇక్కడనే ఉన్నావు, ఇంక పోవేమయ్యా! అన్నది. లేదా మనమందలో జరిగే జాతరకు పోదాం రా! రావయ్యా అంటూ ఆ తొయ్యలి చిన్ని కృష్ణుణ్ని ఎత్తుకొన్నది. ఆచందనాంకురాన్ని ఎత్తుకొనే చందమే అందం.

రొండికెత్తు కోవడంవల్ల ఒత్తుక పోవడం సాధారణం. మెదుపడం, మర్దనంవల్ల విస్తరించే చందన పరిమళం లాగా ఆ ఎత్తుకొనే చందం మనోహరమైనది. అలాంటి బాలగోపాలకృష్ణుని దర్శన, స్పర్శన భాగ్యమబ్బిన ఘోషస్త్రీల శరీరం పులకరించక, ప్రత్యంగం వ్యాకోచించక ఉండదు కదా! ఘోష ఆభీర పల్లీ స్యాత్ (అమరం). 'ఘోష' శబ్దానికి 'గొల్లపల్లె' అని అర్థం. భగవంతుణ్ని ఎత్తుకో గలిగిన సౌభాగ్యవతులు ఆ ఘోషస్త్రీలు.

**శా. అన్నా కృష్ణమ! నేఁడు వేల్పులకు మీఁదన్నార మీచట్లలో**
**వెన్నల్ ముట్టకుమన్న నాక్షణమున న్విశ్వాకృతిస్ఫూర్తివై**
**యున్నన్ దిక్కులు చూచుచున్ బెగడిని న్నోలిన్నుతుల్ సేయుచున్**
**గన్నుల్ మూయ యశోదకున్ జిఱుతవై కన్పింతు నారాయణా॥43**

అర్థం : అన్నా! కృష్ణమ! నేఁడు, వేల్పులకు, మీఁదు, అన్నారము = ఈ వేళ దేవతల (నైవేద్యం) కోసం, అన్నాం. ఈ చట్లలో = ఈ కడవల్లో, వెన్నల్, ముట్టకుము, అన్నన్, ఆ క్షణమునన్, విశ్వ+ఆకృతి స్ఫూర్తివై = విశ్వాకారంతో ప్రకాశించిన వాడవై; ఉన్నన్; దిక్కులు చూచుచున్, బెగడి = బెదరి; నిన్నున్, ఓలి = వరుసగా; నుతుల్ = స్తోత్రం, చేయుచున్; కన్నుల్, మూయ = మూసుకొన్నప్పుడు; ఓ నారాయణా! యశోదకున్, చిఱుతవై = చిన్నవాడవై; కన్పింతువు.

ఈ పద్యారంభానికి ఈ విధముగా అర్థము చెపుతారు : అన్నా, కృష్ణమ, నేఁడు = ఈ దినము; ఈ చట్లలో వెన్నల్ = ఈ కుండలలోని వెన్నపూసలు; మీఁదు అన్నారము = నియమించిన ముడుపు అనినాము - అని. ఇది వేంకటేశ్వరస్వామికి మీదు కట్టినాము అని వ్యవహారము. కనుక ఈ వెన్న ముట్టకుము అనటం స్వరసం.

తా: అన్నా! కృష్ణమ! ఈ వేళ వచ్చిన వెన్న దేవతలకోసము మీదుకట్టినామన్నాం. మీద పెట్టిన ఈ కడవల్లోని వెన్నను ముట్టకు, అన్నంతలోనే విశ్వరూపాన్ని దాల్చావు. నాలుగు దిక్కులు చూస్తూ బెదరిపోయి నిన్ను స్తోత్రంచేస్తూ కన్నులను మూసుకొన్నప్పుడు యశోదకు చిన్న బాలుడవై కన్పిస్తుంటావు.

**వ్యాఖ్య : శ్రీకృష్ణుని స్వరూపం అప్రాకృతమని తెలిపే పద్యం.**

పరత్వం కప్పిపుచ్చి ఒక రాత్రి ఒకతెకు పుత్రుడై పుట్టి, మరొకతెకు పుత్రుడై పెరిగాడు శ్రీకృష్ణుడు. సౌలభ్యసౌశీల్యగుణాలను వెల్లడించడానికే గొల్లకులంలో పుట్టిన తాను అతిమానుషకృత్యాలను చేసి పరత్వాన్నీ ప్రకాశింపజేశాడు.

"అజాయమానో బహుధా విజాయతే" కర్మాధీనమైన పుట్టుకలేని వాడే అయినా, మత్స్యకూర్మాద్యనేకరూపాలలో పుడుతాడని భగవంతుణ్ని గూర్చి శ్రుతులు చెబుతున్నాయి.

"అజోఽపిసన్నవ్యయాత్మా భూతానామీశ్వరోఽపి సన్।
ప్రకృతిం స్వామధిష్ఠాయ సంభవామ్యాత్మమాయయా॥"

కర్మల వల్ల కలిగే పుట్టుక, గిట్టుక నాకు లేదు. సర్వభూతాలను శాసించేవాడను. అయినా నా సంకల్పంచేత నా పరమేశ్వర స్వభావాన్ని విడువకుండా అప్రాకృత దివ్య శరీరంతో పుట్టుతుంటాను. అని భగవద్గీత (4-6)లో శ్రీకృష్ణుడు తన అవతార రహస్యాన్ని ప్రకటించాడు.

కుడి, ఎడమ తెల్వనివారే అయినా గొల్లలు 'పాడి'ని పవిత్రంగా భావిస్తారు. పాలు, పెరుగు, వెన్న ఉన్న కడవలను అంటు, ముట్టు తగుల కుండా ప్రత్యేక స్థలంలో భద్రంగా ఉంచుతారు. ఉట్లమీదనూ పెడతారు.

ఒకనాడు యశోద 'అన్నా! కృష్ణమ్మా! నేడు దేవతలకు నైవేద్యం పెట్టాలను కొన్నాం. కాబట్టి ఉట్ల మీద చట్లలో ఉన్న వెన్నను నీవు ముట్టకూడదు. ఉచ్ఛిష్టం చేయకూడదు అని చెప్పింది. అంతే. వెంటనే వేలుపులటెనాకంటెను, వేలుపు మఱియెవ్వడనుచు పాలు, పెరుగు, వెన్న అన్నీ తనకే చెందవలసిన పదార్థాలని తల్లి గ్రహించే రీతిగా ఆ, వేలుపుదొర విశ్వరూపాన్ని ప్రదర్శించాడు.

దేవకీ వసుదేవులు అనుభవించ నోచుకోని కన్నయ్య ముద్దుముచ్చట్లనూ, ఆట పాటలనూ చూచి ఆనందించే యశోదానందుల సుకృతమలాంటిది.

"ద్రోణో వసూనాం ప్రవరో ధరయా సహ భార్యయా।

కరిష్యమాణ ఆదేశాన్ బ్రహ్మణస్తమువాచ హ॥" (భాగవతం. 10.8.50)

పూర్వజన్మలో ద్రోణుడనే వసుశ్రేష్ఠుడే నందుడు, ఆయన భార్యయైన ధర యే యశోద. వారు బ్రహ్మదేవునితో మేము భూలోకంలో జన్మించినప్పుడు అనాయాసంగా దుర్గతిని దాటడానికి విష్ణువుమీద ప్రేమమయభక్తిని ప్రసాదించు మన్నారట. బ్రహ్మదేవుడు 'తథాఽస్తు' అన్నాడని శ్రీశుక మహర్షి పరీక్షిన్మహారాజుతో చెప్పాడు.

కారాగృహంలో దేవకీ వసుదేవులకు స్వస్వరూపంతోనే ఆవిర్భవించిన కృష్ణుడిచ్చట నందకిశోరుడై విశ్వరూపాన్ని ప్రదర్శించాడు. కృష్ణావతారంలో మొట్టమొదట విశ్వరూపాన్ని యశోదకే చూపాడు కదా!

"తస్యైషఆత్మా వివృణుతే తనూంస్వాం" అని కఠోపనిషత్తు చెప్పింది. సర్వేశ్వరుడే తానై తన విశ్వరూపాన్ని దర్శింపజేస్తే సాక్షాత్కరించడానికి సాధ్యం గాని, స్వప్రయత్నంతో ఎంతగొప్పవారికైనా అది అసాధ్యమే.

"న చక్షుషా పశ్యతి కశ్చ నైనమ్" (శ్రుతి)

"న మాంసచక్షుషా ద్రష్టుం బ్రహ్మభూతస్స శక్యతే" (స్మృతి) అనే వాక్యాలు కూడా ఈ విషయాన్నే వెల్లడిస్తున్నాయి.

"ఖం రోదసీ జ్యోతిరనీకమాశాస్సూర్యేందువహ్నిశ్వసనాంబుధీంశ్చ।

ద్వీపాన్నగాంస్తద్దుహితౄర్వనాని భూతాని యాని స్థిరజంగమాని॥

సా వీక్ష్య విశ్వం సహసా రాజన్! సంజాతవేపథుః।

సంమీల్య మృగశాబాక్షీ నేత్రే చాసీత్సువిస్మితా॥" (భాగ. 10.7, 37, 38)

యశోదకు ఆ రూపంలో, ఆకాశం, జ్యోతిర్మండలాలు, దిక్కులు, సూర్యుడు, చంద్రుడు, అగ్ని, వాయువు, సముద్రాలు, ద్వీపాలు, పర్వతాలు, అడవులు, చరాచర ప్రాణికోటి కూడా కనిపించడంవల్ల భయంతో శరీరం కంపించింది. 'కృష్ణా! నారాయణా!' అంటూ ఆ క్రాల్గంటి కన్నులు మూసుకొంది.

క్షణంలో "కృష్ణస్తు భగవాన్ స్వయమ్" అని స్పష్టంగా తెలిపిన ఆ నల్లనయ్య మెల్లగా, అమ్మా! అంటూ, యశోదముందు చిన్న పిల్లవాడై కనిపించాడు.

**శా. ఉల్లోలంబులుగాఁ గురుల్ నుదుటిపై నుప్పొంగ మోమెత్తి ధ**
**మ్మిల్లంబల్లల నాడ రాగరససమ్మిశ్రంబుగా నీవు వ్రే**
**పల్లెందాడుచు గోపగోనివహగోపస్త్రీలయుల్లంబు మీ**
**పిల్లంగ్రోవిని జుట్టి రాఁ దిగుచు నీపెంపొప్పు నారాయణా॥ 44**

అర్థం : ఓ నారాయణా! కురుల్ = వెంట్రుకలు; నుదుటిపైన్ = నొసలుమీద; ఉత్+లోలంబులుగాన్ = ఎగురుతున్నట్లుగా; ఉప్పొంగ = పైపైకి రాగా; మోము+ఎత్తి = మొగమెత్తి; ధమ్మిల్లంబు = కొప్పు; అల్లల నాడ = అటు ఇటు కదలుతుంటే; రాగ రస సంమిశ్రంబుగా = రాగం (ప్రేమ); రసం (సింగారం) కలిసి ఉన్నట్లుగా; నీవు; వ్రేపల్లెన్ = రేపల్లెలో, తాడుచు = ఒక విధంగా సంచరిస్తూ; గోప, గోనివహగోపస్త్రీల = ఆలకాపరులు, ఆలమందలు, గొల్ల పడతులు, వీరియొక్క; ఉల్లంబు = మనస్సు; మీ పిల్లంగ్రోవిని చుట్టి = మీ మురళీరవాన్ని అనుసరించి; రాన్, తిగుచు = వచ్చేరీతిగా రంధ్రాల మీద వ్రేళ్ళను కదల్చుతున్న (మోగించే); నీ పెంపు = నీ మహిమ; ఒప్పు = తగియున్నది.

తా : ఓ నారాయణా! నీ ముంగురులు పైకి ఎగురుతూ నొసట చెలరేగుతుంటే మొగమెత్తి, నీకొప్పు కేశపాశం - జారి అల్లలనాడు తుంటే, ప్రేమ, సింగారం కలబోసినట్లు నీవు రేపల్లెలో సంచరిస్తూ, ఆలమందలు, ఆలకాపరులు, ఆ భీరయువతులు మనసుపడి నీ పిల్లన గ్రోవి చుట్టూరా చేరి తిరిగే రీతిగా మ్రోగించే నీ పెంపు ప్రశంసనీయం.

**వ్యాఖ్య : మురళి మోహనుని రూపవర్ణన.**

గోకులమంతా ప్రతిబింబిస్తున్న గోపాలకృష్ణుని లీలా విహారానికి ఆబాల గోపాలం ఆకర్షితమవుతున్నది. కన్నయ్య వీధుల్లో సంచరిస్తున్నప్పుడు అతని నుదుటిపైన అలకలు పదేపదే పైకి చెలరేగుతున్నాయి. కాబట్టి ముంగురులు ముఖాన్ని కప్పివేయకుండా మధ్యమధ్యన మొగమెత్తుతుంటాడు. అప్పుడు అతని కొప్పు విడిపోయి నర్తిస్తున్నట్లు సంచరిస్తుంటాడు. 'తోయంపు గురులతోడ దూగేటి శిరసు,

చింత కాయల వంటి జడలగములతోడ, మ్రోయుచున్న కనకపు మువ్వల పాదాలతోడ" (అన్నమయ్య) అన్నట్లు, ముగ్ధ మోహన రూపంతో విహరిస్తూ మురళీ నాదామృతాన్ని అందరికీ మనోహరంగా పంచిపెడ్తున్నాడు.

పిల్లన గ్రోవికి సప్త స్వరాలను పలికించే రంధ్రాలుంటాయి. ఆ రంధ్రాల మీద మృదువుగా ఉన్న చిన్న వ్రేళ్ళనానించి, మూస్తూ తెరుస్తూ ఉంటే, జగన్మోహనమైన నాదం ఉదయిస్తుంది. మురళీ మోహనుని రూపం ప్రేక్షకులకు ప్రేమను జనింపచేస్తే ఆయన సింగారంగా మ్రోగించిన వేణునాదం రసజనకమయింది. రాగరసమిశ్రమంగా కన్నయ్య పిల్లంగ్రోవిని మ్రోగిస్తుంటే గోవుల, గోపాలకుల, గోపస్త్రీల చెవుల ద్వారా ఆనాదామృతం హృదయంలోకి ప్రవహించింది. వారి ఉల్లం ఉబికి ఉరకలేస్తుంది. మనస్సు మారి నమస్సు పలుకుతుంది. 'మనస్సు తమది కాదని ఎవరి మనస్సు వారికి చెబుతూనే పరుగుదీసి, మురళిమనోహరుని చుట్టూ ప్రదక్షిణం చేస్తుంటుంది. "వంశస్తు భగవాన్ రుద్రః" రుద్రుడు శ్రీకృష్ణుని చేతి పిల్లనగ్రోవిగా ఆవిష్కృతుడన్నది ఆథర్వణిక కృష్ణోపనిషత్తు.

"హ్రదిన్యో - హృష్యత్త్వచోఽశ్రు ముముచుస్తరవో యథార్యాః" అని వ్యాసుడంటే "నలినోదర భక్తునిగని కులజులు నందాశ్రుజలము గురియు పగిది, మ్రాకులు పూదేనియలొలికెడు, నలినాక్షునిచేతివంశనాళముమ్రోతన్" అని పోతన పలికాడు.

తమ నీరుత్రాగి వృద్ధి పొందిన వేణువు, శ్రీకృష్ణుని అధరసుధాపానం చేత తమకూ ధన్యత్వాన్ని సంపాదించిందని నదులు పులకించాయట. ఆర్యుల లాగా చెట్లు ఆనందబాష్పాలను విడిచాయట. ఎందుకు? తమవంశంలో పుట్టిన వేణువు తమ కులానికంతకు ధన్యతను సంపాదించిందని పోతన దీనికి ఇలా రూపకల్పన చేశాడు.

భగవద్భక్తుణ్ని కని ఆకులంలో ఉద్భవించిన వారు ఆనందాశ్రువులను కురిసేలాగా, కృష్ణుని వేణునాదంవల్ల తరువులు మకరంద వ్యాజంతో అశ్రువులను కురుస్తాయట.

ఇలా స్థావర జంగమాలను వేణునాదంతో వశపరచుకొనే శ్రీకృష్ణుని తత్త్వాన్ని ఆబాలగోపాలం ప్రస్తుతిస్తుంది.

**మ. కసవొప్పన్ పసిమేసి ప్రొద్దు గలుగం గాంతారముంబాసి య**
**ప్పసియున్నీవును వచ్చుచో నెదురుగా\ బైకొన్న గోపాంగనా**
**రసవద్వృత్తపయోధరద్వయహరిద్రాలేపనామోదముల్**
**పసి\గొంచున్ బసి\గొంచు వచ్చుటలు నే భావింతు నారాయణా॥ 45**

అర్థం : ఓ నారాయణా! పసి = ఆలమంద; కసవు = గడ్డిని; ఒప్పన్ మేసి = బాగాతిని; ప్రొద్దు గలుగన్ = (ప్రొద్దుఉండగా) మలిసందవేళలో; కాంతారమున్ = అడవిని; పాసి = విడిచి; ఆ పసియున్ = ఆ గోగణమూ; నీవును; వచ్చుచోన్ = నీవూ వస్తుండగా; ఎదురుగాన్; పైకొన్న = మీదపడిన; గోపా-ముల్ గోప+అంగనా = గోపస్త్రీ(ల) యొక్క; రసవత్ = చిప్పిలుతున్న రసం (పస) గల; వృత్త = గుండ్రని; పయోధర ద్వయ = రెండు చన్నులయందలి; హరిద్రాలేపన = పసుపు పూత యొక్క; ఆమోదముల్ = వాసనలను; పసిగొంచున్ = ఆఘ్రాణిస్తూ; పసిగొంచువచ్చుటలు = ఆలమందనుతోడ్కొని రాకడ(ల)ను; నేను భావిస్తుంటాను.

తా : ఓ నారాయణా! దినమంతా గడ్డిని బాగా మేసి సందెవేళ ఆ పశువులూ, నీవూ అడవి నుంచి తిరిగి వస్తుంటే, నీ కెదురుగా వచ్చిన గోపికల గాలి నీ మీద సోకింది. వారు సింగారంగా గుండ్రని రెండు చన్నులందు పూసుకొన్న పసువు, కుంకుమ జవ్వాది పూతల సువాసనలను ఆఘ్రాణిస్తూ ఆలమందను నీవు తోల్కొని వచ్చే దృశ్యాలను స్మరిస్తుంటాను.

**వ్యాఖ్య : శ్రీకృష్ణుణ్ని గోపాలునిగా వర్ణించే పద్యం.**

శ్రీకృష్ణునికి గోవులను పాలించడం పరమప్రీతికరం. సర్వేశ్వరుడు రామావతారంలో అరణ్యంలో సంచరించాడు. కృష్ణావతారంలో ఆవులను మేపుతూ అరణ్యంలో సంచరించాడు. "ఆరణ్యకా" లనే వేదాంత వనాలలో సంచరించే - గోచరించేవాడు సర్వేశ్వరుడు.

తన దర్శనాన్ని కోరే ధ్రువాదుల లాంటి ఏ ఒకరిద్దరు భక్తులకోసమో కాక, కోరకున్నా తానే ఉండబట్టలేక అవతారాదులనెత్తి వచ్చి సకల జనులకు యోగక్షేమాలను కల్పిస్తూ నిత్యసన్నిహితుడు అవడం, వాత్సల్య మనే దయావిశేషకార్యమే కదా! కాబట్టి, పొదుగులో పాలు నిండిపోయి సలుపుతుంటే ఉండలేక తనంతట తానే నేలమీద పాలను కార్చే గోవులాంటి స్వభావం కలవాడు నారాయణుడంటారు విజ్ఞులు.

తొలిసంజలో తోల్కొని పోయినపశువులు - ఆవుల గుంపులు, దూడల మందలు - పగలంతా అడవిలో పచ్చిగడ్డి బాగా కడుపు నిండా మేశాయి. మలిసంజ కాగానే గోగణమూ, గోపాలుడూ అడవినుంచి పల్లెకు తిరిగి రావడం పరిపాటికదా!

పశువులే ముందుపోతుంటే పసుల కాపరి వాటి వెంట పోతుంటాడు. ఆలకాపరులకు ఆవులే ఆచార్యులవలె ఆర్జవాన్ని ఋజుమార్గాన్ని చూపిస్తాయి.

గతాన్ పశూనాం సహజన్మబంధుతాం

గృహాశ్రయం ప్రేమవనేషు బిభ్రతః

దదర్శ గోపానుపధేను పాండవః
కృతానుకారానివ గోభిరార్జవే॥(కిరాతార్జునీయం 4 సర్గ -13)

అర్జునుడు పశువుల దగ్గరున్న గోపాలకులను చూచాడట. వారెలా ఉన్నారు? అంటే, "గోపాలకులకు పుట్టినప్పటి నుంచే గోవులతో బాంధవ్యముందట. ఇండ్లల్లో ఉండవలసిన ప్రేమ వారికి అడవుల్లో నివసించడమందే ఉందట. కపటం లేకుండా ఉండే విషయంలో పశువులచేత పరిహసింపబడుతున్నారట. "పశువులు కూడా వాటి కాపరులను, ఎంత అమాయకులో కదా వీరు అని వెక్కిరిస్తున్నటులుంటారని 'భారవి' సూక్తి.

శ్రీకృష్ణ పరమాత్మ కూడా, గోవులవెంట బోవడమూ, అడవులకేగడమూ, అక్కడనే భుజించడమూ దోషం కాదా? అంటే ఉదరపోషణపరులైన జ్ఞానహీనులకు దోషావహాలు కాని జ్ఞానాధికులకు అవి దోషాన్ని కలిగించవు.

"తేజోవిశేషేణ ప్రత్యవాయో న విద్యతే" అన్నట్లు సామాన్యులు చేసే పనులనే మహాతేజశ్శాలురు చేసినా, వారి ప్రభావ విశేషం చేత అవి దోషావహాలు కావు అని ధర్మశాస్త్రం.

పశువులవెంట వచ్చేవారికి పశువుల గాలి, ధూళి సోకడం నైసర్గికం. పశువులూ, వాటికాపరియైన కృష్ణుడూ పల్లెకు వస్తున్నప్పుడు గోపస్త్రీలు ఎదురయ్యారు. ఆ గోపస్త్రీలగాలి గోపాలునిపై సోకింది. పడతులు పరిమళ ద్రవ్యాలను పయోధరాలకు లేపనం చేసుకోవడం పరిపాటి. కాబట్టి వారి చందనహరిద్రాలేపనాదులసువాసనలు కృష్ణుణ్ని పులుముకొన్నాయి. ఆ సువాసనావాసితుడైన గోపాలచక్రవర్తి గోవులను మందకు తోల్కొంటూ వస్తున్నసుందరసన్నివేశం సంస్తవనీయమేకదా! ఇది ఈ కవి సుకృతమే.

**శా. చన్నుల్ మీఁదికి చౌకళింప నడుముంజవ్వాడ కందర్ప సం**
**పన్నాఖ్యంబు నటించు మాడ్కి కబరీభారంబులూటాడగా**
**విన్నాణంబు నటింప గోపజనగోబృందంబుతో వచ్చు మీ**
**వన్నెల్ కన్నుల ముంచి గ్రోలుటలు నే వర్ణింతు నారాయణా॥ 46**

అర్థం : ఓ నారాయణా! చన్నుల్ మీదికి చౌకళింప = చనుగుబ్బలు చెంగలింపగా; నడుమున్; జవ్వాడగా = అల్లల్లాడగా; కందర్ప సంపన్న+ఆఖ్యంబు = కామసంపద అనేది; నటించు మాడ్కి = నాట్యం చేసే రీతిగా; కబరీ భారంబులు = కేశపాశాలు; ఊటాడగా = విడిపోయి కదలుతుండగా; విన్నాణంబు = చాతుర్యం; నటింప; గోపజన గోబృందంబుతో వచ్చు; మీ, వన్నెల్ = శోభించే కాంతులను; కన్నుల ముంచి గ్రోలుటలు = నేత్రపర్వంగా సేవించడాన్ని, నేను వర్ణింతును.

తా : ఓ నారాయణా! శ్రీకృష్ణుడు గోవులతోనూ గోపజనంతోనూ వస్తున్న అందమైన దృశ్యమిది. గోపికల గుబ్బచన్నులు సంచలిస్తున్నాయి. వారి నడుము సన్నగా ఉండడంవల్ల తీగలాగా అల్లల్లాడుతున్నది. సిగముడులు విడిపోయి ఊడల్లాగా కదలుతున్నాయి. కామపురుషార్థం స్వేచ్ఛగా నటిస్తున్నట్లున్నది. ఇంతనేర్పుతో నటిస్తూ గో గోపజనాలతో వస్తున్న మీ తేజోరాశులు కన్నులనే గిన్నెలతో ముంచుకొని త్రాగదగినవిగా ఉన్నాయి. ఈ ఉదంతాన్ని ఉగ్గడిస్తాను. అన్నాడు శతకకర్త.

**వ్యాఖ్య : గోపాలకృష్ణుని సౌశీల్యగుణవర్ణన.**

గోపాలకృష్ణుడు దేవాదిదేవుడు. అయినా తన పరత్వాన్ని భావించక, సౌలభ్య సౌశీల్యాది గుణాలతో చిన్న పెద్ద అనే తర తమభావాన్ని ప్రదర్శించక, ఆశ్రితులందరితో కలిసి మెలసి తిరిగే మహోదారహృదయుడు. పరత్వం అతిశయించడం వల్ల గానీ, లేదా జీవులు చేసే పాపాల వల్ల గాని వేల్పుల దొర మనస్సులో నిగ్రహం కలుగక పోదు. కలుగుతుంది. "సుతప్త మపి పానీయం పునర్గచ్ఛతి శీతతాం"

నీరు, వేడిచేయబడినా మళ్ళీ కొంత సేపటికి చల్లబడుతుంది.

అలాగే, భగవంతునికి నిగ్రహం కలిగినా అది తాత్కాలికమే.

ఎక్కువ కాలం నిలువదు. ఆయన చూపుచల్లనిదే

"మహతః మందైః సహ నీరంధ్రేణ సంశ్లేషః సౌశీల్యం"

సౌశీల్యమంటే, గొప్పవాడు తక్కువ స్థితిలో ఉన్నవారితో మనస్సులో ఏమాత్రం సంకోచం లేకుండా కలిసి తిరుగడమన్నమాట.

నిత్యసూరులు అనంతగరుడవిష్వక్సేనాదులు - మాత్రమే అనుభవింప సాధ్యమైన తనస్వరూపరూపగుణాదులను సామాన్యులకు - గొల్లవారికి కూడా అనుగ్రహించడం కృష్ణావతారప్రాశస్త్యం.

గోవులు, గోపికలు, గోపాలురు, పిల్లలు, పెద్దలు వీరందరితో కలిసి కృష్ణుడు ఆహ్లాదకరంగా జీవనయాత్ర సాగించడం గోకుల భాగ్యమే.

"గోప్యో గావో ఋచః" (అథర్వ - కృ. ఉప)

తత్పూజార్థం సంభవంతు సురస్త్రియః" (సం.భాగ.)

"హరిపూజార్థము పుట్టుడు, సురకన్యలు భూమియందు సుందరతనులై" - (ఆంధ్రభాగ.) శ్రుతులూ, దేవతలూ, ఋషులూ గోవులుగానూ, గోపాలురుగానూ, గొల్లభామలుగానూ పుట్టి, వేద ప్రతిపాద్యుడైన శ్రీకృష్ణపరబ్రహ్మను విడువకుండా సంచరిస్తూ, సంశ్లేషించి ఆనందించడం మహాభాగ్యమేకదా!

కచకుచకటితటాలు కందర్పునిసంపత్తు. కామపురుషార్థం స్వైరవిహారంచేస్తున్నట్లు చన్నులు చౌకళిస్తున్నాయి. నడుము జవ్వాడుతున్నది. కబరీభారాలు అంటే కేశపాశాలు ఊటాడుతున్నాయి. "పాశస్తు మృగపక్ష్యాదిబంధనే, కర్ణాంతే శోభనార్థః స్యాత్, కచాంతే నికరార్థకః" (హైమనిఘంటువు). పాశమంటే తాడు. కర్ణపాశమంటే శ్రేష్ఠమైన చెవులు, కేశపాశమంటే సిగముడి. "కం వృణోతీతి కబరీ" శిరస్సును చుట్టి ఉండేది. కొప్పు అని అర్థం. సిగ ముడి ఉన్నప్పుడూ, ముడి విడిపోయి విరబోసి ఉన్నప్పుడు కూడా అందంగానే ఉంటుంది.

"బంధే స్రంసిని చైకహస్తయమితాః పర్యాకులా మూర్ధజాః" శకుంతల కణ్వాశ్రమంలోనిచెట్లకు కుండతో నీరుపోస్తుంటే సిగముడి విడిపోయింది. వెంటనే ఆమె ఒక్కచేత్తోనే గజిబిజిగా ముడివేసుకొంది. దుష్యంతుడా కొప్పును చూచి ముగ్ధుడై ఆహా! ఎంత అందం! అని వర్ణించాడు.

"అపి తురగసమీపాదుత్పతంతం మయూరం
న స రుచిరకలాపం బాణలక్ష్యీచకార।
సపది గతమనస్కశ్చిన్నమాల్యానుకీర్ణే
రతివిగళితబంధే కేశపాశే ప్రియాయాః॥" (రఘువంశం)

రకరకాల పూలతో అల్లబడిన మాలచేత అలంకృతమైన కైకేయి కేశపాశం సంభోగసమ్మర్దంచేత విడిపోయిందట. తర్వాత పడకనుంచి లేచిన ఆమె యొక్క పూలు జారిపోయి విప్పారిన కురులను చూచిన దశరథునిహృదయం పరవశమయిందట. కొంత కాలానికి వేటాడబోయిన దశరథుడు, పింఛం విప్పుకొని ఆడుతూ గుర్రందగ్గరినుంచి పోతున్న నెమిలిని చూచినప్పుడు కైకేయియొక్క విడిపోయిన కేశపాశం గుర్తుకు వచ్చినందువల్ల స్తబ్ధుడై, నెమిలిపైన బాణాన్ని విడువక నిలిచాడట.

శ్రీకృష్ణుడు గోపజనగోబృందంతో విన్నాణంగా నటిస్తూ వస్తుంటే ఆ వన్నెలు చిన్నెలు కన్నుల పండువుగా ఉన్నాయి. 'కన్నుల మించి గ్రోలుట' అంటే దర్శించి ఆనందించడమే.

"లోచనాభ్యాం పిబన్నివ" (రా.యు. 19-6) అన్నట్లు గోపాల కృష్ణుణ్ని చూచి కన్నులు ఆ తేజః పుంజాన్ని - ఆ సౌందర్య రసాన్ని జుర్రుకొన్నాయి. కనుదొప్పలతో జుర్రుకొనవలసింది అందమే కదా! "సదా పశ్యంతి సూరయః" అనే శ్రుతిరీతిగా రెప్పపాటులేకుండా పరమపదనాథుణ్ని దర్శించే నిత్యముక్తులకు కూడా ఈ విధమైన తృప్తి కలుగకుండవచ్చు. కన్నులు సాధనాలు మాత్రమే. మాంస చక్షువులతో గోపాలుని దివ్యమంగళవిగ్రహాన్ని దర్శించి తృప్తిని పొందవలసిన ఫలభోక్తలు సంసారులే కదా!

మ. పెరుగుల్ ద్రచ్చుచు నొక్క గోపిక మిముం బ్రేమంబునంజూచి రా
గ రసావేశత రిత్త ద్రచ్చనిడ నాకవ్వంబు నీవు న్మనో
హరలీలం గనుగొంచు ధేనువని యయ్యాబోతునుంబట్టి తీ
వరవృత్తాంతములేను పుణ్యకథగా వర్ణింతు నారాయణా॥ 47

అర్థం : ఓ నారాయణా! ఒక గోపిక పెరుగుల్ ద్రచ్చుతూ మిమున్ ప్రేమంబునన్ చూచి; రాగరస+ఆవేశతన్ = ప్రేమరసావేశంతో; ఆకవ్వంబున్ = రిత్తన్ = ఉత్తకుండలో; త్రచ్చన్, ఇడన్ = తరచడానికి ఉంచగా; నీవున్ = నీవు కూడా; మనోహరలీలన్ = మనస్సును (ఆగోపికచేష్ట) హరించిన భావంతో; కనుగొంచు = చూస్తూ; ధేనువు అని = ఆవు అనుకొని; ఆఁబోతుకున్ = ఎద్దును కూడా; పట్టితి = పట్టుకొంటివి. ఈ వరవృత్తాంతములు = శ్రేష్ఠమైన ఈ ఉదంతాలను; ఏను పుణ్యకథగా; వర్ణింతును = ప్రశంసిస్తాను.

తా : ఓ నారాయణా! తరుణియొకతె పెరుగుదరచుచు నిన్ను ప్రేమతో చూచింది. ప్రేమలో మునుగడంవల్ల ఆ గోపిక కవ్వాన్ని పెరుగులేని ఉత్త కడవలో పెట్టి చిల్కడానికి త్రిప్పుతుంది. ఇక నీవు కూడా ఆ మనోహర లీలన్ చూస్తూ ఆవు అనుకొని ఆబోతును పట్టుకొన్నావు. ఈ గొప్ప (భ్రాంతిమూలకమైన) చిత్రమైన ఉదంతాన్ని నేను పుణ్యకథగా వర్ణిస్తానంటున్నాడు కవి.

**వ్యాఖ్య : అన్యోన్యమనోహరవృత్తాంతవర్ణన.**

చిత్తాన్ని ఆకర్షించేది 'చిత్రం'. ఒక్క మనస్సు పరవశమైతే ఇంద్రియాలు ఏ పనినీ చక్కగా చేయలేవు. "మనః ప్రగ్రహ ఏవ చ" ఇంద్రియాలు గుర్రాలైతే, మనస్సు వాటిని నియమించే కళ్ళెమే అని కఠోపనిషద్వాణి. కళ్ళెం సడలిపోయింది అంటే గుర్రాలు తమ ఇష్టం వచ్చినట్లు చెలరేగుతాయి. సర్వేంద్రియాలు సర్వేశ్వరునికి అభిముఖమై నిల్చినప్పుడు ప్రాకృతికపదార్థాలమీద ధ్యాస ఎలా ఉంటుంది? ఉండనే ఉండదు.

ఒక గోపిక పెరుగును చిల్కడానికి సిద్ధపడింది. అంతలోనే అక్కడికి వచ్చిన కృష్ణునిమీద ఆమె దృష్టి పడింది. దృష్టి మారితే సృష్టి మారుతుంది. గోపిక చూపు గోపాలునిపై ప్రసరించగానే మనస్సు అటే పోయి నిలిచింది. అది తిరిగి రాలేదు. కాబట్టి ఆ గోపిక పెరుగు ఉన్న కడవ అనుకొని, పెరుగులేని ఉత్త కడవలోనే కవ్వం పెట్టి తరచసాగింది.

"సర్వగంధః, సర్వరసః" శ్రుతి చెప్పిన రీతిగా, శ్రీకృష్ణునిరూపం రాగరసమయమై ఆగోపికను ముంచెత్తింది. ఆమెచిత్తరువు బొమ్మ అయింది. ఇది మనోహరలీల. ఈ

లీలను కృష్ణుడూ చూచాడు. "యే యథా మాం ప్రపద్యంతే తాంస్తథైవ భజామ్యహమ్" (భ.గీ. **4-11)** ఎవరే విధంగా నన్నాశ్రయిస్తారో వారిని నేనావిధంగానే అనుగ్రహిస్తానన్నాడు కృష్ణుడు.

ఆ బొమ్మను చూచిన క్షణంలోనే కృష్ణునికీ రిమ్మ పుట్టింది. ఆయన మనస్సు ఆమెను అనుగ్రహించింది. కాబట్టి, పాలు పితుకడానికి ఆవును పట్టుకొంటాననుకొన్న కృష్ణుడు ఆబోతును పట్టుకొన్నాడు. ఆయన హృదయం గోవువెంట దగులు కోడెభంగి అన్నట్లు భక్తపరాధీన మయింది. ఇది వరవృత్తాంతం.

ఆశ్రయణీయుడైన కృష్ణుడు గోపికలుండేచోటికే వచ్చి సిద్ధసాధన తత్పరులకంటె కూడా యథేష్ట వినియోగార్హంగా గోపికలకు స్వాధీనుడవడం వల్ల ఎంతో ఉత్కృష్టమైనదీ వృత్తాంతం. పుణ్యామూర్తి గోపాల చక్రవర్తి. పుణ్య భాజనులు గోపజనులు. ఈ పుణ్యకథను కృతికర్త ఇప్పుడు, (వర్ణింతును - తద్ధర్మార్థక క్రియాపదప్రయోగం వల్ల) ఇక ముందు కూడా వర్ణిస్తానన్నాడు.

ఈ పద్యానికి మాతృక శ్రీలీలాశుకుని శ్లోకం.

"రాధా పునాతు జగదచ్యుతదత్తచిత్తా
మంథాన మాకలయతీ దధిరిక్తపాత్రే।
తస్యాః స్తనస్తబకచంచలలోలదృష్టి
ర్దేవోఽపి దోహనధియా వృషభం నిరుంధన్ ॥" (శ్రీకృష్ణకర్ణామృతం-2.25)

'అచ్యుతునియందు దత్తచిత్తయైన రాధ, పెరుగును త్రచ్చడానికని కవ్వాన్ని పెరుగులేని బానలో పెట్టి త్రిప్పుతున్నది. ఆమె స్తనస్తబకం (పూలగుత్తుల లాంటి పయోధరద్వయం) మీద మాటిమాటికి చూపు నిల్పిన కృష్ణుడు కూడా, పాలు పిండడానికి ఎద్దును దాయకట్టాడు. ఆరాధామాధవులు ప్రపంచాన్ని పావనం చేతురుగాక అని శ్లోకార్థం.

**శా. కేలన్ గోలయుఁ గూటి చిక్కము నొగింగీలించి నెత్తంబునం**
**బీలీపింఛముఁ జుట్టి నెన్నడుమునం బింఛావళిన్ గట్టి క**
**ర్ణాలంకార కదంబగుచ్ఛమధుమత్తాలీస్వనంబొప్ప నీ**
**వాలన్ గాచిన భావమిట్టిదని నే వర్ణింతు నారాయణా॥ 48**

అర్థం : ఓ నారాయణా! కేలన్ = చేతియందు; కోలయున్ = కఱ్ఱను; కూటి చిక్కమున్ = చద్ది ఉట్టినీ; ఒగిన్ = వరుసగా; కీలించి =అమర్చి; నెత్తంబునన్ = శిఖరమందు; పీలీపింఛమున్ = పక్షితోకను; చుట్టి; నెఱి+నడుమునన్ = అందమైన నడుమునందు; పింఛ+ ఆవలిన్ = నెమిలి ఈకల సముదాయాన్ని; కట్టి; కర్ణా-స్వనంబు

కర్ణ = చెవులయందు; అలంకార = భూషణంగా ఉన్న; కదంబ గుచ్ఛ = కడప పూలగుత్తియందలి; మధు = మకరందంచేత; మత్త = మదించిన; అలీ స్వనంబు = తుమ్మెదల మ్రోత; ఒప్ప; నీవు, ఆలన్ = ఆవులను కాచిన = మేపుతూ కాపరిగాఉన్న; భావము = రూపమున్న తీరు; ఇట్టిది అని నే వర్ణింతు.

తా : ఓ నారాయణా! చేతిలో చద్దిమూటనూ, కట్టెనూ పట్టుకొని, తలపాగకు బర్హిపింఛాన్ని చుట్టి, నడుముకు నెమిలి ఈకలను కట్టి, చెవులకు శోభగూర్చే కడప పూల గుత్తి యందున్న పూదేనెను ఆస్వాదించి మదించిన తుమ్మెదల ఝుంకార ధ్వని ఒప్పుతున్న నీవు ఆవులగాచిన రూపసంపద ఇట్టిదని నేను వర్ణిస్తాను.

**వ్యాఖ్య : ఆలకాపరియైన కృష్ణునిరూపసంపద వర్ణితం.**

ఓగిరపుమూటను కర్రకు తగిలించి చేత్తో పట్టుకొన్న రూపమది. తలకు నెమిలి పింఛం ఉంది. మొలచుట్టూ నెమిలి తోక ఈకలు కట్టి ఉన్నాయి. పూదేనియను త్రాగి మదించిన తుమ్మెదలు జుమ్మని మ్రోగుతున్న కదంబ పుష్పగుచ్ఛాలు కర్ణభూషణాలుగా ఉన్నాయి. పసులకాపరులెందరో ఉన్నారు కాని గోపాలకృష్ణుని ఈ రూపవైభవం ప్రత్యేక శోభను సంతరించుకొన్నందువల్ల సంస్తవనీయమయింది.

శ్రీకృష్ణుని దివ్య శరీరం త్రిజగన్మోహనమైన నీలకాంతితో దేదీప్యమానంగా ఉంటుంది.

"ఆసీదనుజ్ఝితశిఖావళకంఠశోభం, మాంగల్యదం ప్రణమతాం మధువైరిగాత్రమ్" (గోదాస్తుతి 22).

పసుపు రంగు, నీలిరంగు, ఆకుపచ్చరంగు - ఈ మూడు వన్నెల కలయికతో మధువైరిగాత్రశోభ మయూరకంఠశోభలా స్నిగ్ధమయింది.

శ్రుతి స్మృతులు కూడా భగవద్విగ్రహం అతసీపుష్పసంకాశ మనీ, మయూరగ్రీవాస దృశమనీ, కృష్ణపింగళ మనీ వర్ణిస్తున్నాయి.

"ఋతగ్ం సత్యం పరం బ్రహ్మ పురుషం కృష్ణపింగళమ్" (నారా.ఉప)

"భగవద్విగ్రహస్య అతసీ పుష్పసంకాశతయా ప్రతిపాదనాత్, అతసీపుష్పస్య మయూరగ్రీవాసదృశతయా కృష్ణపింగళవర్ణత్వాత్ కృష్ణపింగళత్వోపపత్తిః" (భాష్యం.)

"నమస్యే పరమానందవపుషం కృష్ణపింగళమ్।

నారాయణం జగన్నాథం వాసుదేవమనామయమ్" (యోగార్ణవం.)

గోపాలకృష్ణునిశరీరం దేవమనుష్యశరీరసజాతీయంగా కనబడుతున్నా, ప్రాకృతికము, పాంచభౌతికమూ కాదు.

"న తస్య ప్రతిమా మూర్తిః మాంస మేదో ఽస్థిసంభవా" (వాయుపురాణం)

"న భూతసంఘసంస్థానః దేహోఽస్య పరమాత్మనః" (భారతం)

ఆలకాపరి రూపమైనా, ఆది దివ్యమంగళవిగ్రహం.

గోపార్భక వేషంతో ఉన్నా, ఆ బ్రహ్మవర్చస్సు కన్నులకు రెప్పపాటు లేకుండా సేవించదగినది. యౌవనాన్ని విడువనిది. బర్హిపింఛంతోనూ, భూషణాలతోనూ పరస్పరం జగడమాడే శిరోజాలు కలది. ఇంద్రియాలను మత్తెక్కించే విలాసం కలది కదా! అని దేశికులు స్తుతించారు (గోపాలవింశతి).

"అనిమేషనిషేవణీయమక్ష్ణోరజహద్యౌవన మావిరస్తు చిత్తే!
కలహాయితకుంతలం కలాపైః కరణోన్మాదకవిభ్రమం మహో మే॥ (10)

సామగానలోలుడైన గోపకిశోరుడు, జుమ్మని మ్రోగేతుమ్మెదలనాదాన్ని వింటూ గోవులను కాచే భావం రమణీయం. పూదేనెకోసం వచ్చే తుమ్మెదల ఝుంకారం, వాటి రెక్కలు సెకనుకు మూడు వందలనుంచి నాలుగువందల సార్లు కంపించడంవల్ల శబ్దతీవ్రత ఎక్కువగా ఉండి, కొంచెం భయాన్ని కలిగిస్తుంది. మధువును పానం చేసి మదించిన తుమ్మెద రెక్కల పౌనఃపున్యం తక్కువగా ఉండడంవల్ల, ఝుంకారం సంగీతం లాగా శ్రావ్యంగా ఉంటుంది. షట్పదాలు అంటే తుమ్మెదలు షడ్భుజాకారంలో ఉండే తమ గదిని మధుమయం చేస్తాయి.

షట్పదాన్ని ద్వయమంత్రమంటారు. ఆ ద్వయమంత్రాన్ని అనుసంధించే ఆచార్యులూ, ఋషులూ, సత్పురుషులూ షట్పదాలే. తుమ్మెదల రెక్కలు సత్పురుషులకుండే జ్ఞానవైరాగ్యాలకు ప్రతీకలు.

"ఋషయోఽపి తదాదేశాత్ కల్ప్యంతాం పశురూపిణః।
పయోదానముఖేనాఽపి విష్ణుం తర్పయతే సురాః॥" (భాగ.)

అన్నట్లు, ఋషులకళలే గోవులు, దేవాంశజులే గోపాలురు కదా! దేవర్షులైన తుంబురు నారదులు మొదలైన గాయకులు, షడ్గుణ పరిపూర్ణుడైన గోపాల కృష్ణుని కర్ణాలంకార కదంబ గుచ్ఛమధుపానం చేసిన బంభరాలు జుమ్మని మధురాలాపన చేస్తుంటే, వింటూ ఆవులను కాచినభావం స్పృహణీయం.

**శా. కాళిందీతటభూమి నాలకదుపుల్ కాలూఁది మేయన్ సము**
**త్తాలాలోలతమాలపాదపశిఖాంతస్థుండవై వేణురం**
**ధ్రాలిన్ రాగరసంబునిండ విలసద్రాగంబు సంధించి గో**
**పాలవ్రాతము గండుఁగోయిలలుగా వర్ణింతు నారాయణా॥** 49

అర్థం : ఓ నారాయణా! కాళిందీ తటభూమిన్ = యమునా నదీతీర ప్రదేశమందు; ఆలకదుపుల్ = పసుల మందలు; కాలు+ఊదిమేయన్ = పూనికతో గడ్డి మేస్తుండగా;

సముత్తా-డవై సం+ఉత్తాల+ఆలోల = బాగా పొడవై మరుగుగాఉన్న; తమాల పాదపశిఖా = కానుగు చెట్టుకొన కొమ్మయొక్క; అంతఃస్థుండవై = లోపల ఉన్నవాడవై; వేణు రంధ్ర+అళిన్ = పిల్లనగ్రోవి ఛిద్రాల సముదాయమందు; రాగ రసంబునిండ = శృంగార రస పూర్ణంగా; విలసత్ + రాగంబు = శోభించే రాగాన్ని; సంధించి = ఆలపించి; గోపాల వ్రాతము = ఆలకాపరుల సమూహం; గండు, కోయిలలుగా = పుంస్కోకిలలుగా; వర్ణింతు = ప్రశంసిస్తాను.

తా : ఓ నారాయణా! యమున అనే ఏటిగట్టున ఆలమందలు నెమ్మదిగా మేత మేస్తుంటే నీవు, చాలా పొడవై దట్టంగా ఉన్న చీకటి చెట్టు కొనకొమ్మలోపల కూర్చున్నావు. పిల్లనగ్రోవి వివరాలలో శృంగారరసభరితమైన శోభనరాగాన్ని ఆలపించావు. గోపాలురందరు అలాగే నిన్ను అనుకరించారు. కాబట్టి వారందరినీ గండు కోకిలలుగా వర్ణిస్తాను అన్నాడు కవి.

**వ్యాఖ్య : గోపాలకృష్ణుడు వేణువును ఊదేవర్ణన.**

నందనందనునికి కాళింది ఆటపట్టు. భగవత్కైంకర్యానికి అన్వయించిన భాగ్యవతి యమున.

"యమునాం చాతిగంభీరాం నానావర్తఝషాకులాం।
వసుదేవో వహన్ కృష్ణం జానుమాత్రోదకో యయౌ॥" (వి.పు)

అనేకజలచరాలతోనిండి, వలునుడులు తిరిగే లోతైన నీటితో ప్రవహించేయమునానది, నందగోకులానికి శ్రీకృష్ణపరమాత్మణ్ణి నెత్తి మీద ఎత్తుకొని పోతున్న వసుదేవునికి మోకాళ్ళబంటి నీళ్లున్న దారిని కల్పించింది.

"వల్లవీ వదనోచ్ఛిష్ట పవిత్రాధరవిద్రుమః" ఐదు లక్షల గొల్లచెలువలతో, శ్రీకృష్ణుడు వారి విరహతాపం తీరే రీతిగా జలక్రీడల ననుభవించడానికి యమున తేటనీటితో నిండుగా దరులొరసి ప్రవహించింది. వారి గండూషణస్నానాదులచేత అతి పవిత్రంగా వెలసింది. "యమునా సాక్షిక యౌవనం యువానమ్" గోపీజన వల్లభునికి రమణీమణులు దొరికేది యమునా తీరాననే కదా! కాబట్టి శ్రీకృష్ణుని యౌవనవైభవాభియోగానికి సాక్షిణిగానూ గోచరించేది యమునయే.

ఆ ఏటి గట్టుమీద ఆలమందలన్ని పచ్చగడ్డిని బాగా మేస్తున్నాయి. అక్కడ దళసరి ఆకులతో దట్టని చీకటిని కల్పించే కానుగు చెట్లు (తమాల తరువులు) ఉన్నాయి. అందులో ఎత్తైన ఒక చీకటి చెట్టు మీదికొమ్మల్లో కనబడకుండా కూర్చున్న నల్లనయ్య మెల్లగా పిల్లనగ్రోవిని ఊదుతూ దాని సుషిరాలను కొనవ్రేళ్ళతో సొగసుగా మూస్తూ, తెరుస్తూ సింగారంగా మ్రోగిస్తున్నాడు.

పిల్లనగ్రోవి రంధ్రాలనుంచి సప్త స్వరాలను పలికిస్తారు గాయకులు. "సరిగమపదని" అనే ఏడు స్వరాలలోనే సంగీత శాస్త్రం వెలసింది.

'షడ్జ' స్వరాన్ని పలికేది 'స'. 'ఋషభ' స్వరాన్ని 'రి', 'గాంధార' స్వరాన్ని 'గ', 'మధ్యమ' స్వరాన్ని 'మ', 'పంచమ' స్వరాన్ని 'ప', 'ధైవత' స్వరాన్ని 'ద', 'నిషాద' స్వరాన్ని 'ని' పలుకుతుంది.

"పుష్పసాధారణే కాలే పికః కూజతి పంచమమ్" (అమరం)

వసంతర్తువులో కోకిలలచేత విస్తరించేది పంచమస్వరం.

గోపాలచక్రవర్తి తమాలపాదపశిఖాంతఃస్థుడై శృంగారరసభరితమైన ముగ్ధ మోహనరాగాన్ని గీతవాద్యలయ సామ్యంగా వేణువాదన చేస్తుంటే, గోపాలకులందరు ఆయనను అనుకరించారు. మావి చివుళ్ళను మెక్కి చెట్లపైన కనబడకుండా ఉండి కుహూకుహూ ధ్వనిమాత్రం మధురంగా స్ఫురింపచేసే గండు కోయిలలలాగా గోపాలకులున్నారని కవి వర్ణించడం కమనీయమే కదా!

**శా. రాణించెన్ గడునంచు నీ సహచరుల్ రాగిల్లి సోలంగ మీ**
**వేణుక్వాణము వీనులంబడి మనోవీథుల్ బయల్ ముట్టఁగా**
**ఘోణాగ్రంబులు మీఁది కెత్తుకొని లాంగూలంబులల్లార్చి గో**
**శ్రేణుల్ చిందులు ద్రొక్కి యాడుటలు నేఁ జర్చింతు నారాయణా॥ 50**

అర్థం : ఓ నారాయణా! మీ వేణుక్వాణము = మీ వేణునాదం; వీనులన్, పడి = చెవులలో పడి (విని); కడున్ = బాగుగా; రాణించెన్, అంచు = ఒప్పియుండెను అంటూ; నీ సహచరుల్ = నీతోటివారు, అనుయాయులు; రాగిల్లి = రంజిల్లి; సోలంగ = వివశులు కాగా; మనోవీథుల్ = మానసిక స్థితులు; బయల్ ముట్టగా = ఆకాశానికి చేరగా; ఘోణా+అగ్రంబులు = ముఖాలు; మీదికెత్తుకొని; లాంగూలంబులు = తోకలు; అల్లార్చి = పైకిలేపి జాడించి; గోశ్రేణుల్ = పసుల మందలు; చిందులున్ + త్రొక్కి; గంతులు వేసి; ఆడుటలు; నేన్ = నేను; చర్చింతును = వర్ణింతును.

తా : ఓ నారాయణా! నీ మురళీరవం వీనులవిందు చేయగా బాగా రాణించిందంటూ నీ అనుయాయులు రంజిల్లి వివశులయ్యారు. ఆలమందలు ఆ వేణునాదాన్ని విని వాటి మనోవీధులు ఆకాశాన్ని చేరుకోగా అంటే ఉత్సాహం ఉరకలేయగా, మోరలెత్తి తోకలను లేపి జాడించి గంతులు వేస్తూ ఆడసాగాయి. ఈ మనోజ్ఞదృశ్యాన్ని వర్ణిస్తాను, అన్నాడు కవి.

**వ్యాఖ్య : మురళీనాదమాధురిని వర్ణించేపద్యం.**

సంగీతం ఆపాతమధురం. గానం చెవికి సోకగానే హృదయం ఉర్రూతలూగుతుంది. పాటవిన్నంతసేపు ఇంద్రియాలు ఉద్దీపితాలవుతాయి. మనస్సుకు మధురమైన అనుభూతి కలుగుతుంది. శిశువైనా, పశువైనా, పామైనా గానరసంలో మగ్నమై మైకంతో ఉండడం ఆజానజం. శ్రీకృష్ణుడు అధరాన చల్లని పిల్లనగ్రోవి నానించి, ముఖ వాయువుతో ముఖరీకృతమైన నాదాన్ని స్వరాలతో మేళవించి ఆలపిస్తుంటే, సర్వశ్రుతిపేయమైనందువల్ల తోటి గోపాలకులు ఆహా! భళా! అంటూ పరవశులయ్యారు. పశువులకు ఉత్సాహం ఉరకలేసింది. భూనభోంతరాళాన్ని పావనం చేస్తున్న మురళీ నాదతరంగాల వైపు మెడసాచి మొగమెత్తుకొని చూచాయి ఆలమందలు. వీనుల ద్వారా మేనులో చేరిన నాదమాధుర్యానికి అంతరంగం తురంగలించింది. కాబట్టి పశువులు కాలూది నిలబడలేక తోకలు పైకెత్తి చిందులు త్రొక్కి ఆడసాగాయి. ఇట్టి మనోజ్ఞభావవీచికలతో కవి ఉల్లం పల్లవిస్తే, అది పద్యమై పరిమళించడం పరిపాటి. ఇక్కడ పోతన పద్యం స్మరణీయం.

"నవమాధుర్యముకల్గు కృష్ణమురళీనాదామృతస్యందముల్
సెవులంజొచ్చి హృదంతరాళముల భాసిల్లన్ సవత్సంబులై
యువిదా! మేపులకుందొఅంగి మృగగోయూథంబునుత్కంఠతో
దివికిం గంఠమునెత్తి లో వదలుఁ బో దేహేంద్రియవ్యాప్తులన్॥" (భాగ.10)

**మ. పసులంగాపరి యేమెఱుంగు మధురప్రాయోల్లసద్వృత్త వా**
**గ్విసరారావము మోవిదా వెదురుగ్రోవింబెట్టినాఁడంచునిన్**
**గసటుల్ సేయఁగ నాఁడు గోపికల తద్గానంబులన్ మన్మథ**
**వ్యసనాసక్తలఁ జేయుచందములు నే వర్ణింతు నారాయణా॥ 51**

అర్థం : ఓ నారాయణా! పసులన్ కాపరి = పశువులకాసే వాడు; మధుర- రావము మధురప్రాయ = అత్యంత మధురమైన; ఉల్లసత్+వృత్త = పైకిశోభించి ఆవరించే; వాక్+విసర+ఆరావము = వాక్ప్రసారధ్వని; ఏమి, ఎఱుంగు = ఏమెరుగును? తాన్ = ఆలకాపరి; వెదురుగ్రోవిన్ = పిల్లనగ్రోవిని; మోవిన్ = అధరమందు; పెట్టినాడు; అంచు = అంటూ; నిన్ = నిన్ను; కసటుల్ సేయగన్ ఆడు = (ఎగతాళి) పాపం తగిలే మాటలనాడుతున్న; గోపికల = గోపస్త్రీలను; తత్ + గానంబులన్ = ఆ వేణుగానాలచేత; మన్మథ వ్యసన+ఆసక్తలన్ = కామాతురత కలవారినిగా; చేయు చందములు = చేసే రీతులను; నేను వర్ణింతును.

తా : ఓ నారాయణా! అతి మధురమైన, పైకి వ్యాపించే వాక్ప్రసార ధ్వని పసులకాపరికి ఏమి తెలుస్తుంది? తాను పిల్లనగ్రోవిని పెదవికి ఆనించాడు. అని

నిన్ను హేళనగా మాటాడే గోపికలను ఆ పిల్లనగ్రోవిని ఊదిపాడిన పాటల చేతనే కామ పురుషార్థమందు శ్రద్ధకలవారినిగా చేసిన రీతులను చక్కగా కీర్తిస్తాను. అన్నాడు కవి.

**వ్యాఖ్య : వేణుగోపాలుడు వ్రేతలను మదనాసక్తలను చేసే వర్ణన :**

ఆకాశం శబ్దగుణం కలది. పెదవి దాటితే పృథివి దాటుతుంది అంటుంది లోకం. ఆడిన మాటకు అంతరిక్షంలోకి వ్యాపించే శక్తి ఉంది. లోక వ్యవహారమంతా మాటచేతనే జరుగుతుంది. మాటకే ఇంతశక్తి ఉంటే, పాటకు జగత్తునే గమ్మత్తుగా మల్చే శక్తి ఉంది అంటే అతిశయోక్తికాదు. ధ్వని తరంగాల, కాంతి తరంగాల వ్యాపకశక్తిని సంగ్రహించే దూరశ్రవణ దర్శన యంత్రాలున్న ఈనాడు ఆబాలగోపాలం, మధుర ప్రాయోల్లసద్వృత్తవాగ్విసరారావాన్ని గమనించి ప్రవర్తిస్తున్నదంటే ఆశ్చర్యపడనక్కర లేదు కదా! ఈ పసులకాపరికి నిజముఖమారుతపూర్ణరంధ్రాల ద్వారా శబ్దాలను ప్రసరింపజేసే సంగతి ఏమి తెలుస్తుందని తాను ఆ పిల్లంగ్రోవిని (క్రింది) పెదవికి ఆనించి పెట్టాడు? అని గొల్లభామలు వేణుగోపాలుణ్ని దెప్పి పొడిచారు. ఈ సూటి పోటు మాటలు ఆ పసుల కాపరికి ఏమాత్రం ఈసుకలిగించలేదు.

ధీర లలితుడైన ఈ సామగానప్రియుడు, తన వదనవాయువుతో పూరించిన మురళీరంధ్రాలను అంగుళ్యగ్రాలతో కప్పుతూ విప్పుతూ అద్భుతంగా నినదింప చేశాడు. హరి మురళిరవామృతం సోకగనే "గిరులెల్ల జలములయ్యెన్ దరులెల్లను బల్లవించె ధరణి గగన భూచరులెల్లరు చొక్కి" నారు. శబ్దాన్ని ప్రసారంచేసే జ్ఞానమే లేదని కసటు మాటలాడిన గొల్లగోతులు ఉక్కిరిబిక్కిరి అయ్యారు. అనంగ క్రీడలందు ఆసక్తలయ్యారు.

"కామిగాని మోక్షగామిగా"డన్నట్లూ, గోపికలను కామపురుషార్థవ్యగ్రలను చేసిన వేణుగానసరణులను ఈ సుకవి వర్ణిస్తాననడం గమనీయంకదా!

**మ. జడ యెంతేఁ దడవయ్యెఁ జెయ్యి యలసెన్ శైలంబు మా చేతులం**
**దిడుమన్నన్ జిరునవ్వుతో వదలినన్ హీనోక్తి గీపెట్ట నె**
**క్కుడు గోపుల్ బ్రియమంద నింద్రుఁడదలంగోవర్ధనాద్రీంద్రమున్**
**గొడుగై యుండఁగఁ గేలఁబూనితి గదా గోవింద నారాయణా॥ 52**

అర్థం : ఓ నారాయణా! ఓ జడ = తెలివిలేని నిశ్చలుడా! ఎంతేన్ తడవు అయ్యెన్ = ఎంతో ఆలస్యమయింది, చెయ్యి అలసెన్ = నీ చెయ్యి అలసింది; మా చేతులందు; శైలంబు ఇడుము = పర్వతాన్ని పెట్టుము; అన్నన్ = అనగానే; చిరునవ్వుతో =

సుందహాసంతో; వదలినన్ = (గుట్టను కొద్దిగా) వదలిన వెంటనే; హీన+ఉక్తిన్ = మాటరాక; కీ పెట్టన్ = కియ్యని అరవగా; గోవుల్ = పశువులు; ఎక్కుడు = అధికంగా; ప్రియము అందన్ = సంతోషింప; ఇంద్రుడు = దేవరాజు; అడలన్ = భయపడగా; గోవర్ధన + అద్రి +ఇంద్రమున్ = గోవర్ధన మనే గిరిరాజును; గొడుగై ఉండగ = ఛత్రమైనట్లు; కేలన్ = చేతితో; పూనితి = పట్టుకొన్నావు కదా!

తా : ఓ నారాయణా! చైతన్యం లేనివాడా! చాలా కాలమయింది. నీ చేయి అలసిపోయింది. పర్వతాన్ని మా చేతుల్లో పెట్టు. మేమెత్తుకొంటామని గోపజనులు తమ చేతులను గుట్టకానించారు. నీవు చిన్నగా నవ్వుతూ ఆ పర్వతాన్ని తిన్నగా వదులిడిచావు. గోపజనులకు నోట మాట పెకులలేదు. 'కీ' అని అరచారు. గోవులు సంతోషించే రీతిగా, ఇంద్రుడు భయపడే విధంగా గోవర్ధన మనే గొప్పగుట్టను, గొడుగుగానే చేత్తో పట్టుకొన్నావు కదా! గోవింద!

**వ్యాఖ్య : గిరిధరుని చాతుర్యం వర్ణితం.**

శ్రీకృష్ణుడు ఏడేండ్ల బాలుడు. గొల్లలు పరంపరగా ఏడాది కొక్కసారి జరిపే ఇంద్రయాగాన్ని ఆపి వేసి, గిరిరాజును పూజించుమని వారికి బోధించాడు. బాలకృష్ణుడే కొండమీద దేవునిగా వెలశాడు. గొల్లలతో తానూ కలిసి, కొండ దేవరను పూజించి మహా నైవేద్యాలనూ పెట్టాడు. ఆ నైవేద్యాలనూ తానే ఆరగించాడు. ఇంద్రునికడుపు మండింది. సంవర్తక మనే ప్రళయకాలమేఘాలను విడిచాడు దేవరాజు. ఉరుములు మెరుపులతో రాళ్ళవాన ఎడతెగని ధారగా కురిసింది. గోవులూ, గోపజనులూ ఆపన్నులయ్యారు. కృష్ణా! గోపాలా! కాపాడవయ్యా! అని వారు ప్రార్థించారు. రాళ్ళవానను రాళ్ళతోనే అడ్డగించాలనుకొన్నాడు నీలపు డాలు నేలు మెయినిగ్గులు గల్గిన బాలుడు.'

"క్షుత్తృడ్వ్యథాం సుఖాపేక్షాం హిత్వాతైర్వ్రజవాసిభిః।
వీక్ష్యమాణో దధారాద్రిం సప్తాహం నాచలత్పదాత్॥ (భాగ. 10.25)

లీలామానుష విగ్రహుడాగిరీంద్రాన్ని కుడిచేత్తో లేవనెత్తి గొడుగు లాగా పట్టుకొన్నాడు. ఒక్క అడుగైనా ముందుకో, వెనుకకో వేయకుండా నిశ్చలుడై నిలబడ్డాడు. గోగోపసంఘాలు సామగ్రితోపాటు వచ్చి భయపడుతూ గుట్ట క్రింద నిలిచారు. చాలా సేపయింది, నీ చెయ్యి అలసిపోయింది. ఆ పర్వతాన్ని మేమెత్తుకొంటాం. మా చేతుల్లో పెట్టుమంటూ గొల్లలు తమ చేతులెత్తి గుట్టను పట్టుకొన్నారు. చతురనటమూర్తి లేనగవుతో నగాన్ని చయ్యన వదలివిడిచాడు. వారు గుట్ట బరువుకు నోటమాటరాక పండ్లిగిలిస్తూ 'కీ' అని మొరపెట్టారు.

ఈ సందర్భాన పోతన భావ, రూప, రచనా సౌందర్యాన్ని గమనిద్దాం.

"బాలుండీతడు కొండదొడ్డది మహాభారంబు సైరింపగా
జాలండోయని దీనిక్రింద నిలువన్ శంకింపఁగాఁ బోల దీ
శైలాంభోనిధిజంతుసంయుతధరాచక్రంబుపైఁ బడ్డ నా
కేలల్లాడదు బంధులార! నిలుఁడీక్రిందన్ బ్రమోదంబునన్॥"

"హరిదోర్దండము కామగుబ్బ శిఖరం బాలంబి ముక్తావళుల్
పరగం జాతెడు తోయబిందువులు గోపాలాంగనాపాంగ హా
సరుచుల్ రత్నచయంబుగాగ నచలచ్ఛత్రంబు శోభిల్లె ద
ద్గిరిభిద్దుర్మదభంజియై జలధరాక్లిన్నప్రజారంజియై॥" (భాగ.)

(ఛత్రాకం = పుట్టగొడుగుకాదు.) సావయవరూపకాలంకారంచేత గిరియే, మానవులు వానలో విప్పి పట్టుకొనే గొడుగుగా ఆవిష్కృతమైన అద్భుతశిల్పమిది. అస్తు.

శ్రీకృష్ణభగవానుడేడు దినరాత్రాలెత్తి పట్టుకొన్న గుట్ట క్రింద నిర్భయంగా నివసించిన గోగోప సంఘాలకు ఆహారనిద్రావసరాలే కలుగలేదు. గోకులాన్ని కాపాడినందువల్ల ఆ గోత్రానికి "గోవర్ధనగిరి" అనీ, శ్రీకృష్ణునికి 'గోవర్ధనోద్ధరణు' డనీ అన్వర్థనామమేర్పడింది.

మూడులోకాల కధిపతి ననే గర్వంకల ఆఖండలునికి హడలెత్తింది. వెంటనే ఆయన కామధేనువుతో, దేవతలతో వచ్చి శ్రీకృష్ణపరమాత్మను 'క్షమింపు' మని పాదాలపై పడి ప్రార్థించాడు. కామధేనువు పాలతోనూ, ఇంద్రుడు ఐరావతంతెచ్చిన మిన్నేటి జలంతోనూ శ్రీకృష్ణపరమాత్మను అభిషేకించి గోవింద నామంతో పూజించినట్లు పురాణగాథ.

**మ. లలితాకుంచితవేణియందడవి మొల్లల్ జాఱ ఫాలస్థలిన్**
**దిలకం బొయ్యన జాఱఁ గుండలరుచుల్ దీపింప లేఁజెక్కులన్**
**మొలక న్నవ్వుల చూపులోరగిల మేన్మువ్వంకలన్ బోవఁగా**
**నలిగైకొందువు గాదె నీవు మురళీ నాట్యంబు నారాయణా॥ 53**

అర్థం : ఓ నారాయణా! లలిత+ఆకుంచిత వేణియందు = అందంగా ముడువబడిన జడయందు; అడవిమొల్లల్ జాఱ; ఫాలస్థలిన్ = నుదుట; తిలకంబు = బొట్టు; ఒయ్యన జాఱ = తిన్నగా జాఱ; కుండలరుచుల్ = కర్ణాభరణాలైన కుండలాలకాంతులు; లే, చెక్కులన్ = లేత చెక్కిళ్ళయందు; దీపింప = ప్రకాశింపగా; మొలక నవ్వుల చూపులు = చిరునవ్వులతో కూడిన చూపులు; ఓరగిల = ప్రక్కలకు వాలగా; మేను = శరీరం;

ముప్వంకలన్ పోవగా = మూడు మల్కలుకాగా; నీవు; మురళీ నాట్యంబు = వేణువునూదుతూ చేసే నృత్యం; నలిన్ = యోగ్యంగా; కైకొందువుగాదె = చేపడ్తావుకదా!

తా : ఓ నారాయణా! నీవు మురళీ నాట్యానికి పూనుకొన్నప్పుడు అందంగా ముడిచిన జడలోని అడవి మొల్లపూలు జాఱుతుంటాయి. నుదుట పెట్టిన బొట్టు మెల్లగ జాఱుతుంది. కుండలాల కాంతులు స్నిగ్ధకపోలాలపైన ప్రకాశిస్తాయి. మొలకనవ్వుల చూపులు ఓరగిల్లుతాయి. దేహంమూడు వంకల తిరుగుతుంది. నీ సంకల్పానికి యోగ్యంగా నాట్యం చేస్తావు.

**వ్యాఖ్య : మురళీనాదవినోదివర్ణన.**

క్రియాశక్తి ఇచ్ఛాశక్తిని అనుసరిస్తుంది. శ్రీకృష్ణభగవానుడు సత్యకాముడు, సత్యసంకల్పుడు "నానవాప్తమవాప్తవ్యం వర్త ఏవ చ కర్మణి" (భ.గీత. 3.22). ఆయనకు మూడులోకాల్లో పొందవలసిందిగానీ, పొందబడనిదిగానీ లేదు. కాబట్టి కర్తవ్యమనేది ఆయనకు లేదని వేరే చెప్పనక్కర లేదు. అయినా అందరి లాగా తానూ లోకవ్యవహారాలను నిర్వర్తించాడు. లోకసంగ్రహకర్మకు తార్కాణంగా తననే శ్రీకృష్ణుడు నిరూపించుకొన్నాడు. గోకులంలోని బృందావనంలోని ఆయన లీలలన్ని అద్భుతాలు, అతిమానుషాలు. ఎన్ని కడగండ్లు కలిగినా, ధైర్యంగా వాటిని ఎదుర్కొంటూ ఎల్లప్పుడు ఆనందంగా ఉండేవాడు. ఇతరులకు ఆనందాన్ని కలిగిస్తూ ఆదర్శ ప్రాయంగా ఉంటాడు.

సంకల్ప సిద్ధుడైనందువల్ల శ్రీకృష్ణుడు స్వేచ్ఛగా గైకొన్న మురళీనాట్యభంగిమ జగన్మోహనంగానే ఉంటుంది. మురళీ వాదనకు అనుగుణంగా ఉన్న ఆమూర్తిత్వమూ, ఆనటనాచాతుర్యమూ ఆననుకరణీయం.

పాయలు దీసిన కురులతో పాము తీరల్లిన జడను లలితంగా ముడిచి తుఱిమిన అడవి మొల్లపూలు జారిపోతుంటాయి. లలాటాన పెట్టిన కస్తూరి తిలకం తిన్నగజాఱుతుంటుంది. లేతబుగ్గ చెంపలమీద చెవుల కుండలాల కాంతులు తళుకు లీనుతుంటాయి. మొలక నవ్వులతో ఓరచూపులు జతగూడుతుంటాయి. ఆ కేకరాలోకనాలవరకున్న చతుర ప్రక్రియలు ఒక్క ముఖారవిందంలోనే గోచరిస్తుంటాయి. అధరమందానించిన వేణువును, సవ్యాపసవ్యకరాంగుళులు సుషిరాలను మూస్తూ, తెరుస్తూ కర్ణామృతంగా నినదింపచేస్తుంటాయి. వదనం వామభాగానికి వంచి ఉంటుంది. డాకాలిమీద కుడికాలు అడ్డంగా సాచి ఉంటుంది. మురళిని పూరిస్తున్నప్పుడు శ్రీకృష్ణునిమేను మూడు వంపులతో ఉంటుంది.

నాట్య భంగిమల్లో 'త్రిభంగి' ఒకటి. తల, నడుము, కాళ్ళను కొంచెం వంచి విలాసంగా నిలుచున్న సం నివేశం.

"త్రిభంగీసమితం గాత్రం పాదౌ చ స్వస్తికీకృతౌ।
వక్షస్థః ఖటకో వామో దక్షిణశ్చాలవల్లవః।
ఉత్తానశిరసస్తస్య త్రిభంగీకరణం తథా॥" (భరతకోశం)

ఇలా, త్రిభంగీ లక్షణంగా నిల్చి మురళీ నాట్యం చేస్తున్నప్పుడు, గాత్రంలో శిరస్సు ప్రధానమైనది. పద్యంలో మొదట ప్రయుక్తమైన లలిత శబ్దం (విశేషణం) వల్ల బాలకృష్ణుని కరచరణాది అంగవిన్యాసమే కాక భ్రూనేత్రాది విక్షేపాలూ సూచితాలే. "సుకుమారతయాంగానాం విన్యాసో లలితం భవేత్" అని కావ్యాలంకార సంగ్రహం.

"సుకుమారవిధానేన భ్రూనేత్రాదివిక్రియా సచివకరచరణాంగవిన్యాసో లలితమ్" (అమర సుధవ్యాఖ్య) అని, లలిత శబ్దానికి వివరణ. కాబట్టి, ఈ నాట్య భంగిమలో ముడిచిన జడనుంచి పూవులు జారడం, ఉన్న చోటునుంచి బొట్టుకారడం, కపోలాలయందు కుండలాలకాంతులు ప్రసరించడం, మేను ముప్వంకలు పోవడం, అపూర్వమనోహరవిన్యాసమేకదా!

**శా. మా పాలంగడుగ్రొవ్వి గోపికలతో మత్తిల్లి వర్తింతు వే**
**మా పాలెంబుల వచ్చియుండుదు వెసన్మాపాలలో నుండుమీ**
**మాపాలైన సుఖాబ్ధిలో మునుగుచున్ మన్నించి తా గొల్లలన్**
**మాపాలం గలవేల్పు వీవె యని కా మన్నింతు నారాయణా॥ 54**

అర్థం : ఓ నారాయణా! మా పాలన్ కడుక్రొవ్వి = మా గోవుల క్షీరాలతో బాగాబలిసి; గోపికలతో; మత్తిల్లి = మదించి; వర్తింతువే! మాపాలెంబులు = మా పల్లెల్లో; వచ్చి ఉండుదువు; వెసన్ = వెంటనే; మా పాలలోన ఉండు = మా పక్షాన ఉన్నట్టి; మీ మా పాలైన = మీకు మాకు విభక్తమైన; సుఖ+అబ్ధిలో = సుఖసముద్రంలో; మునుగుచున్ = అవగాహిస్తూ; ఆ గొల్లలన్ = ఆగోపజనులను; మన్నించితి = కాపాడితివి. (కాబట్టి) మాపాలన్ కల వేల్పువు = మా దగ్గర ఉన్న దేవుడవు; ఈవె అని కా = నీవే అని కదా! మన్నింతు = ఆదరంతో భావింతును.

తా : ఓ నారాయణా! మా ఆవుల పాలు త్రాగి బాగా బలిసి, గోపికలతో మదించి ప్రవర్తిస్తుంటావు. మా పల్లెల్లో వచ్చి ఉంటావు. మాపక్షాన ఉండే మీ, మా భాగమైన సుఖజలధిలో మునుగుతూ ఆ గొల్లలను క్షమించి కాపాడావు. మా పాలిట దేవుడవు నీవే అని కదా గౌరవిస్తాను.

**వ్యాఖ్య : గోపకుల వేలుపు శ్రీకృష్ణభగవానుడని వర్ణితం.**

గొల్లవారికి ఇలువేల్పు నందనందనుడు. ఆయన దయాళువై తనంతతానే

నందగోకులానికి వచ్చియున్నాడు. ఆనాటినుంచి ఆ పల్లెలోని ప్రతి గృహంలో పాడి వృద్ధి అయింది. పాలెన్నో నెయ్యి అంతే లభిస్తున్నదట.

"యదా చ కృష్ణ ఉద్భూతస్తదాప్రభృతి మే గృహే।
యావద్దుగ్ధం సముద్భూతం తావదేవ ఘృతం భవేత్॥"

కాబట్టి గోపాలకృష్ణుడు గొల్లల ఇండ్లల్లో ఉన్న పాలను త్రాగి జిడ్డుగా, దొడ్డుగా బలిశాడు. గోపికలకు మదనగోపాలుడయ్యాడు.

"అహోభాగ్య మహో భాగ్యం నందగోపవ్రజౌకసామ్।
యన్మిత్రం పరమానందం పూర్ణం బ్రహ్మ సనాతనమ్॥" అన్నట్లు

ఆయన సుఖమే వారిసుఖం. వ్రజవాసులందరికి ఆ పరబ్రహ్మ మిత్రధేయంగా ఉండడం వారి భాగధేయం. 'పాలు' పదాన్ని ఆవృత్తి చేసిన (శ్లేషతో కూడిన) యమక మనే శబ్దాలంకారం కల పద్యమిది.

**మ. ఒక కాంతామణికొక్కఁడీవు మఱియు న్నొక్కర్తె కొక్కండవై**
**సకలస్త్రీలకు సంతసంబలర రాసక్రీడ తన్మధ్య క**
**ల్పకమూలంబున వేణునాదరస మొప్పంగాఁ బదార్వేలగో**
**పికలంజెంది వినోద మొందునెడ నీ పెంపొప్పు నారాయణా॥ 55**

అర్థం : ఓ నారాయణా! ఒక కాంతామణికి = ఒక స్త్రీకి; ఈవు = నీవు; ఒక్కఁడవు; మరియున్ ఒక్కర్తుకు; ఒక్కండవై; రాసక్రీడ; సకలస్త్రీలకు = స్త్రీలందరికి; సంతసంబు లలరన్ = సంతోషంకలుగగా; తత్ + మధ్యకల్పక మూలంబు = ఆరాసలీలకు నడుమ ఉన్న కల్పతరువు యొక్క ఆలవాలం; సవేణు నాదరసము = మురళీనాద రసంతో కూడినదై; ఒప్పంగా = శోభించగా; పది + ఆర్వేల గోపికలన్ చెంది; వినోదము, ఒందున్, ఎడ = వినోదాన్ని (ఆనందం) పొందుతున్నప్పుడు; నీ పెంపు = నీమహిమ; ఒప్పున్.

తా : ఓ నారాయణా! ఒక్కొక్క గోపికకు నీవు ఒక్కొక్కడవై వృత్తాకారంగా బారుదీరి మగువలందరు మురిసిపోతుంటే, ఆ రాసమండలానికి నడుమ కల్పతరువు క్రింద నీవు వేణునాదాన్ని సరసంగా పూరించావు. ఇలా (16) పదారువేల గోపికలతో కూడి వినోదిస్తున్నప్పుడు నీ వైభవం సకలలోక శ్లాఘనీయమయింది.

**వ్యాఖ్య : శ్రీకృష్ణుని రాసక్రీడ వర్ణితం.**

రసమయమైనది రాసలీల. "రసగ్గ్ హ్యేవాయం లబ్ధ్వాఽనందీ భవతి" 'ముక్తపురుషుడు రసికుడైన భగవంతుణ్ని పొంది బ్రహ్మానందాన్ని పొందుతా"డని ఉపనిషద్వాణి.

"సర్వాస్తాః కేశవాలోక పరమోత్సవనిర్వృతాః।
జహుర్విరహజం తాపం ప్రాజ్ఞం ప్రాప్య యథా జనాః॥"

ముముక్షువులు పరమజ్ఞానియైన సత్పురుషుణ్ని పొంది సంసారబాధనుంచి ముక్తులయ్యే రీతిగా, గోపికలందరు శ్రీకృష్ణునిదర్శనస్పర్శనాదులవల్ల పరమానందాన్ని పొంది విరహతాపంనుంచి విముక్తలయ్యారని భాగవతం (10.32-9) విశదీకరిస్తుంది.

"రాసోత్సవ స్సంప్రవృత్తో గోపీమండలమండితః।
యోగేశ్వరేణ కృష్ణేన తాసాం మధ్యే ద్వయోర్ద్వయోః॥" (భాగ 10.33.3)

నారికి నారికి నడుమ యోగేశ్వరుడైన కంసారి, మళ్ళీ తన కిరువైపుల ఇద్దరు ఇంతులచొప్పున మండలాకారంగా సల్పిన మంజు క్రీడయే రాసక్రీడ. ఒక్కొక్క గోపికకు ఒక్కొక్క కృష్ణుడుగా ఒక్కడే అనేకరూపాలతో ప్రకటితుడై, ఆడుతూ పాడుతూ సకలగోపికలను ప్రేమపూర్ణమైన ఆనందజలధిలో ఓలలాడించాడు. ఆరాసమండలం నడుమ ఒక కల్పవృక్షమున్నది. ఆ చెట్టు క్రిందను తాను మురళీగానం చేస్తూ నిలిచాడు. మండలాకారంగా నృత్తగానాలతో తిరుగుతూ ఉంటే, ఆ మురళీగానరసంతో ఆ చెట్టుకున్న పాదు నిండిపోయింది. ఎంత రాసిక్యమో! ఎంత మధురిమయో! ఇది ప్రేమసేవ, త్యాగంతో కూడి నిర్మలమైన ఆత్మ సంయోగ మనక తప్పదు.

ఇలా పదహారువేలగోపికలందరికీ తానందరై వినోదించిన చందం సకల జన మనోనయనానందకరం.

"అంగనా మంగనామంతరే మాధవో
మాధవం మాధవం చాంతరేణాంగనా।
ఇత్థ మాకల్పితే మండలే మధ్యగః
సంజగౌ వేణునా దేవకీనందనః॥" (కృష్ణకర్ణామృతం 2. ఆ. 35)

**మ. లలితంబైన భవత్తనూవిలసనన్ లావణ్యదివ్యామృతం**
**బలుఁగు ల్పారఁగ నీ కటాక్షమునఁదామందంద గోపాంగనల్**
**తలఁపుల్ పాదులు కట్టి కందళిత నూత్నశ్రీలు వాటింతురా**
**నెలఁతల్ తీవెలు చైత్రవిస్ఫురణ మౌ నీయొప్పు నారాయణా॥ 56**

అర్థం : ఓ నారాయణా! లలితంబు ఐన = సుకుమారమైన; భవత్+తనూ, విలసనన్ = నీ శరీరవిన్యాసంవల్ల; లావణ్యా దివ్య+అమృతంబు = సౌందర్యమనే అలౌకికమైన అమృతం (జలం); నీకటాక్షమునన్ = నీ కన్నుల కొలకుల నుంచి; అలుగుల్ పారగ = పాయలైపారగా; గోపాంగనల్ = గొల్లపడుచులు; తాము, అందు, అందె = వారక్కడక్కడనే; తలపుల్ = కోరికలు; పాదులుకట్టి; కందళిత, నూత్నశ్రీలు = మొలకలెత్తిన కొత్త సంపదలుగల; ఆనెలతల్ తీవెలు = ఆ స్త్రీలు అనే లతలు; చైత్ర

విస్ఫురణమౌ = చిత్రంగా శోభించే; నీ ఒప్పు = నీ సమ్మతిని; పాటింతురు = అంగీకరించి అనుసరిస్తారు. నీ ఒప్పు వసంతవికాసమే.

తా : ఓ నారాయణా! సుకుమార మైననీ శరీరావయవవిన్యాసంవల్ల సౌందర్యమనే అప్రాకృతజలం (అమృతం) నీ కనుగొలుకులద్వారా అలుగు ల్పారుతుంటే; గోపికలు అక్కడక్కడనే భావాలనే పాదులు కట్టారు. నూత్నసంపదలంకురించిన ఆనెలతలే లతలు. చిత్రంగా శోభించే నీ ఒప్పును వారు పాటిస్తారు.

**వ్యాఖ్య: భగవంతునిప్రవృత్తిని గోపికలు అనుమతించేవర్ణన.**

బాలకృష్ణుని శరీరం చాలా సుకుమారమైనది. ఆశరీరావయవాలనుంచి తళతళకాంతులీనుతుంటాయి. ఆఒయ్యారం చూస్తున్నకొద్దీ పెరుగుతుంది. "సుకుమారతయాంగానాం విన్యాసో లలితం భవేత్" హస్తపాదాద్యవయవాలనొయ్యారంగా ఉంచడమే 'లలిత' లక్షణం.

నడకలో, ఉనికిలో, సంభాషణంలో సంవీక్షణంలోనూ ప్రకాశించే ఇష్టమైన వికారమే విలసనం లేదా విలాసం.

"యానస్థానాసనాదీనాం ముఖనేత్రాదికర్మణాం।
విశేషస్తు విలాసస్స్యా దిష్టసందర్శనాదినా॥" అని 'విలాస' లక్షణం.

ఆ శరీరంలో సర్వాంగాలయందు మిన్నేటి జలం లాగా లావణ్యం తొణికిసలాడుతుంది. భగవంతుని ప్రత్యవయవశోభ అసాధారణం. ఒక అవయశోభను చూస్తున్నప్పుడు 'నన్ను విడిచి వేరొక చోటికి పోవద్దు' అని నిర్బంధిస్తున్నట్లుగా వేరొక అంగశోభను చూడాలనే తలపే కలుగదు. అట్టి ప్రత్యంగశోభయే సౌందర్యం.

'కంబరామాయణం'లో శ్రీరాముని ప్రత్యంగశోభ ఇలా వర్ణింపబడింది. "తోళ్ కణ్డార్ తోళే కణ్డార్...తాళ్ కణ్డార్ తాళే కణ్డార్" -

బాహువులను చూచేవారు బాహువులనే చూచారు. పాదాలను దర్శించేవారు పాదాలనే దర్శించారట. 'లావణ్యం' అంటే సుందరమైన అవయవాలకలయిక వల్ల ఏర్పడే సముదాయ శోభ. శ్రీ పరాశరభట్టర్ శ్రీరంగనాథుని లావణ్యాన్ని చూచే తననేత్రాన్ని చమత్కారంగా సంబోధించి వర్ణించారు.

"త్వాం సౌభ్రాత్రవ్యతికరకరం రంగరాజాంగకానాం
తల్లావణ్యం పరిణమయితా విశ్వపారీణవృత్తి ॥"(శ్రీరంగరాజస్తవం.89)

'ఓమందచక్షూ! స్వామి దివ్యావయవాలన్నిటిలోగల సౌందర్యాన్ని ఎలా అనుభవించాలని శంకించకు. అనురాగంగల సోదరుల పరస్పర సంబంధం, ఇతరులకు వారితో సత్సంబంధాన్ని కలిగించే రీతిగా స్వామిలావణ్యం, అవయవాలమధ్య, పరస్పరసంబంధం కలది కాబట్టి అన్ని అవయవాల శోభను పూర్తిగా నీవు అనుభవించేటట్లు చేస్తుంది. అని పూర్వశతకంలో వర్ణితం.

అహిర్బుధ్న్యసంహిత లావణ్యాన్ని ఇలా నిర్వచించింది.

"భూయిష్ఠం తేజ ఏవాద్భిర్బహులాభిర్మృదూకృతమ్।

చక్షురానందజననం లావణ్య మితి కథ్యతే॥" (52అధ్యా)

'అధికజలంతో మృదువుగా చేయబడిన, నయనాలకానందాన్ని కలిగించే గొప్ప తేజస్సు 'లావణ్యం' అనబడుతుంది.

గోపడింభకుని గివ్యావయవపరస్పరసౌందర్యమనే దివ్యామృతం ఆయన కడకన్నులనుంచి అలుగులు పారింది.

శ్రీశఠకోపముని "ముడిచ్చోదియామ్ ఉనదు ముకచ్చోది మలర్న్దదువో"(తి.వా.మొ.)

"శ్రియఃపతీ! నీకిరీట శోభగా నీముఖశోభ వికసించిందా? లేక, నీ ముఖ శోభగా నీకిరీటశోభ మారిందా?" అని వర్ణించారు.

జలమధికమై కట్టకొనకున్న దారినుంచి అలుగులు పారినట్లే, అవయవాల సాముదాయక తేజఃపుంజం కనుకొలకులనుంచి ప్రసరిస్తుంది.

"త్వదీక్షణసుధాసింధువీచివిక్షేపశీకరైః" - (దేవరాజాష్టకం) తిరుక్కచ్చినంబి "భగవంతునినేత్రాలను అమృతనదులతో పోల్చిన విషయం" గమనీయం.

నయనాంచలాలనుంచి దొరలిన ఆలావణ్యదివ్యామృతాన్ని గోపికలు తమ శరీరలతలు ఏపుగా ఎదుగడానికి తమ తలపు (భావా) లనే పాదుల్లో నిల్పారు. "రమణీయం ప్రసన్నాంబు సన్మనుష్యమనోయథా" (రా.బాల.) బురదలేని స్వచ్ఛమైన నీరు మంచిమనిషియొక్క మనస్సులాగా రమణీయంకదా!

'తలపులు' అంటే భావాలు. రసజ్ఞానయోగ్యమైన మనోవికారమే భావం.

"నిర్వికారాత్మకే చిత్తే భావః ప్రథమ విక్రియా" (సాహిత్యదర్పణం.)

నిర్వికారంగా ఉన్న అంతఃకరణంలో (యౌవనారంభంలో) మొట్టమొదట కలిగే కోరికను తెలిపేది 'భావం' అని విశ్వనాధకవిరాజు అన్నాడు.

వికారంయొక్క అనుభవాలు శరీరంలో కనబడకుండా, కేవలం మనస్సులో కలిగే వికారం 'భావ' మని ఇలా ఉదాహరించాడు.

"సఏవ సురభిః కాలః సఏవ మలయానిలః।

సైవేయ మబలా; కిం తు మనోఽన్య దివ దృశ్యతే॥" (సా.ద.)

"ఆవసంతకాలమే ఇది. ఆమలయానిలమే ఇది. ఆ అబలయే ఇది. కాని మనస్సు మాత్రం అది కానట్లున్నది.

'పాదు'లంటే మొక్కలచుట్టూ నీరు నిల్వడానికి కట్టే గుంటలు. పాదులు కట్టడంవల్ల (కోరికలీరెత్తి)కొత్తశోభను సంతరించుకొంటాయి తీగలు. ఆనెలతలే ఈ తీవెలు. ఇది చైత్రవిస్ఫురణం.

'చిత్రం వా ఏతత్కర్మ' అనే శ్రుతివాక్యంవల్ల చిత్రవిచిత్రమైన ఈ కార్యకలాపం భగవంతునికి ఇష్టమైనదే, సమ్మతమైనదే అని తెలుస్తుంది.

'గో' శబ్దానికి 'ఇంద్రియ' మని అర్థం. ఇంద్రియాలచేత భగవంతుని లావణ్యామృతాన్ని పానంచేసేవారు గోపికలు అని వ్యుత్పత్త్యర్థం.

(గోభిః భగవద్రూపగుణసౌందర్యామృతం పిబంతీతి = గోప్యః । గోపాః)

భగవత్కటాక్షంవల్ల లతలలాగా లలితంగా ఉండే గొల్లనెలతలు, భగవత్ప్రయత్నానికి అడ్డుతగులకుండా ఆయన సమ్మతిని అనుమతిస్తారు. స్వామి ఇష్టమున్నట్లు తమను ఉపయోగించుకోవడానికి అంగీకరించేవారు గోపస్త్రీలని సారాంశం. "పరార్థైక ప్రవృత్తి శేషత్వం. పరాధీనప్రవృత్తి పారతంత్ర్యం." ఈరెండూ స్వరూపంగా కలజీవులు గోపికలని పూర్వాచార్యులు బోధించారు.

'చిత్రం'అంటే, చిత్తాన్ని హరించేది. "చిత్రా నక్షత్రం భవతి" (శ్రుతివాక్యం)

చిత్ర తారాస్వరూపం సగం 'కన్యకు సగం తుల' కు వర్తిస్తుంది. 'తుల'లో ప్రమాణం, ప్రమేయం, రెండూ ఉంటాయి.

బాటురాయి ప్రమాణమైతే వస్తువు ప్రమేయమవుతుంది.

సమతౌల్యంగా ఉండే బింబప్రతిబింబధర్మమే చిత్రం.

"విష్ణోర్విచిత్రాః ప్రభవంతి మాయాః" విష్ణుమూర్తి మాయలే చిత్రవిచిత్రాలుగా ఉంటాయి.

"దేవకీ సుతుకొర్కె తీవెలు వీడంగ, వెలఁదికి మెయిదీగ వీడఁదొడఁగె" ఈ, సమాలంకార సజ్జితమైనదే చిత్రం. చిత్రమే చైత్రం.

బాలకృష్ణుని లీలాప్రవృత్తి చైత్రవిస్ఫురణమే.

చిత్రానక్షత్రంతో కూడిన పున్నమ కలనెలను చైత్రమాసమంటారు. "చైత్రః శ్రీమానయం మాసః పుణ్యః పుష్పితకాననః" (రా,అయో.)

'వపుర్మందారస్య ప్రథమకుసుమోల్లాససమయః" (శ్రీరంగరాజస్తవం 90)

శ్రీరంగనాథుని శరీరమనే మందారతరువుకు మొదటి పూవుపూచే సమయం అని తారుణ్యాశోభను వర్ణించారు. శ్రీ పరాశరభట్టర్.

"ఇవ్విడత్తిల్ అవయవస్ఫూర్తిహేతుతయా పుష్పోత్పత్తి కాలమాకవుమ్,

అవయవసౌందర్యస్ఫూర్తిహేతుతయా అన్ద పుష్పవికాసమాకవుమ్"

ఇక్కడ, భగవంతునిఅవయవాలస్ఫూర్తి పూవు పుట్టేకాలమనీ, అవయవ సౌందర్యం స్ఫురించడంవల్ల పుష్పవికాసమనీ, శ్రీవాధూల రాఘవాచార్య వ్యాఖ్య - తారుణ్యాశోభను వివరించింది.

చైత్రమాసంలోనే తరువులు విరులతో అలరారుతుంటాయి. అది వసంతర్తువే. "వసంతే పుష్పసమయః" (అమరం)

లోకులకు యౌవనవికాసానికి కాలపరిమితి ఉంది. శ్రీకృష్ణుడు నిత్యయౌవనుడుకదా! అందువల్ల "ఋతూనాం కుసుమాకరః" (భ.గీ.) తాను ఎల్లప్పుడూ "వసంతర్తువునే" అని స్పష్టపరచాడు.

"చైత్రవిస్ఫురణమౌ నీయొప్పు నారాయణా!" అన్నాడు ఈ కవీశ్వరుడు. రూపకాలంకారంతో సమాలంకారం దీపించిన పద్యమిది.

**శా॥ లీలన్ పూతనప్రాణవాయువులు పాలిండ్లందు వెళ్లించి, దు**
**శ్శీలుండై చను బండిదానవు వెసం జిందై పడం దన్ని యా**
**రోలన్మద్దులు గూల్చి ధేను దనుజున్ రోజంగ నీల్గించి, వే**
**కూలన్ కంసునిఁగొట్టి గోపికల కోర్కుల్ దీర్తు నారాయణా॥ 57**

అర్థం: ఓ నారాయణా! పూతన ప్రాణవాయువులు = పూతనఅనేరాక్షసి యొక్క ప్రాణం, అపానం, వ్యానం, ఉదానం, సమానం అనే పంచ విధాలైన గాలులను; లీలన్ = క్రీడగా, పాలిండ్లయందు; వెళ్ళించి = దేహంనుంచి పోగొట్టి; దుశ్శీలుండై చను = దుష్టస్వభావంతో బతుకుతున్న; బండి దానవుని = శకటాసురుణ్ని; వెసన్ = వేగంగా; చిందై = శిథిలమై; పడన్, తన్ని ; ఆరోలన్ = (తల్లి తనను కట్టివేసిన) ఆరోటితో; మద్దులు = రెండు మద్ది చెట్లను; కూల్చి; ధేను దనుజున్ = ధేనుకాసురుణ్ని; రోజంగ నీల్గించి = చంపి; కంసునిన్; వే, కూలన్ కొట్టి = వేగంగా ఈడ్చి చంపి; గోపికల కోర్కెల్ తీర్తువు.

తా : ఓనారాయణా! పూతన చనుపాలను త్రాగి అలవోకగా ప్రాణాలను తీశావు. దుర్గుణంగల శకటాసురుణ్ని ఎగిరి ముక్కలై పడేలాగా తన్ని చంపావు. రోటి నీడ్చుకొంటూ పోయి రెండు మద్దిచెట్లను కూల్చావు. ధేనుకాసురుణ్ని దమ్ము ఎగపోస్తూ నేలకొరిగే లాగా చేశావు. కంసుణ్ని అతని సింహాసనం నుంచి జుట్టు పట్టి లాగి కొట్టి మట్టికరిపించావు. గోపికల కోరికలనీడేర్చావు.

**వ్యాఖ్య : శ్రీకృష్ణుడు శిష్టరక్షణకోసం దుష్టులను శిక్షించిన వర్ణన.**

దేహంలో ఉండేవాయువులు సాధారణంగా ఐదు. ప్రాణవాయువు హృదయంలో ఉంటుంది. ఇది కడుపులోకి అన్నపానాలను ప్రవేశింపజేస్తుంది. అపానవాయువు గుదస్థానంలో ఉంటుంది. ఇది మలమూత్రరేతస్సులను క్రిందికి తోసేస్తుంది. వ్యానవాయువు శరీరమంతటా ఉంటుంది. ఇది రక్తాన్ని, చెమటను, రెప్పపాటును పుట్టిస్తుంది. ఉదానవాయువు కంఠమందు ఉంటుంది. ఇది ధ్వనిని మీదికి తెప్పించి

మాటలను పుట్టిస్తుంది. సమానవాయువు నాభియందు ఉంటుంది, ఆహారాన్ని జీర్ణింపజేస్తుంది. దేహధారులు ఈ పంచవాయువులతో జీవిస్తుంటారు. వీటినే పంచప్రాణాలంటారు.

పూతన అనే రాక్షసి కంసునిప్రేరణతో ఇష్టమైన రూపాన్ని ధరిస్తూ పసిపిల్లల ప్రాణాలను తీస్తూ వ్రేపల్లెకు వచ్చింది. రాత్రిపూట నందునింటికి సుందరమైన స్త్రీ రూపాన్ని ధరించి బాలకృష్ణుణ్ని విషపూరితమైన చనుపాలనిచ్చి చంపడానికి ప్రవేశించింది. రోహిణీయశోదలు పూతన సౌందర్యాన్ని చూచి ముగ్ధలయ్యారు. కన్నులు మూసుకొన్న చిన్ని కృష్ణుణ్ని చంకకెత్తుకుని అతని నోటిలో స్తనాన్ని పెట్టింది పూతన. దాని రెండు చన్నులను రెండు చేతులతో గట్టిగా పట్టుకొని, కృష్ణుడు దాని పాలతో పాటు పంచప్రాణాలనుకూడా పీల్చేశాడు.

"గాఢం కరాభ్యాం భగవాన్ ప్రపీడ్య తత్ప్రాణైస్సమం రోష సమన్వితోఽపిబత్" (భాగ.10స్కం.6 అధ్యా.11శ్లో)

శ్రీకృష్ణుడు పరివర్తనోత్సవం నాడు అంటే, - నక్షత్రాన్ని బట్టి జన్మదినం - పుట్టినతర్వాత 27వ దినం (Birthday) నాడు, యశోదాదేవి పేరంటానికి వచ్చిన సువాసినులకు కానుకలను, వాయనాలనిస్తున్న సమయమది. అది వరకే, ఒక విచిత్రమైన బండిక్రింద శ్రీకృష్ణున్ని పడుకోపెట్టింది. అతడు, యశోదపాలకోసం ఏడుస్తూ తనచిన్న పాదాలనెగురవేస్తున్నా, సత్కారంచేయడంలో తన్మయులైనందువల్ల ఎవరూ వినలేదు, కనలేదు.

"రుదన్ స్తనార్థీ చరణా వుదక్షిపత్" (భాగ.10-7-6.)

శ్రీకృష్ణుని మృదువైన చిన్నపాదం తగులడంతోనే రక్కసుడు ఆవహించి యున్న ఆ బండి ముక్కలు ముక్కలుగా విరిగి ఎగిరి పడింది. బండిమీద పాలు, పెరుగు, వెన్నతో నిండి ఉన్న భాండాలన్నీ చెల్లా చెదరై పడిపోయాయి.

"తస్య పాదప్రహారేణ శకటం పరివర్తితమ్।
విధ్వస్తకుంభ భాండం తద్విపరీతం పపాత వై"॥ (వి.పు)

"విధ్వస్త నానారసకుప్యభాజనం
వ్యత్యస్తచక్రాక్షవిభిన్నకూబరమ్"॥ (భాగ.10-7-7.)

ఒకనాడు యశోద శ్రీకృష్ణునికి చనుపాలను త్రాగిస్తుంటే, పొయ్యిమీద పాలు పొంగిపోయే దృశ్యాన్ని గమనించింది. శ్రీకృష్ణుణ్ని తృప్తి పరచకయే క్రింద కూర్చుండబెట్టి పాలను దించడానికి పొయ్యి దగ్గరికి పోయింది.

సాంసారికవ్యామోహం సర్వేశ్వరసన్నిధిలో ఉండనీయదుకదా!

బాలకృష్ణునికి కోపం వచ్చింది. దగ్గరున్న కఱ్ఱతో నిండుగా పెరుగుతో ఉన్న కుండను పగులకొట్టాడు. తల్లి వచ్చి చూచింది. భయంతో కృష్ణుడు పరుగెత్తాడు. యశోద కఱ్ఱను చేత పట్టుకొని శ్రీకృష్ణుణ్ని పట్టుకోవడానికి వెంట పరుగెత్తింది. ఎలాగో పట్టుబడిన కృష్ణుణ్ని తాడుతో కట్టి వేయ యత్నించింది. జగజ్జాలములున్న బొజ్జను కట్టవశమా! ఎన్ని త్రాళ్ళు తెచ్చి అతుకులు పెట్టినా, ఎప్పటికీ రెండంగుళాలు తక్కువ అవుతుండడం అందరికి వింతగా కనబడింది. అలసిపోయిన తల్లి స్థితిని చూచి కన్నయ్య తానే దయతలచి కట్టుబడ్డాడు. త్రాటి యొక కొనతో అచేతనమైన రోటిని ఎలా కట్టివేసిందో, మరొక కొనతో పరమచేతనుడైన కృష్ణభగవానుణ్ని అలాగే కట్టివేసింది. యశోద రోషంతో

"యది శక్నోషి గచ్ఛ త్వమతిచంచలచేష్టిత" - (వి.పు)

"ఓరి చంచలుడా! సామర్థ్యముంటే ఇప్పుడుపోరా!" అంటూ, తన ఇంటిపనులలో మగ్నమయింది.

స్వతంత్రుడు పరతంత్రుడయ్యాడు. ఇతరులను బంధంనుంచి విడిపించడానికి తాను బంధితుడవడమే దామోదరలీల.

"దామోదరాయ నమః"

నలకూబరుడు, మణిగ్రీవుడనే యక్షులు కుబేరుని కుమారులు. వారు సౌందర్య, ఐశ్వర్యసంపన్నులు. రుద్రునిఅనుచరులు. అఖర్వగర్విష్ఠులై అచ్చర లేమలతో కూడి నగ్నంగా గంగానదిలో జలక్రీడలు సలుపుతుంటే నారదమహర్షి చూచాడు. అప్సరలు వెంటనే బట్టలు కట్టుకొన్నారు. కాని యక్షరాజపుత్రులు మాత్రం దిగంబరులుగానే ఉన్నారు.

'పెద్దలు కనబడగానే వారిని భయభక్తులతో గౌరవించక మదాంధులై ప్రవర్తించేవారు మద్ది చెట్లుగా ఉండడంమేలు' అని దేవర్షి శాపమిచ్చాడు. వారికి శ్రీకృష్ణుని సాన్నిధ్యం ప్రాప్తించినప్పుడు పూర్వస్థితికలుగగలదని శాపవిమోచనాన్నీ తెలిపాడు.

మహాభక్తుడైన నారదునిమాటను సత్యం చేయడానికి రోటికి కట్టివేయబడిన శ్యామసుందరుడు, నందుని ఇంటి ముందు యమళార్జునము లనే పేరుగాంచిన రెండు మద్ది చెట్ల మధ్య నుంచి రోటిని లాగుకొని పోతుంటే రోలుకు తట్టుకొన్న చెట్లు పెళపెళార్భటులతో, కూకటి వ్రేళ్ళతో పెకిలినేలకు ఒరిగాయి. ఆచెట్లలోనుంచి అగ్ని సమానతేజ స్సంపన్నులైన ఆ ఇద్దరు పురుషులు బయటకు వచ్చి శ్రీకృష్ణభగవానుని సన్నిధిలో బద్ధాంజలులై స్తుతించి పురుషార్థపరులయ్యారు.

ధేనుకాసురుణ్ని, కంసుణ్ని సంహరించిన సంగతి 18వ పద్యంలో వ్యాఖ్యానింపబడింది.

శ్రీకృష్ణలీలలు గోపికల కోర్కెలను సిద్ధింపచేశాయి, అనడం స్వభావోక్తియే.

**మ. రసనాగ్రంబున నీదు నామరుచియున్ రమ్యంబుగాఁ జెవ్లకు**
**న్నసలారంగ భవత్కథాభిరతియున్ హస్తాబ్జయుగ్మంబులన్**
**వెస నీపాదసుపూజితాదియుగమున్ విజ్ఞాన మధ్యాత్మకున్**
**వెసనిం పొందనివాఁడు దాఁబశువు సూ వేదాత్మ నారాయణా॥ 58**

అర్థం: ఓ వేదాత్మ ! నారాయణా! రసన+అగ్రంబున = నాలుకచివర; రమ్యంబుగా = ఆడునట్లుగా; నీదు నామరుచియున్ = నీపేరునాస్వాదించడమూ; చెవ్లకున్ = రెండుచెవులకు; నసలు+ఆరంగ = దురద తీరునట్లుగా; భవత్+కథా+అభిరతియున్ = నీ కథలయందు ఆసక్తి ఉండడమూ; హస్త + అబ్జయుగ్మంబులన్ = కరకమల ద్వయంతో; వెసన్ = శీఘ్రంగా; నీపాదసుపూజిత + ఆదియుగమున్ = నీ పాదాలను పూజించడం మొదలైనవి. (ఈ సమాసపదం సాధువుగా లేదు) ఆధ్యాత్మకున్ = మనస్సుకు; విజ్ఞానము = శుద్ధిని కలిగించే ఆచారనిష్ఠ; వెసన్ = వెంటవెంట; ఇంపు = ఆనందం; ఒందనివాడు; తాను; పశువుసుమా!

తా : ఓ వేదాత్మ! నారాయణా! జిహ్వాగ్రాన నామసంకీర్తనమే రుచించడం ఇంపు; చెవుల నసనస దీరే రీతిగా నీ కథలను వినడమందు ఆసక్తి ఉండడం ఇంపు; కేల్దమ్ములతో నీపాదపూజచేయడమే సొంపు. జ్ఞానం గల చిత్తం విజ్ఞానసహితమవడం ఇంపు. వీటిని ఇష్టపడని వ్యక్తి కేవలం పశువేసుమా!

**వ్యాఖ్య : దేహసంపదను భగవత్సేవకోసం నివేదించడమే మానవ లక్షణమని వర్ణన.**

నాలుకకు రెండు చేష్టలున్నాయి. ఒకటి మాటాడడం, రెండవది రుచినెరుగడం. ఈ జిహ్వేంద్రియమే మనిషికీ, పశువుకూ తారతమ్యాన్ని తెల్పుతుంది. పశువుకు నాలుక ఉన్నా భగవన్నామరుచినెరుగదు. పశువుకు వెన్నుబాము తిర్యక్ - అడ్డం - గా ఉంటుంది కాబట్టి దానికి ఆలోచించేశక్తి శూన్యం. కాబట్టి వాటి నాలుకకు తిండి రుచి మెండు. భగవత్కథలను వినే ఆసక్తి కూడా వాటి చెవులకు కలుగదు. నాలుగు పాదాలతోనడవడమే తప్ప చేతులతో పూజించే స్వరూపంగానీ, స్వభావంగానీ పశుదేహనిర్మాణక్రియలోనే లేదు. జ్ఞానమే లేనప్పుడు దాన్ని అనుష్ఠించే ప్రక్రియనూ పశువెరుగదుకదా! కాబట్టి వివేకహీనులను పశువులంటారు.

"విచిత్రా దేహసంపత్తిః ఈశ్వరాయ నివేదితుమ్।
పూర్వమేవ కృతా రాజన్! హస్తపాదాదిసంయుతా'॥"

'చేసిన కర్మ ఫలితంగా, విచిత్రమైన కరచరణహృదయమేధలతో కూడిన మానవునిదేహసంపద భగవంతునిసేవకోసమే నిర్మింపబడింది' అని శాస్త్రం బోధిస్తుంది.

భగవంతుడు అచేతనంలాగా పడియున్న జీవులకు మంచిబుద్ధిని, మనస్సును, వాక్కును, జ్ఞాన కర్మేంద్రియాలతో కూడిన కరణకళేబరాన్ని ప్రసాదించాడు. సర్వేశ్వరునికి వినియోగించే విధానాన్ని తెలిపే శాస్త్రాన్నీ అనుగ్రహించాడు. కాబట్టి భగవంతునికోసం దేహసంసత్తిని వినియోగించక పోవడం ద్రోహమే.

రుచికి మరగిన చేపగాలానికి తగిలి నశిస్తుంది కదా!

"భగవద్గుణానుసంధానం అభయహేతుః" అన్నట్లు నరరూపంలో ఉన్న పశువే అనదగినా, పాపభీతితో నరుడు "దయాసింధో! బంధో!నిరవధిక వాత్సల్యజలధే!" (స్తోత్రరత్నం) అని, జిహ్వకు నామరుచిని కలిగిస్తే అతనికి భయం పోతుంది. మోక్షసామ్రాజ్యమూ లభిస్తుంది.

కర్ణేంద్రియం దుర్వినియోగమైతే ముప్పుతప్పదు.

సాధు జంతువైన లేడి పిల్లనగ్రోవినాదానికి లొంగిపోయి కిరాతునికి బందీ అవుతుందికదా! కాబట్టి చెవులతో భగవద్గాథలను వినాలి. జన్మజన్మాల పాపాలన్నీ తొలగిపోయి ఆస్తిక్యం జనిస్తుంది. రూపానికి ఆశపడి శలభం (దీపపు పురుగు-మిడత) నశిస్తుంది. స్పర్శకోసం దంతి (ఏనుగు) గుంతలో పడుతుంది. వాసనకు ఆసపడిన తుమ్మెద మ్రోగి మ్రోగి ఉస్సురంటుంది.

శబ్దస్పర్శరూపరసగంధాలనే విషయాలుకలిగిన ఇంద్రియాలకు వశుడై మానవుడు చెడిపోతాడు.

కర్మేంద్రియాలలో ముఖ్యమైన చేతులతో భగవంతుని పూజ, భజన చేయడం వల్ల దుష్కర్మ నశించి ముక్తి లభిస్తుంది.

"కమలాక్షునర్చించు కరములు కరములు.

శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ" (ఆంధ్రభాగవతం).

'ఆత్మన్' శబ్దానికి దేహం, మనస్సు, బుద్ధి, జ్ఞానం, జీవాత్మ, పరమాత్మ అని నానార్థాలున్నాయి.

మంచి చెడ్డలను గ్రహించడమే వివేకం. మానవజీవనాన్ని మూడు రకాల తాపాలు ఆవరించి ఉన్నాయి.

1. ఆధ్యాత్మికతాపాలు: మానసికాలైన ఉన్మాదమూర్ఛాదులూ, దేహానికి కలిగే రోగాలూ - ఆధివ్యాధులు.

2. ఆది భౌతిక తాపాలు: మృగ, వృశ్చిక,సర్పాది భూతాలవల్ల కలిగే బాధలు.

3. ఆధిదైవికాలు: భూకంపం, తుపాను, పిడుగులవల్ల కలిగే ఉపద్రవాలు.

"తాపత్రయీమయదవానలదహ్యమానమ్" (కూరేశుల వరదరాజస్తవం) తాపత్రయమనే కార్చిచ్చులో పడి కాలిపోతున్న మానవునికి 'కష్టాలనుంచి కడతేరే

దెట్లా? దైవమా!" అనే జ్ఞానం చీకట్లో మెరుపులాగా స్ఫురిస్తుంది. ఈ వివేకమే బీజంలాగా మనస్సున నాటుకొని ఆత్మరక్షణోపాయమైన నారాయణుణ్ణి ప్రార్థిస్తాడు. జ్ఞానుల ధ్యానయోగవిధానమే విజ్ఞానం. "Practice is the test of knowledge—— ఆచరణమే జ్ఞానానికి గీటురాయి.

"యాన్యనవద్యాని కర్మాణి, తాని సేవితవ్యాని, నో ఇతరాణి
యాన్యస్మాకం సుచరితాని, తాని త్వయోపాస్యాని" (ఉపనిషత్తు)

'నీవు మంచి పనులనే చేయాలి. దురితాలను చేయరాదు. మేమాచరించిన వాటిలోనూ సుచరితాలనే గ్రహించి పాటించు' మని జ్ఞాన పూర్ణుడై జీవితంలో అడుగిడబోయే శిష్యునికి 'విద్యాస్నాతకవ్రతోత్సవ' సమయాన ఆచార్యుని అనుశాసనమిది. కాబట్టి, వేదాంతశాస్త్రమే ఆధ్యాత్మ విద్య.

"అనుష్ఠాననిత్యత్వం స్వాతంత్ర్య మపకర్షతి" (ఉత్తరరామచరిత్ర).
నిత్యానుష్ఠానం స్వేచ్ఛగా ప్రవర్తించనీయదన్నాడు భవభూతి.

ఈ శరీరం విజ్ఞానాత్మకమైన పరబ్రహ్మకు వినియోగించడమే ఇంపు, సొంపు.
"కంజాక్షునకుగాని కాయంబు కాయమే" అన్నాడు కదా భక్తపోతన.

"జిహ్వే కీర్తయ కేశవం, మురరిపుం చేతో భజ, శ్రీధరం
పాణిద్వంద్వ సమర్చయ, అచ్యుతకథాః శ్రోత్రద్వయ త్వం శృణు।
కృష్ణం లోకయ లోచనద్వయ! హరేర్గచ్ఛాంఘ్రియుగ్మాలయం
జిఘ్ర ఘ్రాణ ముకుందపాదతులసీం, మూర్ధన్! నమాధోక్షజమ్"॥

అని శ్రీకులశేఖరమహారాజు తన ఇంద్రియాలకు హితాన్ని బోధించాడు.

**మ. వరకాళిందితరంగడోలికలలో వైకుంఠధామంబులో**
**వెరవొప్పార నయోధ్యలో మథురలో వ్రేపల్లెలో ద్వారకా**
**పురిలో నాడెడు భంగి నాదు మదిలో భూరిప్రసన్నాననాం**
**బురుహంబొప్ప నటించు టొప్పును సితాంభోజాక్ష నారాయణా॥ 59**

అర్థం: సిత+అంభోజ +అక్ష = తెల్లతామరపూలలాంటి కన్నులు కల వాడా! ఓనారాయణా! వరకాళింది - లలో వర =శ్రేష్ఠమైన; కాళింది = యమునయొక్క; తరంగ = అలలు అనే; డోలికలలో = ఊయలలోనూ, వైకుంఠ ధామంబులో = పరమ పదంలోనూ; వెరవు ఒప్పార = ఉపాయానుగుణంగా; అయోధ్యలో; మథురలో; వ్రేపల్లెలో = నందగోకులంలోనూ; ద్వారకాపురిలోనూ; ఆడెడు భంగి = నటించేరీతిగా; నాదు = నాయొక్క; మదిలో = చిత్తంలో; భూరి = గొప్ప; ప్రసన్న+ఆనన+అంబురుహంబు = వికసించిన కమలంలాంటి వదనం; ఒప్ప, నటించుట = తగినట్లు ఆడుట; ఒప్పును = యోగ్యమగును.

తా : ధవళాంభోజాక్ష! ఓనారాయణా! ఉత్కృష్టమైన యమునా నదీ వీచికలు అనే డోలికలలోనూ, వైకుంఠంలోనూ, అయోధ్యలో, మధురలో, నందగోకులంలోనూ, ద్వారకాపురిలోనూ నీవాడుకొన్నావు. అలాగే నాహృదయంలోనూ వికసిత వదనకమలంతో నటించడమూ నీకు యోగ్యమే.

**వ్యాఖ్య : భక్తుని హృదయం భగవంతుడు నివసించే దివ్యక్షేత్రంగా వర్ణితం.** శ్రీకృష్ణుడు యమునానదిలో గోపికలతో కూడి జలక్రీడలాడుతూ, ముఖోచ్ఛిష్టజలాలను పరస్పర వదనారవిందాలమీద చిమ్ముకోవడం వల్ల కాళింది పుణ్య తీర్థక్షేత్రమయింది.

"వల్లవీవదనోచ్ఛిష్టపవిత్రాధరవిద్రుమః" అన్నట్లు భగవద్భాగవతోత్తముల గండూషాదులచేత అతిపవిత్రమయింది యమునా జలం.

"వైకుంఠే తు పరే లోకే శ్రియా సార్ధం జగత్పతిః।
ఆస్తే విష్ణురచిన్త్యాత్మా భక్తైర్భాగవతైః సహ॥" (భగవచ్ఛాస్త్రం)

శ్రీమన్నారాయణుడు నిత్యసూరులతోనూ, ముక్త పురుషులతోనూ శాశ్వతఆనంద తేజః ప్రవాహంలో క్రుంకులిడుతూ, అంగరంగభోగాలను అనుభవించే యోగ్యమైన పరంధామం వైకుంఠధామం.

శ్రీ మహావిష్ణువు "అభజత్ భరతాదిభేదమీశః" (పాదుకాసహస్రమ్) తనను నాలుగు విధాలుగా విభజించుకొని అయోధ్యానగరంలో దశరథ పుత్రులుగా జనించాడు. అప్పుడు -

"యశ్చ రామం న పశ్యేత్తు యం చ రామో న పశ్యతి।
నిందితః స వసేల్లోకే స్వాత్మాఽప్యేనం విగర్హతే॥" (రామాయణం)

శ్రీరామచంద్రస్వామిని చూడనివాడు, రామునిచే చూడబడనివాడు లోకనిందితుడేకాక, తనను తానే నిందించుకొనేవాడట. ఇలా రామ భరతలక్ష్మణశత్రుఘ్నులు నలుగురూ సమవయస్కులైన నాగరిక బాలురతో జనమనోనయనానందకరంగా ఆటలాడుకొన్న క్షేత్రం సాకేతనగరం.

గోగోపగోపీజన సంఘంతో కూడి ఆడిన శ్రీకృష్ణుని రాగరసభరితాలైన లీలలచే నిస్తులమైన పల్లె వ్రే(తల)పల్లె.

"నాకేశస్త్రి పురాంతకః కమలభూరన్యే చ నాకాలయాః
కాకాకారజుషో ముహుః కబళయం త్యుచ్ఛిష్టమిష్టం తవ॥" (ఆనందమందాకిని)

యమునగట్టున చెట్టునీడలో శ్రీకృష్ణుడు గోపబాలురతో కలిసి పెరుగు సద్దులను తిని, ఆడుకొంటున్నప్పుడు బ్రహ్మరుద్రేంద్రాదిదేవతలు కాకులరూపంలో వచ్చి

భగవద్భాగవతోత్తముల ఉచ్ఛిష్టాన్నంలోని మెతుకులను మాటిమాటికి (ఏరుకొని) తింటున్నట్లు దర్శించి, వర్ణించిన ఉద్దండ విద్వత్కవి శ్రీమధుసూదన సరస్వతి యతీశ్వరుడు.

"దలితం మధురం, ఫలితం మధురం, మధురాధిపతే రఖిలం మధురమ్"

(శ్రీమధురాష్టకం) కౌమారవస్థలో ధనుర్యాగ మందు పాల్గొనేవ్యాజంతో వచ్చి అవక్రమపరాక్రమాన్ని ప్రదర్శించిన శౌరిక్రీడలతో అఖిలంమధురమైన ముక్తి క్షేత్రం మధురానగరం.

"సుఖం స్వపుర్యాం నివసన్ ద్వారకాయాం శ్రియఃపతిః
సర్వసంపత్సమృద్ధాయాం సంవృతో వృష్ణి పుంగవైః।
రేమే షోడశ సాహస్రపత్నీనామేకవల్లభః।
తావంతి బిభ్రద్రూపాణి తద్గృహేషు మహర్ధిషు॥" (భాగవతం. 10 స్కం.90అ)

నిత్యయువకుడై, అష్టమహిషీమణులతోనూ, షోడశసహస్రాధిక పురంధ్రులతో - ఒక్కొక్కపత్నికి ఒక్కొక్క పతిగా - కూడి విశ్వరూపధారియైన శ్రీరుక్మిణీశుని సరసవినోద కేళీవిలాస విహారాలకూ, సకల సంపదలకూ నిలయమై, ప్రకృతి బంధనివారక మయింది ద్వారకా క్షేత్రం.

"అహం వసామి వైకుంఠే యోగినాం హృదయే రవౌ।
మద్భక్తా యత్ర గాయంతే తత్ర తిష్ఠామి నారద॥" అన్నట్లు

భగవంతుడు వైకుంఠంలోనూ సూర్యమండలంలోనూ, యోగుల హృదయంలోనూ, తనను భజించే భక్తుల అంతరంగంలోనూ ఉంటాడు.

'భగవ' చ్ఛబ్దం పరిపూర్ణవస్తువును తెల్పుతుంది. 'భక్త' శబ్దం విడిపోయిన వస్తువును తెల్పుతుంది. తననుంచి విడిపోయిన వస్తువు - జీవవర్గం - తనకు అభిముఖంగా ఉండాలని తలచేవాడు భగవంతుడు. భగవంతుడా! నీ సన్నిధి చేరడానికి ఇంక "కాలం కుఱుగాదో" కాలం దగ్గరపడదా? అనే ఆర్తితో ప్రార్థించేవాడు భక్తుడు. భక్తిరూపమైన జ్ఞానం కలవారి హృదయంలోనే "మయి తే తేషు చాప్యహమ్' ' "స చ మమ ప్రియః" (భ.గీత) అన్నట్లు యథేచ్ఛగా ఉంటాడు.

"కలౌ కృతయుగం తస్య కలిస్తస్య కృతే యుగే।
యస్య చేతసి గోవిందో యస్య చేతసి నాచ్యుతః॥ (వి.ధ.109-57)

ఎవని హృదయంలో గోవిందుడు ఉంటాడో అతనికి కలియుగం కృతయుగమవుతుంది. అలాగే ఎవని హృదయంలో అచ్యుతుడు ఉండడో అతనికి కృతయుగం కూడా కలియుగమవుతుందన్న విషయం గమనీయం.

"షట్పదీ మదీయే హృదయసరోజే సదా వసతు" (శ్రీవిష్ణుషట్పది)

"శ్రీరంగరాజభృంగో మే రమతాం మానసాంబుజే". (శ్రీరంగరాజస్తవం)

భగవంతుడు తమ మనస్సులలో స్థిరనివాసమేర్పరచుకొని ఆనందించడంకోసమే మహనీయులైన పూర్వాచార్యులు ప్రార్థించినట్లే, ఈ శతకకర్త కూడా 'నాదుమదిలో భూరిప్రసన్నాననాంబురుహంబొప్ప నటించుటొప్పునని నారాయణుణ్ని ప్రార్థించడం భృశం ప్రశంసనీయం.

**శా. చల్లల్వేఱొక యూర నమ్మికొనునాసం బోవుచోఁ ద్రోవ నీ**
**వుల్లాసంబున నడ్డకట్టి మదనోద్యోగానులాపంబులన్**
**చల్లన్ జల్లని చూపు జల్లుమని గోపస్త్రీలపైఁ జల్లు మీ**
**చల్లం బోరుతెలుంగుఁ జిత్తమున నేఁజర్చింతు నారాయణా॥ 60**

అర్థం: ఓ నారాయణా! చల్లల్ = పాలు, పెరుగు, చల్లమొదలైనవాటిని; వేరొక యూరన్ = మరొకగ్రామంలో; అమ్మికొను ఆసన్ = అమ్ముకొనే ఆశతో; పోవుచో = పోతున్నప్పుడు; ఉల్లాసంబున = కుతూహలంతో; నీవు; త్రోవన్ = దారియందు; అడ్డకట్టి = ఎదురుగా నిల్చి; మదన+ఉద్యోగ +అనులాపంబులన్ = కామాన్ని ప్రేరేపించే మాటలను; చల్లన్ = వెదజల్లగా - పలుకగా; గోపస్త్రీలపై జల్లుమని = ఒళ్ళు జల్లుమని పులకించునట్లు; చల్లని చూపు; చల్లు(తున్న)మీ చల్లన్ పోరుతెలుంగు = మీ చల్లని ప్రణయకలహపద్ధతిని; నేను; చిత్తమున = మనస్సునందు; చర్చింతు = ధ్యానింతును; స్మరిస్తాను.

తా : ఓ నారాయణా! గోపికలు వేరే ఊళ్ళో చల్లలమ్ముకొనే కోరికతో పోతున్నారు. నీవు వారిదారికి అడ్డంగా నిల్చావు. వారితో కామాన్ని ఉద్దీపింపజేసే సంభాషణ జరిపావు. అప్పుడు వారి ఒళ్ళు జల్లుమనే రీతిగా చల్లని చూపు(ల)ను వారిమీద ప్రసరింప చేశావు. నేను మీ ప్రణయకలహపద్ధతిని మనస్సులో స్మరిస్తుంటాను.

**వ్యాఖ్య : గోపస్త్రీలయందు శ్రీకృష్ణునివాల్లభ్యం వర్ణితం.**

శ్రీవేణుగోపాలునిఅద్భుతకృత్యాలను గొల్లపడతులు ఎల్లప్పుడు స్మరించేవారు. శ్రీకృష్ణానుస్మరణమే వారిమనుగడకు ధారకం, పోషకం, అనుస్మరణం అంటే శ్రీకృష్ణుని అసంఖ్యాక నామాలను - గుణ గణాలను నిరంతరం గానం చేయడం. అదివారిజీవిత భాగధేయం.

"ఉద్గాయతీనామరవిందలోచనం వ్రజాంగనానాం దివమస్పృశద్ధ్వనిః।
దధ్నశ్చ నిర్మంథనశబ్దమిశ్రితో నిరస్యతే యేన దిశామమంగళమ్॥"

(భాగవతం 10-46-47). ప్రాతఃకాలంలో గోపికలు మధురకంఠంతో శ్రీకృష్ణుని లీలలను గానంచేస్తూ పెరుగును చిల్కేవారు. వారిగానధ్వని పెరుగును చిలికే

ధ్వనితో కలిసి మిన్ను ముట్టేది. తత్ఫలితంగా దశదిశలవ్యాపించిన అమంగళం తొలగిపోయి పవిత్రత ఏర్పడేది.

"విక్రేతుకామా కిల గోపకన్యా మురారిపాదార్పితచిత్తవృత్తిః।
దధ్యాదికం మోహవశాదవోచత్ గోవిందదామోదరమాధవేతి"॥
(శ్రీకృష్ణకర్ణామృతం. 2ఆ.56)

ఒక గొల్లపడుచు పాలు, పెరుగు అమ్మడానికి పోయింది. ఆమె మనస్సు శ్రీకృష్ణుని యందే మరులుకొని యుండడంవల్ల వీధిలో "పాలోయమ్మపాలు, పెరుగోయమ్మ పెరుగు" అనడానికి మారుగా "గోవిందా! దామోదరా! మాధవా!" అని కేకలు వేస్తూ సంచరిస్తుండింది.

ఇంత ముగ్ధస్నిగ్ధహృదయాలుగల గోపకన్యకల కోరికలను శ్రీకృష్ణుడు తీర్చకుండా ఎలా ఉండగలడు? వారి చిత్తవృత్తులకు అనుగుణంగా ప్రవర్తించేవాడు.

శ్రీకృష్ణుడు, వేరే ఊరికి చల్లలమ్మబోయే గోపికలను దారిలో అడ్డగించేవాడు. మదనోద్దీపకాలైన మాటలతో హృదయాలను మథించేవాడు. వారి మృదువైన మనస్సులు వెన్నముద్దలుగా తేలియాడేవి. అంతలోనే వారి ఒళ్ళు కూడా జల్లు మనే రీతిగా చల్లని చూపులను వెదజల్లేవాడు. ఆదయాతరంగితాంతరంగం, ఆసంభాషణాచాతుర్యం, ఆకటాక్షవీక్షణం, ప్రణయాన్వితమైన పోరుగా ధ్యానయోగ్యమైనదేకదా!

తమజాతి ధర్మకార్యాలను నిర్వహిస్తూనే, తమహృదయాలను శ్రీహరి చరణారవిందాలయం దర్పించే గోపికలను యథావకాశంగా తృప్తిపరచే నటపరిబృఢుడు గోపీజనవల్లభుడు. ఆయనదివ్యజన్మకర్మలను తత్త్వతః తెలిసికొన్నవాడు పునర్జన్మను పొందడనీ, తననే పొందుతాడనీ (భ.గీత) నొక్కి చెప్పిన శ్రీకృష్ణుడు సాక్షాత్తుగా శ్రీమన్నారాయణుడే కదా!

"న బుద్ధిభేదం జనయేత్" అన్నట్లు భేదబుద్ధి కలుగకూడదు, కలిగించకూడదుకదా!

"అష్టాక్షరాదివేణుగోపాలాష్టకం" సర్వదా అనుసంధేయం.

1. **ఓం**కారవర్ణాత్మకవిశ్వమూర్తిం, బ్రహ్మర్షిభిః సేవితపాదపద్మమ్।
శ్రీద్వాదశాంతాఖ్యపురాధివాసం, శ్రీవేణుగోపాలమహం స్మరామి॥
2. **న**రార్చితం శ్రీమథురాపురీస్థితం పద్మాక్షమాలాసుగదాధరం వరమ్।
నాగాదిభిర్గోపకులైశ్చ సేవితం, శ్రీవేణుగోపాలమహం స్మరామి॥
3. **మో**క్షప్రదం భోగకరం యశస్కరం వైరాగ్యసిద్ధిప్రదమాత్మవేదినే।
అష్టాంగయోగాద్యణిమాదిసిద్ధిదం, శ్రీవేణుగోపాలమహం స్మరామి తమ్।

4. **నా**మార్థబోధం నవనీతలోలుపం సోమాదిభిర్వందితపాదపంకజమ్,
భామాపతిం సుందరరుక్మిణీప్రియం, శ్రీవేణుగోపాలమహం స్మరామి తమ్॥

5. **రా**జత్ప్రభామండలమండితాంగకం, నీలామ్బుదం తం వరదేహభాస్వరమ్,
శ్రీవేణునాదైర్భవరోగనాశనం, శ్రీవేణుగోపాలమహం స్మరామి తమ్॥

6. **య**క్షేశ్వరైః సిద్ధగణైశ్చ పూజితం గంధర్వసంఘాప్సరసామతిప్రియమ్ ।
శ్రీ గోపకన్యారమణం మనోహరం శ్రీవేణుగోపాల మహం స్మరామి తమ్॥

7. **ణా**వర్ణసంశోధినిజాభిధానం శ్రీయోగిహృత్పంకజచిత్రభానుమ్,
శ్రీ సన్నిధిష్ఠం మురళీధరం తం శ్రీవేణుగోపాలమహం స్మరామి॥

8. **య**తీశ్వరారాధిత నైజరూపం బాలైశ్చ వృద్ధైస్తరుణైర్మనుష్యైః,
భక్త్యా సమభ్యర్చితదివ్యమూర్తిం శ్రీవేణుగోపాలమహం స్మరామి

# జ్ఞాన వింశతిః

**మ. కలయన్వేదములున్ బురాణములు బ్రఖ్యాతంబుగా తెల్పి మీ**
**వలనన్ భక్తివిహీనుఁడైన పిదపన్ వ్యర్థప్రయత్నంబె పో**
**గులకాంతామణి గొడ్డు వోయిన గతిం గ్రొవ్వారు సస్యంబు దా**
**ఫలకాలంబున నీచపోవుపగిదిన్ పద్మాక్ష! నారాయణా॥ 61**

అర్థం : పద్మాక్ష = నీరేజనయనా ! ఓ నారాయణా! మీ వలనన్ = మీపక్షాన; వేదములున్; పురాణములు; కలయన్ = అంతటా; ప్రఖ్యాతంబుగా; వెల్లడి అగునట్లు; తెల్పి; పిదపన్ = తర్వాత; భక్తి విహీనుఁడు = భక్తి ఏమాత్రం లేనివాడు; అయిన = అయితే; కులకాంతామణి = కుల స్త్రీ; (పత్ని). గొడ్డుపోయిన గతిన్ = సంతానవతికాని విధంగానూ; క్రొవ్వారు సస్యంబు = ఏపుగా ఎదిగినపైరు; తాన్; ఫలకాలంబునన్ = పండేసమయాన; ఈచపోవుపగిదిన్ = గింజపట్టక పొల్లు అయిన రీతిగానూ; వ్యర్థప్రయత్నంబె పో = చేసినకృషి నిష్ఫలమే సుమా!

తా : పద్మాక్ష! నారాయణా! నీవు వేదాలనూ, పురాణాలనూ ప్రాకటంగా తెల్పిన తర్వాత, భక్తిలేనివాడుగా అయితే, ఆప్రయత్నమంతా కులకాంత గొడ్రాలైనట్లూ, బలంగా పెరిగిన వరిపైరు తీరాపండేకాలాన గింజపట్టక ఈడ్చుకపోయినట్లూ నిష్ప్రయోజనమే.

**వ్యాఖ్య : శాస్త్రజన్యజ్ఞానం భక్తిరూపంగా పరిణమిస్తే ప్రయోజనకరమని వర్ణితం.**

అనేకసంశయాలను తొలగించి, పరోక్షంగా ఉండే పదార్థాన్ని దర్శింప చేసేది శాస్త్రం. శాస్త్రమనేలోచనం లేనివాడు అంధుడే అంటుంది పంచతంత్రం.

"అనేక సంశయోచ్ఛేది పరోక్షార్థస్య దర్శనం।
సర్వస్య లోచనం శాస్త్రం యస్య నాస్త్యంధ ఏవ సః॥"

వేదపురాణాదిశాస్త్రాలను ఎంతోకష్టపడి అధ్యయనంచేసినా భక్తిరూపమైన జ్ఞానంకలుగక, శుష్క(వేదశాస్త్ర)జ్ఞానం ఏర్పడితే, ఆప్రయత్నమంతా అగ్నిలో కాక బూడిదలో ఆజ్యం పోసినట్లే అవుతుంది. వాస్తవంగా, భగవంతుని పాదసంసేవాసక్తియే జ్ఞానం.

"బోధావిర్భావనిదానముల్ చదువులయ్యా!కావు" అన్నాడు మహాకవి ధూర్జటి.

"ఉపదేక్ష్యంతి తే జ్ఞానం" అన్నట్లు పెద్దలు జ్ఞానోపదేశం చేయగలరు. కాని భక్తిని ఉపదేశించలేరుకదా!

"ముక్తిం దదాతి కర్హిచిన్న తు భక్తియోగమ్" (భాగవతం) ఎప్పుడో ముకుంద భగవానుడు ముక్తినైనా (ముం,కుం, = ముక్తిని, భుక్తిని) ఇస్తాడు. కాని భక్తిని మాత్రమీయ(లే)డు అంటాడు వ్యాసమహర్షి ఋషభావతారకథలో. అందుకే మహాజ్ఞానులు కూడా "భవతు మమ పరస్మిన్ శేముషీ భక్తిరూపా" 'పరమాత్మని యందు నాకు భక్తి రూపమైన జ్ఞానం కలుగాలి' అని ప్రార్థించారు.

భక్తివిహీనుడే అయితే అతనికి బోధించిన ప్రయత్నం వ్యర్థమేకదా! అంటూ కవి రెండు ఉపమానాలిచ్చాడు.

1. "కులకాంతామణి గొడ్డు వోయినగతి" - వివాహశుభకార్యం నూతన వధూవరులకేర్పడే ఒక పవిత్రబంధం. అది (ధర్మార్థకామాలు అనే) త్రివర్గఫల సాధనం. "ధర్మప్రజాసంపత్త్యర్థం స్త్రియముద్వహే" ఆపస్తంబసూత్రం. ధార్మిక సంతానం కలుగడంకోసం స్త్రీని పెండ్లాడుతానన్నదే వరుని సంకల్పం. "ప్రజాతంతుం మావ్యవచ్ఛేత్సీః" సంతానమనే దారాన్ని తెంపకు మని గుర్వనుశాసనం.

"అంతఃకరణ తత్త్వస్య దంపత్యోః స్నేహసంశ్రయాత్।
ఆనంద గ్రంథిరేకోఽయమపత్యమితి బధ్యతే" (ఉ.రా.చ.)

ఆలుమగల ప్రేమకు ఏకాశ్రయమూ, వారి మనస్సులను లాగి కలిపివేసే హర్షపు ముడియే సంతానం, అన్నాడు భవభూతి. కాబట్టి, సంతానవతి కావలసిన మగనాలు గొడ్రాలైతే నిష్ప్రయోజనం. అలాగే, భక్తి భరితుడు కావలసిన వేదపురాణాధ్యాయి భక్తిహీనుడైతే నిష్ప్రయోజనం.

2. "సస్యంబు దా ఫలకాలంబున నీచపోవుపగిది": - నారు పెట్టి నీరుపోసి, ఎరువు బాగా వేయడంవల్ల ఏపుగా ఎదిగిన పచ్చని వరిపైరు ఫలించే సమయాన పాలు వోయక తాలుగా మిగిలితే చేసిన కృషి అంతా వ్యర్థమే. అదే రీతిగా, జ్ఞానబోధ భక్తిగా ఫలించక పోతే చేసిన పరిశ్రమ నిరర్థకమే కదా!

"నాహం వేదైర్న తపసా న దానేన న చేజ్యయా!

శక్య ఏవం విధో ద్రష్టుం దృష్టవానసి మాం యథా"॥ (భ.గీ. - 11-53)

వేదాధ్యయనం కానీ, తపస్సు కానీ, దానం కానీ, యాగం కానీ ఎంత చేసినా, అర్జునా! నీవు నన్ను చూస్తున్నట్లుమాత్రం చూడడానికి యోగ్యుడు కాదు, అన్నాడు శ్రీకృష్ణభగవానుడు.

జ్ఞానమున్నా, భక్తి లేనివానికి భగవద్దర్శనం కలుగదు. జ్ఞానసహకృతమైన భక్తి ముక్తికి హేతువు.

**శా. స్నానంబుల్ నదులందుఁజేయుట గజస్నానంబుచందంబగున్**
**మౌనం బొప్ప జపించువేద మటవీమధ్యంబులో నేడ్పగున్**
**నానాహోమములెల్ల బూడిదలలోనవ్వేల్చు నెయ్యైచను**
**న్నీ నామోక్తియు నీ పదాబ్జరతియున్ లేకున్న నారాయణా॥ 62**

అర్థం: ఓ నారాయణా! నీ నామ+ఉక్తియు = నీనామోచ్చారణం; నీపద+అబ్జరతియున్ = నీపాదకమలాలయందు ఆసక్తికూడా; లేకున్న; నదులందు స్నానంబుల్ చేయుట; గజస్నానంబుచందంబు +అగున్ = ఏనుగుస్నానం చేసినట్లవుతుంది. మౌనంబు+ఒప్ప = ఎవరితో మాటాడకుండా ; జపించు వేదము = చేసేవేదాధ్యయనం; అటవీమధ్యంబులోన్ = అడవినడుమ; ఏడ్పు అగున్; నానాహోమములు ఎల్ల = పలుయాగాలన్నీ; బూడిదలలోనన్; వేల్చు = హోమముచేసే; నెయ్యి, ఐచనున్. వ్యర్థమగును అని భావం.

తా : ఓ నారాయణా! నీనామస్మరణమూ, నీపాదపద్మాలకు సేవజేసే వ్యగ్రతా లేకుండా గంగాగోదావరీలాంటి నదులందు స్నానం చేస్తే అది గజస్నానంలాగా నిష్ఫలమవుతుంది. వేదాలను వల్లెవేయడమూ అరణ్యరోదనమే అవుతుంది. యాగాలెన్నిచేసినా ఆప్రక్రియ బూడిదలో హోమంచేసిన నెయ్యిలాగా వ్యర్థమవుతుంది.

**వ్యాఖ్య: నారాయణ నామస్మరణతోనే సర్వకర్మలను ఆచరించేధర్మం వర్ణితం.** భగవత్ప్రీత్యర్థం చేసే కర్మలన్నీ స్నానంతో ఆరంభమవుతాయి. సర్వవర్ణాలవారికీ, ఆశ్రమాలవారికీ సాధారణమైన స్నాన విధి ఐదు (5) విధాలు.

"స్నానం హి పంచ పుణ్యాని కీర్తితాని మహర్షిభిః।

ఆగ్నేయం వారుణం బ్రాహ్మ్యం వాయవ్యం దివ్యమేవ చ"॥ (ధర్మశాస్త్రం)

1. ఆగ్నేయం : హోమ భస్మలేపనం చేసికోవడం.
2. బ్రాహ్మ్యం: మంత్రపూతమైన నీళ్ళను చల్లుకోవడం.
3. వాయవ్యం: గోధూళిని సోకించుకోవడం.
4. దివ్యం: ఎండలోనైనా, వానలోనైనా నిల్చియుండడం.
5. వారుణం: జలస్నానం.

జలస్నానం చేసే అవకాశం లేని అశక్తులకు ఆగ్నేయాదిస్నానవిధులు నాలుగు. శక్తిమంతులకే వారుణీ స్నానం విధిగా ఆచరణీయం. సూర్యోదయంకంటె ముందే స్నానం చేయడం ఆరోగ్యకరం. వర్చస్సు కలుగుతుంది.

గంగా యమునా కావేరీ లాంటి పుణ్యనదీజలాల్లో స్నానంచేస్తే శరీరానికి మాత్రం బాహ్యశుద్ధి ఏర్పడుతుంది. కాని ఆత్మశుద్ధి కలుగదు. తీర్థయాత్రచేసినామని గొప్ప చెప్పుకోవడానికి ఉపయోగపడుతుంది. కాబట్టి, నారాయణనామాన్ని స్మరిస్తూ స్నానం చేయడం వల్ల బాహ్యశుద్ధి, అంతఃశుద్ధి కలిగి సత్త్వగుణం పెరుగుతుంది.

"ధ్యాయే న్నారాయణం దేవం స్నానాదిషు చ కర్మసు।
బ్రహ్మలోకమవాప్నోతి న చేహావర్తతే పునః॥ (దక్షస్మృతి).

స్నానాదికర్మల నాచరిస్తున్నప్పుడు నారాయణున్ని ధ్యానించే వ్యక్తికి భగవత్ప్రాప్తి కలుగుతుంది. ఇక సాంసారికబాధయే ఉండదు.

యత్పృథివ్యాం రజస్వ మాంతరిక్షే విరోదసీ।
ఇమాంస్తదాపో వరుణః పునాత్వఘమర్షణః॥ (అఘమర్షణసూక్తం)

స్వర్గ మర్త్య పాతాళలోకాల్లో ఎన్నో జన్మలెత్తి ఏయే పాపాలు చేశామో, వాటినన్నింటిని పోగొట్టి జలాధి దేవతయైన వరుణ శబ్ద వాచ్యుడైన శ్రీమన్నారాయణుడు మమ్మ పరిశుద్ధులను చేయుగాక' అని ధ్యానిస్తూ జలస్నానం చేస్తే భగవంతుని అనుగ్రహం కలుగుతుందని వేదవాణి.

ఏనుగు గంభీరజలంలో స్నానమాడి గట్టెక్కిన తర్వాత తొండంతో దుమ్ము ధూళిని ఎత్తి తనదేహంమీద చిమ్ముకుంటుంది. కాబట్టి 'గజస్నానం' అంటే వ్యర్థమని అర్థం. రజోవృద్ధియేకాని సత్త్వవృద్ధి కాదు. నారాయణనామస్మరణ లేకుండా పుణ్యనదీజలాల్లో తీర్థమాడితే గజస్నానంలాగా నిష్ఫలమవుతుంది.

అడవిలో ఏడిస్తే విని, అనునయించి, ఆదరించే ఆప్తుడుండడు. కాబట్టి, 'అరణ్యరోదనం' అంటే 'నిష్ప్రయోజన' మని అర్థం. హృదయాన్ని పరమస్తిమితంగా పరంధాముని పాదారవిందాలయందు లగింపజేయక, ఆయననామాన్ని స్మరించక వేదాలను అధ్యయనం చేసినా వల్లెవేసినా అది అరణ్యరోదన మవుతుంది.

"య ద్వేదాదౌ స్వరః ప్రోక్తః వేదాంతే చ ప్రతిష్ఠితః" (శ్రుతి). వేదపఠనానికి ముందు 'హరిః ఓమ్' అని ఆరంభించాలి. పఠనానంతరం 'హరిః ఓమ్' అని ముగించాలి.

"సవిసర్గం హరిపదం ప్రణవాత్పూర్వమిష్యతే।
హరి పదే విసర్గస్య న సంధిః ప్రణవోత్తరే॥ " (శిక్షాప్రాతిశాఖ్య)

ఓంకారానికి ముందు విసర్గతో కూడిన హరిపదాన్ని ఉచ్చరించాలి. 'హరిః ఓమ్' అనే పదంలో విసర్గకు సంధిలేదు.

"వేదస్యోపక్రమే విద్వా నవసానేఽప్యతంద్రితః।
ఉచ్చరేత్ ప్రణవం బ్రహ్మ రక్షాయై ఛందసాం స్ఫుటమ్"॥ (శిక్షాప్రా.)

నారాయణుడు అధ్యయనంచేత సంతుష్టుడై ఫలాన్ని ప్రసాదించడంకోసం విద్వాంసుడు వేదాధ్యయనానికి ముందూ, తర్వాతనూ ప్రణవాన్ని స్ఫుటంగా ఉచ్చరించాలని 'కారిక' బోధిస్తుంది.

"న వేదయజ్ఞాధ్యయనై ర్నదానైర్న చ క్రియాభిర్నతపోభి రుగ్రైః" (భ.గీ)

యజ్ఞపురుషుడు, యజ్ఞభోక్త, ప్రభువైన నారాయణుని చరణకమల సంస్మరణరహితంగా జ్యోతిష్టోమాదిక్రతువులనెన్ని చేసినా, ఆప్రయత్నమంతా అగ్గిలోకాక, బుగ్గిలో పోసేనేతిధారలాగా నిరర్థకమేకదా!

సర్వకర్మసమారాధ్యుడైన నారాయణున్ని స్మరిస్తూ స్నానాది సమస్తకర్మల నాచరించడం శ్రేయస్కరం.

ఈ పద్యానికి మాతృక ముకుందమాలలోని శ్లోకం.

"ఆమ్నాయాభ్యసనాన్యరణ్యరుదితం వేదవ్రతాన్యన్వహమ్
మేదశ్ఛేదఫలాని పూర్తవిధయః సర్వే హుతం భస్మని।
తీర్థానామవగాహనాని చ గజస్నానం వినా యత్పద
ద్వంద్వాంభోరుహసంస్మృతిం విజయతే దేవస్స నారాయణః"॥ (26)

**మ. అలనీటం దగురొంపిపైఁ జిలికిన న్నానీటనే పాయు నా**
**యిల పాపంబులు దుర్భరత్వము మహాహేయంబునంబొందినన్।**
**బలువై జీవుని దొప్పఁదోగినవి యీ బాహ్యంబునం బాయునే**
**పొలియుంగాక భవత్సుపాదజలముంబ్రోక్షింప నారాయణా॥ 63.**

అర్థం: ఓ నారాయణా! అలనీటందగురొంపి = నీటిలో ఉండే ఆబురద; పైన్ చిల్కినన్ = మీదపడితే; ఆ నీటనే = ఆరొంపిగలనీటితోనే; పాయునా = పోతుందా? ఇల = ఈ సంసారంలో; పాపంబులు; దుర్భరత్వము = భరించరానివిగా; మహా హేయంబునన్

= గొప్పరోతగా; పొందినన్; బలువై = బలిసి; జీవుని; దొప్పఁదోగినవి = ఆవరించినవి. తలమున్కలైనవి; భవత్ సుపాదజలమున్ = నీ పావనమైన చరణతీర్థాన్ని; ప్రోక్షింప = చల్లినచో, పొలియున్ కాక = నశించునే తప్ప; ఈ బాహ్యంబునన్ = ఈ ప్రాకృతిక జలంతో; పాయునే = తొలగిపోవునా?

తా : ఓ నారాయణా! నీటిబురద, రొంపి మీద పడితే, ఆబురదనీటితోనే కడిగితే పోతుందా? ఈ బాహ్యశరీరంమీద పడిన రొంపి శుద్ధజలంతోనే క్షాళితమవుతుంది. అలాగే దుర్భరంగా బలసి, శరీరంలోపల ఉన్న జీవుణ్ని చెడగొట్టే మహాపాతకాలు, భగవత్పాదతీర్థాన్ని ప్రోక్షిస్తేనే నశిస్తాయి.

**వ్యాఖ్య : భగవత్పాదతీర్థప్రోక్షణవల్ల పాపాలు నశిస్తాయని వర్ణితం.**

పాపరాశి రొంపి లాంటిది. రొంపి మీద పడితే దేహమంతా కంపుగొట్టి భరించరానిదిగా ఉంటుంది. హేయమైన విషయవాసనతో బలిసిన పాతకాలు, కరణకళేబరాలను ఆధివ్యాధులకు గురిచేస్తాయి. జీవయాత్ర దుర్భరమవుతుంది.

"మేరు మందర తుల్యాని పాపాని వివిధాని చ।
కేశానాశ్రిత్య తిష్ఠంతి"

పర్వతాల్లాగా బలిసిన రకరకాల పాపాలు దేహధారి తలమీద వెంట్రుకల నాశ్రయించి ఉంటాయి. షోడశకర్మలలో (సగం) అష్టమకర్మ ఉపనయనం. "గర్భాష్టమేషూపనయీత" (ఆపస్తంబసూత్రం). జీవుడు గర్భంలో ప్రవేశించినప్పటినుంచి ఎనిమిదేండ్ల ప్రాయంలో అతనిని జ్ఞానార్జనకు యోగ్యునిగా చేసే సంస్కారమే ఉపనయనం.

జ్ఞానదృష్టి ఏర్పడడమే రెండవజన్మ - ద్విజన్మ - గా భావించింది. ధర్మశాస్త్రం. 'అన్నప్రాశన' కర్మతో జీవునికి రుచులు అధికమై, దేహంతోపాటు విషయవాసన పెరుగుతుంది. తత్ఫలితంగా అవహించిన పాతకాలనాశనంకోసం 'కేశఖండనం' (చౌలకర్మ) విధింపబడింది.

జ్ఞానప్రాప్తికి ప్రతిబంధకమైన పాపరాశిని నశింపజేసే క్షౌరకర్మను 'మంగళకర్మ' అన్నారు. కాబట్టి, అన్నప్రాశనం తర్వాత ఉపనయనంకంటె ముందు 'చౌలకర్మ' విధి విహితమై ఆచరింపబడుతున్నది. జ్ఞానగమ్యుడైన కేశవునిదర్శన, స్పర్శన,రూపాద్యర్చన చేయడానికి ముందు కేశవపనం (క్షౌరం) చేసుకోవడం శిష్టాచారం. వ్రతదీక్షకు, యజ్ఞదీక్షకు పూనుకొనే మాన్యులూ, సామాన్యులూ 'మంగళకర్మ' నాచరించడం పరిపాటి.

'కేశానాం వపనం నాస్తి నారీణాం వ్రతసత్రయోః।
మహాదోషేషు సర్వేషు ఛేదయే దంగుళద్వయమ్॥" (ఆచారకాండ)

సుమంగళులకు మాత్రం వ్రతాదులనాచరించడానికైననూ కేశవపనకర్మను శాస్త్రం విధించలేదు. సర్వదోషపరిహారార్థం వారికి రెండంగుళాల శిరోజాలను మాత్రం కత్తిరించివేయడం శాస్త్రవిహితం.

"విష్ణు పాదాబ్జసంభూతా గంగా త్రిపథగామినీ" - శ్రీవిష్ణుపాదకమలములయందు ఉద్గమించి స్వర్గమర్త్యపాతాళలోకాల్లోనూ ప్రవహిస్తున్న గంగయే ఈ జలమని భావిస్తూ "తీర్థరాజాయ నమః" అని స్మరిస్తూ ఆజలంతో శిరఃస్నానం చేయాలి. స్నానం దేవపూజకు యోగ్యతను కల్పిస్తుంది. దేహపరిశుద్ధి బాహ్యమైనది. కేశవ, నారాయణ, మాధవనామస్మరణం చేస్తూ మూడుసార్లు ఆచమనం చేసి - తీర్థం పుచ్చుకొని - గుండెను తడిపితే, అంతః (కరణ) శుద్ధి ఏర్పడుతుంది. ఉపలక్షణంగా చెప్పిన ప్రోక్షణకు అర్థమిదే. అగ్నిలాగా తేజస్విని చేసే ఈశుచిర్భూతప్రక్రియ నిత్యం కొనసాగాలి.

భగవత్పాదజలప్రోక్షణతో పాపాలు నశిస్తాయనే కవి అధ్యవసాయం శాస్త్రసమ్మతం.

**మ. తనచిత్తాబ్జము మీపదాబ్జములకుందాత్పర్యసద్భక్తి తం**
**తున బంధించిన బంధనంబుకతనం దుష్పాపపుంజంబులె**
**ల్లను విచ్ఛిన్నములై యడంగు మహిమోల్లాసాబ్ధియైనట్టి దా**
**సున కింపొందును మోక్షవైభవము దా సుశ్లోక నారాయణా॥ - 64**

అర్థం : సుశ్లోక = శోభనమైన కీర్తికలవాడా! ఓ నారాయణా! తన చిత్త +అబ్జము = తన మనస్సు అనే కమలాన్ని; మీ పద+అబ్జములకున్ = మీ చరణ సరోజాలకు; తాత్పర్య సత్ భక్తితంతున = ఆకమలాలనే పట్టుకొని ఉండే ఉత్తమ భక్తి అనే దారంచేత; బంధించిన బంధంబుకతనన్ = కట్టిన కట్టుకారణంగా; దుష్పాపపుంజంబులు ఎల్లను = చెడ్డపాపరాశులన్నీ; విచ్ఛిన్నములై అడంగు = తెగిపోయి నశిస్తాయి. మహిమ+ఉల్లాస+అబ్ధియైనట్టి = ప్రభావంతో సముద్రమంత సంతోషంగల; దాసునకు = భక్తునకు; మోక్షవైభవము = ముక్తి సంపద; ఇంపు, ఒందును = సుగమమగును.

తా : సుశ్లోక! ఓనారాయణా! మనస్సరోజాన్ని మీ చరణసరోజాలకు తగిలియుంచే పరమభక్తి అనే సూత్రంతో ముడివేసినముడివల్ల మహాపాతకాలన్నీ ఛిన్నాభిన్నాలై నశిస్తాయి. ఈ ప్రభావంచేత అత్యంతసంతుష్టాతరంగుడైన భక్తునికి ముక్త్యైశ్వర్యం సుగమమవుతుంది. పాపాలు అణగిపోయే మహిమచేత ఆనంద సముద్రమైన మోక్షవైభవం భక్తునికి - దాసునికి - చాలా ఇష్టమైనదని కూడా అన్వయించవచ్చును.

**వ్యాఖ్య: చిత్తానికీ భగవత్పాదాలకూ సంయోగమైతే ముక్త్యైశ్వర్యం లభిస్తుందని వర్ణితం.**

పువ్వును పువ్వులతో విడిపోకుండాచేయాలంటే మంచిదారంతో మనోహరంగా కట్టాలి. ఇది చిత్తాబ్జం. అవి పదాబ్జాలు.వీటిని భక్తిఅనే సూత్రంతో ఒక్కచోట బంధించాలి. అదే మోక్షవైభవం.

పద్మకోశప్రతీకాశమయింది హృదయం. ఆహృదయపుండరీకగత మైనదే మనస్సు. మనస్సు సముద్రంలాగా గంభీరమయింది. పర్వతం లాగా ఉన్నతమయింది.అద్రికంటె, అబ్ధికంటెనూ అధికుడు మనస్వి.

"తుంగత్వ మితరానాద్రౌ నేదం సింధావగాధతా।
అలంఘనీయతా హేతు రుభయం తన్మనస్విని॥" (శిశుపాలవధ - 2-48)

కాని మనస్సుకు చంచలత్వముంది. కాబట్టి మానవుని బంధమోక్షాలకు మనస్సే కారణం. విషయసంగమున్న మనస్సు సంసారబంధాన్ని కలిగిస్తుంది. విషయాలను వదలి భగవద్విషయాన్నే అవలంబించిన మనస్సు ముక్తిని కలిగిస్తుంది.

"మనఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః।
బంధాయ విషయాసంగి ముక్త్యై నిర్విషయం మనః॥"

మనస్సునే చూడలేని మనం భగవంతుణ్ని కంటితో చూడగలమా?

"న చక్షుషా పశ్యతి కశ్చ నైనం" అన్నట్లు భగవంతుణ్ని కంటితో ఎవ్వడూ చూడలేడు. అత్యంతసూక్ష్మమైన మనస్సు యోగయుక్తమైతే లౌకిక మనోవ్యాపారాలను నియమిస్తుంది. పరమాత్మనూ అనుభవింపజాలుతుంది.

"దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా సూక్ష్మయా సూక్ష్మదర్శిభిః" - అని శ్రుతి.

భగవంతుడు సుశ్లోకుడు "తస్య నామ మహద్యశః" (యాజ్ఞిక్యుపనిషత్తు). నిఖిలజగజ్జననాదిలీలత్వ, సర్వరక్షకత్వకీర్తి భగవంతునికే తప్ప మరొకరికి లేదుకదా! అట్టి మహాయశస్విని గ్రహించే అర్హత మనస్సుకు ఉంది.

"హృదా మనీషా మనసా ఽభిక్లప్తో య ఏనం విదురమృతాస్తే భవంతి".

"హృదితి భక్తిరుచ్యతే". భౌతిక వృత్తులను నిరోధించేధృతికలది 'మనీట్' అని భాష్యం. భక్తి, ధృతిగల మనస్సుమాత్రమే సర్వేశ్వరుణ్ణి గ్రహిస్తుందని తెలిసి అనుష్ఠించే యోగులు అజరామరులౌతారు. మోక్షాన్ని పొందుతారన్నది నారాయణోపనిషత్తు.

"సదా విశ్లేషభీరుత్వం పరమా భక్తిరుచ్యతే" భగవంతుని వియోగం కలుగుతుందేమో అని ఎల్లప్పుడు భయపడే చిత్తవృత్తిని సద్భక్తి లేదా పరమభక్తి అంటారు.

"మోక్షసాధనసామగ్ర్యాం భక్తి రేవ గరీయసీ" మోక్షసిద్ధికి ఉప యోగపడే

సకలసాధనాలలో భక్తియే శ్రేష్ఠమైన దన్నారు భగవత్పాదులు. కాబట్టి చిత్తాన్ని నారాయణచరణాలతో సంయోగపరచిన వెంటనే సకలపాపాలు డుల్లిపోతాయి. సద్భక్తిమహిమను పాటిస్తూ ఆనందజలధివిలోలవీచికలలో ఓలలాడే దాసుడు సాయుజ్యమనే మోక్షసామ్రాజ్యాన్ని అవశ్యంగా పొందుతాడు.

**మ. తనువుంజీవుఁడు నేకమైన పిదపన్ ధర్మక్రియారంభుఁడై**
**యనయంబున్మదిఁ దన్నెఱుంగక తుదిన్నామాయచే మగ్నుఁడై**
**తనుతత్త్వాదివియోగమైన పిదపం దానేర్చునే నీదు ద**
**ర్శన మింపారఁగ భక్తివైభవ మహాసంకాశ నారాయణా॥ 65**

అర్థం: భక్తివైభవ = భక్తిసంపదకలవాడా! మహాసంకాశ = చాలా దగ్గఱగా ఉండేవాడా! మహా+అసంకాశ = సమానుడులేని గొప్పవాడా!భక్తి వైభవ మహాసంకాశ = భక్తి సంపదచేత గొప్పగా ప్రకాశించే వాడా! ఓ నారాయణా! తనువున్ + శరీరం; జీవుడున్ = ఆత్మయు; ఏకమైన పిదపన్ = ఒక్కటైన తర్వాత; ధర్మక్రియా+ఆరంభుడై= ధర్మాలను ఆచరించడానికి యత్నించేవాడై; అనయంబున్ = ఎల్లప్పుడు; మది = మనస్సున; తన్ను = తనను; ఎఱుఁగక = తెలుసుకోలేక; తుదిన్ =చివరకు; ఆమాయచేభగవత్సంకల్పంవల్ల కలిగిన ప్రకృతి చేత; మగ్నుడై = భౌతిక విషయాలయందు మునిగిన వాడై; తను తత్త్వ+ఆది వియోగమైన పిదపన్ = దేహేంద్రియాదులచే విడిపోయిన పిమ్మట; తాన్ = ఆజీవుడు; నీదు దర్శనము; ఇంపారగ నేర్చునే = ఇష్టమున్నా పొందగలడా?

తా : భక్తివైభవ! మహాసంకాశ! నారాయణా! దేహం, ఆత్మ ఒక్కటైన తర్వాత ధర్మాచరణకు పూనుకొన్నవాడై అవశ్యంగా తనను తాను తెలుసుకోలేక ప్రకృతిలో మగ్నుడౌతాడు. దేహేంద్రియాలను సడలి విడిపోయిన తర్వాత ఆజీవుడు నీ దర్శనం చేసుకోగలడా!

**వ్యాఖ్య : ప్రాకృతికభోగపరవశునికి భగవద్దర్శనం దుర్లభమని కవి ఆశయం.**

భక్తి ఈశ్వరసంపద. "భక్త్యా త్వనన్యయా శక్యః" (భ.గీ) భక్తికి చిక్కిన క్రియ మరి దేనికి చిక్కడు, దొరకడు, "భక్తిక్రీతోజనార్దనః" భగవంతుడు భక్తికి అమ్ముడుపోతాడు.

"స్నేహపూర్వమనుధ్యానం భక్తి రిత్యభిధీయతే"ధ్యానం, ఉపాసనమొదలైన శబ్దాలచే వాచ్యమై, స్మృతిపరంపరారూపమైన జ్ఞానవిశేషమే భక్తి. భక్తివైభవంచేత భక్తునికి పరతంత్రుడౌతాడు భగవంతుడు.

మహాసంకాశుడు. 'సంకాశ' శబ్దానికి సమానం, సమీపం, బాగా ప్రకాశించడం అని నానార్థాలున్నాయి. భగవంతుడు అద్వితీయుడు. పదార్థాలన్నిటియందు అంతరాత్మగా సన్నిహితుడై వెలిగేవాడు.

ప్రకృతి, జీవుడు, పరమాత్మ, ఈమూడు నాశం లేనివి. జీవుడు ప్రకృతితోనూ పరమాత్మతోనూ ఉంటాడు. తనువంటే దేహం, భోగస్థానం. భోగోపకరణాలు ఇంద్రియాలు. భోగ్యాలు శబ్దాదివిషయాలు. తనువు, జీవుడు ఒక్కటవడమంటే ప్రకృతిబద్ధుడన్నమాట. "శరీరమాద్యం ఖలు ధర్మసాధనం" (కుమారసంభవం) అన్నట్లు ధర్మాచరణకు ప్రధానసాధనం శరీరం.

"మనసా వాచా హస్తాభ్యాం పద్భ్యాముదరేణ శిశ్నా" (శ్రుతి)

దేహంమీది వ్యామోహంవల్ల, మనస్సు, వాక్కు, చేతులు, కాళ్ళు, కడుపు, శిశ్నం ధర్మాధర్మకార్యాలను చేస్తుంటాయి. చివరిరెండింటికి - ఉదరానికి జిహ్వాచాపల్యం, శిశ్నానికి ఉపస్థచాపల్యం ఉంటుంది. ఈ రెండు రుచులు మెండై జీవుడు సంసారంలో పడరాని పాట్లు పడుతాడు.

విషయభోగలాలసుడైన జీవుడు తానెవడో తనను తెలుసుకోలేడు. తనకు దగ్గఱనే ఉన్న పరమాత్మనూ భక్తితో సేవింపలేడు. భోగస్థానమైన దేహమే ఆత్మ అనుకొంటాడు. ఇలా మాయా మగ్నుడై - ప్రకృతిబద్ధుడై చేసిన ధర్మాధర్మక్రియలు - పుణ్యాపాపకర్మలు - జన్మపరంపరకు కారణమవుతాయి. శరీరం జీర్ణమై, ఇంద్రియాలు శిథిలమైనప్పుడు జీవుడు కొట్టు మిట్టాడుతాడు. మరణించిన తర్వాత కొత్త చొక్కాను ధరించే రీతిగా జీవుడు మరొక దేహాన్ని ధరిస్తాడు. అంటే మరొక జన్మనెత్తునేకాని భగవత్సాక్షాత్కారాన్ని పొందలేడు కదా!

**మ. తనకున్ సాత్త్వికసంపదన్వితమహాదాసోహభావంబునన్**
**అనయంబున్మది నన్యదైవభజనం బారంగ దూలింపుచున్**
**జనితాహ్లాదముతోడ నీచరణముల్ సద్భక్తి పూజించి నిన్**
**గనుగొన్నంతనె కల్మషంబులడఁగుం గర్మఘ్న నారాయణా॥ -66**

అర్థం: ఓ కర్మఘ్న = కర్మలను నశింపజేయువాడా! ఓనారాయణా! అనయంబున్ = ఎల్లప్పుడు; సాత్త్విక -భావంబునన్! సాత్త్విక సంపత్+అన్విత = సత్త్వగుణసంపత్తుతో కూడిన; మహాదాసోహభావంబునన్ = దాసుడ ననే గొప్పతలంపుతో; మదిన్ = ఎదలో; అన్యదైవభజనంబు = ఇతరదేవతలను సేవించడాన్ని; ఆరంగ = పూర్తిగా; తూలింపుచున్ = తొలగించుచు; జనిత+ఆహ్లాదముతోడ = కలిగినసంతోషంతో; నీచరణముల్ = నీపాదాలను; సద్భక్తి పూజించి = స్థిరమైన భక్తితో అర్చించి; నిన్ కనుగొన్నంతనె; తనకున్ = జీవునికి; కల్మషంబులు = పాతకాలు; అడఁగున్ = నశించును.

తా : కర్మలను నశింపజేసే నారాయణా! సత్త్వగుణసంపన్నమైన 'దాసోఽహం' అనే గొప్పభావంతో సర్వదా మనస్సులో దేవతాంతరభజనను మానుకొంటూ

సంతోషంగా నీపాదాలను ఉత్తమభక్తితో పూజించి నీ సాక్షాత్కారం పొందగానే జీవునికి సకల పాపాలు నశిస్తాయి.

**వ్యాఖ్య : భగవంతునిసాక్షాత్కారమైన వ్యక్తి శుద్ధాత్ముడని కవిభావన.**

కర్మల నాచరించకుండా మానవుడు ఉండలేడు. ముఖ్యంగా దేహయాత్ర సాగదు. "న హి కశ్చిత్ క్షణమపి జాతు తిష్ఠత్యకర్మకృత్" (భ.గీ. 3-5)

"శరీరయాత్రాపి చ తే న ప్రసిద్ధ్యేదకర్మణః" (భ.గీ) అని భగవానుడే విశదపరచాడు.

సత్కర్మల నాచరించే వ్యక్తి స్వర్గసుఖాన్ని పొందుతాడు. దుష్కర్మల నాచరించేవాడు నరకయాతనను అనుభవిస్తాడు. పాపకర్మలు ఇనుప సంకెళ్ళైతే, పుణ్యకర్మలు బంగారు సంకెళ్ళు. ముక్తిని పొందడానికి ప్రతిబంధకాలు. పునర్జన్మకు హేతువులు. కర్మలఫలాన్ని ఆశించకుండా విధిగా కర్మలను ఆచరించి 'శ్రీకృష్ణార్పణమస్తు' అని అర్పిస్తే భగవంతుని అనుగ్రహం లభిస్తుంది. ఆకర్మలన్నీ వేయించిన విత్తనాల్లాగా మొలవక, ఫలమిచ్చేశక్తిని కోల్పోతాయి. కాబట్టి నారాయణుడు కర్మఘ్నుడు.

రజస్తమోగుణాలు కలవారు అహంభావం కలవారు. తానే గొప్పవాడనీ, ఇతరులు తనకంటె చాలా తక్కువ స్థాయి కలవారని అఖర్వగర్వంతో ప్రవర్తించడమే అహంకారి లక్షణంకదా! సత్త్వగుణసంపన్నులు చాలా నమ్రులై ప్రవర్తిస్తారు. భగవంతునికే కాక, భగవద్భక్తులకు కూడా సేవకుడనేనే క్రమమైన భావం కలగియుండడమే దాసోఽహం అనే వైష్ణవపరిభాషకు అర్థం.

మోక్షార్థులు నారాయణ మూర్తినే భజిస్తారు.ఇతరదేవతలను చిత్తగించరు.

"ముముక్షవో ఘోరరూపాన్ హిత్వా భూతపతీనథ।

నారాయణకళాఃశాంతా భజన్తి హ్యనసూయవః"॥ (భా.గ.1-2-26)

అన్నట్లు విష్ణుభక్తులకు వేరే దేవతలయందుగానీ ఆయాదేవతలను ఉపాసించే వారియందు గానీ అసూయాద్వేషాలుమాత్రం ఉండవు.

త్రికరణశుద్ధిగా శ్రీమన్నారాయణచరణారవిందాలను పూజిస్తుంటే జీవులకు భగవత్సాక్షాత్కారం కలుగుతుంది. సర్వపాపాలు నశించినందువల్ల పరిశుద్ధాత్ములై శాశ్వతానందాన్ని పొందుతారు.

**మ. పరికింపన్ హరిభక్తిభేషజునకున్ భవ్యంబుగా మీఁద మీ**
**చరణాంభోరుహదర్శనంబు గలదే సంప్రీతి నెట్లన్నఁదా**
**ధరలోఁ జోరుఁడుగన్నదుస్తర పరద్రవ్యంబుపై నాశలం**
**బొరయన్నేర్చునె దుర్లభంబగు గృపాంభోజాక్ష నారాయణా ॥ 67**

అర్థం : కృపా+అంభస్+జ+అక్ష = దయతోకూడిన కమలనయనా! ఓనారాయణా! పరికింపన్ = ఆలోచింపగా; హరిభక్తిభేషజునకున్ = భగవద్భక్తి అనే దంభంగల వ్యక్తికి; భవ్యంబుగా; యోగ్యంగా; మీద = ముందుజీవితంలో; మీచరణ+అంభస్+రుహ దర్శనంబు = మీపాదనీరేజాలను దర్శించడం; సంప్రీతిన్ = (మీ) కృపతో; కలదే = సంభవించునా? ఎట్లు అన్నన్; ధరలో = లోకంలో; చోరుడు = దొంగ; తాన్, కన్న = చూచినట్టి; దుస్తర పరద్రవ్యంబు పైన = దాటిపోలేని ఇతరుల ద్రవ్యం మీద, ఆశలన్ = (కలిగే) కోరికలతో; పొరయన్ నేర్చునె = పొందగలుగునా? దుర్లభంబు అగు = పొందశక్యం కాదు.

తా : కృపాపూర్ణకమలనయనా! ఓనారాయణా! హరిభక్తి అనే దంభం కల వ్యక్తికి జీవితంలో భగవద్దర్శనం కలుగదు. ఎట్లనగా, దొంగ పరద్రవ్యాన్ని చూచి ఆశపడితే దాన్ని పొందలేడు. అది దుర్లభమే.

**వ్యాఖ్య : కపటభక్తుడు కమలాక్షుణ్ని పొందలేడని వర్ణితం.**

నిజంగా భక్తిలేకున్నా లోకులు తనను హరిభక్తుడని నమ్మడానికి జప, తపో,వ్రత దానాదులను చేస్తూ లోకులను వంచించడం భక్తిభేషజం. అది దొంగభక్తి.

సూర్యకిరణాలశక్తిని హరించి వికసించే తామరపూవుల్లాంటి కన్నులు గల హరి, తనమీద చూసే ప్రేమ, భక్తి ఎలాంటిదో చూడకుండా ఉంటాడా? దయారసమొలికే హరి నరసిజనయనాలనే మోసగించే భక్తి భేషజునిమీద అవి కృపను కురిపిస్తాయా?

'హరి' అంటే విశ్వాన్ని హరించే హృదయంకలనారాయణుడే.

"కేశవః కేశిహా హరిః" (విష్ణు స.నా.) ఆయనమీద నిరతిశయప్రీతి కలిగి యుండడమే భక్తి. ఆ ప్రేమ, ఆభక్తి వేరేకోరికలను పొందడానికి సాధనంకారాదు. సద్బుద్ధితో నిరంతరం హరిని స్మరిస్తూ లోక కల్యాణంకోసం సత్కర్మలను ఆచరిస్తే, ఆయనను తెలుసుకోవడానికి, దర్శించడానికి ఉండే ప్రతిబంధకాలను అవ్యాజానుగ్రహంచేత తొలగించే హరి దయను, దర్శనాన్ని దాంభికప్రవృత్తిగల వ్యక్తి పొందగలడా? పొందలేడు.

సామాన్యంగా ఇందుకు దృష్టాంతాన్ని ప్రదర్శించాడు కవి.

లోకులు కష్టార్జితమైన ద్రవ్యాన్ని గది నుంచి దాటిపోకుండా, భద్రం గా నిక్షేపిస్తారు. పరధనానికి ఆశపడి దాన్ని అపహరించడానికి ప్రయత్నించే దొంగకు ఆధనం పట్టుబడదు సరికదా! తానే భటులకు పట్టుబడి చెరసాల పాలవుతాడు. చోరునికి పరద్రవ్యం ఎలా దుర్లభమో, అలాగే భక్తి భేషజునికి భగవద్దర్శనం దుర్లభమేకదా!

మ. పరమజ్ఞానవివేకపూరితమహాభవ్యాంతరాళంబునన్
పరగన్నీనిజనామమంత్ర మొనరన్ భక్తి న్ననుష్ఠింపుచున్
దురితాన్వేషణకాలభూతము వెసన్ దూలంగ వాకట్టువాఁ
డరుగున్ భవ్యపదంబునొందుటకునై యవ్యక్త నారాయణా॥ 68

అర్థం : అవ్యక్త = స్పష్టంగా కనబడనివాడా! ఓ నారాయణా! పరమ-నన్! పరమ = ఉత్కృష్టమైన;జ్ఞాన = జ్ఞానంచేత; వివేక = మంచిచెడులభేదపరిశీలనంచేత; పూరిత = నిండిన; మహాభవ్య+అంతరాళంబునన్ = గొప్పయోగ్యమైన హృదయమందు; పరగన్ = ప్రవర్తించేవిధంగా; నీనిజనామమంత్రము = నీస్వీయనామమంత్రాన్ని; ఒనరన్ = ఒప్పుగా; భక్తిన్, అనుష్ఠింపుచున్ = సంతత ప్రీతితో అనుసంధానంచేస్తూ; దురిత+అన్వేషణ కాల భూతము = పాపాలను వెదకే మృత్యువు; వెసన్ = వేగంగా; తూలంగ = పైన పడగా; వాకట్టువాఁడు = వాఙ్నియమంగల మౌని; భవ్యపదంబున్+ఒందుటకునై = భద్రమైన ముక్తిస్థానాన్ని పొందడానికి; అరుగున్ = వెళ్ళును.

తా : అవ్యక్తనారాయణా! పరమజ్ఞాన వివేకభరితమైన హృదయంలో నీ నామమంత్రాన్ని భక్తితో జపిస్తూ మరణించే మౌని పరమపదాన్నే పొందుతాడు.

**వ్యాఖ్య: ధ్యానమగ్నుడైన మౌనికి వైకుంఠప్రాప్తియే అని వర్ణన.**

"వాయుః సర్వగతో మహాన్" అన్నట్లు అంతటా వ్యాపించియున్న గాలివలె విశ్వవ్యాప్తుడైన భగవంతుడూ నయనగోచరుడు కాడు. కాబట్టి నారాయణుడు అవ్యక్తుడు.

"వేదాంతవాక్యార్థ జ్ఞానంకన్న భిన్నమైన అర్థం కలది జ్ఞానం. ధ్యానోపాసనాదిశబ్దవాచ్యమైనది, ప్రత్యక్షతాపన్నస్మృతి రూపమైనది, అహరహం అభ్యసించడం వల్ల వృద్ధి పొందేది, మరణం దాకా అనుష్ఠింపయోగ్యమైనది. మోక్షఫలసాధనమైనది జ్ఞానం" అని శ్రీభాష్యం (3-4-26) నిర్వచించింది.

'జాతిదుష్టం, ఆశ్రయదుష్టం, నిమిత్తదుష్టం' అనే త్రివిధదోషం లేని ఆహారాన్ని సేవించడం వల్ల రజస్తమస్సులడగిపోయి, సత్త్వగుణవృద్ధిచేత నిర్మలమైన మనస్సు బాగోగులను పరిశీలించడం వివేకం' అని "సర్వత్ర ప్రసిద్ధ్యధికరణం" బోధిస్తుంది.

వివేచనాశక్తివల్ల దేహం వేరు, ఆత్మవేరు అనీ, దేహం నశిస్తుంది. ఆత్మ శాశ్వతంగా ఉంటుందనీ తెలుస్తుంది.

"తస్మిన్ యదన్తస్తదన్వేష్టవ్యం. తద్వావ విజిజ్ఞాసితవ్యం". (ఛాం.ఉప.8-1-1-) పట్టణం మధ్యన రాజగృహమున్నట్లే శరీరంలో పరమాత్మకు ఆవాసభూతమైన దహరమనే హృదయ పుండరీకం ఉంది. ఆపుండరీక మధ్య భాగంలో పరంజ్యోతిగా

వెలిగే వేల్పును అన్వేషించాలి, ఉపాసించాలి. అర్థాత్, బహిర్ముఖంగా ఉన్న ఇంద్రియాల వ్యాపారాన్ని అణచివేసిన మనస్సుతో అంతర్ముఖుడై వాక్కును ధ్యేయమూర్తిమంత్రాన్ని జపించడానికి మాత్రమే నియమించి, భక్తితో ధ్యానించడమే పరమజ్ఞానం :

"పరాంతకాలే, పరిముచ్యంతి సర్వే" - (నారా.ఉప)

జ్ఞానులకుగానీ అజ్ఞానులకుగానీ మరణం తప్పదు. అజ్ఞానులు అవివేకంతో పాపకార్యాలకోసం ఆలోచిస్తారు. వాటికి తగిన సాధనాలకోసం అన్వేషిస్తారు. జ్ఞానులు వివేకంతో ఆప్రయాణాదనువర్తమానులు అంటే దేహాన్ని విడిచి జీవుడు వెళ్ళిపోయేవరకు భగవంతుణ్ణి ఉపాసిస్తుంటారు.

ప్రాణులు చేసిన పాపకర్మలను వెదికే మృత్యుదేవత యముడు. "గృహీత ఇవ కేశేషు మృత్యునా ధర్మమాచరేత్". ఆకాలభూతం ఎప్పుడు హఠాత్తుగా మీద తూలి, జుట్టు పట్టి ఈడుస్తుందో అని భావిస్తూ, మానవుడు సదా ధర్మం ఆచరిస్తునే ఉండాలి అన్నది 'హితోపదేశం'.

అజ్ఞాని దేహపతనానంతరం నరకానుభవాన్ని పొంది, తర్వాత ఆ లోకానికే వచ్చి మరొక దేహాన్ని ధరిస్తాడు. పరమజ్ఞానవివేకభరితుడైన వాఙ్నియమశీలుడు దేహం పతనం కాగానే చక్కగా పరమపదాన్ని - మోక్షస్థానాన్ని - పొందగలుగుతాడు.

**మ. పరిఘోరాంధకబోధకారణవిపత్సంసారమాలిన్యమున్**
**పరమానందసుబోధకారణ లసద్భస్మంబుపై నూఁది యా**
**నిరతజ్ఞానసుకాంతిదర్పణమున న్నిస్సంగుఁడై తన్నుదా**
**నరయంగాంచినవాఁడు నిన్నుఁ గనువాఁడబ్జాక్ష నారాయణా॥ 69.**

అర్థం: అప్+జ+అక్ష = నీరజ నయనా! ఓనారాయణా! ఘోర+అంధక, బోధకారణ విపత్ సంసార మాలిన్యమున్ = కటికచీకటివంటి అజ్ఞానం వల్ల కలిగిన కష్టాలతో కూడిన సంసారకల్మషాన్ని; పరమ+ఆనంద సుబోధకారణలసత్ భస్మంబు = పరమానందాన్ని కలిగించే జ్ఞానం వల్ల ప్రకాశిస్తున్న బూడిదను; పైన ఊది = మీద తొలగించి, ఆనిరతజ్ఞాన సుకాంతి దర్పణమునన్ = ఆ, సంగంలేని జ్ఞాన మనే స్వచ్ఛ కాంతి గల అద్దమందు; నిస్సంగుడై = నిర్లిప్తుడై; తన్ను తాన్ ; కాంచినవాడు = చూచినవాడు; అరయన్ = విచారించగా; నిన్నున్; కనువాడు = చూచేవాడవుతాడు.

తా : అబ్జాక్ష! నారాయణా! అజ్ఞానంవల్ల కలిగే సంసారమాలిన్యాన్ని, ఆనందాన్ని కలిగించే జ్ఞానంతో తొలగించుకొని నిస్సంగుడు ఆత్మసాక్షాత్కారాన్ని పొందుతాడు. మలినమైన అద్దంమీద బూడిద చల్లి తుడిచివేసినవాడు అద్దంలో తనను చూచుకోగలుగుతాడు.

స్వచ్ఛమైన దర్పణంలో తనను చూచుకొన్నవాడు తన పక్కకున్నవ్యక్తిని కూడా దర్పణంలోనే చూస్తాడు. కర్మసంగరహితుడైన జ్ఞాని ఆత్మసాక్షాత్కారాన్నీ, పరమాత్మసాక్షాత్కారాన్నీ పొందగలుగుతాడు.

**వ్యాఖ్య : ఆత్మసాక్షాత్కారం, పరమాత్మసాక్షాత్కారానికే హేతువని వర్ణితం.** అజ్ఞానాంధకారంవల్ల చేసిన కర్మలఫలమే ఆపదలు సంభవించడం. ఇది సహజమైన ప్రకృతి కల్మషం. ప్రారబ్ధకర్మకు వశులై మహాపురుషులు కూడా ఆధి వ్యాధులతో బాధపడుతారు. సత్పురుషుల సహవాసంవల్ల, హఠాత్తుగా వారిలో పరివర్తన కలుగుతుంది. ఉత్తమగురుబోధవల్ల జ్ఞానులవుతారు. అగ్ని కట్టెలను భస్మం చేసే రీతిగా, జ్ఞానం సర్వకర్మలను భస్మం చేస్తుంది. ఆపైన ఫలాపేక్షలేకుండా విధిగా కర్మనాచరించడమే నిష్కామకర్మ అవుతుంది. నీటిమీద తామరాకు లాగా, సంసారంలో ఉన్నా సంగరహితడవుతాడు.

"న కర్మణా లిప్యతే పాపకేన" - శ్రుతి.

"బ్రహ్మణ్యాధాయ కర్మాణి సంగం త్యక్త్వా కరోతి యః ।
లిప్యతే న స పాపేన పద్మపత్రమివాంభసా॥" (భ.గీ.5-10)

కర్మఫలాసక్తుడు గాక సర్వకర్మలను సర్వేశ్వరుని పైన ఆరోపించి, అంటే భగవదారాధనగా భావించి, వ్యవహరించే వ్యక్తి నీటిచేత తామరాకులాగా వాటిచే స్పృశింపబడడు.

"యద్యత్కర్మ కరోమి తత్తదఖిలం శంభో తవారాధనమ్" అన్నారు. శ్రీశంకరభగవత్పాదులు.

కర్తృత్వాభిమానమూ, కర్మఫలభోక్తృత్వాభిమానమూలేని కర్మిష్ఠి యొక్క జ్ఞానం స్వచ్ఛమైన అద్దంలాగా మెరుస్తుంది."యథాఽదర్శో మలేన చ" (భ.గీ.3-38)అన్నట్లు అద్దం స్నిగ్ధమైన దయినా దుమ్ము ధూళి పడి మలిన మవడం ప్రకృతిసిద్ధం. కర్మ కౌశలం కలవాడు అద్దంమీద పౌడరు చల్లి శుభ్రంగా తుడిచివేస్తే అద్దం నిగనిగలాడుతుంది. దానిలో బింబం ప్రతిఫలిస్తుంది కదా! అలాగే నైష్కర్మ్యసిద్ధిని పొందిన వ్యక్తియొక్క జ్ఞానం నైగనిగ్యం గల దర్పణం లాంటిది. అజ్ఞాన దర్పణమందు "మేను వేరు, నేను వేరు" గా ప్రతిభాసిస్తుంది. కాబట్టి నిస్సంగుడు, నిర్లిప్తుడు ఆత్మసాక్షాత్కారాన్ని పొందుతాడు. ఆత్మసాక్షాత్కారం పొందిన వ్యక్తికి పరమాత్మను దర్శించే భాగ్యం కలుగుతుంది.

"యత్ర నిర్లిప్తభావేన సంసారే వర్తతే గృహే।

ధర్మం చరతి నిష్కామః తత్రైవ రమతే హరిః॥" అన్నట్లు, సంసారంలో నిర్లిప్తుడైన నిష్కామకర్మానుష్ఠానపరుని హృదయం భగవన్మందిరమే అవుతుంది.

"సత్యాత్మ ప్రాణారామం మన ఆనందం" అనే ఉపనిషద్వాక్యం ఈ విషయాన్నే విశేషంగా వివరిస్తుంది.

**మ. పరుషాలాపము లాడనోడి మది నీపాపార్జనారంభుఁడై**
**నిరసించేరికిఁ గీడుసేయక మదిన్నిర్ముక్తకర్ముండునై**
**పరమానందనిషేధముల్ సమముగా భావించి వీక్షించు నా**
**పరమజ్ఞాని భవత్కృపంబొరయునో పద్మాక్ష నారాయణా॥ 70**

అర్థం : ఓ పద్మాక్ష = కనుదమ్ములుకలవాడా! నారాయణా! ఈ పాప+ఆర్జన+ఆరంభుడై = పాపకార్యాలకు యత్నించు వాడై; మదిన్ = మనసులో, నిరసించి = తిరస్కరించి; పరుష + ఆలాపములు = నిష్ఠురపుమాటలను; ఆడన్ ఓడి = పలుకలేనివాడై; ఏరికిన్; కీడుసేయక = ఎవ్వరికీ చెరుపు చేయక; మదిన్ = హృదయంలో; నిర్ముక్త కర్ముండునై = ఫలాపేక్షలేని కర్మలనాచరించువాడై; పరమ+ఆనంద, నిషేధముల్ = శ్రేష్ఠమైన, సంతోష విషాదాలను; సమముగా = సమానంగా; భావించి; వీక్షించు = చూచే; ఆపరమజ్ఞాని = ఆసమ్యక్‌జ్ఞానం కల వ్యక్తి; భవత్ కృపన్ = నీ దయను; పొరయున్ = పొందును.

తా : ఓ పద్మాక్ష ! నారాయణా! పాపకర్మలను ఆచరించడానికి యత్నించిన వ్యక్తి ఆలోచించి, ఎవరితోనైనా కఠినంగా మాటలాడడమూ, కీడుసేయడమూ మానుకొంటాడు. రాగద్వేషాలు లేకుండా కర్మలనాచరిస్తూ, సుఖదుఃఖాలను, సంతోషవిషాదాలను సమానంగా భావించే పరమజ్ఞాని నీ కృపకు పాత్రుడవుతాడు.

**వ్యాఖ్య : పరమజ్ఞాని భగవత్కృపకు పాత్రుడయ్యే విధానం వర్ణితం.**

మానవుడు స్త్రీ, పుత్ర, ధన, కీర్తి ప్రతిష్ఠలకోసం చేసే కార్యాలు ప్రేయోరూపమైనవి. ఆపాత రమణీయమై దుఃఖాంతంగా ఉండే ప్రాకృతభోగాలను అనుభవించడానికి తనశక్తిని దుర్వినియోగం చేస్తాడు. ఈ ప్రేయస్సాధనకర్మలన్నీ పునర్జన్మకు హేతువులు.

మరుజన్మకు బీజం కాకుండా, మోక్షసాధనకు ఉపయోగపడే కర్మ శ్రేయోరూపమైనది. తనకంటె పూర్వులైన పెద్దలు ఆచరించిన కార్యాలను చూచిగానీ, వైచక్షణ్యంతో కానీ ప్రేయశ్శ్రేయస్సుల భేదం తెలుసుకొంటాడు. ప్రేయఃకర్మలను నిరసిస్తాడు. శ్రేయోమార్గావలంబియై నియతకర్మలను అనుష్ఠిస్తాడు మానవుడు.

అసక్తోహ్యాచరన్ కర్మ పరమాప్నోతి పూరుషః"- (భ.గీ.3-19)

కర్మఫలమందు భోగ్యతాబుద్ధిలేకుండా, అనాసక్తుడై విహితకర్మలనాచరించే వ్యక్తి శాశ్వతానందాన్ని కలిగించే పరలోకాన్ని పొందుతాడు.

మాట మనిషిస్వభావాన్ని తెల్పుతుంది. వాక్పారుష్యం మనిషియొక్క

మనోమాలిన్యాన్ని సూచిస్తుంది. నలుగురితోకలిసి ఆడేమాట - మంతీ కూడా 'ప్రస్తావయజ్ఞ' మనబడుతుంది. దీనికి కావలసింది నోటి మంచితనమే. "సత్యం బ్రూయాత్, ప్రియం బ్రూయాత్" అన్నట్లు ఇతరులతో పరుషంగా మాటాడక, మనస్సులోనైనా పరులకు కీడుసేయ తలపెట్టక, సత్యమూ, ప్రియమూ ఆయిన మాటలతో మధురంగా సల్లాపంచేస్తాడు.

కర్మలు నాలుగువిధాలు:

1. విహితకర్మలు : వర్ణాలను, ఆశ్రమాలను బట్టి శాస్త్రం విధించిన కర్మలు. నిత్య, నైమిత్తిక కర్మలు, విహిత కర్మలు.
2. కామ్యకర్మలు: పశుకాముడు, స్వర్గకాముడు, స్వారాజ్యకాముడు చేసే కర్మలు.
3. ప్రాయశ్చిత్తకర్మలు: విహిత కర్మలనాచరింప నందువల్ల కలిగే, పాపాలను పోగొట్టే కర్మలు.
4. నిషిద్ధకర్మలు : ప్రాణిహింసను తలపెట్టిన 'అభిచార' కర్మలు.

"న హ వై సశరీరస్య సతః ప్రియాప్రియయోరపహతిరస్తి,
అశరీరంవా వసంతం న ప్రియాప్రియే స్పృశతః" (శ్రుతి)

మోక్షమందు బుద్ధిగల జ్ఞాని ప్రియా ప్రియ - కామ్యనిషిద్ధ - కర్మలచే కొట్టబడడు.

"త్యక్త్వా కర్మఫలాసంగం నిత్యతృప్తో నిరాశ్రయః
కర్మణ్యభిప్రవృత్తోఽపి నైవ కించిత్కరోతి సః॥ (భ.గీ.4-20)

కర్మఫలాభిసంధిరహితుడై ఎవరినీ ఆశ్రయింపక, తృప్తిగా నిత్యకృత్యాలను నిర్వహిస్తున్నా, అతడేమీ చేయనివాడే. ఆకర్మలవలన పుణ్యాపాపాలుండవు.

ఈ నిర్ముక్తకర్ముడు అయాచితంగా ప్రాప్తించిన సుఖదుఃఖాలు, మానావమానాలు. మణులు - మట్టి బెడ్డలు, ప్రియాప్రియాలు మొదలైన ద్వంద్వాలయందు సమబుద్ధితో వ్యవహరిస్తాడు.

"సమత్వ మారాధన మచ్యుతస్య" అన్నట్లు సంతోషవిషాదాలలోనూ సమబుద్ధితో వ్యవహరించే జ్ఞాననిష్ఠాపరుడు, సర్వకర్మలను భగవదారాధన దృష్టితో ఆచరిస్తాడు. తన యోగక్షేమాలను దైవాయత్తం చేస్తాడు. పద్మాక్షునికటాక్షాన్ని పొందుతాడు.

**మ. ఒరులం దన్ను నెఱుంగు నియ్యొఱుకయు న్నొప్పార నేకాంత మం**
**దరయంబైపడు నన్యభామినులపై నాకాంక్షదూరత్వమున్**
**మరణావస్థను నీదు నామములె సన్మానంబునందో(చుటల్**
**ధరలోనన్నివి దుర్లభంబులు సుధాధామాక్ష నారాయణా ॥ 71**

అర్థం : సుధాధామ + అక్ష = అమృతకిరణాల్లాంటి చల్లని చూపులు కలవాడా! (ముక్తిగేహనయనాలుకలవాడా! చల్లని, వేడి చూపులుకలవాడా!) ఓనారాయణా! ఒరులన్ = ఇతరులను; తన్నున్ = తనను; ఎఱుంగు = తెలిసికొనే; ఈ+ఎఱుకయున్ = ఈజ్ఞానం; ఒప్పారన్ = యోగ్యంగా; ఏక+అంతమందు = ఒకేనిశ్చయమందు; అరయన్ = విచారిస్తుండగా, పైపడున్ = (శరీరం) మీద పడునట్టి; అన్యభామినులపైన = పరకాంతలమీద; ఆకాంక్షదూరత్వమున్ = కోరిక లేకుండడం; మరణ+అవస్థను= చస్తున్నప్పుడూ; నీదు నామములె = నీగుణదీప్తులైన పేర్లే; సన్మానంబునన్ = గౌరవంగా శ్రద్ధతో; తోచుటల్ = స్మృతికిరావడం; ఇవి = ఈ ధర్మాలు; ధరలోనన్ = లోకమందు; దుర్లభంబులు = సులభమైనవి కావు.

తా : ఓ సుధాధామాక్ష ! నారాయణా! తానెవరు? పరులెవరు? అని విచారించే జ్ఞానమూ; పరకాంతలపైన వ్యామోహరాహిత్యమూ; దేహావసానదశలోని నామస్మరణా సక్తియూ లోకంలో దుర్లభాలు.

**వ్యాఖ్య : జ్ఞానిలక్షణాలను తెలిపే పద్యమిది.**

వ్యక్తి సంఘజీవి, సాంఘికధర్మాలననుసరించి, వైయక్తికజీవితాన్ని గడుపడం తనకూ, సంఘానికీ శ్రేయస్కరం. వ్యక్తిగతధర్మాలను పరిశీలించి, ఆదరంతో అవలంబించిన వ్యక్తి సమాజానికి ఆదర్శ పురుషుడవుతాడు. సమాజం ఆయనను మహాజ్ఞానిగా గౌరవిస్తుంది. జ్ఞానికి స్వ, పరభేదం ఉండదు. "ఆత్మవత్ సర్వభూతాని" సర్వప్రాణులను తనను వలె చూచుకొంటాడు. అందరియందు, దేహభేదాలను గణింపక, సమదృష్టికలిగి యుంటాడు.

"విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని।
శుని చైవ శ్వపాకే చ పండితాః సమదర్శినః ॥ (భ.గీ.5-18)

విద్య, వినయం - ఈరెండూ - కలిగిన బ్రాహ్మణుని యందూ, కుక్క మాంసం తినే వ్యక్తియందూ; గోవు, ఏనుగు, కుక్క, మొదలైన జంతువులందుకూడా జ్ఞానులు సమదృష్టి కలిగి ఉంటారు.

"ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి" - (భ.గీ.6-32)

పరులకష్టాలను గానీ, సుఖాలను గానీ తనవిగానే భావిస్తూ, ఇతరులు తనపట్ల ఎట్లు ప్రవర్తించాలని కోరుతాడో, అట్లే తాను ఇతరుల పట్ల ప్రవర్తించడం "ఆత్మౌపమ్యం". విశ్వమానవసామ్రాజ్యానికి ఆత్మౌపమ్యమే అత్యావశ్యకం.

ఆత్మతత్త్వమెరిగి అన్ని సముని - శ్రీమంతుని - నారాయణుని స్వరూపాలే అన్న అధ్యవసాయం కలిగిన జ్ఞానులనే 'ఏకాంతులు' అని వ్యవహరిస్తుంది లోకం. స్వపరభేదం లఘుబుద్ధులకు ఉంటుంది.

స్వ, పర భేదం లేని జ్ఞానం కలవారు వ్యవహారదశలోనూ సమవర్తనులై ఉంటారా? అనే ప్రశ్నకు ద్వితీయచరణమే సమాధానం.

ప్రకృతిలో జాతి, గుణ, ద్రవ్య, క్రియా రూపాలయందెక్కడనూ సమానత్వం కనబడదు. ఏకోదరులలోనూ ఏ ఇద్దరి రూపాలు ఒక్క రీతిగా ఉండవు. అందుకే 'సమత' భావానికే పరిమితం.

సమతాభావం లేని అజ్ఞానులు, కామాంధులై స్త్రీల విషయంలో స్వకీయ పరకీయ భేదం లేకుండా, స్వైరవిహారం చేస్తుంటారు. కామాంధులు ప్రకృతికృపణులుకదా!

"సంసారోఽయమతీవ విచిత్రః" (శంకరభగవత్పాదులశ్రీసూక్తి).

భార్యాపుత్రాదిబంధాలతో కూడి అతివిచిత్రమైన ఈ సంసారంలో ఉన్న మానవునికే తత్త్వచింతన, నిత్యానిత్యవివేచన అత్యావశ్యకం. గర్భంలో ఉండడం, పుట్టడం, పెరుగడం, మారడం, క్షీణించడం, నశించడం - అనే షడ్భావవికారాలు దేహధర్మాలే కాని ఆత్మధర్మాలు కావు. ప్రకృతి సహజపరిణామంవల్ల సంక్రమించే - కాలక్రమేణ శరీరానికి బాల్య, కౌమార, యౌవన, వార్ధక్యాలు అనే - మార్పులు కలుగుతుంటే, మానవుని ప్రవర్తనకూడా వాటికి అనుగుణంగా సాగుతుంటుంది.

"యౌవనే విషయైషిణామ్" కవికుల గురువన్నట్లు యువకుడైన వ్యక్తి గృహస్థాశ్రమాన్ని స్వీకరించడమే ధర్మం. 'చతుర్ణామాశ్రమాణాం తు గార్హస్థ్యం శ్రేష్ఠ్యముచ్యతే" (రామాయణం).

బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ, సంన్యాస మనే నాలుగాశ్రమాలలో ద్వితీయాశ్రమం అద్వితీయమైనదని శాస్త్రం బోధిస్తుంది.

వరుడు తన వృత్తిప్రవృత్తులకు అనుకూలవతియైన వధువుగళసీమలో మంగళసూత్రంకట్టి మూడుముళ్ళువేసి, నవోఢగా, సుమంగళిగా, గృహలక్ష్మిగా పాణిగ్రహణం చేసే శుభముహూర్తంలో ఆనూతనదంపతులకు కలిగే ఆనందం 'న భూతో న భవిష్యతి'.

వ్యక్తులు విషయాలకు బలికాకుండా, సమాజం క్రమపద్ధతిలో నడవడానికీ, నిత్యనైమిత్తిక కామ్యవ్రతాచరణానికీ, కులదీపకమైన సత్సంతానాన్ని పొంది పితౄణం తీర్చుకోవడానికీ, స్వధర్మపరాయణులైన ఇతరాశ్రమస్థులకూ, తైర్థికులకూ ఆతిథ్యమిచ్చి యథోచితంగా సహకరించడానికీ ఏర్పడిన భార్యాభర్తృసంబంధం, సాంఘికంగానూ, ధార్మికంగానూ ఎంతో పవిత్రమైనది కదా!

"ఋతావృతౌ స్వదారేషు సంగతిర్యా విధానతః।
బ్రహ్మచర్యం తదేవోక్తం గృహస్థాశ్రమవాసినామ్॥" (విజ్ఞానేశ్వరీయం)

'సంతానార్థమై ఋతుకాలంలో నియమితశుభరాత్రియందు తన భార్యతో సంగమించే గృహస్థధర్మం బ్రహ్మచర్యమే' అని యాజ్ఞవల్క్యస్మృతి కూడా బోధిస్తుంది. అందుకే-

"ధర్మావిరుద్ధో భూతేషు కామో ఽస్మి భరతర్షభ" - (భ.గీ.7-11)

ధర్మానికి విరుద్ధంగాలేని కామపురుషార్థాన్ని తానే అని భగవద్వాక్యం. కాబట్టి భార్యాభర్తల విషయాన్ని విషమయం చేసే పరదారాభిగమనాన్ని శాస్త్రం దూషిస్తుంది. సంఘం శిక్షిస్తుంది.

కామపురుషార్థాన్ని దుర్వినియోగం చేస్తే జ్ఞానవిజ్ఞానాలు నాశనమవుతాయి. అది ఆసురికం అవుతుంది. దాన్ని సద్వినియోగంచేస్తే దైవిక మవుతుంది.

ఒంటరిగా ఉన్నాడని వలచి వచ్చి కౌగిలించుకొనే పరకాంతను మనస్సులో నైనా కోరక, విదలించుకొనే బుద్ధికలవాడు "లేఁడు ప్రవరాఖ్యుఁడు దక్క మరొక్కఁడెక్కడన్" పెద్దపులియైనా నారాయణస్వరూపమే, అని దూరంనుంచే నమస్కరించేవాడు జ్ఞానయోగి.

"యా ప్రీతి రవివేకానాం విషయేష్వనపాయినీ।

త్వామనుస్మరతః సా మే హృదయాన్మాపసర్పతు॥ (భాగవతం.)

అవివేకులకు విషయాలయందెంతటి తీవ్రమైన ఆసక్తి ఉంటుందో,

అంతటి ఆసక్తి నిన్ను స్మరించే నా హృదయంనుంచి తొలగకుండా చేయవయ్యా, సుధాధామాక్షా! అని ప్రార్థించే వాడు జ్ఞానయోగి.

దేహాత్మవిచారంలేని అజ్ఞానులు మృత్యువంటే భయపడుతారు.

"కృతకృత్యాః ప్రతీక్షంతే మృత్యుం ప్రియమివాతిథిమ్" అన్నట్లు జ్ఞానులు మాత్రం, ఆత్మబంధువుకోసం ఎదురు చూస్తున్నట్లే, మరణంకోసం సంతోషంగా ఎదురుచూస్తుంటారు.

బంగారాన్ని వన్నె - వాసి (చూడడానికి) చూపించడానికి గీటు రాయి మీద పదే పదే రాపిడి చేసేవాడు లాభపడుతాడు. అలాగే, భగవన్నామాన్ని జన్మలో నాలుకకు అభ్యాసం చేయిస్తే, అది జరామరణావస్థలోనూ ఆనామాన్నే స్మరించడం వల్ల జన్మ సఫలమవుతుంది.

"మరణదశలో నన్నే స్మరిస్తూ దేహాన్ని విడిచే వ్యక్తి నాస్థితినే నిస్సంశయంగా పొందుతా" డన్నాడు శ్రీభగవానుడు. (భ.గీ.8-5)

స్వపరజ్ఞానం, పరకాంతానపేక్ష, మరణమాసన్నమైనప్పుడు భగవన్నామస్మరణ, ఇవి జ్ఞాన యోగులకే తప్ప అనితరసాధారణవిషయాలు కదా!

"చంద్ర సూర్యౌ చ నేత్రే" అన్నట్లు నారాయణునినయనాలు చంద్రసూర్యులు. శీతోష్ణాలను సమానంగా సహించే, వహించే దృష్టి కలవాడు నారాయణుడు. 'సుధాధామాక్ష' సంబోధన, ఈ పద్యభావాన్ని ఆవరిస్తున్నది.

**మ. వెరవొప్పన్ బహుశాస్త్రమంత్రములొగి న్వీక్షించి వేతెల్పి మీ**
**వరనామామృతపూరమానుచుఁదగన్ వైరాగ్యభావంబునన్**
**సరినశ్రాంతముఁగోరువారు పిదపన్ సంసారమాతుఃపయో**
**ధరదుగ్ధంబులు గ్రోల నేరరు వెసన్ దైత్యారి నారాయణా॥ 72**

అర్థము: ఓ దైత్య+అరి = ఓరాక్షసాంతకా! నారాయణా! వెరవు, ఒప్పన్ = ఉపాయంగా; బహుశాస్త్రమంత్రముల్; ఒగిన్ = క్రమంగా; వీక్షించి = బాగా చూచి; వే = వెంటనే; తెల్పి; మీ, వరనామ+అమృత పూరము = మీ పావననామమనే అమృతప్రవాహాన్ని; ఆనుచు = పానంచేస్తూ; తగన్ = యోగ్యంగా; వైరాగ్యభావంబునన్ = రాగ ద్వేషాలు లేని మనస్సుతో; అశ్రాంతమున్ = ఎల్లప్పుడు; సరిని = అవసానాన్ని; కోరువారు; పిదపన్ = మరణానంతరం; సంసారమాతుః+పయస్+ధర, దుగ్ధంబులు = ప్రపంచంలో తల్లి చనుపాలను; వెసన్ = శీఘ్రంగా; క్రోల నేరరు = త్రాగలేరు..

తా : ఓ రాక్షసవైరి! నారాయణా! అనేక శాస్త్రమంత్రాలను శ్రద్ధతో క్రమంగా సాధించి, ఇతరులకు తెల్పి, శ్రేష్ఠమైన మీనామామృతాన్ని పానం చేసి, యోగ్యంగా రాగద్వేషాలు లేని మనస్సుతో జీవితాంతాన్ని సతతంకోరే వారు, మరణానంతరం సంసారంలో తల్లిపాలను త్రాగ లేరు. పునర్జన్మను పొందరని తాత్పర్యం.

**వ్యాఖ్య: వైరాగ్యభావం కలవారికి పునర్జన్మ ఉండదనే పద్యమిది.**

మానవుడు చిన్నతనాననే అహంకారాభిమానాలను వదలుకొని, తనసందేహాలను నివారించగలసర్వజ్ఞుడనే దృఢవిశ్వాసం కలిగి, వినయంతో గురువుదగ్గరికి వెళ్ళి, పాదాభివందనం చేయాలి. తన కోరికను విన్నవించాలి.

"సంవత్సరం తదర్ధం వా మాసత్రయమథాఽపి వా।
పరీక్ష్య వివిధోపాయైః కృపయా నిఃస్పృహో వదేత్॥"

గురువు మూడుమాసాలో, ఆరుమాసాలో, ఒక్క సంవత్సరమో అంతేవాసికి గలశ్రద్ధను పరీక్షిస్తుంటే, ఆపరీక్షోపాయాలకు తగినట్లు సహనంతో ప్రవర్తించాలి. గురువు విద్యార్థులందరికి ఒక్కరీతిగనే విద్యను బోధిస్తాడు. వారిలో ప్రజ్ఞామేధాశక్తులు రెండూ ఉన్నవాడే నేర్పరి అవుతాడు. నేర్పినదాన్ని గ్రహించేశక్తియే కాక గ్రహించిన దాన్ని, ధారణచేసే శక్తి కూడా ఉండడం సత్పాత్రలక్షణం.

"పాత్రవిశేషే న్యస్తం గుణాంతరం వ్రజతి శిల్పమ్" (మాళవికా - 1-6)

స్వాతి చినుకు చిప్పలో పడి ముత్యమైనట్లు, గురువు యోగ్యునికి చెప్పిన విద్య విశేషగుణాన్ని పొంది భాసిస్తుందని కాళిదాసమహాకవిసూక్తి. ఉపదిష్టుడైన ఛాత్రుడు మంత్రాన్ని పునః పునరనుశీలనం చేయాలి. ఈ ప్రక్రియనే అభ్యాసమంటారు.అనేక శాస్త్రాలను పరిశీలించాలి. వాటిలోని సంశయం, పూర్వపక్షం, సిద్ధాన్తం అనే చర్చల వల్ల అనేక విషయాలు అవగాహన మవుతాయి. ఇది పీక్షణక్రమం.

బోధకు విషయం విద్య. శాస్త్రజన్యమైనది జ్ఞానం. అనుభవవిషయం విజ్ఞానం. తత్ఫలితంగా ప్రాపంచికవిషయాలపట్ల ఏహ్యభావం కలుగుతుంది. సుఖానికి పొంగక, దుఃఖానికి క్రుంగక, మనస్సును నిగ్రహించే సామర్థ్యం ఏర్పడుతుంది. తాను అనుభూతజ్ఞానమార్గంలో ప్రవర్తిస్తుంటే, తన నడవడిని లోకం సంగ్రహిస్తుంది. తనకు తెలిసిన విషయాన్ని చెప్పకయే, తన ఆచరణద్వారా లోకానికి తెల్పినవాడవుతాడు.

జ్ఞానానికి చరమసీమ భగవన్నామసంస్మరణమే. రాగద్వేషాలు అణగారిన పరిశుద్ధమనస్సు బహిర్ముఖంగా పరుగెత్తక అంతర్ముఖంగా మరలడమే వైరాగ్యభావం.

"అభ్యాసవైరాగ్యాభ్యాం తన్నిరోధః" (పతంజలి)

"అభ్యాసేన తు కౌంతేయ వైరాగ్యేణ తు గృహ్యతే" (భ.గీ.6-35)

అభ్యాసవైరాగ్యాలవల్లనే చంచలమైన మనస్సునిగ్రహింపబడుతుంది.

"వైరాగ్యబోధౌ పురుషస్య పక్షివత్" (వివేకచూడామణి) గగనాన విహరించడంకోసం పక్షికి రెండు రెక్కలాధారాలైనట్లు, ముక్తి సౌధాన్ని అధిరోహించడంకోసం వ్యక్తికి జ్ఞాన వైరాగ్యాలు రెండు ఆధారాలన్నారు శ్రీ శంకరాచార్యులు.

కాబట్టి వైరాగ్యభావంతోనే తనదేహయాత్ర సరి-ముగిసి-పోవాలని కోరే వ్యక్తికి తన జననపదవీజాంఘికత్వం శాశ్వతంగా వదలిపోతుంది. భావగతమైనదే భాగవతధర్మం కదా!

**శా. వేదంబందు సునిశ్చయుండగు మహావేల్పెవ్వఁడో యంచు నా**
**వేదవ్యాసపరాశరుల్ వెదకిన న్వేఁటొండు లేఁడంచు మీ**
**పాదాంభోజము లెల్ల ప్రొద్దు మదిలో భావింతురత్యున్నతిన్**
**శ్రీదేవీవదనారవిందమధుపా శ్రీరంగ నారాయణా॥ 73**

అర్థం : శ్రీదేవీ వదన+అరవింద మధుపా = లక్ష్మీదేవిముఖమనేకమల మందలి మకరందాన్ని పానంచేసే భృంగమా! శ్రీరంగా! ఓనారాయణా! ఆవేదవ్యాసపరాశరుల్ = ప్రసిద్ధులైన కృష్ణద్వైపాయనుఁడు, ఆయన తండ్రియైన పరాశరమహర్షి; వేదంబందు = వేదమందు; సునిశ్చయుండగు = ప్రతిపాద్యుడైన; మహావేల్పు = (మిశ్రసమాసపదమిది) గొప్పదేవుడు; ఎవ్వఁడో; అంచు; వెదకినన్ = పరిశోధించిన తర్వాత; వేఱు+ఒండు =

మరొకడు; లేడు; అంచు; మీపాద+అంభోజములు = కమలాలవంటి మీపాదాలను; మదిలో = హృదయంలో; ఎల్ల ప్రొద్దు = సర్వకాలాల్లో; అతి+ఉన్నతిన్ = మిక్కిలి భక్తితో; భావింతురు = ధ్యానింతురు.

తా : శ్రీదేవీ ముఖపద్మచంచరీకా! శ్రీరంగా! వేదప్రతిపాద్యుడైన మహాదేవుడెవ్వడో అని పరాశర పారాశర్యులు వేదమందు అన్వేషించిన పిమ్మట మరొకడు లేడని ఓ నారాయణా! మీ చరణారవిందాలనే తమడెందంలో నిత్యం మహోన్నతంగా ధ్యానిస్తుంటారు.

**వ్యాఖ్య : నారాయణుడే గొప్పదేవుడని ఋషులు ధ్యానించే వర్ణన.**

శ్రీదేవికి పర్యాయపదాలు లక్ష్మీదేవి, పద్మాదేవి. "లక్ష్మీః పద్మాలయా పద్మా కమలా శ్రీః" (అమరకోశం). పద్మయొక్కముఖం కూడా పద్మమే, అంటే, తామరపూవు.

"తామరలన్న నీవలపుదారికి దారియు తెన్ను లేదు, పొం
దామర యామెమోము, తెలిదామర యాయమకన్నుదోయి, చెం
దామర యామెకేలుగవ, తామరలన్ మఱలన్ జయించుకాం
తామరవాహినీ వికచతామరసంబులు నామెకన్‌జిగుల్॥"
(కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ)

తామరపూరేకులలోని మకరందాన్ని పానంచేసేది తుమ్మెద లేదా తేనెటీగ. ఇందిందిరం లాగే, ఇందిర మొగంలో ఉన్న సొగసుల మిసిమినంతా ఆస్వాదించే వాడు నారాయణుడు.

శ్రీరంగ = శ్రీరంగనగరమందు వెలసిన దేవా! పరమపదవాసం వలన కలుగదగిన పరమాత్మరతిని - బ్రహ్మానందాన్ని కలిగించేది 'రంగం' "రతింగతో హరిస్తస్మాద్రంగ మిత్యభిధీయతే". సామాజికులందరు ఎంతో ఆసక్తిని పొందుతారు కాబట్టి 'రంగం' "రజ్యంతేఽస్మిన్ సర్వే సామాజికాః ఇతి రంగం" ఈ రెండు వ్యుత్పత్తులను రంగశబ్దానికి చెప్పవచ్చు.

శ్రీరంగ మనేది విమానం. అది ప్రణవాత్మకం. ప్రణవంలోని అకారంచేత భగవంతుడు, ఉకారంచేత లక్ష్మీదేవి, మకారంచేత జీవుడు సూచింపబడినట్లే శ్రీరంగ విమానంలో భగవంతుడైన శ్రీరంగనాథుడు, లక్ష్మీదేవి. జీవసంఘాతాత్మకమైన కౌస్తుభరత్నం ఉండడంవల్ల ప్రణవాకారమైనది శ్రీరంగవిమానం.

రంగశబ్దం నాటకరంగాన్ని సూచిస్తుంది. మహానటుడు రంగనాయకుడు.

"దేవో నః శుభమాతనోతు దశథా నిర్వర్తయన్ భూమికాం
రంగే ధామని లబ్దనిర్భరరసైరధ్యక్షితో భావుకైః" (దశావతారస్తోత్రం)
అని శ్రీవేదాంతదేశికులు స్తుతించారు.

ఊరు, పేరు, మందిరం - మూడింటినీ శ్రీరంగ శబ్దం తెల్పుతుంది. శ్రీరంగ విమానంతోపాటు శ్రీరంగనాథుడు శ్రీరంగక్షేత్రంలో వెలసినాడని పురాణప్రసిద్ధం.

వ్యాసమహర్షి "ప్రాంశుడు, పయోదనీలతనుభాసితుడు, ఆగమపుంజపదార్థ తత్త్వనిస్సంశయకారుడు, భారతీవంశవివర్ధనుడు, త్రిదశవందితుడు. ఈ సాత్యవతేయునిజన్మకు కారణభూతుడు పరాశరమహర్షి. "పరాన్ శృణాతీతి పరాశరః"

ఈ తండ్రికొడుకు లిద్దరు, హరిహర హిరణ్య గర్భులనే త్రిమూర్తులలో గొప్ప దేవతామూర్తి ఎవరో కదా! అని వేదాలను పరిశీలించారు. వేదాలన్నీ పరతత్త్వాన్ని ప్రతిపాదిస్తాయి.

"సర్వే వేదా యత్పద మామనంతి"(కఠోపనిషత్).

ఇంద్రియాలు దైవిక విషయాలను పట్టించుకోవు. అనుమానాది శాస్త్రప్రమాణాలు యథార్థాన్ని తెల్పవు. వేదాలే పరబ్రహ్మను ప్రకటిస్తాయి.

"నేంద్రియాణి, నానుమానం, వేదా హ్యేవైనం వేదయన్తి".

"ప్రత్యక్షాగమ మాహాత్మ్యాత్ అనుమానం ప్రమాణతామ్।
యాతి నైవాన్యథా తస్య నియతత్వం క్వచిద్భవేత్"॥

"న చానుమానాదీనామాగమం వినా ప్రామాణ్యం ధర్మాదిషు తదగోచరత్వాత్" (విష్ణుతత్త్వనిర్ణయం).

ప్రత్యక్షప్రమాణంవల్ల (కంటితో స్పష్టంగా ఒకసారి చూచినందున) అనుమానం ప్రమాణమవుతుంది. కేవలం ఊహాజనితమైతే అనుమానానికి గౌరవముండదు. కాబట్టి ధర్మాధర్మవిషయాలు వేదప్రమాణం లేకుండా, కేవలం శాస్త్రప్రమాణాలవల్ల గోచరించవు.

"నారాయణః పరబ్రహ్మ తత్త్వం నారాయణః పరః"

"బృహత్తే విష్ణోస్సు మతిం భజామహే".

"తద్విప్రాసో విపన్యవో జాగృవాంసః సమింధతే విష్ణోర్యత్పరమం పదం"

"సర్వభూతస్థ మేకం నారాయణం, కారణరూపమకారపరబ్రహ్మోమ్".

"యద్వేదాదౌ స్వరః ప్రోక్తో వేదాన్తే చ ప్రతిష్ఠితః।
తస్య ప్రకృతిలీనస్య యః పరః స మహేశ్వరః"॥

వైకుంఠవాసుడు, సకలదేవతలచే స్తవనీయుడు, విశ్వవ్యాపి, జగత్కారణభూతుడు, ప్రకృతికంటె పరుడైన జీవునికంటె పరుడైన నారాయణుడే ఓంకార వాచ్యుడైన పరబ్రహ్మ, అని శ్రుతిశతవాక్యాలు ప్రతిపాదిస్తున్నాయి.

పరులు అంటే వేదబాహ్యులను ప్రమాణాలనే రంపాలతో హింసించేవాడు. 'పరాశరుడు' అన్వర్థనామధేయుడు. చిదచిదీశ్వరతత్త్వాలను బోధించే 'పురాణరత్నం' అని ప్రసిద్ధిపొందిన 'విష్ణుపురాణాన్ని' లోకానికి అనుగ్రహించినమహర్షి పరాశరుడు.

"ఆలోడ్య సర్వశాస్త్రాణి విచార్య చ పునః పునః

ఇదమేకం సునిష్పన్నం ధ్యేయో నారాయణః సదా॥" (భారతం).

వేదాలను వింగడించి, ఉపనిషత్తులను పరిశీలించి, భగవద్గీతను విని, బ్రహ్మసూత్రాలను సమకూర్చి, పురాణాలను రచించి, ఎన్ని విధాల తరచి తరచి చూచినా పరతత్త్వంగా కనబడుతున్న నారాయణుడే ధ్యానింప దగినవాడు' అని వేదవ్యాసమహర్షి లోకాన చాటినాడు. "న తత్సమశ్చాభ్యధికశ్చ దృశ్యతే" (శ్రుతి).

"సంచింతయేత్ భగవతశ్చరణారవిందం

వజ్రాంకుశధ్వజసరోరుహలాంఛనాఢ్యమ్" (భాగవతం-3-28)

నారాయణునికన్న మించిన దేవుడు మరొకడు లేడని నిర్ణయించి, ఆదేవదేవుని పాదపద్మాలనే ఎదలో పదిలపరచుకొని, సర్వకాల సర్వావస్థలయందు భజించే భాగధేయులు వేదవ్యాస, పరాశరమహర్షులు.

**మ సుతదారాప్తజనాది విత్తములపై శూన్యాభిలాషుండు నై**
**యతనోద్రేకయుతంబులై పొదలఁ నయ్యై యింద్రియవ్రాతముల్**
**మృతిఁబొందించి దమంబునన్ శమమునన్ మీరంగ వర్తించుని**
**ర్గతసంసారి భవత్కృపం బొరయునో కంజాక్ష నారాయణా॥ 74**

అర్థం : ఓ కంజ+అక్ష = ఓ నీరజనయనా! నారాయణా! సుత, దార+ఆప్తజన+ఆది విత్తములపై = కొడుకు, పెండ్లాం, ఇతవరిమొదలైన తెలిసిన వారిమీదనూ; ద్రవ్యం మీదనూ; శూన్య+అభిలాషుండును, ఐ=కోరిక లేనివాడై; యతన+ఉద్రేక యుతంబులై = ఆరంభ విజృంభణలతో కూడినవై; పొదలు = వృద్ధిబొందు; అయ్యై, ఇంద్రియవ్రాతముల్ = ఆయాఇంద్రియాలసముదాయాలను; దమంబునన్ = నిగ్రహంతో; మృతిన్, పొందించి = నిర్జీవం చేసి; శమంబునన్ = శాంతితో; మీరంగ = అతిశయంగా; వర్తించు = మెలగే; నిర్గతసంసారి = సంసారంనుంచి బయటపడిన వ్యక్తి; భవత్, కృపన్ = నీదయను; పొరయును = పొందును.

తా : ఓ నీరేజాక్ష! నారాయణా! పుత్రకళత్రసుమిత్రహితపరిచితవిషయమై, ద్రవ్యంపట్ల ఖ్యాతిలాభానురాగాదివాంఛను విడనాడి, ప్రయత్నోద్రేకాలతో వర్ధిల్లే ఇంద్రియాలను నిగ్రహంతో నిర్జించి, శాంతితో వర్తించే ప్రకృతిబంధవిముక్తుడు నీ కృపకు పాత్రుడౌతాడు.

**వ్యాఖ్య : జ్ఞానానుష్ఠానపరుడు భగవంతునిదయకు పాత్రుడని వర్ణితం.** దేహేంద్రియాలు బహిర్ముఖాలుగా నిర్మితాలు. శబ్దస్పర్శరూపరసగంధాలనే విషయాలు ఇంద్రియాలనే గుఱ్ఱాలకు భోగ్యవస్తువులు, ఆహారాలు,

"పరాంచి ఖాని వ్యతృణోత్ స్వయంభూ

స్తస్మాత్ పరాఙ్ పశ్యతి నాంతరాత్మన్ ॥" (కఠోపనిషత్)

పరిసరాల్లో చూచిన ఆహారాన్ని తినడానికి గుఱ్ఱాలు, కళ్ళెం ఎంతబిగబట్టి నిరోధించినా, విజృంభించి ఎగబడినట్లే, ఇంద్రియాలు ఆబాహ్యవిషయాలపైకి పరుగిడుతుంటాయి. కాబట్టి, అంతర్యామియైన పరమాత్మవైపు చూచే భాగ్యం కలుగదు.

ఏ ఇంద్రియమైనా మనస్సంయోగంలేకుంటే దానివిషయాన్ని గ్రహించజాలదు. కాబట్టి, సాత్త్వికాహారాన్ని భుజించేవ్యక్తి వివేకం కలిగి, స్థిరమైన అధ్యవసాయంతో మనస్సును నిగ్రహించే శక్తిమంతుడవుతాడు.

'దమ' మంటే వాక్చక్షుఃశ్రోత్రజిహ్వాఘ్రాణాలనే బాహ్యేంద్రియాలను నిషిద్ధ విషయాలవైపు పరుగెత్తనీయని ఒక జ్ఞానసాధనం.

"దమేన దాన్తాః కిల్బిష మవధూన్వంతి, దమేన బ్రహ్మచారిణః సువరగచ్ఛన్" (తై.నా.ఉప) - దమం చేతనే బాహ్యేంద్రియనియమనశీలురు - దాంతులు - తమపాపాలను పోగొట్టుకొంటారు. నైష్ఠికబ్రహ్మచారులు దమం చేతనే స్వర్గానికి పోగలిగారు.

"శమేన శాంతాః శివమాచరంతి, శమేన నాకం మునయోఽన్వవిందన్" (తై.నా.ఉప) - కామవాసన, కోపోద్రేకాదిదుర్గుణవృత్తులు లేనందువల్ల కలిగే మనఃశాంతిని 'శమ' మంటారు. శమంకలవారు - శాంతులు - మంగళకరమైన పురుషార్థాన్ని సాధిస్తారు. శమమనే జ్ఞానసాధనతో మునులు మోక్షఫలాన్ని పొందినారని శ్రుత్యర్థం.

'ఇంద్రియవ్రాతముల్ మృతి బొందించడ' మంటే ఇంద్రియాలను బాహ్యవిషయాలనుంచి మళ్ళించి అంతరాత్మాభిముఖంగా మలచడమే. దమ, శమసాధనానుష్ఠానపరునికి దారాపుత్రాదులు ముక్తికి దారి చూపేవారు కారని సంసారంపట్ల విరక్తి కలుగుతుంది.

"మాతాపితృపతిభ్రాతృదారాపుత్రాదయోఽపి వా।

ఏకైకఫలలాభాయ, సర్వలాభాయ కేశవః॥"

తల్లి, తండ్రి, పతి, పత్ని, పుత్ర మిత్రాదులు ఆభాసబంధువులు. వీరిలో ఒక్కొక్కరివల్ల ఒక్కొక్క లాభం కలుగవచ్చునేమోకాని, సకలలాభాలను సమకూర్చేవాడు సర్వేశ్వరుడు అని గ్రహించి పరమాత్మయందు రక్తుడవుతాడు.

"పరమాత్మని యో రక్తః, విరక్తోఽపరమాత్మని" - పరమాత్మయందు రక్తికలవాడు, ప్రాపంచిక విషయాలపట్ల విరక్తుడవుతాడు. ఇలాంటి జీవన్ముక్తుడు భగవత్కృపచేత తర్వాత ముక్తపురుషుడవుతాడనడం నిశ్చప్రచం.

**మ. ప్రమదంబారఁగ పుణ్యకాలగతులన్ భక్తిన్ననుష్ఠింపుచున్**
**నమరన్నన్నసువర్ణగోసలిలకన్యాధారుణిగ్రామ దా**
**నములామ్నాయవిధోక్తి భూసురులకున్ సన్మార్గుఁడై యిచ్చువాఁ**
**డమరేంద్రార్చితవైభవోన్నతుఁడగున్నామీఁద నారాయణా ॥ 75**

అర్థం : ఓ నారాయణా! ప్రమదంబు, ఆరగ = నిండుసంతోషంతో; పుణ్యకాలగతులన్ = పర్వదినాలు వచ్చినప్పుడు; భక్తిన్, అనుష్ఠింపుచున్ = భక్తియోగాన్ని ఆచరిస్తూ; అన్న, సువర్ణ, గో, సలిల, కన్యా, ధారుణి, గ్రామ దానములు = అన్నం, బంగారం, ఆవు, ఉదకం, కన్య, భూమి, ఊరు దానాలను; ఆమ్నాయ విధా+ఉక్తిన్ = వేదం చెప్పినరీతిగా; భూసురులకున్ = బ్రాహ్మణులకు; సత్+మార్గుడై = ధర్మప్రవర్తనుడై; ఇచ్చువాడు; ఆమీద = మరణానంతరం; అమర+ఇంద్ర+అర్చిత, వైభవ+ఉన్నతుడు, లగున్ = దేవప్రముఖులచేత పూజింపబడిన గొప్ప సంపద కలవాడవుతాడు.

తా : ఓ నారాయణా! పర్వదినాలలో సంతోషంగా శ్రద్ధా భక్తులతో అన్నం, బంగారం, ఆవులను, ఉదకాన్ని, కన్యను, భూమిని, గ్రామాన్ని వైదిక విధానంగా భూదేవతలకు ధార్మిక వర్తనుడై దాన మిచ్చే జ్ఞానవంతుడు, ముక్తాత్ముడై దేవ ప్రముఖులచేత పూజితుడై గొప్ప ఐశ్వర్యవంతుడవుతాడు.

**వ్యాఖ్య : దాతయైన జ్ఞానయోగి దేవపూజితుడవుతాడని వర్ణన.**

జ్ఞానసంపన్నుడు ఏకాదశి, పున్నమ, అమావాస్య, రవిసంక్రాంతి మొదలైన పర్వదినాలలో భక్తితో యథాశక్తి దానాలను చేస్తాడు.

"దాతవ్య మితి యద్దానం దీయతేఽ నుపకారిణే ।
దేశే కాలే చ పాత్రే చ తద్దానం సాత్త్వికం స్మృతమ్" ॥ (భ.గీ.17-20)

దానం చేయాలి అనే దృఢ నిశ్చయంతో దానం చేయాలి. 'నేను ఈ కార్యం చేస్తున్నాను' అనే కర్తృత్వాభిమానం లేకుండా, 'ఈ కర్మవల్ల కలిగే ఫలాన్ని నేను అనుభవిస్తాను' అనే ఫలమందుభోగ్యతాబుద్ధి లేకుండా, పుణ్యతీర్థక్షేత్రాలయందు, ఉపరాగ (గ్రహణం) పుష్కర, ఏకాదశీత్యాది పుణ్యకాలాలయందు, దానం చేయాలి. దానం తీసుకొనే వ్యక్తి ప్రత్యుపకారం చేయని వాడై యుండాలి. సదాచారనిష్ఠులైన శ్రోత్రియులకు గానీ, బీదలకు, వికలాంగులకు గానీ కర్తవ్యతాబుద్ధితో ఇచ్చే దానం సాత్త్వికదానమవుతుంది. సాత్త్వికదానం చేసేవాడు సన్మార్గుడు.

"న విద్యయా కేవలయా తపసా కేవలేన చ।
యత్ర వృత్తం హ్యుభే చైతే తద్ధి పాత్రం ప్రచక్షతే"॥

కేవలం విద్య ఉన్నా, ఒక్క తపస్సు ఉన్నా 'పాత్ర' శబ్దం చెల్లదు. విద్యా తపస్సులు రెండింటితోపాటు నడవడి బాగుంటే, ఆ వ్యక్తియందు 'పాత్ర' శబ్దం అన్వర్థమవుతుంది, అని ధర్మశాస్త్రం.

"యజ్ఞే తపసి దానే చ స్థితిః సదితిచోచ్యతే।
కర్మ చైవ తదర్థీయం సదిత్యేవాభిధీయతే ॥"(భ.గీ.17-27)

యజ్ఞతపోదానాలయందలి నిష్ఠ 'సత్' అనబడుతుంది. ఆ వేదోక్త కర్మనిష్ఠ కూడా భగవత్ప్రీత్యర్థంగా చేయబడినప్పుడే భగవద్రూపమైన 'సత్తు'గా చెప్పబడుతుంది. భగవానుడు ఇట్టి కర్మయందు దైవత్వాన్ని బోధించాడు.

"అభిగ మ్యోత్తమం దానం ఆహూ యైవ తు మధ్యమమ్।
అధమం యాచమానాయ, సేవాదానం తు నిష్ఫలమ్॥"

సత్పాత్రునిదగ్గరికి పోయి దానం చేయడం ఉత్తమం. ఆయనను తనవద్దకు రప్పించి దానం చేస్తే అది మధ్యమం. అడిగినవానికి దానం చేస్తే అది అధమం. మనకెప్పుడైనా పనికి వస్తాడనుకొనబడే వ్యక్తికీ, సేవ చేసిన వ్యక్తికీ ఇచ్చేది కూలి, లేదా పారితోషికమవుతుందే కాని, అది దానమూ కాదు, దాన ఫలమూ ఉండదు.

అన్నదానం మొదల్కొని గ్రామదానం వరకు ఈ పద్యంలో చెప్పబడిన సప్తదానాలు ఉత్తరోత్తరంగా శ్రేష్ఠమైనవి.

దాత దానంచేసే స్వీయవస్తువుమీద తన స్వత్వాన్ని (హక్కును) వదలుకొని దానగ్రహీతకు స్వత్వాన్ని కలిగిస్తాడు. కాబట్టి దాతృత్వాన్ని 'త్యాగం' అంటారు. దాన సమయంలో ప్రతిగ్రహీతను గూర్చి దాత, "శ్రీమహావిష్ణవే తుభ్యమహం సంప్రదదే; న మమ" - విష్ణుస్వరూపుడవైన దీనిని నీకోసం ఇస్తున్నాను; నాది కాదిది; అని త్యాగం చేస్తాడు.

జలాలు స్థానంగా కలవాడు నారాయణుడు. జలోపలక్షితాలైన సమస్త వస్తువులకు స్రష్టయైనవాడు, ఆవస్తువుల ఉనికికి హేతువైన వాడు నారాయణుడు. కాబట్టి నారాయణరూపమైన జలంతోనే ఏ వస్తువైనా ధారాపూర్వకంగా దత్తమవుతుంది.

"నారం (జ్ఞానం) ఏతి (జానాతి)ఇతి = నారాయణః" సమస్తజ్ఞానాశ్రయుడు నారాయణుడు. కాబట్టి త్యాగమహిమ త్రైలోక్యసంతర్పియైన నారాయణున్ని సంతృప్తి పరుస్తుంది. ఇది వేదశాస్త్రోక్త విధానం. 'కర్మ'లో వలె 'కర్మవిధానం'లోనూ లోపం ఉండరాదుకదా!

దాత కీర్తిశేషుడైన తర్వాత దేవయానమార్గంగా శ్రీ వైకుంఠం చేరుకొంటాడు. భాగవతంలో ఇలా ఉంది -

"క్షణేన మర్త్యేన కృతం మనస్వినః సంన్యస్య సంయాంత్యభయం పదం హరేః" - అల్పాయుష్కులైన మనుష్యులు, చేసిన కర్మలను త్యాగం చేసి, భగవత్సన్నిధిలో శాశ్వతానందాన్ని పొందుతున్నారని కల్పాయుష్కులైన దేవతల ప్రశంసకు పాత్రమైనది భారతీయసంస్కృతి.

సన్మార్గుని దేహయాత్ర గడచిన మీదట, జీవయాత్రా విధానాన్నీ ఈ పద్యంలోని నాల్గవ చరణం తెల్పుతుంది.

"ఏషసంప్రసాదోఽస్మాచ్ఛరీరాత్ సముత్థాయ పరంజ్యోతి రుపసంపాద్య స్వేన రూపేణా భినిష్పద్యతే" - (ఛాందోగ్యం).

భగవదారాధనగా సత్కర్మల నాచరించిన జీవుడు శరీరంలోనుంచి వెడలి పరంజ్యోతిస్సును పొంది స్వస్వరూపావిర్భావంకలవాడవుతాడు (శ్రుత్యర్థం).

"తత్పురుషోఽ మానవః సఏనాన్ బ్రహ్మ గమయతి"

అతివాహికుడుగా, అమానవుడుగానూ, విద్యుత్పురుషుడుగానూ శ్రుతిచెబుతున్న విష్ణుసేవకుడు మాత్రమే భగవత్ప్రీతిపాత్రులైన ఈ జీవులను పరబ్రహ్మ దగ్గరికి తీసుకొని పోతాడు.

"సఏతం దేవయానం పంథానం ఆపద్య అగ్నిలోకమాగచ్ఛతి, స వాయులోకం, సవరుణలోకం, సఆదిత్యలోకం, సఇంద్రలోకం, సప్రజాపతిలోకం, సబ్రహ్మలోకం" - (కౌషీతక్యుపనిషత్ - 1అ-3)

ఆమానవునితోకూడి ఆజీవుడు, దేవయానమార్గగామియైక్రమంగా అగ్ని, వాయు, వరుణ, ఆదిత్య, ఇంద్ర, ప్రజాపతి లోకాల్లో ప్రవేశిస్తూ చివరకు పరబ్రహ్మలోకానికి చేరుకొంటాడు.

"వాతాంశుమద్ గ్లావిద్యుద్వరుణేంద్రధాతృమహితః" అన్నట్లు, దేవలోకాల్లోకి ప్రవేశించే ఈ ముక్తాత్మను ఆయాదేవలోకాధిపతులు సాదరంగా ఎదుర్కొని, ఘనంగా పూజించి, వైభవంగా సాగనంపుతారు. "త్యాగేనైకే అమృతత్వమానశుః" త్యాగమహిమచేత జీవుడు మోక్షసామ్రాజ్యాన్ని పొందుతాడు.

"అర్చిరాదినా తత్ప్రథితేః" (బ్ర.సూ)అని, చతుర్థాధ్యాయంలో, అర్చిరాద్యధికరణాలయందు శ్రీవ్యాసభగవానుడు ఈవిషయాన్ని వివరంగా బోధించాడు.

"ఇదం జ్ఞాన ముపాశ్రిత్య మమ సాధర్మ్యమాగతాః।
సర్గేఽ పి నోపజాయంతే, ప్రళయే నవ్యథయంతి చ॥" (భ.గీ.14-2)

జీవులు ఈ జ్ఞానాన్ని ఆశ్రయించి, నాతో సమానమైన స్వరూప, స్వభావాలను పొందిన వారై, సృష్టికాలంలో పుట్టరు, ప్రళయ కాలంలో నశించరు - అన్నాడు శ్రీకృష్ణభగవానుడు.

**మ. ఇలనెవ్వారి మనంబులో నెఱుక దానెంతెంత గల్గుండు నా**
**కొలదింజెంది వెలుంగుచుందు కలయ న్గోవింద నీరూపులన్**
**అలర న్నంబుమితంబులై సరసిలో నంభోరుహంబుల్ దగన్**
**నిల నొప్పారెడు చంద మొందె దెపుడు న్నీలాంగ నారాయణా॥ 76**

అర్థం : నీల+అంగ = శ్యామవర్ణశరీరుడా! ఓ నారాయణా! ఇలన్ = లోకంలో; ఏవారి మనంబునన్ = ఎవరెవరిచిత్తమందు; ఎఱుక = జ్ఞానం, తాన్ = అది; ఎంతెంతన్, కల్గి, ఉండున్ = ఏ పరిమాణంలో ఉంటుందో; ఓ గోవింద! నీ రూపులన్ = నీ మూర్తులతో; ఆ కొలఁదిన్, చెంది = ఆ పరిమితిని బట్టి, కలయన్ = అంతట; వెలుంగుచుందు = ప్రకాశిస్తుంటావు.

ఎపుడున్ = ఏకాలాననైనా; అంభస్+రుహంబుల్ = నీరేజాలు (తామరలు) తగన్ = యోగ్యంగా; సరసిలో = కొలనులో (జలాశయంలో) అంబుమితంబులై = నీటికొలదికలవై; అలరన్ = వికసింపగా; ఇలన్ = లోకమందు; ఒప్పు, ఆరెడు చందము = ఒప్పిదమైన రీతిగా; ఒందెదు = పొంది ఉంటావు.

తా : శ్యామవర్ణ శరీరంగల ఓ నారాయణా! లోకంలో ఎవరిమనస్సున జ్ఞానం ఎంత పరిమితి కలిగి ఉంటుందో, అంత మాత్రమే నీ రూపాలతో ఓ గోవింద! సరస్సులో తామరకమలాలు జలపరిమితాలై వికసించేరీతిగా, ప్రకాశిస్తుంటావు.

నీరుకొలది తామర అంటే నీరెంతలోతుంటే తామర పువ్వునాళం అంత పొడవు ఉంటుంది అనీ అర్థం చెపుతారు.

**వ్యాఖ్య : జ్ఞానానుగుణంగా భగవద్రూపమలరే వర్ణన.**

సర్వతోముఖమైనది నీరు. ఏ పాత్రలో గ్రహిస్తే, ఆపాత్రకొలది ఆకారం కలిగియుండడం నీటి స్వభావం. "యావత్సలిలం తావత్కమలం" అన్నట్లు సరస్సులో నీరే మాత్రముంటే ఆ మాత్రం తామరలుంటాయి. నిన్న నిలువెడు నీరున్నా వికసించిన తామరకమలాలు, రాత్రి వానపడి నందువల్ల నేడు తాళప్రమాణంగా పెరిగిన నీటి ఉపరితలంలోనూ అట్లే వికాసంగా గోచరిస్తాయికదా!

'నీరు కొలది తామర' లున్నట్లే, భక్తి రూపజ్ఞానం ఎవరిహృదయంలో ఎంత ఉంటే, "అఖిలభువనజన్మస్థేమభంగాదిలీల, వినతవివిధభూతవ్రాతరక్షైకదీక్ష" కలిగిన పరబ్రహ్మకూడా, అంతమాత్రమే రూపంకలవాడై ప్రకాశిస్తుంటాడు.

అజ్ఞానులయందు దేవుడుండడని కాదు. "కంటకాగ్రఇవస్థితః" వారి హృదయంలో ముండ్లమీద నిలిచియున్నట్లు ఉంటాడు.

రావణుడెత్తినా లేవని లక్ష్మణున్ని ఆంజనేయుడు లేవనెత్తాడు.

"ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశే౽ర్జున! తిష్ఠతి।" (భ.గీ.18-61)

భగవంతుడు సర్వప్రాణులహృదయప్రదేశమందు ఉంటాడు.

"యే యథా మాం ప్రపద్యంతే తాంస్తథైవ భజామ్యహమ్" (భ.గీ.4-11)

ఎవరే కోణంతో కొలిస్తే, విశ్వతోముఖుడు ఆ కోణమానానికి తగినంత ఆకారంతో ప్రకాశిస్తుంటాడు.

"వరమహాద్భుతమైన వైష్ణవజ్ఞానంబు
తిరముగా నెవ్వరు తెలియగలరు?" (భాగ.6-176)

నిదర్శనాలంకృతపద్యమిది.

జ్ఞానంకొలది గోవిందునిరూపాలు ప్రకాశిస్తాయి. ఇది ఉపమేయవాక్యార్థం, నీటికొలదితామరలు వికసిస్తాయి. ఇది ఉపమానవాక్యార్థం.

ఈ రెండు వాక్యాలు బింబప్రతిబింబభావంగా ఉన్నాయి. తామరలొప్పారెడు చందంగా గోవిందునిరూపాలు వెలుగుతుంటాయనడంవల్ల ఉపమేయ వాక్యార్థ ధర్మమందు ఉపమానవాక్యార్థధర్మం అభేదంగా ఆరోపితం. విశిష్ట ధర్మాల కైక్యారోపం చేసినందువల్ల ఇది వాక్యార్థవృత్తి నిదర్శనాలంకారం.

**మ. మదిలో నుత్తమభక్తిపీఠముపయిన్ మానాథ మీపాదముల్**
**గదియం జేర్చినవానికేనొడయఁడన్ గాదంచు నత్యున్నతిన్**
**పదిలుండై సమవర్తి మృత్యువునకున్ బాఠంబుగాఁ బల్కు మీ**
**పద పద్మార్చకు లెంత పుణ్యులో కృపాపారీణ నారాయణా॥ 77**

అర్థం : మానాథ = లక్ష్మీపతీ! కృపాపారీణ = దయాపూర్ణా! ఓ నారాయణా! మదిలోన్ = మనస్సులోన; ఉత్తమభక్తిపీఠముపయిన్ = గొప్పభక్తి అనే ఎత్తైన వేదికమీద; మీపాదముల్ కదియన్ చేర్చినవానికి = మీచరణాలను సమానంగా కూర్చి ఉంచిన వానికి; ఏను=నేను; ఒడయఁడన్, కాదు, అంచున్ = ప్రభువును కాను అంటూ; సమవర్తి =యముడు; అతి+ఉన్నతిన్ = కడుగొప్పగా; పదిలుండై; స్థైర్యంకలవాడై; మృత్యువునకున్ = మృత్యుదేవతకు; పాఠంబుగా, పల్కు = బోధించును; మీపదపద్మార్చకులు = మీ చరణకమలాలను పూజించేవారు; ఎంతపుణ్యులో.

తా : ఓ లక్ష్మీనాథా! దయాళూ! నారాయణా! ఎదలో భక్తిని పీఠంగా వేసి దానిమీద మీపాదపద్మాలను కడకతో చేర్చికొల్చే భక్తునికి నేను దొరను కాదు.

అంటూ యముడు పదిలముగా మృత్యుదేవతకు ప్రబోధిస్తాడు. వాస్తవంగా, మీపాదకమలసేవాపరులు ఎంత సుకృతులో కదా!

**వ్యాఖ్య : భగవత్పాదపద్మార్చకులు పుణ్యాత్ములని వర్ణితం.**

పుణ్యాత్ములు పాపాత్ములు అందరు మరణానంతరం ఒకేలోకానికి వెళ్ళరు.

"నావిరతో దుశ్చరితాత్ నాశాంతో నాసమాహితః।

నాశాంతమానసో వాఽపి, ప్రజ్ఞానే నైన మాప్నుయాత్॥"

చెడునడవడిని మానక, ఇంద్రియ చలనముడుగక, ఏకాగ్రచిత్తంలేక, అన్నిటియందు వ్యాపించే మనస్సుకలవాడు పరమాత్మను పొందలేడు - అని యముడు నచికేతునికి ఉపదేశించాడు.

"అయం లోకో నాస్తి నపర ఇతి మానీ పునః పునర్వశమాపద్యతే మే"

"సర్వే చైతే వశం యాంతి యమస్య భగవన్ కిల" - ఇత్యాది వాక్యాలు, 'ఈలోకమూ లేదు, పరలోకమూ లేదు'. అనే దురభిమాని, ఇలాంటి జనులందరు యమునికి వశమవుతారని బోధిస్తున్నాయి.

"శప్తమానస్య యత్పాపం శపంతమనుగచ్ఛతి" - తిట్లు పడేవాని పాపం తిట్టేవానితో కూడి పోతుంది. సాధువులను దూషించేవారూ, ఆచారహీనులూ యమునిఆజ్ఞవల్ల రౌరవాది సప్తనరకాలను పొందుతారని శ్రుతిస్మృతులు బోధిస్తున్నాయి.

భగవద్భక్తులు యమలోకానికి వెళ్ళరు. వైకుంఠానికి వెళ్ళుతారు.

భగవంతునిస్వరూపగుణవిభూతులందు నిరతిశయప్రీతిరూపమైన ధ్యానవిశేషమే భక్తి. ధ్యానవిశేషమంటే తైలధారవలె ఎడతెగకుండా నిరంతరస్మృతిరూపమై, జీవుడు శరీరాన్ని విడిచేవరకు - వైకుంఠానికి ప్రయాణం చేసేవరకు - ప్రతిదినం అనుష్ఠింపగా వృద్ధి పొంది, అంతిమస్మృతివరకు ఉండే జ్ఞానపరంపర.

"ఆ పీఠాన్మౌళిపర్యంతం పశ్యతః పురుషోత్తమమ్।

పాతకాన్యాశు నశ్యంతి, కిం పునస్తూపపాతకమ్॥"

భక్తులు తమహృదయంలో భక్తిపీఠంమీద ధ్యేయమూర్తిని ప్రతిష్ఠించి ఆపాదమస్తకం సేవిస్తుంటారు. కాబట్టి వారి మహాపాతకాలన్నీ నశిస్తాయి. ఇక ఉపపాతకాలవిషయం చెప్పేదేమి? అన్నట్లు భక్తులు పావనమూర్తులు.

"విష్ణునామధరః పుణ్యో నామధారీ స ఉచ్యతే॥"

విష్ణు, నారాయణ అనే భగవద్వాచకమైన నామాన్ని ధరించినవాడే 'నామధారి'. "నామైవ నామ నామ మే" భగవన్నామమే నామమనబడుతుందని (అరుణపాఠం) శ్రుతి బోధిస్తుంది. కాబట్టి 'నామధారి'యే పుణ్యుడు కాదు, ఆయనను ఆపేరుతో పిలిచేవారుకూడా అజామిళునివలె పుణ్యాత్ములవుతారు.

'సమవర్తిన్' శబ్దానికి, ధర్మాధర్మాల పుణ్యపాపాల విషయమై పక్షపాతం లేకుండా, సమానంగా వర్తించే 'యమధర్మరాజు' అని అర్థం. మృత్యువు మొదలైన భృత్యులే యమకింకరులు.

"స్వపురుష మభివీక్ష్య పాశహస్తం
వదతి యమః కిల తస్య కర్ణమూలే।
పరిహర మధుసూదనప్రపన్నాన్
ప్రభురహ మన్యనృణాం న వైష్ణవానామ్"॥

యమధర్మరాజు పాశహస్తుడైన తన కింకరుణ్ని పిలిచి, 'శ్రీమన్నారాయణుని శరణు జొచ్చిన వారి వద్దకు పోవద్దు, నేను తక్కిన నరులకే గాని విష్ణుభక్తులకు ప్రభువును కాను' అని రహస్యంగా చెబుతాడట.

"దేవం శార్ఙ్గధరం విష్ణుం యే ప్రపన్నాః పరాయణమ్।
న తేషాం యమసాలోక్యం, న చ తే నరకౌకసః॥

శార్ఙ్గధరుడైన విష్ణుమూర్తిని పూజించే ప్రపన్నులకు యముని దర్శనం కాదు. వారు నరకానికే పోరు, అని వైష్ణవ, వామన పురాణాల ప్రామాణ్యం ఉంది. నిజంగా, నారాయణుడెంతదయాళుడో, ఆయన పాదపద్మార్చకులెంత పుణ్యులోకదా!

**మ. కులమెన్నం గొలదేల యేకులజుఁడుం గోత్రాభిమానాభిలా**
**షులునజ్ఞానము బాసి జ్ఞానము మదిన్ సంధించి శుద్ధాత్ముఁడై**
**యలరారం బరుసంబు సోఁకునినుమున్ హేమాకృతిస్తోమమై**
**వెలయున్నాగతివాఁడు ముక్తి కరుగున్ వేదాత్మ నారాయణా॥ 78**

అర్థం : ఓ వేదాత్మ! నారాయణా! కులము = జాతిలోని ఒక తెగను; ఎన్నన్ = గణించడం; కొల = పాపం, అది, ఏల = ఆకులమెన్నడం ఎందుకు? ఏకులజుఁడున్ = ఏ కులమందు పుట్టినవాడైనా; గోత్ర+అభిమాన+అభిలాషలున్ = వంశాహంకారవాంఛలను; అజ్ఞానమును, పాసి = త్రోసి, జ్ఞానముమదిన్ సంధించి = వివేకాన్ని ఎదలో సమకూర్చి; శుద్ధ+ఆత్ముడై = నిర్మలాత్ముడై; అలరారన్ = ప్రకాశించగా; పరుసంబు = స్పర్శవేధి అనే వస్తువు; సోకున్ = తాకునట్టి; ఇనుమున్ = ఆయసలోహం; హేమ+ఆకృతి స్తోమమై = మొత్తం బంగారు రూపమై; వెలయున్ = మెరయును. ఆ గతి వాడు = ఆరీతిగా ప్రకాశించే శుద్ధాత్ముడు; ముక్తికి అరుగున్ = మోక్షాన్ని పొందును.

తా : వేదాత్మ! ఓనారాయణా! కులాన్ని తలచే పాపమెందుకు? కులగోత్రాలమీద అభిమానాభిలాషలుండడం అజ్ఞానం. ఏకులజుడైనా అజ్ఞానాన్ని త్రోసివేసి, జ్ఞాన మయమైన హృదయంతో శుద్ధాత్ముడై ప్రకాశిస్తాడు.

స్పర్శవేధి సోకిన ఇనుము, బంగారు రూపంతో మెరిసే రీతిగా జ్ఞానాన్ని సంధించిన వ్యక్తి శుద్ధాత్ముడైతే ముక్తిని పొందుతాడు.

**వ్యాఖ్య : ఏకులజుడైనా శుద్ధాత్ముడైతే ముక్తిని పొందుతాడని వర్ణితం.**

చేతనులు చేసిన పుణ్యాపాపకర్మలకు అనుగుణంగా భగవంతుడు కల్పించే దేహాలన్ని పంచభూతాత్మకాలే. దేహమూ దేహంలో ఉండే జీవుడూ కలిసి 'ఒక్కడు' అని వ్యవహరిస్తుంటాం.

"చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మవిభాగశః" - (భ.గీ.-4-13)

బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులు అనే నాలుగు వర్ణాలను నేను సత్త్వాదిగుణ కర్మలను బట్టి సృజించాను అన్నాడు శ్రీకృష్ణభగవానుడు. కాబట్టి ఈ విభజన వర్ణసాంకర్యం, వృత్తిసాంకర్యం కలుగకుండా భగవంతుడు నిర్మించిన వ్యవస్థ. ఈ నాలుగు వర్ణాలలో పూర్వ పూర్వులకు నియమాలు అధికం అవికూడా గీతోపదిష్టాలే.

వర్ణాలలో శూద్రుడు, యుగాలలో కలి ఉత్తమం అంటారు. శూద్రునికి నియమాలు తక్కువ. కాబట్టి చెడిపోయే అవకాశాలు తక్కువ. బ్రాహ్మణునికి నియమాలు ఎక్కువ. పతనావకాశాలూ ఎక్కువ.

"స్వే స్వే కర్మణ్యభిరతః సంసిద్ధిం లభతే పరామ్" - (భ.గీ.18-45)

"స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః" (భ.గీ.18-46)

మానవుడు, తన విహితకర్మను భగవదారాధనగా నిష్కాముడై ఆచరిస్తే చిత్తశుద్ధి కలిగి, జ్ఞానయోగ్యతచేత ముక్తిని పొందుతాడని విశదపరచాడు శ్రీభగవానుడు.

"సత్కులజాతా వయమిత్యన్యే, తేషు కలిం పరిపూర్ణం మన్యే" అన్నట్లు మీది ఆకులం, మాది ఈ కులం. అని కులగోత్రాభిమానాలు కలిగి మనుగడ సాగించడం నిండు అజ్ఞానమే.

"అవజ్ఞార్థ మనర్థాయ భక్తజన్మాదిచింతనమ్।
శాస్త్రవ్యవస్థామాత్రార్థం న తు దూష్యతి క్వచిత్" (రహస్యత్రయసారం)

అవమానించాలనే ఉద్దేశంతో భక్తులకులగోత్రాలను విచారించడం అనర్థకరం. శాస్త్రవ్యవస్థకోసం విచారిస్తే అది దూష్యం కాదు.

"న శూద్రా భగవద్భక్తాః విప్రా భాగవతా స్స్మృతాః।
సర్వవర్ణేషు తే శూద్రాః యే హ్యభక్తా జనార్దనే॥"

భక్తులు శూద్రులు కారు. వారు భాగవతులుగా పరిగణింపబడతారు. భక్తులు కాని వారు శూద్రులుగా భావింపబడతారు.

"శ్వపచోపి మహీపాల! విష్ణుభక్తో ద్విజాధికః ।
విష్ణుభక్తివిహీనస్తు యతిశ్చ శ్వపచాధమః॥"

శ్వపచుడు - కుక్క మాంసం తినేవాడు - విష్ణుభక్తుడైతే ద్విజునికంటె అధికుడే. విష్ణుభక్తిలేనివాడు యతీశ్వరుడైనా శ్వపచునికంటె అధముడే. "భక్తిహీనంబు లైన జ్ఞాన, వాచా,కర్మకౌశలంబులు నిరర్థకంబులు"(భాగ.)

"ఏకులజుడైన నేమి? యెవ్వడైన నేమి? అరుదైన భూతదయానిధియగువాడే, తగిలి వేంకటేశుదాసుడైనవాడు". (అన్నమాచార్యులు)

"జ్ఞానవిహీనస్సర్వమతేన ముక్తిం న భజతి జన్మశతేన"

"జ్ఞానాదేవ తు కైవల్యం" జ్ఞాన రహితుడెన్ని జన్మలెత్తినా ముక్తిని పొందలేడు. జ్ఞానంచేతనే మోక్షం లభిస్తుంది, అన్నారు శ్రీ శంకరాచార్యులు.

మధ్వమతస్థాపకులైన ఆనందవర్ధనాచార్యులు "అమలాభక్తిశ్చ తత్సాధనమ్" - భక్తియే మోక్షసాధన మన్నారు. మార్గాలు వేరైనా అందరిగమ్యం ఒక్కటే కదా!

"నాహం దేవో న మర్త్యో వా న తిర్యక్ స్థావరోఽపి వా।
జ్ఞానానందమయస్త్వాత్మా శేషో హి పరమాత్మనః॥" (సచ్చరిత్రరక్ష)

జ్ఞానానందమయమైనది ఆత్మ. అది సురనర తిర్యక్ స్థావరాలలో ఏదీ కాదు. ఆత్మ కేవలం పరమాత్మకు దాసభూతమే.

ఆత్మకు జ్ఞానాన్ని కలిగించే అవసరముండదు. అది శుద్ధమైనది, అమలమే.

"యథోదపానకరణాత్ క్రియతే న జలాంబరమ్।
సదేవ నీయతే వ్యక్త మసతః సంభవః కుతః"॥

బావిని త్రవ్వినంతమాత్రాన నీటిని సృజించడంలేదు. ఉన్న నీటిని పొందడానికి దాన్ని ఆవరించిన నేల పొరలను తొలగించడమే అవసరం. ప్రాకృతిక బంధాలను తొలగిస్తే శుద్ధాత్మ గోచరమవుతుంది కదా! అందుకే కవి 'అజ్ఞానముబాసి జ్ఞానము మదిన్ సంధించి' అన్నాడు. కులగోత్రాభిమానాలు అజ్ఞానంవల్ల కలిగినవే. ఈ అజ్ఞానాన్ని మనస్సునుంచి తొలగించాలి, త్రోసి వేయాలి. అందరిఆత్మఅమలమైనది, జ్ఞాన ఆనందమయమైనది, అనే జ్ఞానాన్ని చిత్తాని కెక్కించాలి అన్నాడు.

అజ్ఞానం అంతరిస్తే జ్ఞానం ఆవరిస్తుందా? జ్ఞానం కలిగితే అజ్ఞానం పోతుందా? ఇది విచారణీయం. అయోమయవిషయం కదా!

ఇనుము అజ్ఞానసదృశమనీ, పరుసం జ్ఞానసదృశమనీ వర్ణితం. ఈ రెండింటిని ఒండొంటితో సోకించే ప్రయత్నం కర్మసిద్ధాంతం. సోకిన వెంటనే - సత్కర్మనాచరిస్తే అజ్ఞానం తొలగుతుంది. జ్ఞానం ప్రకాశిస్తుంది. మనస్సు నావరించిన తమస్సు పాసిపోతుంది. సత్త్వం వృద్ధిచెందుతుంది. హేమాకృతిగా వెలుగుతుంది మనస్సు. శుద్ధాత్ముడు - నిర్మలమైన మనస్సు కలవాడు అవుతాడు నరుడు. ఈ గతివాడు సద్గతుడు కదా!

**మ. నిరతానందనియోగులై నియతులై నిర్భాగ్యులై నీచులై
కరుణాహీనమనస్కులై మలినులై కష్టాత్ములై నష్టులై
పరుషవ్యాధినిబద్ధులై పతితులై భగ్నాంగులై మ్రగ్గువా
రరయ న్నిన్నొగి నాత్మయందిడనివారబ్జాక్ష నారాయణా॥** 79

అర్థం: అబ్జాక్ష = పుండరీకాక్ష ! ఓ నారాయణా! నిరత+ఆనంద నియోగులై = ఎల్లప్పుడు మోద ప్రమోదాలను పొందువారై; నియతులై = భాగ్యవంతులై నియమంకలవారై; నిన్నున్, ఆత్మయందు, ఇడనివారు = చిత్తంలో నిల్పుకోనివారు; అరయన్ = ఆలోచిస్తే; ఒగిన్ = క్రమంగా; నిర్భాగ్యులై = దరిద్రులై; నీచులై = క్షుద్రులై; కరుణాహీనమనస్కులై = నిర్దయులై; మలినులై = కల్మషులై; కష్టాత్ములై = కష్టపడే శరీరం కలవారై; నష్టులై = కష్టించినా ఫలం దక్కని వారై; పరుష వ్యాధి నిబద్ధులై = దారుణరోగ గ్రస్తులై; పతితులై = పడినవారై; భగ్న+అంగులై = విరిగిన అవయవాలు కలవారై; మ్రగ్గువారు = చచ్చేవారు.

తా : అబ్జాక్ష! ఓ నారాయణా! సదానందభరితులై భాగ్యవంతులై నియమనిష్ఠలతో నిన్ను ఎదలో పదిలపరచుకోలేని వారు భాగ్యహీనులవుతారు. క్రమంగా, వారు నీచులు, నిర్దయులు, మలినులు, కష్టాత్ములై నష్టపడతారు. దారుణరోగగ్రస్తులై, సమాజంలో పతితులై, వికలాంగులై చస్తారు.

**వ్యాఖ్య : భోగభాగ్యులై భగవంతుణ్ని ఉపాసించనివారు చెడిపోతారని వర్ణితం.** "భాగ్యం స్త్రీ నియతిర్విధిః" (అమరకోశం) 'నియతి' శబ్దానికి భాగ్యమనే అర్థముంది. పూర్వజన్మపుణ్యంవల్ల కొందరు భోగభాగ్యాలను నియమంగా అనుభవిస్తున్నారు. ఆనందమయజీవితాన్ని గడుపుతున్నారు.

భాగ్యాన్ని - ద్రవ్యాన్ని - మందసంలో భద్రపరచుకొన్నట్లే, ఆభోగభాగ్యాలను అనుభవించే జన్మను ప్రసాదించిన పరమాత్మను కృతజ్ఞతాభావంతోనైనా అంతరంగాన ప్రతిష్ఠించుకొని సర్వదా సంస్మరించడం జీవునిలక్షణం.

సర్వాత్ముడెలాగైనా అందరిహృదయంలోనూ ఉన్నాడు. అజ్ఞానం లేక 'ఇది మాధనం, మేమనుభవిస్తుంటాం' అని అహంకారంతో మాధవుణ్ని మనస్సున క్షణమైనా చింతించని వ్యక్తులు జీవన్మృతులే. స్మృతి లేకపోతే మిగిలేది మృతియే.

సర్వానర్థాలకు నిదానం దరిద్రం. భాగ్యవంతులై భగవద్ధ్యానం చేయని జీవులు మొదట నిర్భాగ్యులవుతారు. క్రమంగా సమాజంలో నీచ, నికృష్టజీవనులవుతారు. ఇంకిపోయిన జీవనం (నీరు) వల్ల వారి గుండె ఎండి బండబారుతుంది. పాపకర్ములవుతారు. కష్టపడినా ఫలితం వారికి దక్కదు. ఘోరవ్యాధి పీడితులవుతారు. సర్వాంగాలు శిథిలమై కడకు వారు దీర్ఘనిద్రపోతారు.

భగవద్విషయప్రావీణ్యులైన శ్రీ శఠకోపమునుల శ్రీ సూక్తి స్మరణీయం.

"ఏకచ్ఛత్రాధిపత్యం విదధతి కిల యే భూతలే తేఽపి కాలే
నీలశ్వాదష్టపాదాశ్చ్యుతఘటశకలా భిక్షుకా ఏవ హి స్యుః।
అస్మిన్దేహేఽపి సర్వైర్జగతి సువిదితా ఏవ తస్మాత్తు యూయం
శ్రీమన్నారాయణస్య స్మరత పదయుగం నిత్యముజ్జీవనాయ" ॥ (4-1-1)

చిరకాలం ఏకచ్ఛత్రాధిపతులైన మహారాజులు కూడా ఒకప్పుడు శత్రువులచే పరాజితులవుతారు. వారి భోగభాగ్యాలనూ పగతురు అపహరిస్తారు. ఎక్కడనో తలదాచుకొని, లోకులు చూస్తారనే సిగ్గుతో రాత్రి భిక్షాటనకోసం బయల్దేరుతారు. దారిలో చీకటికి కానరాని నల్లకుక్కను తొక్కుతారు. అది వారిని వెంటనే కరుస్తుంది. వారిచేతిలో ఉన్న బిచ్చపు చిప్ప హఠాత్తుగా నేలమీద పడి బొచ్చెలవుతుంది. బాధతో బావురుమంటూ ఎలుగెత్తి ఏడుస్తుంటే, ప్రజలందరు వచ్చి వారిని చూడడం వల్ల సిగ్గుతో తలెత్తుకోలేరు. కాబట్టి, ఓ చేతనులారా! నశ్వరమైన ప్రాకృతిక ఐశ్వర్యాలను ఆశించక, ఈ జన్మలోనే శ్రీమన్నారాయణుని దివ్య పాదారవిందాలను సర్వదా ధ్యానిస్తూ ఉజ్జీవించండి అని బోధించారునమ్మాళ్వారు (తిరువాయిమొళి).

ఈ పద్యం శ్రీ యథావాక్కుల అన్నమయ్యగారి (125) పద్యరచనను పోలి ఉంది.

"ఖలులై యాచకులై విరుద్ధవికటాకారాంగులై పంగులై
బలహీనాతురులై రుజాపటలతాపచ్ఛన్నులై ఖిన్నులై
చలనాందోళిత చిత్తులై మలినులై జాత్యంధులై మందులై
యిల జన్మించెద రాత్మ నిన్నిడనివారీక్షింప సర్వేశ్వరా॥"

**మ. ఘనభోగాస్పదులై గతౌఘమతులై కారుణ్యులై ముక్తులై**
**ధనకీర్తిప్రదులై దయాభిరతులై ధర్మాత్ములై నిత్యులై**
**మనుజాధీశ్వరులై మనోజనిభులై మాన్యస్థులై స్వస్థులై**
**యొనరన్నొప్పెడువారు నీ పదరుచిన్నూహించు నారాయణా॥ 80**

అర్థం: నీ పదరుచిన్, ఉహించు, ఓ నారాయణా! నీ పదరుచిన్ = నీచరణ రుచితో; ఘనభోగ+ఆస్పదులై = గొప్పసుఖాలకు స్థానభూతులై; గత+ఓఘమతులై = స్థిరబుద్ధులై; కారుణ్యులై = దయాళురై; ముక్తులై = బంధాలను త్రెంచుకొన్నవారై; ధనకీర్తి ప్రదులై; దయా+అభిరతులై = దయాసక్తులై; ధర్మాత్ములై = ధార్మికులై; నిత్యులై = శాశ్వతులై; మనుజ+అధీశ్వరులై = నరేంద్రులై; మనస్+జ, నిభులై = మన్మథునితో సమానులై; మాన్యస్థులై = గౌరవపాత్రులై; స్వస్థులై = ఆరోగ్యవంతులై; ఒనరన్, ఒప్పెడువారు = యోగ్యంగా జీవించేవారు.

తా : నీ పదరుచిని ఊహించే నారాయణా! నీ పదరుచితో గొప్పభోగాలకు ఆస్పదులై, స్థిరమతులై, దయాళురై, ముక్తులై, ధనకీర్తులను వితరణం చేయువారై, కరుణాసక్తులై, ధార్మికులై, నిత్యులై, నరాధిపతులై, మన్మథునితో సమానసుందరులై, మాన్యస్థులై, స్వస్థులై యోగ్యంగా జీవిస్తుంటాటు.

**వ్యాఖ్య : భగవత్పాదాభిరుచికలవారు సకలశుభాలను అనుభవిస్తారని వర్ణన.** భక్తులందరు భగవంతుని పాదారవిందమందలి అమృతాన్ని ఆస్వాదిస్తుంటారు. భక్తులమనస్సు అనే మధుపం భగవంతుని పాదరుచిని చూడగలుగుతుంది. "విష్ణోః పదే పరమే మధ్వ ఉత్సః" - భగవంతుని పాదకమలంనుంచి మకరందం స్రవిస్తుందని శ్రుతి బోధిస్తుంది.

తన పాదరుచి ఎలా ఉంటుందో తానూ రుచి చూడాలని కాబోలు, వటపత్రశాయియైన బాల ముకుందుడు తన కరారవిందంతో పదారవిందాన్ని ముఖారవిందాన చొనిపి చొక్కుతుంటాడు. బహుశఃమకరందాస్వాదనతో తన ఉదరంలో ఉన్న చేతనాచేతన పదార్థాలను ఉజ్జీవింప చేసే అభిరుచి, ఆసక్తి కలవాడు నారాయణుడు.

'రుచి' శబ్దానికి రుచి, కాంతి అనే అర్థాలున్నాయి.

భగవత్పాదారవిందచింతన, జ్ఞానసంపన్నుల జిహ్వాకు అమృతపానం చేసినట్టుంటుంది. వారి హృదయం, శరీరమంతా బ్రహ్మ వర్చస్సుతో దేదీప్యమానమవుతుంది. వారిజీవనతరువు మూడుపువులు, ఆరుకాయలతో వృద్ధిబొందుతుంది. వారు గృహభోగం మొదలు శయ్య, వస్త్ర, ఆభరణ, స్త్రీ, పుష్ప, గంధ, తాంబూలములనే అష్టభోగాలను అనుభవిస్తారు. వారు నవనవోన్మిషిత ప్రజ్ఞాశాలురై, కరుణాంతరంగులై, ప్రతి బంధకాలేమీ లేని వారవుతారు. ధనధాన్యాదులను దానం చేసి వదాన్యులై వంశానికి కీర్తిని ఆపాదిస్తారు. భూతదయాసక్తులై ధర్మకార్య నిర్వహణధురంధరులై శాశ్వతులవుతారు. సద్గుణభూషితులై ప్రజానాయకులవుతారు. సౌందర్యంలో కందర్పసదృశులై, లోకమాన్యులై అనామయులై ధన్యజీవులవుతారు.

ఈ పద్యశైలికి సర్వేశ్వరశతకంలోని (109) పద్యశైలికి మైత్రి ఉంది.

"సకలాధీశ్వరులై గణాధిపతులై సర్వజ్ఞులై నిత్యులై
అకళంకాత్మకులై మహామహిములై యంభోజగర్భాండర
క్షకులై యుండుదు రెల్లవారును భవత్పద్భక్తినానాగణా
ధికలీలావిధి నంతరంగముల వర్తింపంగ సర్వేశ్వరా॥"

# మోక్షవింశతి:

**మ. విదితామ్నాయనికాయభూతములలో విజ్ఞానసంపత్కళా
స్పదయోగీంద్రమనస్సరోజములలో బ్రహ్మేంద్ర దిక్పాలక
త్రిదశవ్రాతకిరీటరత్నములలో దీపించుచున్నట్టి మీ
పదపద్మంబులు భావగేహమున నే భావింతు నారాయణా॥ 81**

అర్థం : ఓ నారాయణా! విదిత+ఆమ్నాయ నికాయభూతములలో = తెలిసిన వేదాలు లక్ష్యంగాగల ప్రాణులలో; విజ్ఞాన సంపత్ కళా+ఆస్పద యోగీంద్ర మనస్+సరోజములలో = విజ్ఞాన సంపత్తు అనే కళకు ఆస్పదమైన యోగీశ్వరుల హృదయపుండరీకాలలో; బ్రహ్మ+ఇంద్ర, దిక్పాలక, త్రిదశవ్రాత కిరీటరత్నములలో = చతుర్ముఖుని, శతమఖుని, దిక్పతుల, దేవతాగణాల మకుటాలయందలి మణులలో; దీపించు చున్నట్టి = ప్రకాశిస్తున్న; మీ పద పద్మాలను = మీ చరణారవిందాలను; నేను; భావగేహమున = మనో మందిరంలో; భావింతును = స్మరిస్తుంటాను.

తా : ఓనారాయణా! ప్రసిద్ధమైన వేదమందిరాల యందలి ప్రాణులలో, విజ్ఞాన సంపద్రూపకళకు స్థానభూతులైన మహా యోగుల మనస్సరోజాలలోనూ, బ్రహ్మేంద్ర దిక్పాలక దివౌకసుల కిరీటాలయందలి మణులలోనూ ప్రకాశిస్తున్న మీ పాదకమలాలను నా హృదయసదనంలో స్మరిస్తుంటాను.

**వ్యాఖ్య : భగవంతుని పాదపద్మాలు ప్రకాశించే ప్రదేశాలను ఉల్లేఖించిన పద్యమిది.**

జిజ్ఞాసువులైన మహర్షులు కర్మ జ్ఞానాలు అనే రెండు రెక్కలున్న పక్షులై ఇంద్రుని వద్దకు పోయి ప్రార్థించారనే శ్రుతి వాక్యాలున్నాయి.

"వయస్సుపర్ణా ఉపసేదు రింద్రం ప్రియమేధా ఋషయో - నాథమానాః"

"సచాగ్ం శిక్యః పురోవాచోపనిషదింద్రో జ్యేష్ఠ ఇంద్రియాయ ఋషిభ్యః"

ఇంద్రుడు మహర్షులకు జ్ఞానసామర్థ్యం కలుగడానికి వేదవేదాంతాలను బోధించాడు. మహర్షులకు వేదమే శరణం. ఆశ్రయమైనది. వేదవేద్యుడైన పరబ్రహ్మ అనే ఆకాశంలో విహరించే పక్షులైన మహర్షులు వేదనీడాధిరూఢులు. (వేదమనేగూటిలో ఉన్నవారు) కాబట్టి, 'విదితామ్నాయనికాయభూతములు' అని కవి వాక్కు.

"ఆచార్యాద్ధైవ విదితా సాధిష్ఠం ప్రాపత్" (ఛాం.ఉ.)

"స్వాధ్యాయాద్యోగమాసీత, యోగాత్ స్వాధ్యాయమావసేత్।
స్వాధ్యాయయోగసంపత్త్యా గమిష్యతి పరాం గతిమ్"॥

ఆచార్యోపదిష్టమైన విద్యయే శ్రేష్ఠమైనది. భక్తియోగమందు స్థిరుడై వేదాన్ని అధ్యయనం చేస్తాడు వేదపురుషుడు. పరస్పరవేద యోగసంపత్తిచేత మోక్షం పొందేవారు వేదపురుషులు. "చరణం పవిత్రం వితతం పురాణం" అని అధ్యయనం చేసే వేదమూర్తుల అంతరంగమందు భగవత్పాదపద్మాలు స్థిరంగా ప్రకాశిస్తుంటాయి.

యోగీంద్రులు విజ్ఞాన సంపత్కళాస్పదులు. 'శాస్త్రం భూరి నిజస్వరూపమతయే స్వారాధనార్థం వపుః" (విశ్వగుణాదర్శ చంపువు). భగవంతుడు తనస్వరూపాన్ని తెలుసుకోవడానికి గొప్పశాస్త్రాన్ని కల్పించాడు, తనను పూజించడానికి మనకు ఈ శరీరాన్ని అనుగ్రహించాడు.

"ద్వే విద్యే వేదితవ్యే " అన్నట్లు రెండు-పర, అపర - విద్యలను తెలుసుకోవాలి. అపరావిద్య: వేదవేదాంగశాస్త్రాభ్యాసం, అధ్యాత్మవిద్యను చక్కగా అర్థం చేసుకొనే యోగ్యతను కల్పిస్తుంది. పరబ్రహ్మాను పరోక్షంగా తెలుసుకొనే జ్ఞానమిది.

పరావిద్య: ఉపనిషద్విద్య, అధ్యాత్మవిద్య లేదా వేదాంతశాస్త్రం.

భక్తి లేదా ఉపాసనచేత పరబ్రహ్మాను సాక్షాత్కారంగా పొందే జ్ఞానమిది.

జ్ఞానాన్ని అనుభవానికి తెచ్చేది విజ్ఞానం. 'యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధారణ, ధ్యాన, సమాధి అనే అష్టాంగయోగం విజ్ఞానసంపత్కళాస్పదం. 'కం లాతీతి కళా' పరబ్రహ్మాను ఆకర్షించేది. భగవత్ప్రాప్తికి సాధనమిది. యోగీశ్వరులు ఈ సాధనలో వాయువును క్రమబద్ధంచేస్తూ, కామ, క్రోధ, భయ, స్వప్న, స్నేహ, అత్యశన, వైచిత్ర్య, వ్యాధి, ఆలస్య, లోభాలు అనే పది (10) విఘ్నాలను దాటి, బాహ్యేంద్రియాలను అంతర్ముఖంగా చేస్తారు. నిగ్రహించిన మనస్సును ఏకాగ్రంగా ధ్యేయమూర్తిమీద లగ్నం చేస్తారు. ధ్యానానుసంధాననిష్ఠలో ఉన్నప్పుడు పాములు ప్రాకినా,పుట్టలు పెరిగినా తెలియని స్థితిలో ఉండడమే సమాధి దశ. "సమే ఆధీయతే, ఇతి సమాధిః" శ్రీనాథుని యందు ఏకాగ్రంగా ఉంచబడిన మనస్సు తేజోవంతమవుతుంది. కాబట్టి,

"తత్ర ప్రత్యయైకతానతా ధ్యానమ్". (యోగసూత్రం. 3-2)

"శాస్త్రోక్తదేవతా ఆలంబనేషు అచలః అభిన్నజాతీయై రనంతరితః ప్రత్యయ సంతాన ఏకాగ్రతేతి యమాహుః" (మహాభాష్యమ్)

యోగులకు ధ్యానమే బలం. యోగీంద్రులు అణిమ, మహిమ, గరిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్య, ఈశిత్వ, వశిత్వాలు అనే అష్టసిద్ధులను పొందుతారు. వీటితో వారనుకొన్నవాటిని పొందుతారు.

"ఏతా నష్టౌ గుణాన్ ప్రాప్య కథంచిద్యోగినాం వరాః ।

ఈశాః సర్వస్య లోకస్య దేవానప్యతిశేరతే ॥"(భారతం. అను.145 అ)

యోగీంద్రులు అష్టసిద్ధులను సాధించి ప్రపంచాన్ని శాసించే సమర్థులై దేవతల కంటె మించి శోభిస్తారు.

"ధ్యానావస్థిత తద్గతేన మనసా పశ్యంతి యం యోగినః"(భాగవతం 12 స్కం.)

పాదాలు విగ్రహానికి ఉపలక్షణంకదా! ధ్యానపరమైన మనస్సుచేత యోగిపుంగవులు జ్యోతిర్మయుడైన పరబ్రహ్మను దర్శిస్తారనీ, తత్ఫలితంగా వారు ముక్తిని పొందుతారనీ అన్నది నిర్వివాదాంశం.

"యం బ్రహ్మ వరుణేంద్రరుద్రమరుతః స్తున్వంతి దివ్యైస్స్తవై

ర్వేదైః సాంగపదక్రమోపనిషదైర్గాయంతి యం సామగాః" (భాగవ)

బ్రహ్మాదాది దేవతలందరు దివ్యంగా స్తోత్రం చేస్తూ నారాయణుని పాదపద్మాలకు నతమస్తకులై దండవత్ప్రణామం చేస్తుంటారు. అప్పుడు దేవతల కిరీటాల యందలి ప్రత్యుప్తమణులలో భగవత్పాదపద్మాలు ప్రతిఫలిస్తుంటాయి.

అలాగే, భక్తిరూపాపన్నజ్ఞానంతో భగవంతుణ్ని కీర్తిస్తున్న ఈ కవిచంద్రుడు, తనహృదయపద్మమందు వెలసి యున్న నారాయణపాదపద్మాలను సర్వదా సంస్మరిస్తానన్నాడు. ముక్తి లభిస్తుందనే ఆత్మప్రత్యయం ప్రశంసనీయం.

**మ. వెలయన్ యౌవనకాలమందు మరుఁడున్ వృద్ధాప్యకాలంబునన్**
**బలురోగంబులు నంత్యమందు యముఁడుం బాధింప నట్టైన యీ**
**పలు జన్మంబులు చాలదూలితి ననుంబాలింపవే దేవ మీ**
**ఫలితానంద దయావలోకనము నా పైఁజూపు నారాయణా ॥ 82**

అర్థం: ఓ నారాయణా! మరుఁడున్ = మన్మథుడు; యౌవనకాలమందు = తరుణ ప్రాయమందు; వెలయన్ = ప్రకాశింపగా; వృద్ధాప్యకాలంబునన్ = ముసలితనాన; పలురోగంబులు; అంత్యమందు = మరణదశలో; యముఁడున్ = దండధరుడుకూడా; బాధింపన్ = వెతలపెట్టగా: అట్టైన = అలాంటి; ఈ పలు జన్మంబులు; చాల; తూలితి = ఎత్తి అనుభవించాను. దేవ! ననున్; పాలింపవే! మీ ఫలిత+ఆనందదయా+అవలోకనము = మీ పూర్ణానందంతో దయా దృష్టిని; నాపైన్; చూపు = ప్రసరింపజేయుము.

తా : ఓ నారాయణా! వయస్సులో మన్మథుని విజృంభణం, వార్ధక్యంలో రోగాలబాధ, మరణదశలో యమయాతన కలిగే ఇలాంటి జన్మలు చాలా ఎత్తాను, మిత్తి వాతపడ్డాను. నన్ను కాపాడవా దేవా! మీ పండిన ఆనందంతో నాపై కృపాదృష్టిని సారింపుము.

**వ్యాఖ్య : కవి, తనకు జన్మరాహిత్యాన్ని ప్రసాదించుమని దేవుణ్ణి ప్రార్థించే పద్యం.**

జీవులకోసం ఏర్పడిన సుఖం రెండురకాలు 1. ప్రేయము 2 శ్రేయము. "అన్యచ్ఛ్రేయోఽన్యదుతైవ ప్రేయః తే ఉభే నానార్థేపురుషగ్ంసినీతః" (కఠో) 1. ప్రేయస్సు: ప్రీతికరమైన భోగం 2.శ్రేయస్సు: కల్యాణకరమైన మోక్షం. పరస్పర విలక్షణ ప్రయోజనాలు కలిగిన ప్రేయః శ్రేయస్సులకు - రెండింటికీ మానవులను ఆకర్షించేశక్తి ఉంది.

భోగలాలసమైన మానవప్రకృతి స్త్రీ పురుష వ్యామోహంతో సంసారమనే ఊబిలో కూరుకొని పోతుంది - ఇంద్రియాల తృప్తికోసం వెంపర్లాడే జీవనదశ యౌవనం. "తరుణ స్తావత్తరుణీసక్తః" యువకుడు యువతియందాసక్తుడైనట్లే "తరుణీ తావత్తరుణాసక్తా" యువతికూడా యవకునియందు ఆసక్తయై, క్రమంగా వారు అన్యోన్యాకర్షితులవుతారు.

వనితల అంతస్సౌందర్యంకంటె బాహ్యసౌందర్యమే మొదట ఆకర్షిస్తుంది. యువతి విద్యుల్లతావిగ్రహ. చంద్రాస్య, చంచరీకచికుర, కురంగనయన, వేయేల? సానబెట్టిన మకరాంకుశస్త్రమే.

"చన్నులపెంపు, పాదజలజమ్ములకెంపు, మనోహరమ్ములౌ
కన్నుల సొంపు, మైయగరుకంపు, కనుంబొమ వంపు, శ్రోణులన్
తిన్నెలనింపు, నెన్నడల తీరనిజంపు, నఖాళితెంపు, పల్
క్రొన్నన యింపు, ముంగురుల గుంపు దలంప వరింప కెట్టగున్?"
"మాటలనవచ్చు. వచ్చునే మనసు నిలువ"

"వయసువాఁడఁట ఆమీఁద వైష్ణవుఁడఁట" అనుకొంటూ, హావభావచేష్టలతో విలాసానికి నిల్చిన వగలాడిని చూచి,

"తలోదరి! తవాపాంగైః క్రీత మేకం జగత్త్రయమ్।
త్వాం వినా స తు కందర్పః, కం దర్ప మవలోకతే॥"

ఓ తన్వీ! నీ చూపులతో ముల్లోకాలు ఓడిపోయాయి. నీవు లేకపోతే మన్మథుడు ఎవరిని జూచుకొని గర్వపడతాడు? అని నానలేక యువకుడు ఆశ్లేషశేముషితో నోరు జార విడువడం చెలరేగినమారుని లక్షణంగాక మరేమి?

"మరుఁడాచార్యుఁడుగా విశీర్ణకబరీమాల్యాళి పుష్పాంజలి
స్ఫురణల్గాఁ దదుపేతభృంగనినదస్తోమంబు గానంబుగా
వరమంజీరరవంబు తాళగతిగా వర్ధిల్లు శాతోదరీ
సురతవ్యత్యయవేగతాండవ మొనర్చుం జింతితాభీష్టమున్"॥

ఇలా రతిసుఖసారమైన యువతిశరీరాన్ని కౌగిట జేర్చే భాగ్యం ఏకాంతంగా లభించినా, ఇస్సీ అని త్రోసి వేసే గృహస్థుడు "లేఁడు ప్రవరాఖ్యుఁడు దక్క మరొక్కఁడెక్కడన్"

నిగనిగలాడుతూ బంగారుకడ్డీలాగా ఉన్న శరీరం వయస్సు ఉఁడిగి శ్లథసంధి జర్జరమవుతుంది. శరీరం జర్జరీభూతం, ముగ్గుబుట్టలాంటితల, పండ్లు ఊడిపోయిన బోసినోరు, అయినా మూడు కాళ్ళ ముదుసలికి ఆశ పెరుగుతూనే ఉంటుంది. అందుకే ఇలా అన్నారు.

"అంగం గళితం, పలితం ముండం, దశనవిహీనం, జాతం తుండమ్,
వృద్ధో యాతి గృహీత్వా దండం, తదపి న ముంచత్యాశాపిండమ్॥"

కన్నులు కనబడక, తిన్నది అరుగక, వాతపిత్త శ్లేష్మాది రోగాలతో మాట పెగలక, మలమూత్రవ్యాధులతో పక్కతడుస్తుంటే, కట్టుకొన్నది గానీ, కన్నవారుగానీ ముక్కుమూసుకొని వెక్కిరిస్తూ చీవాట్లు పెట్టే దుర్భర దశ కలది వృద్ధాప్యం.

జరాజర్జరితశరీరంనుంచి జీవుడు, యమపాశంతో గుండె గూడు కదలి, విడిపోవడమే అంత్యదశ. ఆయమయాతన వర్ణనాతీతం. ఉన్నవానికి తెలియదు, పోయేవాడు చెప్పలేడుకదా! ఇలాంటి అనేకజన్మలు చాలా తూలితినన్నాడు కవి.

స్వశక్తితో పుట్టడం, గిట్టడం కాని పని. పుట్టించి గిట్టించే వాడొక్కడుండాలి. వాడు పుట్టువూ చావూలేనివాడై ఉండాలి. వాడూ పుట్టువుకలవాడంటే అనవస్థాదోషం సంభవిస్తుంది.

కర్మఫలానుభవానికి కాక, కేవలం తన సంకల్పంతో ధర్మసంస్థాపనకోసం పుట్టే సర్వస్వతంత్రుడు పరమాత్ముడు. ఆయన 'అర్జునా! నీకూ నాకూ ఎన్నో జన్మలు గడిచాయి. పూర్వజన్మల సంగతి నాకుమాత్రం తెలుసు, నీకుతెలియవు' అన్నాడు. (భ.గీ.4-5)

బ్రహ్మవిద్యయైన గీతాశాస్త్రం మీదనూ, గీతాచార్యునిమీదనూ, గీతను అనుగ్రహించిన వ్యాసభగవానుని మీదనూ, భక్తి విశ్వాసాలు కలవారే ఆస్తికులు అని విజ్ఞులమాట.

. బహూనాం జన్మనామంతే జ్ఞానవాన్మాం ప్రపద్యతే" (భ.గీ.7-19)

అనేక జన్మల సాధన ఫలితంగా ఒకనికి జ్ఞానోదయ మవుతుంది. అదే అతని చివరి జన్మ. దేహాంతమందు ఆజీవుడు దేవునిసన్నిధికి చేరుతాడు.

"శ్రేయో హి ధీరోఽభిప్రేయసో వృణీతే" (కఠోప)

వివేకవంతుడు ప్రేయస్సుకంటె శ్రేయస్సునే వరిస్తాడు అన్నట్లు కవి, పునర్జన్మ

విశ్వాసమూ, పరలోకజ్ఞానమూ కలిగినవాడు కాబట్టి, ఈ జన్మలో దేవుణ్ని జన్మరాహిత్యం కోసం 'నన్ను పాలించు, దయతో చూడు'మని ప్రార్థించాడు.

"లౌకిక మొల్లక నన్నాలోకించు ప్రపన్నులకును లోబడి కరుణా
లోకనముల బోషింతును, నాకాశ్రితరక్షణములు నైసర్గికముల్॥"

అని శ్రీకృష్ణభగవానుడే ఉద్ధవునికి (తన) స్వభావాన్ని ప్రకటించాడుకదా!

**మ. బలుకర్మాయతపాశబంధవితతిన్ బాహాపరిశ్రేణికిన్**
**జలయంత్రాన్వితబంధయాతనగతిన్ సంసారకూపంబులో**
**నలరం ద్రిమ్మరుచుండు నన్ను నకటా! యార్తుండనై వేఁడెదన్**
**వెలయన్నీ కృపచేతఁ జేకొనవె నన్ వే వేగ నారాయణా॥ 83**

అర్థం: ఓ నారాయణా! బలు = అధికమైన; కర్మ+ఆయతపాశబంధవితతిన్ = కర్మలు అనే పొడవైన త్రాటిచేకట్టిన ముడుల సముదాయంతో; బాహాపరిశ్రేణికిన్ = బాహువులలాగా ఎక్కువగా నున్న బొక్కెనల వరుసకు; జలయంత్ర+అన్విత బంధయాతనగతిన్ = నీటి మరతో కూడిన బంధం చేత తీవ్రమైన గమనం రీతిగా; సంసారకూపంబులోన్ = సంసారమనే నూతిలోన; అలరన్ = బాగా; (వికాసంగా); త్రిమ్మరుచుండు = తిరుగుతుండే; నన్నున్, అకటా! ఆర్తుండనై=బాధపడుతున్న వాడనై; వేడెదన్ = ప్రార్థింతును. వెలయన్ = ప్రకాశంగా; నీకృపచేత = నీదయచేత; నన్ = నన్ను; వే వేగ = అతిశీఘ్రంగా, చేకొనవే = చేదుకొనుము.

తా : ఓనారాయణా! త్రాటితో బొక్కెనలను వరుసగా కట్టివాటిని జలయంత్రంతో అమర్చగా అది రాట్నంవలె తిరుగుతున్నట్లు, అనేక కర్మపాశబంధాలతో సంసారమనే బావిలోనే తిరుగుతున్న నేను నిన్ను ఆర్తితో ప్రార్థిస్తున్నాను. నీవు దయతో నన్ను అతివేగంగా నీ సన్నిధికి చేర్చుకోవయ్యా!

**వ్యాఖ్య: సంసారకూపంలో తిరుగుతున్న తనను ఉద్ధరించుమని కవి ప్రార్థన.**

సంసారం ఒకనుయ్యి. నూతిలోని నీటిని తోడివేయడానికి ఒకపొడవైన త్రాటి - తీగ-తో యాభై, అరవై బొక్కెనలను హారంలాగా గుది గూర్చి అనేకభుజపంక్తులు కలిగిన ఒక చక్రానికి అమరుస్తారు. ఆచక్రానికి జలయంత్రంతో ఒక గట్టి బంధం ఉంటుంది. జలయంత్రం తిరుగుతున్న కొలది ఆచక్రమూ తిరుగుతుంటుంది. అప్పుడు హారంగా కట్టిన బొక్కెనలు నీటిలో క్రమంగా మునిగి నీటిని పైకి తెచ్చి దోనెలోపోసి, అధోముఖంగా నూతిలోకి నీటిని తేవడానికి తిరిగి పోతుంటాయి. బాహాపరిశ్రేణికి నూతిలో తిరుగడమే పని. కొందరు దీన్ని రాటపు బావి అంటారు. ముఖ్యంగా ఇది 'కూపయంత్రఘటికాన్యాయ' మని ప్రసిద్ధి.

హారంలాగా ఉన్న బొక్కెనల ఊర్ధ్వాధోగమనం జననమరణపరిభ్రమణం. ఈజననమరణరూపచక్రానికి, జలయంత్రరూపమైన కాలచక్రానికి గొప్ప అనుబంధం ఉంది. సంసారమనేపెద్ద నూతిలోనే జననమరణరూపచక్ర పరిభ్రమణం, కాలచక్రం తిరుగుతున్నంతవరకు జరుగుతుంటుంది.

ఇలా పరిభ్రమించడానికి కీలకమైనది బంధం. అదే కర్మబంధం.

"కార్యతే హ్యవశః కర్మ సర్వః ప్రకృతిజైర్గుణైః" (భ.గీ.3-5)

అనుక్షణం మారుతుండే ప్రకృతి యొక్క గుణాల చేత ప్రతివ్యక్తి ఏదో కర్మను - పనిని - చేస్తుంటాడు.

కర్మలు సంచితం, ఆగామి, ప్రారబ్ధం అని మూడు విధాలు.

సంచితం - జన్మజన్మలనుంచి సంపాదించి పెట్టుకొన్న కర్మరాశి.

"సుకృతం దుష్కృతం చైవ గచ్ఛంతమనుగచ్ఛతః" - జీవుడు ఇంద్రియాలతో మంచి, చెడ్డ కర్మల ఫలితాన్ని - సంస్కారాన్ని - తీసికొనిపోతాడు.

"శరీరం యదవాప్నోతి యచ్చాప్యుత్క్రామతీశ్వరః।
గృహీత్వైతాని సంయాతి వాయుర్గంధానివాశయాత్॥ (భగ.15-8)

జీవుడే శరీరాన్ని వదలి మరొక శరీరాన్ని పొందినప్పుడు, పూలున్నచోటు నుంచి గాలి గంధరేణువులను తీసుకొని పోయే విధంగా, ఇంద్రియ విషయవాసనలను సంస్కారాలను తీసుకొని పోతాడు.

కర్మ జన్మకు బీజం - విత్తు కదా! కర్మల ఫలాన్ని అనుభవించడానికే జన్మనెత్తడం ఆవశ్యకం.

"తద్య ఇహ రమణీయచరణాః కపూయచరణా అభ్యాశోహయత్తే రమణీయాం కపూయాం యోని మాపద్యేరన్" - (చాం.ఉ.)

పుణ్యజీవులు పుణ్యజన్మను, పాపులైతే శునక సూకరాది జన్మను పొందుతారట.

2. ప్రారబ్ధం: ఆత్మనంటిపెట్టుకొని ఉన్న సంచితకర్మరాశిలో నుంచి కొంత - బియ్యపుబస్తాలోనుంచి నేడు వండుకోవడానికి తీసుకొన్నమానెడు బియ్యంలాగా - ప్రత్యేకించి ఈ జన్మలో అనుభవిస్తున్నదే. దీన్ని పూర్తిగా అనుభవించేంతవరకు జీవుడీ దేహంలో ఉంటాడు.

3. ఆగామి: ప్రారబ్ధకర్మననుభవిస్తున్న (ఈ) జన్మలోనూ చేస్తున్న కర్మ, మళ్ళీ సంచితకర్మరాశిలో కలిసి, రాబోయేజన్మల్లో అనుభవానికి వచ్చేది.

బాహాపరిశ్రేణికి జలయంత్రంతో కూడిన బంధయాతన రీతిగా, బహుజన్మల సంచితమైన, సుదీర్ఘమైన కర్మపాశంతో దేహబంధమేర్పడిన జీవుడు బ్రహ్మాదిలోకాలతో కూడిన ఈ సంసారకూపంలో జననమరణరూపచక్రంగా పరిభ్రమిస్తాడు.

అనేకజన్మల సుకృతంవల్ల కలిగిన ఈ మానవజన్మలో -

1. దృప్తప్రపన్నుడు, - స్వర్గంలో గానీ, నరకంలో గానీ తననెక్కడ పడవేసినా సరే, తాను భగవంతుని చరణారవిందస్మరణ చేసే రీతిగా తనను అనుగ్రహించాలని పరమాత్మున్ని వేడుకొంటాడు. ఆయన

"వైకుంఠవాసేపి న మేభిలాషః" - అంటాడు.

2. ఆర్తప్రపన్నుడు, - ఈ ప్రకృతి బంధంనుంచి విముక్తున్ని చేసి, త్వరగా తన పాదసన్నిధిలోకి చేర్చుకోవాలని ఆర్తితో ప్రభువును ప్రార్థిస్తాడు.

ఈ సుకవి, ఆర్తితో 'నన్ను వేగంగా నీ దగ్గరికి చేర్చుకొ'మ్మని వేడుకొన్నాడు. రూపకానుప్రాణితోపమాలంకారమున్న పద్యమిది.

**మ. మమహంకారవికారసన్నిభమహామత్తాదిలోభాంధకా**
**రముచే ముక్తికి నేఁగుమార్గమెఱుఁగన్ రాదింక నాలోన నీ**
**విమలాపాంగదయాదివాకరరుచిన్ వెల్గింపు మింపార నో**
**కమలానందవిహారవక్షలలితా ! కంజాక్ష!నారాయణా ॥ 84**

అర్థం : కమలా+ఆనంద విహార వక్షలలితా = లక్ష్మీదేవి ఆనందంతో విహరించే, వక్షఃస్థలంచేత అందమైనవాడా = అందమైన వక్షఃస్థలంకలవాడా! కంజ+అక్ష = వారిజనయనా!నారాయణా! మమహంకార - అంధకారముచే; మమ = మమకారమూ; హంకార = అహంకారమూ అనే; వికార = ప్రాకృతిక వికారాలతో; సన్నిభ = సమానమైన; మహా = గొప్ప; మత్త+ఆది=మదమూమొదలైన; లోభ+అంధకారముచే = లోభమనే చీకటి చేత; ముక్తికిన్, మోక్షానికి; ఏగు = వెళ్ళే; మార్గము = త్రోవ; ఎఱుగన్ రాదు = తెలియరాదు; ఇంక; నాలోన = నాహృదయంలోపల; నీ విమల+అపాంగ దయా = నీ పరిశుద్ధమైన కడకంటితో దయ అనే; దివాకర రుచిన్ = సూర్యకాంతిని; ఇంపార + మనోజ్ఞంగా; వెల్గింపుము.

తా : లక్ష్మీదేవి ఆనందంతో విహరించే భుజాంతరంచేత శోభించేవాడా! ఓ నీరజనయనా!నారాయణా! మమకార అహంకారాలనే వికారాలతో సమానమైన మదమాత్సర్యలోభాలనే అంధకారంచేత ముక్తిని బడసే దారి తెలియరాదు. కాబట్టి. నీ కటాక్షంతో దయాభాస్కరునికాంతిని నా హృదయంలో ఇంపుగా ప్రకాశింపజేయుము.

**వ్యాఖ్య : మోక్షమార్గాన్ని ప్రకాశింపజేయుమని కవిప్రార్థన.**

సుమసుకుమారశరీరయైన కమలాదేవి నారాయణుని వక్షఃస్థలంలో ఉల్లాసంగా విహరిస్తుంది; అంటే ఆయన ఉరఃస్థలం ఎంత మృదువైనదో, ఎంతవిశాలమైనదో కదా! దయారూపిణియైన లక్ష్మీదేవికి అనుగ్రహించడమేకాని నిగ్రహించడం తెలియదు.

ఎదలోనే కమల కాపురం చేస్తున్నది కాబట్టి కమలాకాంతుడు కంజాక్షుడయ్యాడు. హార్దమైన దయార్ద్రతాభావాదులు కన్నుల్లో స్ఫురిస్తాయి.

"Face is index of mind."

కమలానందవిహారానికి కారకుడు దివాకరుడు, సూర్యకిరణాలు సోకితే కమలాలు వికసిస్తాయి. నిశాకరుని కిరణాలు సోకితే అవి ముడుచుకుపోతాయి. సూర్యచంద్రులే నేత్రాలుగా ఉన్నవాడు కాబట్టి కంజాక్షుని కన్నులు అరవిరిసిన తామరలున్నట్లు ఉంటాయి.

నిండుచూపు నిగ్రహానికి, కడకంటి చూపు అనుగ్రహానికి సంకేతం. అందుకే కవి అపాంగదయాదివాకరరుచిని వెల్గింపుమన్నాడు. అపాంగదృష్టియే దయ. అదే సూర్యకాంతి.

మోక్షమార్గాన్ని కనుక్కోవడం మానవునికర్తవ్యం. కాని ఆదారిని కానరాని చీకటి కమ్ముకొన్నది. ఈ చీకటి, కాలప్రభావంచేత కలిగింది కాదు. మానవ ప్రకృతి జన్యగుణాలచేత ఏర్పడింది.

ఇది హృద్గతమైనది. కాబట్టి కన్నుల్లోకి కప్పుకొని వచ్చింది. చీకుకు దారి కనబడదుకదా!

'మమకారం' అంటే 'నాది' అనే భావం. ఈ మేడలు మడిమాన్యాలు నావి. ఇతరులకు గాక నాకుమాత్రమే అనుభవించే హక్కు ఉంది. అని ప్రకటించడం భోక్తృత్వాభిమానమని అర్థం.

'అహంకారం' అంటే 'నేను' అనే భావం. ఇంత భూమి, ధనం - స్థిరచరాస్తులను సంపాదించాను. మంచి చెడ్డలు తెలిసి నేను మసలుకోవడంవల్లనే లోకం దృష్టిలో గొప్ప ప్రజ్ఞావంతుడనయ్యాను, అని గర్వించడం - కర్తృత్వాభిమానమని అర్థం.

'హంకారం' అంటే అభిమానం, అహంకారం. (శబ్దరత్నాకరం).

"హంకారములకెల్ల నాటపట్టు" (చంద్రాంగదచరిత్ర).

జీవాత్మ, పరమాత్మలకన్న భిన్నమైన ప్రకృతి, వికారాస్పదమైనది.

"మనుజపతిం వా దిగధిపతిం వా, జలజభవం వా జగదధికం వా-
మమతాహంకృతి మలినో లోకో, నిందతి నిందతి నిందత్యేవ॥

మమకారాహంకారాలచేత మలినుడైన మనిషి, నరేంద్రుణ్నీ, దేవేంద్రుణ్నీ, బ్రహ్మనైనా, వాని అబ్బనైనా లక్ష్యపెట్టక, నిందిస్తుంటాడు.

"వైష్ణవకులగుణదూషణచింతాం, మా కురు నిజకులశీలాహంతాం" - అన్నట్లు,

విష్ణుభక్తులకులగుణాదులను దూషించేవాడు, తనకులశీలాదులను నాశనం చేసుకొన్నవాడవుతాడు.

ప్రకృతివికారమైన మమతాహంకారాలకు దీటైనవి మదమత్సరలోభాలు. "నష్టే నయనే కస్యాలోకః చిత్తే మత్తే, కస్య వివేకః?" అన్నట్లు కన్నులు పొరలు కప్పి చెడిపోతే దేన్నీ చూడలేవు. చిత్తం, మత్తెక్కితే మేలు కీళ్ళు ఎంచదు కదా!

"న చ లోభాత్పరో వ్యాధిః" లోభంకంటే లోకంలో వేరే వ్యాధి లేదు. తన ద్రవ్యాన్ని తాను అనుభవింపడు. మరొక్కణ్ణి అనుభవింపనీయడు సరికదా! పరుల ద్రవ్యం కూడా తనకే చెందాలని పేరాసతో ఉంటాడు లోభి.

"లోభాత్ క్రోధః ప్రభవతి, లోభాత్కామః ప్రజాయతే।
లాభాన్మోహశ్చ నాశశ్చ, లోభః పాపస్య కారణమ్॥"

లోభంవల్ల కామక్రోధాలు తలెత్తుతాయి. అజ్ఞానం ఆవరిస్తుంది. సకల పాపాలు చేయడానికి ప్రేరకమై, లోభం సర్వనాశనం చేస్తుంది.

భక్తిరూపమైన శేముషి కలవానికే మోక్షమార్గచింతన కల్గుతుంది. బ్రహ్మ విద్యకు అంగమైన అర్చిరాదిగతిని స్మరించే యోగంవల్ల హృదయపుండరీక మందున్న పరమాత్మ ప్రసన్నుడవుతాడు. హార్దానుగ్రహంవల్ల జీవాత్మస్థానమైన హృదయాగ్రాన అద్భుతమైన వెలుగు ద్యోతకమవుతుంది.

"శతం చైకా చ హృదయస్య నాడ్యః, తాసాం మూర్ధాన మభినిస్సృతైకా।
తయోర్ధ్వమాయన్నమృతత్వమేతి, విష్వఙ్ఙన్యా ఉత్క్రమణే భవంతి"॥ (కఠ)

హృదయంలోని నూట ఒక్క నాడులలో మస్తకాభిముఖంగా ఉండే ఒక్క సుషుమ్నానాడి ద్వారా ప్రకాశించే మార్గం కలవాడై, భక్తుడైన జీవుడు శరీరం నుంచి ఊర్ధ్వభాగంగా వెడలి అమృతస్వరూపమైన మోక్షం పొందుతాడు. ఈ విషయాన్ని "త దోకోఽ ధికరణం" (బ్ర.సూ.4 అ-2పా-16సూ) లో 'శ్రీభాష్యం' విపులంగా విశదీకరిస్తున్నది.

ఇది రూపకాలంకృతపద్యం.

**మ. పరిపంథిక్రియ నొత్తి వెంటఁబడు నప్పాపంబుఁ దూలించి మీ**
**చరణాబ్జస్థితిపంజరంబు శరణేచ్ఛం జొచ్చితిం గావు మీ**
**బిరుదుం జూడుము మీరు సూడఁగ భవద్భృత్యుండు దుఃఖంబులం**
**బొరయ న్మీకపకీర్తిగాదె శరదంభోజాక్ష నారాయణా ॥ 85**

అర్థం : శరత్+అంభస్+జ+అక్ష = శరదృతువులోని కమలాల వంటి కన్నులు కలవాడా! నారాయణా! మీ చరణ+అబ్జస్థితి పంజరంబు = మీ పాదపద్మాలు అనే స్థిరమైన పంజరం;

శరణ+ఇచ్ఛన్ = రక్షక మనే కోరికతో; చొచ్చితిన్; పరిపంథిక్రియన్ = శత్రువు చేసినట్లు; ఒత్తి = నెట్టి; వెంటబడు; పాపంబు = పాపాన్ని; తూలించి = తొలగించి; కావుము = రక్షింపుము; మీ బిరుదున్ = మీ ప్రవర్తనను బట్టి కలిగిన పేరును; చూడుము; భవత్+భృత్యుండు = మీసేవకుడు; మీరు సూడగ; దుఃఖంబులన్ = ఆపదలను; పొరయన్ = పొందుతుంటే; మీకు; అపకీర్తి, కాదె = మీకు చెడ్డపేరు ఏర్పడుతుందికదా!

తా : శరత్కాలపద్మాలలాంటి నయనాలుకలవాడా! ఓ నారాయణా! మీపాద పద్మాలనే స్థిరమైన పంజరంలోకి రక్షకమనే వాంఛతో ప్రవేశించాను.

శత్రువు వెంటబడి నెట్టి తరుముతున్నట్లున్న పాపాన్ని తొలగించి కాపాడుము. మీకు గొప్ప బిరుదు ఉంది. ఆలోచించుము, మీరు చూస్తుండగా మీ సేవకుడు ఆపదలపాలై దుఃఖపడుతుంటే మీ కపకీర్తి కాదా?

**వ్యాఖ్య : శరణాగతరక్షకుడ వనే బిరుదును సార్థకంచేయుమని కవివిజ్ఞప్తి.**

శరదృతువులో సరస్సులందలి నీరు గంభీరంగానూ, సన్మనుష్యుని మనస్సులాగా ప్రసన్నంగానూ ఉంటుంది. ఆతేటనీటిఉపరితలాన కెందామరలు ప్రకృతి రంజకంగా వికసిస్తాయి. హంసలు రమణీయంగా కులుకుతూ జలాశయాల్లో ఓలలాడుతాయి. శరత్కాలాన వికసించిన కెందామరలవంటి కన్నులు కలవాడు నారాయణుడు. సౌందర్య, సౌకుమార్య, సౌశీల్య, సౌలభ్య, వాత్సల్యాది కల్యాణగుణ దీక్షాదక్షుడు అంభోజాక్షుడు.

జీవితం తామరాకుమీది నీటిబిందువులాగా చంచలమైనది. మృత్యువుకు దయాదాక్షిణ్యాలు లేవు. దానికి కబళించడమే పని. ప్రాణప్రయాణవేదనాదో దూయమాన మానసునికి పుండరీకాక్షునిస్మరణ కలుగుతుందని నమ్మకమేమి? స్వస్థచిత్తుడుగా ఉన్నప్పుడే తనచిత్తాన్ని భగవదాయత్తం చేయడం వివేకవంతునిలక్షణం. మానవజన్మకు మోక్షమే ప్రయోజనం. లౌకికవిషయాసక్తునికి మోక్షం దుర్లభం కదా।

"సంప్రాప్తే సన్నిహితే కాలే న హి న హి రక్షతి డుకృఞ్ కరణే" -

'కృఞ్' ధాతువుకుండే పదిలకారాలూ, యజన్త యజ్‌లుగన్తాలూ వల్లెవేస్తూ ఉంటే చావుకాలం దాపురిస్తే శబ్దశాస్త్రం రక్షించదు. గోవిందుణ్ని భజించుమని బోధించారు భగవత్పాదులు.

"కాణాదంబు ప్రాణాదంబు, కాపిలంబు చాపలంబు, మీమాంస హింస, వ్యాకరణం బశరణంబు - మోక్షార్థులకయ్యవి ప్రతిబంధకములే" అని విష్ణుచిత్తుడు కేవలం భగవత్కైంకర్యపరుడై యుండెనని 'ఆముక్తమాల్యద' యందు వర్ణితం. చిల్లర దేవతలను కొల్చేవారికి చిల్లర సుఖాలే దొరుకుతాయి. ఆ దేవతలకు ఆ కోరికలు దీర్చే శక్తి కూడా నారాయణుడిచ్చినదే కదా!

"మామేవ యే ప్రపద్యంతే మాయామేతాం తరంతి తే" 'నన్నాశ్రయించిన వారికే ప్రకృతిబంధవిముక్తి' అని బోధించాడు శ్రీకృష్ణభగవానుడు.

'సాధారణంగా ఒక చిన్న పిట్ట గూటిచిక్కును విడదీయలేని మనం, మన కర్మబంధాన్ని విడదీసుకోగలమా? ఆ నారాయణుని కాళ్ళు పట్టుకొనే ఊడ కొట్టించుకోవాలి.' (భగవద్విషయావతారిక)

అందుకే ఈ శతకకర్త శరణేచ్ఛతో నారాయణుని పాదపద్మమనే పంజరంలో ప్రవేశించాడు. పంజరమన్నందువల్ల స్వచ్ఛమైన అతని మనస్సే పక్షి అని గమనీయం.

"కృష్ణ! త్వదీయ పదపంకజ పంజరాంతమద్యైవ మే విశతు మానసరాజహంసః" (ముకుందమాల).

శత్రువులెవ్వరూ చేరరాని వజ్రపంజరంలాంటిది భగవత్పాదపద్మం.

ప్రకృతిలో పాపాలన్ని జీవుని వెంటబడి తరుముతుంటాయి. తుదకు కుంభీపాకానికి (నరకానికి) తీసుకొని పోయి హింసకు గురి చేస్తాయి. కాబట్టి పాపాలు పరిపంథులు, ముముక్షువులకు విరోధులు.

"నామీ నః ప్రభవంతి పాపరిపవః స్వామీ నను శ్రీధరః" - (ముకుందమాల. 12)

శ్రీధరుడు మనప్రభువుకదా! మన మాయన నాశ్రయిస్తే ఈ పాపపరిపంథులు మనలనేమీ చేయలేరు. వారే భయంతో పారిపోతారు, అంటారు శ్రీకులశేఖరులు.

'ఒక్కసారి మనం భగవత్పాదాలను పట్టుకుంటే, మనం విడువదలచుకొన్నా అవి మనలను విడవవు' అంటారు ఆళ్వార్లు.

శరణుజొచ్చినవారిని కాపాడే ధర్మజ్ఞుడు భగవానుడు, "విదితస్సహి ధర్మజ్ఞః శరణాగతవత్సలః" (రా.సుం.) 'శరణాగతవత్సలు'డని బిరుదు.

"కాకాయ కంకాయ చ యోదితేష్టం
దాశాయ కీశాయ చ రాక్షసాయ"

కాకాసురుడు, జటాయువు, గుహుడు, సుగ్రీవుడు, విభీషణుడు - మొదలైన వారిని కాపాడడంవల్ల ఆ బిరుదులు వచ్చాయి స్వామికి.

"కిం తు త్వదగ్రే శరణాగతానాం
పరాభవో నాథ! నతేఽనురూపమ్" (ఆళవందార్ స్తోత్రం -25)

ప్రాకృతిక బంధాలచేత దుఃఖాల పాలై నీయెదుటికి వచ్చి శరణుజొచ్చిన వారిని 'శరణాగతరక్షకు'డన్న బిరుదు ఉన్నవాడు, రక్షించడంలేదనే అపకీర్తి నీకు తగదు స్వామీ! అని శ్రీయామునాచార్యుల సూక్తి.

ఇలా జీవుడు దేవునితో, రక్షిస్తాడనే దృఢ విశ్వాసంతో, చేసే సంవాదనను 'ప్రార్థనా మతిః ప్రపత్తిః' అని ప్రపన్నునిలక్షణంగా శాస్త్రం అనుమతించింది.

**మ. సతతాచారము సూనృతంబు కృపయున్ సత్యంబునున్ శీలమున్**
**నతి శాంతత్వము చిత్తశుద్ధికరము న్నధ్యాత్మయున్ ధ్యానమున్**
**ధృతియున్ ధర్మము సర్వజీవహితముం దూరంబు గాకుండ స**
**మ్మతికిం జేరువ మీనివాససుఖమున్ మానాథ నారాయణా॥ 86.**

అర్థం : మానాథ = శ్రీపతీ! నారాయణా! సమ్మతికిన్ = ప్రజ్ఞావంతునికి; సతత+ఆచారము= ఎల్లప్పుడు శుచిగా మెలగడం; సూనృతం = సత్య, ప్రియవాక్యం, కృపయున్ = దయ; సత్యంబునున్ = యథార్థవచనం; శీలమున్ = చక్కని నడవడి; నతి = నమ్రత; శాంతత్వము = శాంతభావం; చిత్త శుద్ధికరమున్ = మనస్సును నిర్మలంగా ఉంచడం; అధ్యాత్మయున్ = ఆత్మజ్ఞానం; ధ్యానమున్ = సంతతస్మృతి; ధృతియున్ = ధైర్యం; ధర్మము = వేదశాస్త్రచోదితలక్షణం; సర్వజీవహితమున్ = సకలప్రాణులకు మేలుచేయడం; మీనివాస సుఖమున్ = మీ సన్నిధి (లో ఉండడమనే) సుఖం; దూరంగాకుండ; చేరువగా ఉంటాయి.

తా : మానాథ! నారాయణా! ప్రాజ్ఞునికి సతతాచారంమొదలు పద్నాలుగు లక్షణాలు అవశ్యంగా ఉంటాయి. దుర్మతికి ఇవి దూరంగా ఉంటాయి. సమ్యక్ జ్ఞానంకలవానికి దగ్గరగా ఉంటాయి.

**వ్యాఖ్య : సమ్యక్ జ్ఞానం కలవ్యక్తియందు ఉండే లక్షణాలను వర్ణించే పద్యం.** మోక్షధర్మాలలో ఆచారమే ప్రథమంగా పరిగణింపబడింది.

"సర్వాగమానామాచారః ప్రథమం పరికల్ప్యతే" (వి.స.నా.ఉత్తరపీఠిక.)

1. సతతాచారం: "బ్రాహ్మే ముహూర్తే ఉత్తిష్ఠేత్" ఉషఃకాలాన మేల్కొనడం, దంతధావనం, స్నానం చేయడమూ ఆరోగ్యానికీ, ఆచారానికీ ప్రధానమైనవి.

"అభ్యంగమాచరేన్నిత్యం స జరాశ్రమవాతహా" - నిత్యమంటే ఇక్కడ ప్రతి వారమని అర్థం. పురుషులు ప్రతి శనివారం, స్త్రీలు ప్రతి శుక్రవారం తలంటు స్నానం చేస్తే, ముసలితనం రాదు. వాతరోగమంటదు. శరీరం చురుకుగా ఉంటుందట.

నిత్యమంటే ప్రతిదినమనీ చెప్పే వారున్నారు. డా. ఆచంట లక్ష్మీపతిగారు ప్రతిదినమూ అభ్యంగన స్నానమందుకే చేసేవారు.

"ఉద్ధరతి భక్తజనానితి ఊర్ధ్వతాశ్రయణ సూచితశక్తిమ్"।

"ఉత్థం తత్పుంద్రమూర్ధ్వం జనిమరణతమఃఖండనం మండనం నః"అన్నట్లు

ఆత్మ యొక్క ఊర్ధ్వగమనాన్ని సూచించే ఊర్ధ్వపుండ్రధారణం, కర్మసాక్షి యైన సూర్యునికి నమస్కరించడం, సంధ్యావందనం ఆరోగ్యదాయకం.

"సంధ్యాహీనోఽశుచిర్నిత్యమనర్హ స్సర్వకర్మసు" (దక్షస్మృతి) సూర్యనమస్కారం, సంధ్యావందనం చేయనివాడు అంటరానివాడని ఆచారకాండ చెబుతుంది.

"ఆచారహీనం న పునంతి వేదాః" ఆచారపరుడు కాని వ్యక్తిని వేదమంత్రాలు కూడా పావనం చేయలేవని 'వసిష్ఠస్మృతి' వాక్యం.

శుచిర్భూతుడు సర్వకర్మలను చేయడానికి అర్హుడుకదా!

2. సూనృతం: "సూనృతం ప్రియే సత్యే" (అమరం) ప్రియమైన, సత్యమైన మాట. "అనుద్వేగకరం వాక్యం సత్యంప్రియహితం చ యత్" (భ.గీ.17-15) మాటాడేవానికీ, వినేవానికీ చిత్తక్షోభం కలిగించరాని మాట.

"వరం కూపశతాద్వాపీ, వరం వాపీ శతాత్క్రతుః। వరం క్రతుశతాత్పుత్రః"

నూరునూతులకంటె దిగుడుబావి, నూరుబావులకంటె ఒక క్రతువు, నూరుక్రతువులకంటె ఒక సుపుత్రుడు మేలు. "తత్సుత శతకంబు కంటె ఒక సూనృతవాక్యము మేలు చూడఁగన్" (భారతం.)

3. కృప: వ్యసనేషు మనుష్యాణాం భృశం భవతి దుఃఖితః"(రామాయణం). దీనుల దుఃఖాన్నీ, కష్టాలనూచూచి చిత్తం ద్రవించి కన్నీరొలుకడం దయాలక్షణం - దయాళువుకు త్యాగబుద్ధి ఉంటుంది.

4. సత్యం: సకారం జీవవాచకం, తకారం ప్రకృతి వాచకం, 'యం' అంటే ఆజీవ ప్రకృతులరెంటినీ నియమించే సామర్థ్యం. కాబట్టి 'సత్యం' పరబ్రహ్మవాచకం. కాబట్టి "సత్యేన లోకాన్ జయతి" సత్యవాక్పాలకుడు లోకాలను జయిస్తాడు.

సత్యం ప్రామాణికవ్యవహారం. (ధర్మసూక్ష్మమిలా ఉంది.)

"న తథ్యవచనం సత్యం నాతథ్యవచనం మృషా।

యద్భూతహితమత్యంతం తత్సత్యమితరన్మృషా॥"

ఉన్నదున్నట్లు చెప్పడం సత్యమూ కాదు. అబద్ధం అసత్యమూ కాదు.

"భూతహితంబుకై పలుకుబొంకును" సత్యమే అవుతుంది.

మునిఆశ్రమంలో తలదాచుకొన్న బాటసారుల విషయాన్ని అ ముని యథార్థంగా దొంగలకు చెప్పగా, వారు ధనం దోచుకొని బాటసారులను చంపివేశారు. ఆ పాపమంతా మునినెత్తిమీద పడిందని శ్రీకృష్ణుడు పార్థునికి చెప్పాడు (భార-కర్ణప.) కాబట్టి, హింసను నివారించే అసత్యం సత్యంగా పరిగణితం.

5. శీలం: సచ్చరిత్ర. ఏ యెండకాగొడుగు పట్టడం కాదు.

"మనస్యేకం, వచస్యేకం, కర్మణ్యేకం మహాత్మనామ్" - మనస్సు, మాట, చేష్ట (మూడు)త్రికరణాలు ఒకే ఋజుమార్గంలో, సామాజిక ధార్మికవిషయాలను అతిక్రమింపక, ప్రవర్తించడం 'శీలం'.

6. నతి: దాంభికంగా ప్రవర్తించక, ప్రవాహంలో ప్రబ్బలిచెట్టులాగా, సమ్రతతో వర్తించడం.

7. శాంతత్వం: జ్ఞానకర్మేంద్రియాలను విషయాసక్తంకాకుండా మనస్సును నిరోధించి, వాటిని సమాజశ్రేయస్సుకోసం ఉపయోగించేరీతిగా భద్రపరచుకోవడం శాంతస్వభావం.

8. చిత్తశుద్ధికరం: మనస్సును నిర్మలంచేసుకునే విధానం. వివేకం, విమోకం, అభ్యాసం, క్రియా, కల్యాణం, అనవసాదం, అనుద్ధర్షణం అనే సాధన సప్తకం వల్ల మనస్సుకు శుద్ధి కలుగుతుంది. 'సర్వత్ర ప్రసిద్ధ్యధికరణం' - (శ్రీభాష్యం) లో విశదీకృతం.

9. అధ్యాత్మ: ఆత్మపరమాత్మల స్వరూపజ్ఞానం, "అధ్యాత్మ విద్యా విద్యానామ్" (భ.గీ.10-32) జననమరణరూపమైన సంసారబంధంనుంచి విముక్తి నొందే జ్ఞానం. ఇది వేదాన్తశాస్త్రోపదిష్టం.

10. ధ్యానం: యోగకృత్యం తు యోగానాం ధ్యానమేవ పరం బలమ్" మధుకైటభుల వలె కలిసియున్న రాగద్వేషాలను నివృత్తి చేసి మనస్సును దైవాభిముఖంగా మలచి, అవిచ్ఛిన్నస్మృతి కలిగియుండడం.

11. ధృతి: ధృతిర్దృష్టిర్మతిర్దాక్ష్యం స్వకర్మసు న సీదతి".

ధైర్యం, సూక్ష్మ దృష్టి, మేధ, కార్యకారణ సామర్థ్యం - ఈ నాలుగు గుణాలున్నవాడు విజయాన్ని సాధిస్తాడు. అందులో ధృతి గుణానికే ప్రాథమ్యం ఆరంభించిన కార్యాన్ని విఘ్నాలెన్ని కలిగినా నెరవేర్చేదైవీసంపద కల్గిన మనోధర్మం ధృతి.

12. ధర్మం: "యతోఽభ్యుదయనిశ్శ్రేయససాధనం ధర్మః"(కణాదవైశేషికసూత్రం.)
సామాజికజీవనగతిలో దైనందినాభివృద్ధికీ, మోక్షానికీ సాధనమైనది ధర్మం.
'ధరతీతి ధర్మః' (కర్త్రర్థక వ్యుత్పత్తి) ధర్మో విశ్వస్య జగతః ప్రతిష్ఠా ।
సమస్త ప్రపంచాన్ని నిలిపేది ధర్మం. "ధ్రియతే అనేన ఇతి ధర్మః(కరణవ్యుత్పత్తి).
వేద శాస్త్రాలు చెప్పిన విధి నిషేధాలను పాటించడం ధర్మం.
"ధర్మేణ పాపమపనుదతి." ధర్మమాచరిస్తే పాపం తొలగుతుంది.

"అక్షైర్మాదీవ్యః" - జూదమాడకుము.

"కృషిమత్కృషస్వ" - కష్టపడి పనిచేయుము.

"విత్తే రమస్వ" - కలిగిన కలిమితో తృప్తిపడుము.

బోధిస్తే ధర్మం, ఆచరిస్తే కర్మం అవుతుంది.

13. సర్వజీవహితం: సకల ప్రాణులకు మేలు చేయడం. దీనికి దయాక్షమాదానగుణాల సహకారమావశ్యకం.

14. భగవన్నివాససుఖం: భగవంతుని సన్నిధిలో తాను ఉండాలనో లేదా తన హృదయపద్మసద్మంలో భగవంతుడు నివసించాలనో కోరడం జీవలక్షణం. "నిధి సుఖమా? రాముని సన్నిధి సుఖమా?" (త్యాగరాజు)

"శివేన మే సంతిష్ఠస్వ స్యోనేనమే సంతిష్ఠస్వ" (శ్రుతి)

సర్వేశ్వరా! నీవు సకల కల్యాణ గుణాలతో సుఖంగా నాయెదలో ఉండవయ్యా! అని వేదమూర్తులు అంజలి ఘటించి వేడుకొంటారు. భగవదుపాసనవల్ల ఆయనగుణాలే తనకు సంక్రమిస్తాయని వేదవిహితం.

**మ. భవనాశిన్ గయ తుంగభద్ర యమునన్ భాగీరథిం గృష్ణ వే**
**త్రవతి న్నర్మద పెన్న గౌతమి పయోరాశిన్వియద్గంగయం**
**దవగాహంబున నైనపుణ్యములు బెంపారంగ నేఁడిచ్చటన్**
**భవదంఘ్రిస్మరణంబునం గలుగుపో పద్మాక్ష నారాయణా॥ 87**

అర్థం : ఓ పద్మాక్ష = ఓ అంభోజనయనా ! నారాయణా! భవనాశిన్ = భవనాశియనే పేరుగల నదియందు; గయ, తుంగభద్ర, యమున, భాగీరథి, కృష్ణ, వేత్రవతి, నర్మద, పెన్న, గౌతమి = గోదావరి; పయోరాశిన్ = సముద్ర మందు; వియత్+గంగ = ఆకాశగంగ యందు; అవగాహంబునన్ = స్నానంచేత; ఐన = కలిగిన; పుణ్యములు = సుకృతాలు; నేడు; ఇచ్చటన్ = ఉన్నచోటనే; భవత్+అంఘ్రి స్మరణంబునన్ = మీ పాదాలను ధ్యానించడంచేత; పెంపారంగ = అతిశయంగా; కలుగు పో = సంభవించును కదా!

తా : ఓ పద్మాక్ష! నారాయణా! భవనాశిమొదలైన పవిత్రనదులయందు స్నానం చేయడంవల్ల కలిగే పుణ్యరాశి, ఈనాడు ఉన్నచోటున మీ చరణస్మరణవల్లనే సమృద్ధిగా కలుగుతుందిసుమా!

**వ్యాఖ్య : పవిత్రనదులందు తీర్థమాడిన పుణ్యం, నారాయణచరణస్మరణవల్ల కలుగుతుందని వర్ణితం.**

త్రివిక్రముని వామపాదమందు ఉద్భవించిన ఆకాశగంగ భగీరథుని తపః ఫలితంగా దివినుంచి భువికి వచ్చి, పెక్కు పేర్లతో, నదీనదాలుగా ప్రవహించింది.

నదులు తూర్పు దిక్కుకు, నదాలు పడమటి దిక్కుకు ప్రవహిస్తూ సముద్రంలో సంగమిస్తున్నాయి.

పుణ్యభూమి, కర్మభూమియైన భారతదేశంలో, పద్యంలో పేర్కొన బడిన భవనాశి మొదలైన ద్వాదశనదీనదజలాలు పౌరులకు యోగక్షేమాలను కల్పిస్తున్నాయి. వాటిపరీవాహప్రదేశాలు తీర్థస్థలాలుగా ప్రసిద్ధి పొందాయి. భారతీయసంస్కృతికి ఆయువుపట్టువులయ్యాయి.

"ఉశతీరివ మాతరః" - అవి కన్నబిడ్డల అభ్యుదయార్థం పాటుపడుతున్నట్లున్న తల్లులట.

"అత్యాశనా దతీపానాత్ యచ్చ ఉగ్రా త్ప్రతిగ్రహాత్"

ఎక్కడ దొరికితే అక్కడ ఎక్కువగా తిని, త్రాగి, ఇష్టంవచ్చినట్లు తిరిగినందువల్ల కలిగిన వ్యాధిరూపపాపాలను కెరటాల రూపంలో ఉన్నచేతులతో నఖశిఖపర్యంతం తుడిచి వేసి, దేహపుష్టినీ, సర్వకర్మసమారాధనకు యోగ్యమైన చిత్తశుద్ధినీ కలిగిస్తాయన్నది శ్రుతి.

గైరికాది ధాతువులతోనూ ఇరుదరుల యందున్న తరుమూలాలతోనూ ఒరసి, రకరకాల రసాయనాలున్న నేల పొరలలో దొరలుతూ పారే ఏటి నీటిలో మునిగి చేసేస్నానం ఎన్ని పుణ్యాలకు మూలమో! పర్వదినాలలో సముద్రస్నానం చేయడం ఎంతో సుకృతం కదా!

స్నానం చేసే సమయంలో గోవింద! పుండరీకాక్ష! నారాయణ! అంటూ శిరః స్నానం చేయకపోతే అది, గజస్నానం లాగా నిష్ఫలమవుతుందని ఇదివరకే చెప్పబడింది కదా! ధనాన్ని వెచ్చించి, కాలాన్ని వ్యయంచేసి, శ్రమకోర్చి దూర తీరాలకు పోయి సంపాదించుకొన్న పుణ్యరాశి, ఒక్క నారాయణ చరణారవిందాలను ఉన్నచోటనే నిశ్చలంగా స్మరిస్తే క్షణంలో చిత్తానికి హత్తుకొంటుంది.

"యమో వైవస్వతో రాజా యస్తవైష హృది స్థితః।

తేన చేదవివాదస్తే మా గంగాం మా కురూన్ గమః"(మనుస్మృతి)

దేహాంతంలో పరలోకాన యమునిచే బాధపడుతామనే భయపడి పాపాలను చేయకుండడం, సూర్యుడు వెలిగే పగలు పాపాచరణకోసం భయపడడం, ఈ రెండింటినీ నిర్లక్ష్యంచేసే వారైనా రాజుకు భయపడి పాపం చేయరు. ఈ మూడింటినీ లక్ష్యం చేయనివారుకూడా అంతర్యామికి భయపడి పాపం చేయరుకదా!

'యము' డంటే చేతనాచేతనాలను నియమించే పరమాత్ముడు.

సూర్యమండలమధ్యవర్తి యైన నారాయణుడే వైవస్వతుడు. ప్రకృతిని

ఆనందింపజేసేవాడు రాజు. అందరి హృదయాల్లోనూ ఉండేవాడు పరమాత్ముడే. "నేను స్వతంత్రుడను కాబట్టి అంతా నాదే" అంటూ భగవంతునితో వివదించే వారికి, తాము చేసిన అపరాధాలకు ప్రాయశ్చిత్తంగా, తీర్థయాత్రచేయడం, పవిత్రనదీ జలాల్లో క్రుంకులిడడం ఆవశ్యకం.

'నీ హృదయకమలమందున్న (అంతర్యామి) పరమాత్మతో నీకు వివాదం లేకుంటే గంగాది తీర్థాలకుగానీ, కురు దేశాది పుణ్యక్షేత్రాలకు గానీ వెళ్ళవద్దు' అని పెద్దలు ఉపదేశిస్తుంటారు.

"స గంగా స గయా సేతుః స కాశీ స చ పుష్కరమ్।
జిహ్వాగ్రే వర్తతే యస్య హరి రిత్యక్షరద్వయమ్॥" (హర్యష్టకం)

'హరి' అనే రెండక్షరాలు నాలుకమీద నర్తించిన వ్యక్తి (లక్షణయా) గంగలాగా పవిత్ర తీర్థుడవుతాడు. గయాక్షేత్రంవలె పితృదేవతలను పిండోదకాలతో తృప్తిపరచి అభ్యుదయాన్ని పొందుతాడు. రామకార్యార్థులై కపివరులు కట్టిన వారధి (సేతువు) లాగా శ్రీ హరికృపకు పాత్రుడవుతాడు. కాశివలె భగవంతుని నామవైభవాన్ని చాటే భాగవతశిఖామణి అవుతాడు. పండ్రెండు సంవత్సరాలకు ఒక్కొక్కనది యందు బృహస్పతి ప్రవేశించే పుష్కరక్షేత్రంలాగా, తానే సాక్షాత్కరిస్తాడు. ప్రారబ్ధకర్మ ఫలాన్ని అనుభవిస్తున్న ఈజన్మలోనే భగవదంఘ్రి స్మరణచేస్తున్న ప్రాణి, మరణానంతరం సాయుజ్యమనే మోక్షానందాన్ని పొందుతాడుకదా! కాబట్టి -

"పృథివ్యాం యాని తీర్థాని పుణ్యాన్యాయతనాని చ।
తాని సర్వాణ్యశేషాణి, హరి రిత్యక్షరద్వయమ్॥"

సకలతీర్థక్షేత్రాభిగమనంవల్ల కలిగే పుణ్యాలన్నీ, ఒక్క హరినామ స్మరణ పుణ్యంలో ఇమిడి ఉన్నాయనడం రెండువాదాలకు తావులేని మాట.

"స్యాద్ధర్మ మస్త్రియాం పుణ్యం" - పుణ్యమంటే ధర్మమే (అమరకోశం). సకల శాస్త్రావగాహియైన ఈ శతకకవి ధన్యజీవులలో మూర్ధన్యుడు.

**మ. ధర గ్రామాధిపునింటిదాసుఁడు వెసం దా ద్రోహముంజేసినన్**
**పరగం జెల్లుట సూచి తీభువనసంపాద్యుండవైనట్టి మీ**
**వరదాసావళిదాసదాసినని దుర్వారాఘముల్ జేసితిన్**
**కరుణం జేకొని కావుమయ్య త్రిజగత్కల్యాణ నారాయణా॥ 88**

అర్థం: త్రిజగత్ కల్యాణ = ముల్లోకాలకు మంగళకరుడా! నారాయణా! ధరన్ = లోకంలో; గ్రామ+అధిపుని ఇంటి దాసుడు = ఒక ఊరి దొరయింటి సేవకుడు; వెసన్ = త్వరగా; తాన్; ద్రోహమున్ = అపకారాన్ని; చేసినన్ = చేసినప్పటికీ; పరగన్, చెల్లుట,

సూచితి + ప్రసిద్ధంగా ఒప్పిదమై సాగిన దాన్ని చూచాను. దుర్వారాఘముల్ = ఘోరపాపాలను; చేసితిన్; చేసినాను. ఈ భువన సంపాద్యుండవైనట్టి = ఈజగత్తును కల్పించినవాడవైన; మీ = మీయొక్క; వరదాస+ఆవలి = గొప్పసేవకుల సమూహాలకు; దాస, దాసిని = సేవకులైన వారికి సేవకురాలను; అని = తలచి; కరుణన్ = కృపతో; చేకొని = కైకొని; కావుము+అయ్య = కాపాడుము, తండ్రీ!

తా : ముజ్జగాలకు మేలుచేసే ఓ నారాయణా! ప్రపంచంలో ఒక్క గ్రామాధికారి ఇంటి సేవకుడు ద్రోహంచేసినా, ప్రసిద్ధంగా చెల్లిన విషయాన్ని గమనించాను. నేను తొలగించరాని అపచారాలను కుప్పలుకుప్పలుగా చేశాను. ఈ ప్రపంచాన్ని రచించిన దొరవైన మీకు ప్రియులైన పరిచారక సమూహాలకు పరిచర్య చేసే వారికి పరిచారిక నని భావించి నన్ను దయతో చేపట్టి రక్షింపుము తండ్రీ!

**వ్యాఖ్య: భగవద్దాస దాస దాసి యైన తనను కాపాడుమనే కవిపద్యమిది.** భాగవతధర్మం అతిగహనమైనది. భోగబుద్ధిని విడిచి భగవంతుని ప్రీతికోసమే సకలసేవలు చేసే యోగబుద్ధిగల వ్యక్తులను - భగవంతుని భక్తులను - భాగవతులంటారు, భాగవతోత్తముడు 'దాసుడు' అనే పేరుతో వ్యవహరిస్తాడు.

"శ్రీమద్భాగవతార్చనం భగవతః పూజావిధేరుత్తమమ్" (రామానుజసూక్తి) భగవంతునికి దాసులుగా ఉండడమే కాదు, భగవద్దాసులకు దాసులుగా వర్తించడమే జీవితపరమార్థం. మనమెన్నో అపరాధాలు చేసిన, చేస్తున్న మొనగాళ్ళమే కదా! భగవంతుడు ప్రభువు, స్వతంత్రుడు, అపరాధ చక్రవర్తులు ఎంతప్రార్థించినా, ఆచక్రధారి వారిని (శిక్షాశాస్త్రంరీతిగా) నరకంలోకి త్రోసి వేయనూ వచ్చు.

"సిద్ధిర్భవతి వా నేతి సంశయోచ్యుత సేవినామ్।
న సంశయోఽస్తి తద్భక్తపరిచర్యారతాత్మనామ్॥

అచ్యుతుణ్ని సేవించిన వారికి సిద్ధికలుగుతుందో లేదో అనుమానమే. ఆయన భక్తులను సేవించేవారికి అనుమాన మక్కర్లేదు.

"వినా భాగవతాపచారం మోక్షవిరోధో నాస్తి'

భగవద్భక్తులకు అపచారంచేయకపోతే మోక్షం పొందడానికి ఆటంకమే లేదు, అని పూర్వాచార్యసూక్తి. భాగవతులు ఆమోదిస్తే భగవంతుడు అంగీకరిస్తాడు.

"విధేయాత్మా" అని విష్ణుసహస్రనామాల్లో పరమాత్ముడు తనదాసులకు విధేయుడుగా ఉంటాడనే ఒక పేరుందికదా!

భక్తుడు వినయవిధేయతలతో ఎంతక్రిందికి ఉంటే, దాసభావానికి అంత ఉత్కర్ష, ఔన్నత్యం ఉంటుంది. (మూడవ పద్యం వ్యాఖ్యలో దాస్య విధం ఉంది.) శ్రీకులశేఖర మహారాజు (ముకుందమాలలో) -

"త్వద్భృత్య భృత్య పరిచారక భృత్య భృత్య భృత్యస్య భృత్య ఇతి మాం స్మర లోకనాథ!" తనకంటె ఆరు అంతస్థుల పైన ఉన్న భగవద్దాసానుదాసులకు తాను దాసుడుగా గుర్తించుమని జగన్నాథుణ్ని ప్రార్థించాడు.

"యః సప్తపర్వవ్యవధానతుంగాం, శేషత్వకాష్ఠామభజన్మురారేః"।

శ్రీ శఠకోపసూరికి సప్తపురుషవ్యవహితమైన దాసత్వం అభిమతమయింది. ఆ శఠకోపనామాన్ని ధరించిన భక్తులు అష్టపురుష వ్యవధానం ఉన్న దాసత్వ అధ్యవసాయంకలవారే అని శ్రీవేదాన్తదేశికులు'పాదుకాసహస్రం'లో దాసత్వోత్కర్షను ఉగ్గడించారు.

దాసీత్వ విషయం: పతివిషయంలో పత్నికి అనన్యార్హత్వం, అనన్యభోగ్యత్వం, అనన్యశరణ్యాత్వం అనే ఆకారత్రయసంపద సంభవిస్తున్నట్లే, దేవునిపట్ల జీవునికీ వర్తిస్తుంది. సమాధియోగమందు సాక్షాత్కరించిన పురుషోత్తమునిసంశ్లేషంతో సుఖమూ, విశ్లేషంతో దుఃఖమూ పొందడం; ఆయన చేతనే నిర్వహింపబడడం స్త్రీ ధర్మంగా చెప్పబడింది.

" స ఏవ వాసుదేవోఽసౌ సాక్షాత్పురుష ఉచ్యతే।
స్త్రీప్రాయమితరత్సర్వం జగద్బ్రహ్మపురస్సరమ్॥"
వాసుదేవుడొక్కడే పురుషోత్తముడు, బ్రహ్మతోకూడిన ఈ జగమంతా స్త్రీప్రాయమే".
"స్వామిత్వాత్మత్వశేషిత్వపుంస్త్వాద్యాః స్వామినో గుణాః ।
స్వేభ్యో దాసత్వదేహత్వశేషత్వస్త్రీత్వదాయినః ॥"

స్వతంత్రుడైన భగవంతునికీ, పరతంత్రులైన చేతనులకూ స్వామిత్వం దాసత్వం; ఆత్మశరీరభావం; శేషి-శేషత్వం; పుంస్త్వం - స్త్రీత్వం; ఇత్యాదిగా శాస్త్రోక్తం. కాబట్టి 'దాసుణ్ని' అనడంకంటె 'దాసిని' అని భావించడంలో శేషత్వోత్కర్షయేకాక, ఆకారత్రయసంపత్తూ ప్రాప్తిస్తుంది. దాసీభావనగల భక్తులయెడ భగవంతుడు "గోవువెంటఁదగులు కోడెభంగి" ఉంటాడని భాగవత మధురభావన.

శ్రీ మహావిష్ణువు బలిచక్రవర్తి రక్షణకోసం సుతలలోకాన కావలి ఉన్నట్లే, మహాదేవుడు భక్తత్రాణుడై బలిసుతులలో పెద్దవాడైన బాణాసురునిఇంటికి సపరివారంగా కావలి ఉన్నట్లు పరాశరవ్యాసకృతులవల్ల తెలుస్తున్నది.

బాణాసురుణ్ని కాపాడడానికి శ్రీకృష్ణునితో ప్రమథాధిపుడు యుద్ధంచేసి "జృంభణ శరపాతముచే శంభుడు" ఆవలింతలతో నిద్రాపరవశుడయ్యాడు. బాణుని వేయి చేతులను (రెండు-వి.పు) నాలుగు మిగులునట్లుగా (భాగ) శ్రీకృష్ణుడు నరికి వేశాడు. అప్పుడు "సమానాధికవస్తుశూన్యుండవైన నిన్ను నేనునుం బ్రహ్మయుం

బరిణతాంతఃకరణులైన మునిగణంబులును భజియించుచుందుము" అని ఈశ్వరుడు శ్రీకృష్ణుణ్ని సన్నుతించాడు. ప్రహ్లాదునివంశంలో పుట్టినవారిప్రాణాలను మాత్రం తీయనన్నాడు శ్రీకృష్ణభగవానుడు (భాగవతగాథ).

ఒక్క శోణపురాధీశుడు బాణాసురుడు, సర్వభువనాధిపుడు నారాయణుడు. ఒక్క గ్రామాధిపుని ఇంటికి దాసుడైనంత మాత్రాన యుద్ధానికి తలపడిన ద్రోహం చేసినా, శంకరునిమాటను కాపాడాడు. ఆయన తప్పును ఒప్పుగానే చూశాడు కదా! శ్రీకృష్ణుడు. అది ప్రసిద్ధవిషయం.

ఈ కవి, జన్మజన్మలలో చేసిన తప్పులు కుప్పలు కుప్పలు అయినా, నారాయణునికి తప్ప మరెవ్వరికీ తెలిసిన విషయం కాదు. ఆతప్పులు దుర్వారమైనా, తాను కరుణిస్తే నివారింపబడుతాయి.

ఆ వ్యక్తి ఒకరియింటికి దాసుడు. అందులో పౌరుషం మెరుస్తున్నది. ఈవ్యక్తి త్రిజగత్కల్యాణుడైన నారాయణునిదాసబృందాలకే దాసులైనవారికి దాసి. ఇందులో స్త్రైణం జాగృతమవుతున్నది.

భక్తి ప్రణయంగా పరిణమించడంవల్ల విరహసంగమప్రవృత్తులతో అంతరంగాన్ని సింగారింపజేసి, భగవదనుభవాన్ని పొందడం దాసిధర్మం. దాసదాసీభావతారతమ్యాన్ని వలపుల తలపులతో తలకెక్కించడంవల్ల పురుషోత్తమునిచిత్తం మెత్తపడుతుంది. హృదయం స్పందిస్తుంది. అలాంటప్పుడు కల్యాణమూర్తి కరుణతో కరగ్రహణం చేసి దాసిని కావకుండా ఉంటాడా? ఇలాంటి అధ్యవసాయగాంభీర్యం ఈ కవికేసరికే సరి.

**మ. గణుతింపన్ బహుధర్మశాస్త్రనిగమౌఘంబెప్పుడున్ని న్నకా**
**రణబంధుండని చెప్ప నత్తెలఁగు దూరం బందకుండంగనేఁ**
**బ్రణతుల్ జేసెదఁ గొంతయైన; గణుతింపంబాడి లేకుండినన్**
**ఋణమా నానుతి, నీవు శ్రీపతివి నీకే లప్పు? నారాయణా॥ 89**

అర్థం: ఓ నారాయణా! బహు ధర్మశాస్త్ర నిగమ+ఓఘంబు = అనేక ధర్మ శాస్త్రాలనూ, వేదాలనూ. గణుతింపన్ = పరిశీలించగా; నిన్ను, ఎప్పుడున్, అకారణబంధుండు = కారణంలేని చుట్టం; అని, చెప్పన్; ఆ తెలగు = ఆ పద్ధతి; దూరంబు, అందక, ఉండంగ = అందనంతదూరంగా ఉంటుంటే; నే, ప్రణతుల్, చేసెదన్ = నేను దండాలు పెడుతాను. కొంతయైన; గణుతింపన్ = లక్ష్యపెట్టడం; పాడి = న్యాయం, లేకుండినన్ = లేకుంటే; నా, నుతి = నా స్తోత్రం/శతకం; ఋణమా = అప్పు అవుతుందా? నీకు, ఏల, అప్పు = నీకెందుకు ఋణమవుతుంది? నీవు; శ్రీపతివి = లక్ష్మీనాథునివి.

తా : ఓ నారాయణా! ధర్మశాస్త్రాలూ, వేదాలు నిన్ను అకారణబంధువని

బోధిస్తున్నాయి. ఆ బంధు మార్గం దూరంకాకుండా నేను దండం పెడుతాను. నీవు దాన్ని లక్ష్యపెట్టడం న్యాయం. లేకపోతే, నేను చేసే నుతి - స్తోత్రం నీకు ఋణంగా పరిణమిస్తుందనుకొంటే, లక్ష్మీపతికి ఋణమెందుకవుతుంది? - కాదని తాత్పర్యం.

**వ్యాఖ్య : నారాయణుడు నిరుపాధికబంధువని వర్ణన.**

లోకంలో మాతాపితృకళత్రపుత్రాదులు ఆభాసబంధువులు. ఆభాసబంధువులమీద ఆసక్తి భవరోగాల్లో ఒకటి (37వ పద్యవ్యాఖ్యలో ఉంది).

"ఋణానుబంధరూపేణ పశుపత్నీసుతాలయాః।
ఋణక్షయే క్షయం యాంతి కా తత్ర పరివేదనా!"

పశుపత్నీసుతాదిబంధుత్వం జన్మాంతరఋణసంబంధాలచేత ఏర్పడింది. ఇది అనుబంధమేకాని సంబంధం కాదు. ఆ ఋణానుబంధం, ఋణం తీరగానే నశిస్తుంది. ఈ దేహబంధువుల పట్ల అత్యాసక్తిగానీ, (వారు నశించగానే) దుఃఖపడడంగానీ నిరర్థకం.

స్వరూపంచేతనూ, స్వభావం (గుణాల) చేతనూ బృహత్త్వం కలవాడు శ్రీమన్నారాయణుడే. అతడే జిజ్ఞాస్యుడు. "లోకవత్తు లీలాకైవల్యమ్" (బ్ర.సూ.2-1-33) లోకంలో అధికారులు లీల కోసం బంతిఆట ఆడేరీతిగా, పరబ్రహ్మకూడా ఏప్రయోజనం ఆశించక, కేవలం లీలకోసమే జగత్సృష్ట్యాదికం చేస్తుంటాడు.

"సర్వేషాం తు సనామాని కర్మాణి చ పృథక్ పృథక్।
వేదశబ్దేభ్య ఏవాదౌ పృథక్ సంస్థాశ్చ నిర్మమే॥" (మనుస్మృతి)

ఆపరబ్రహ్మ అన్నింటికి నామధేయాలను, కార్యాలను, రూపసంనివేశాలను వేర్వేరుగా వేదాలయందలి శబ్దాలను బట్టి సృజించాడు.

"వైషమ్యనైర్ఘృణ్యే న సాపేక్షత్వాత్" (2-1-34)

జీవులు చేసుకొన్న కర్మలనుబట్టి వారిని ఉత్తమలోకవాసులనుగానో లేదా అధమలోకవాసులనుగానో భగవంతుడు సృజిస్తాడు.

"సాధుకారీ సాధుర్భవతి, పాపకారీ పాపో భవతి" (బృహదా.6-4-5)

మంచిపని చేసినవాడు మంచివాడుగా పాపకార్యాలను చేసినవాడు పాపిగా జన్మిస్తాడని ఉపనిషద్బోధ. ఇలా సృజించడంవల్ల సర్వేశ్వరుడు పక్షపాతం, నిర్దయకలవాడని భావించడానికి అవకాశం లేదని 'బ్రహ్మసూత్రం' విశదీకరిస్తుంది.

"తత్సృష్ట్వా తదేవానుప్రావిశత్" తాను సృజించిన చేతనాచేతనవర్గంలో తానూ ప్రవేశించిఉంటాడు. అని శ్రుతివాక్యార్థం.

"ఏష నారాయణః కృష్ణః ఫాల్గుణశ్చ నరః స్మృతః।
నారాయణో నరశ్చైవ సత్త్వమేకం ద్విధాకృతమ్"॥ (భార.ఆది.)

శ్రీకృష్ణుడు నారాయణుడు. పార్థుడు నరుడు. ఈ నరనారాయణుల సత్త్వం ఒక్కటే అయినా, అది రెండు విధాలుగా చేయబడింది. జీవాత్మ పరమాత్మలది నశించని తత్త్వంకదా!

"యస్యాత్మా శరీరం, యః ఆత్మానం అంతరో యమయతి" అనే శ్రుతి వాక్యం వల్ల జీవాత్మపరమాత్మలకు శరీరాత్మభావసంబంధం ఉందని తెలుస్తుంది. కాబట్టి నారాయణుడు ఆత్మబంధువు.

(38వ పద్యవ్యాఖ్యలో నవవిధసంబంధం స్పష్టమయిందికదా!)

"ఉరుక్రమస్య స హి బంధురిత్థం" (విష్ణుసూక్తం). "ఇత్థముక్తప్రకారేణ స హి బంధుః స ఖలు సర్వేషాం సుకృతినాం బంధుభూతః హితకరో వా, తస్య పదం ప్రాప్తవతాం న పునరావృత్తిః" అన్న ప్రకారంగా సుకృతాత్ములందరికీ బంధువైనవాడు / హితకరుడు సర్వేశ్వరుడు. ఆయన స్థానాన్ని / పాదాన్ని పొందినవారికి పునర్జన్మ లేదు. అని సాయణభాష్యం.

"స ఓతః ప్రోతశ్చ విభుః ప్రజాసు" సర్వప్రజలయందు నారాయణుడు 'పడుగు పేక' లాగా వ్యాపించి ఉన్నాడు. కాబట్టి జీవాత్మ పరమాత్మలది నిత్యసంబంధంకదా!

"స నో బంధుర్జనితా స విధాతా" అతడే నిజమైన బంధువు. లోకంలో తండ్రి, పుత్రుని దేహ మాత్రానికి ఉత్పాదకుడు. కాని నారాయణుడు తండ్రికి కూడా తండ్రియేకదా!" ఎందతందతండై" - అనీ, "సపితుః పితా సత్" జగన్నిర్మాతకాబట్టి, అందరికీ బంధువైనవాడు ఒక్కవ్యక్తికి మాత్రమే బంధువనే భావన కలుగనేరదు. అందువల్ల వేదశాస్త్రాలన్నీ అవాప్తసమస్తకాముడైన నారాయణుడు అకారణబంధువని నొక్కి వక్కాణించాయి.

అందరికీ హితకరుడైనప్పుడు ప్రత్యేకంగా ఒక వ్యక్తిని మాత్రం కటాక్షించడం దూరాలోచనయే కాని దురాలోచనమాత్రం కాదు కదా!

అందుకే ఈ కవి, తనను కటాక్షించడానికి నతులూ నుతులూ అర్పిస్తా నన్నాడు. సుఖం కోరేవాడు శ్రమపడడం న్యాయం. పరిశ్రమించేవాడు జీవుడు. ఫలదాత నారాయణుడు. ప్రార్థించిన - స్తోత్రం చేసిన - వానికి కొంతనైనా ఫలమీయకుంటే, ప్రార్థితుడు ఋణపడి ఉంటాడు.

"గోవిందేతి యదాక్రందత్ కృష్ణా మాం దూరవాసినం।
ఋణం ప్రవృద్ధ మివ మే హృదయాన్నాపసర్పతి॥" (భార-ఉద్యోగ.)

ద్రౌపది 'గోవింద!పుండరీకాక్ష!' అని ప్రార్థించింది. శ్రీకృష్ణుడు వెంటనే వలువల నిచ్చి ఆమెను మానభంగంనుంచి రక్షించాడు. అయినా, తనను నుతిస్తూ,

రెండుచేతులు పైకెత్తి ప్రణతులర్పిస్తుంటే తాను ఆమె దగ్గరికి పోయి దర్శన మీయక, దూరంగా ఉన్నందువల్ల తనమీద చక్రవడ్డీతో పాటు ఋణభారం పెరుగుతున్నదని శ్రీకృష్ణుడు బాధపడినాడట. ఆ, జ్ఞానం ఈకవికి పుష్కళంగా ఉంది. కాబట్టి తాను చేసిన నుతిని (ఈశతకాన్ని) ఋణంగా భావించకూడదనీ, సిరిటెంకి కలవానికి అప్పు ఎందుకుంటుందనీ, ఒక వేళ ఉన్నదనుకొన్నా సిరికలవాడు అప్పు దీర్చుకొనే సమర్థుడనీ కవి చమత్కారంగా ప్రార్థిస్తున్నాడు.

బహుకార్యధురంధరుడైన నారాయణుడు బహుశః ఏమరుపాటు చెందినా, శ్రీదేవి పురుషకారంవల్ల తనకు మోక్షలక్ష్మిని ప్రసాదిస్తాడని వ్యంగ్యార్థం.

"విశ్వతశ్చక్షురుత విశ్వతోముఖో విశ్వతోహస్త ఉత విశ్వతస్పాత్" (శ్రుతి)

"సర్వతః పాణిపాదం తత్సర్వతోఽక్షిశిరోముఖమ్।
సర్వతః శ్రుతిమల్లోకే సర్వమావృత్య తిష్ఠతి॥"(భ.గీ.13-14)

నారాయణుడు అంతటా చేతులు, కాళ్ళు, కన్నులు, తలలు, ముఖాలు చెవులు కల్గి విశ్వమంతటా ఆవరించి - వ్యాపించి ఉన్నాడు. ఏకార్యమైనా అది యెంత రహస్యమైనదైనా సర్వాంతర్యామికి తెలియకపోదు. తప్పక శ్రీపతి కవినుతిని గ్రహిస్తాడు. జయలక్ష్మిని తనకు అనుగ్రహిస్తాడనే సాభిప్రాయమైన శ్రీపతి పదప్రయోగం వల్ల అభివ్యక్తం.

**మ. కరినాథుండు జలగ్రహగ్రహణదుఃఖాక్రాంతుఁడై యీశ మీ**
**శరణంబన్నఁ గృశానుభానుశతతేజస్స్ఫూర్తి యైనట్టి మీ**
**కరచక్రంబున నక్రకంఠము వెసన్ ఖండించి మంచెం దయా**
**పర సద్భక్త భయానకప్రకరసత్ప్రాకట్య నారాయణా॥ 90**

అర్థం: ఓ నారాయణా! దయాపర = దయాళూ! సత్+భక్త భయానక ప్రకర సత్ ప్రాకట్య = భక్తవరుల యొక్క భయభీతులందు ఉనికిని ప్రకటించే వాడా! కరినాథుండు = గజేంద్రుడు; జల - డ్రై! జలగ్రహ = మొసలి యొక్క; గ్రహణ = పట్టుచేత; దుఃఖ+ఆక్రాంతుడై = దుఃఖపడినవాడై; ఈశ! ఓ ప్రభూ! మీ, శరణం = మీరే రక్షకం, ఉపాయం; అన్నన్ = అనగానే; (అది-ఆశరణం. కర్మపదం.) కృశాను, భాను, శత, తేజస్+స్ఫూర్తి, ఐనట్టి = నూరు అగ్నులయొక్క నూరుసూర్యులయొక్క, తేజస్సులాంటి తేజస్సుతో ప్రకాశించునట్టి; మీకరచక్రంబున = మీచేతిచక్రంచేత; నక్రకంఠము = మొసలితలను; వెసన్ = త్వరగా; ఖండించి = నరికివేసి; మంచెన్ = (కరినాథుణ్ని) బ్రతికించెను.

తా : ఓ నారాయణా! దయాళూ! భక్తులకు ఆపదలు కలిగినప్పుడు నీ ఉనికిని

వెల్లడించేవాడా! గజేంద్రుడు మకరపు పట్టుతో దుఃఖపడి, ఓ సర్వేశ్వరా! 'మీరే శరణ' మని ప్రార్థింపగా, అది అనేకాగ్నుల, సూర్యుల తేజస్సులాంటి తేజస్సుతో ప్రకాశించే మీచేతిచక్రంతో మొసలితలను నరికి గజేంద్రుణ్ని రక్షించింది.

**వ్యాఖ్య : భగవంతుణ్ని శరణువేడడమే జీవించడానికి ఉపాయమని సోదాహరణ కథనం.**

భగవంతుడు దయాళుడు. భక్తులు ఆపదలచే బాధపడుతున్నప్పుడు తన సత్తను ప్రకటిస్తాడు. భంగ్యతరంగా చెప్పితే, ఆర్తత్రాణపరాయణుడు నారాయణుడు, అని భావం. దీనికి గజేంద్రమోక్షమే ఉదాహరణం. నీటి మడుగులో అడుగు పెట్టిన గజేంద్రుని పాదాన్ని మకరం పట్టి పీడించినప్పుడు; "ఈశ్వర! కావవే వరద!" అనే ప్రార్థన గజేంద్రుణ్ని రక్షించింది.

"నక్రాక్రాంతే కరీంద్రే ముకుళితనయనే మూలమూలేఽతిఖిన్నే
నాహం నాహం న చాహం న చ భవతి పురస్తాద్వృశోమాద్వృశేషు।
ఇత్యేవం త్యక్తహస్తే సపది సురగణే భావశూన్యే నమస్తే
మూలం యత్ప్రాదురాసీత్". (స దిశతు భగవాన్ మంగళం సంతతం నః॥")

మకరపు పట్టుతో బాధపడుతూ పెక్కేండ్లు పోరాడి డస్సిపోయింది ఒక మదగజం. దానికండ్లు మూతపడ్డాయి. దుర్భరదుఃఖంనుంచి కాపాడేవాడు దేవుడని నమ్మింది. ఆ దేవునిపేరూ, ఊరూ, తెల్వదు. లోకాలనన్నిటిని సృజించి, రక్షించి, లయంజేయడానికి ఆదికారణం ఎవ్వడో వాణ్ని ఆర్తితో మూలా! మూలా! అని మొరపెట్టింది ఆమకరపీడిత మత్తేభం.

ఇంద్రుడు తాను మూలకారణం కానని అంగలార్చాడు. శివుడూ, బ్రహ్మదేవుడూ తమకు జగత్కారణ లక్షణాలే లేవని రాలేక చేతులు ముడుచు కొన్నప్పుడు మూలమే ఆవిర్భవించింది. ఆమూలమే ఈశుడు.

"తాం పద్మినీ మీమ్" అని శ్రీసూక్తి ఈకారం లక్ష్మీవాచకం.

'ఈః+ఈశః = ఈశః' అంటే శ్రియఃపతి. అలవైకుంఠంలోని ఒక మూలనుంచి ఈనేలకు దయతో ఒకజంతువును రక్షించడానికి దిగివచ్చిన శ్రీపతి 'త్వర'ను భక్తిరసానికి ఏతమెత్తిన పోతనకవిమాత్రమే అక్షరాలా సాక్షాత్కరింపజేశాడు.

ఆ వైకుంఠుడు భాస్కరకోటితుల్యమై, సహస్రారశిఖాతితీవ్రమైన సుదర్శన మనే చక్రంతో నక్రకంఠాన్ని లుంఠనంచేశాడు.

"సంతమేనం తతో విదుః" శ్రుతి రీత్యా, నారాయణుడు ఆర్తత్రాణపరాయణుడుగా తనను తాను ప్రకటించుకొన్నారు.

'శరణ' శబ్దానికి గృహం, రక్షణం, ఉపాయం అని నానార్థాలున్నాయి. "అన్యథా శరణం నాస్తి" అని 'శరణాగతి' చేసిన వ్యక్తికి ఆపదలనుంచి విముక్తి, అంత్యదశలో వైకుంఠప్రాప్తి అవశ్యంగా కలుగుతుంది.

**శా. ఏ భావంబున నిన్ దలంచె గజయూథేంద్రుండు ఆపన్నుఁడై**
**యేభావంబున ద్రౌపదయ్యెడ రమాధీశా యనె న్వాయసం**
**బే భావంబున నీశరణ్య మనెనో యీ నీకృపాదృష్టిచే**
**నా భావంబున నీతలంపుఁగలుగ న్నాకిమ్ము నారాయణా॥ 91**

అర్థం: ఓ నారాయణా! గజయూథ+ఇంద్రుడు = ఏనుగులగుంపులో శ్రేష్ఠుడు; ఆపన్నుడై = ఆకస్మాత్తుగా బాధకలిగినవాడై; ఏ భావంబున = ఏ ఉద్దేశంతో; నిన్ తలంచె = నిన్ను స్మరించాడో; ద్రౌపది = (ద్రుపదుని కూతురు)పాండవపత్ని; ఆయెడ = వలువలనీడ్చిన వేళ; ఏభావంబున = ఏ ఆశయంతో, రమా+అధి+ఈశా= లక్ష్మీనాథా; అనెనో; వాయసంబు = కాకాసురుడు; ఏభావంబున = ఏయభిప్రాయంతో; నీశరణ్యము = నీవే రక్షింపయోగ్యుడవు; అనెనో; ఆ భావంబున = రక్షకుడవనే ఆ బుద్ధితో; ఈ నీకృపాదృష్టిచే = ఈ నీదయాలోకనం చేత; నీతలంపు = నీ స్మరణ; కలుగన్; ఇమ్ము = నాకు కలుగునట్లు చేయుము.

తా : ఓ నారాయణా! గజేంద్రుడు ఆపదకు గురియై ఏ భావంతో నిన్ను స్మరించాడో; ద్రౌపది ఏ ఆశయంతో కౌరవసభయందు 'రమాధీశా'! అని ఆర్తితో పిలిచిందో; కాకాసురుడు ఏ ఉద్దేశ్యంతో నీవే దిక్కు అని మొరపెట్టాడో, ఆ భావంతో నే నీ కృపాదృష్టిచేత నాకు నీ స్మరణ కలుగనిమ్ము.

**వ్యాఖ్య : శరణాగత రక్షకుణ్ని స్మరించేశక్తిని అనుగ్రహించుమని కవి ప్రార్థన.**

ఒక మొసలి - చిన్న నీటి పురుగు తనను పట్టి బాధిస్తుంటే గజేంద్రుడు తనను రక్షించడానికి పరమాత్ముడు వస్తాడని 'నీవే తప్పనితఃపరంబెరుగను' అని శరణాగతి చేసింది. భగవంతుడు సంకల్పమాత్రంచేత మొసలిని వధింపవచ్చు. కాని తనరాకకోసం ఎదురుచూచే ఆగజేంద్రుని కోరిక తీరదు కదా!

"నాహం కళేబరస్యాస్య త్రాణార్థం మధుసూదన।

కరస్థకమలాన్యేవ పాదయోరర్పితుం తవ"॥ అన్నట్లు సరస్సులో ఉన్న కమలాలను (తొండంతో) తన చేతితో భగవత్పాదారవిందాలపై అర్పించాలని స్మరించాడేకాని, తన దేహాన్ని రక్షించడానికి కాదు. మొసలివల్ల గజేంద్రునికి కలిగిన బాధ తనకే కలిగినట్లు భావించి త్వరగా వచ్చి సాక్షాత్కరించాడు భగవానుడు.

ద్రౌపది, కౌరవసభలో తనకట్టుపుట్టాన్ని పట్టి దుశ్శాసనుడు ఈడ్వగా,

'మానసంరక్షకుడు శ్రీకృష్ణుడే' అనే దృఢవిశ్వాసంతో 'రమాధీశా' అని అంజలి ఘటించింది. ఆమె, శరణాగతి చేసినందువల్ల అక్షయ వస్త్రాలతో అనన్యార్ఘ్యారాలుగా ఆదరణపొందింది.

తిర్యక్కులలో నికృష్టరూపమైన కాకి సీతమ్మ రొమ్మును చండచంచువుతో పొడిచినందువల్ల శ్రీరాముడు గడ్డిపరకను మహాస్త్రంగా ప్రయోగించాడు. శ్రీరాముడేది చేత పట్టినా అదే మహాయుధమవుతుంది.

"అస్త్రామాస తృణం ప్రియాద్రుహి, తృణామాస స్మరారే ర్ధనుః"

"ప్రాణేభ్యోపి గరీయసీ" తనప్రాణాలకంటె ప్రియురాలైన సీతమ్మను బాధించిన పచ్చి అపరాధియైన కాకాసురునిపై ప్రయోగించిన గడ్డి పోచయే మహాస్త్రమయింది. శివునిధనుస్సుకూడా గడ్డి పరకలాగా రామునిచేతిలో నిస్సారమయింది. మూడులోకాల్లో తిరిగినా గత్యంతరం లేనికాకి, 'రామపాదమే శరణ' మని వచ్చి కాళ్ళమీద పడినందువల్ల కాపాడబడింది.

"దురాచారోఽపి సర్వాశీ కృతఘ్నో నాస్తికః పురా
సమాశ్రయే దాదిదేవం శ్రద్ధయా శరణం యది॥
నిర్దోషం విద్ధి తం జంతుం! ప్రభావాత్పరమాత్మనః"॥

అతడు, మొదట ఎంత నాస్తికుడైనా కృతఘ్నుడూ, దుష్టవర్తనుడూ, సర్వభక్షకుడూ అయినా, భగవంతునిపై శ్రద్ధతో శరణుపొందినట్లైతే అతని మొదటి నడవడిని గమనించక, ఇతడు నిర్దోషి అని పరమాత్మ భావించి అనుగ్రహిస్తాడట. "భూయిష్ఠాంతే నమ ఉక్తిం విధేమ" అనే ఉపనిషన్మంత్రంలో 'తే భూయిష్ఠాం' అని అన్వయించి, 'నమః' అనే ఉక్తిమాత్రమే భగవంతునికి గొప్ప సంతోషాన్ని కలిగిస్తుందని పాండిత్య పాథోనిధులు ప్రవచిస్తారు. శ్రియఃపతి గజేంద్రుని పట్ల ఆర్తి నిర్వాపణాన్ని, ద్రౌపది విషయమై ఔదార్యాన్ని, ఆర్ద్రాపరాధియైన కాకి పట్ల క్షమాగుణాన్ని ప్రకటించడానికి, శరణాగత రక్షకుడు అనే భావమే నిదానం. ఆభావంతోనే భగవంతుణ్ని స్మరించే యోగ్యత తనకు అనుగ్రహింపుమని కవి ప్రార్థించాడు.

"యమే వైష వృణుతే తేన లభ్యః" - అనే శ్రుతి వాక్యప్రకారం భగవంతుని కృప ప్రసరిస్తే జీవునికి, ఆయనను స్మరించే యోగ్యత కలుగుతుంది.

**శా. నీలగ్రీవుఁడు చేతి పున్క విడిచె న్నీయింతి భిక్షంబునన్**
**నీలగ్రీవుఁడు యీశ్వరాఖ్యఁదనరె న్నీనామజప్యంబునన్**
**నీలగ్రీవుఁడు మించి త్రుంచెఁ బురముల్ నీప్రాపు సేవించినన్**
**నీలగ్రీవముఖాబ్జభాస్కర కృపానిత్యాత్మ! నారాయణా ॥ 92**

అర్థం : కృపా నిత్య+ఆత్మ = దయయే నిత్యస్వరూపంగాగలవాడా! ఓ నారాయణా! నీలగ్రీవుడు = నీలకంఠుడైన శివుడు; చేతిపున్క = చేతియందంటుకొన్న తలపుర్రెను; నీ ఇంతి భిక్షంబునన్ = నీ పత్నియైన లక్ష్మీదేవి పెట్టిన బిచ్చంతో; విడిచెన్; నీలగ్రీవుడు = శితికంఠుడు; నీనామాన్ని జపించినందువల్ల; ఈశ్వర+ఆఖ్యన్ = ఈశ్వరుడనే పేరుతో; తనరెన్ = ప్రసిద్ధిని పొందాడు. నీలగ్రీవుడు = కాలకంఠుడు; నీ ప్రాపుసేవించినన్ = నీ ఆశ్రయాన్ని పొందినందువల్ల; మించి = ప్రకాశించి; పురముల్ = త్రిపురాలను; త్రుంచెన్ = ధ్వంసంచేశాడు. నీలగ్రీవముఖ+అబ్జ భాస్కర = శ్రీకంఠుని ముఖాలనే కమలాలకు సూర్యుని వంటివాడా!

తా : ఓ కృపానిత్యాత్మ! నీలగ్రీవుని ముఖకమలవికాసానికి సూర్యునివంటివాడా! ఓ నారాయణా!నీలగ్రీవుడు తన అరచేతికి అంటుకొన్న కపాలాన్ని లక్ష్మి పెట్టిన భిక్షతో విడిచిపెట్టాడు. అతడు నీ నామజపంవల్ల ఈశ్వరుడనే పేరుతో శోభించాడు. కాలకంఠుడు నిన్నాశ్రయించినందువల్ల తేజోవంతుడై మూడుపురాలను దహించి వేశాడు.

**వ్యాఖ్య : నారాయణుడు దేవ దేవుడనే ఉద్ఘాటించాడు కవి.**

నారాయణుడు దయామూర్తి. కాబట్టి సూర్యుడు కమలాల వికాసానికి కారకుడైనట్లే నీలగ్రీవునిముఖోల్లాసానికి ముఖ్యకారకుడు నారాయణుడు. శివునిఅనిష్టాలను పోగొట్టి, ఇష్టాలను కలిగించినవాడు నారాయణుడు.

తత్పురుష (తూర్పుదిక్కున) అఘోర (దక్షిణం వైపున) సద్యోజాత (పడమరదిక్కున)వామదేవ (ఉత్తరం వైపున) ఈశాన (ఊర్ధ్వభాగాన) సంజ్ఞలుగల పంచముఖాలతో ప్రకాశించేవాడు పరమశివుడు.

అమృతంకోసం సముద్రాన్ని మథించినప్పుడు మొదట ఉప్పతిల్లిన హాలాహల మనే కాలకూటమనే విషాన్ని జగద్రక్షణార్థంమ్రింగినప్పుడు కంఠం నల్లబడినందు వల్ల నీలగ్రీవుడయ్యాడు.

ఒకప్పుడు తనవలె బ్రహ్మకు కూడా ఆయిదు(5)తలలున్నందువల్ల చాలా మంది భ్రమపడే అవకాశం కలుగుతుందని తమోగుణాభిభూతుడైన రుద్రుడు, తన తండ్రియని యోచింపక, నిరపరాధియైన బ్రహ్మయొక్క ఒక తలను త్రుంచివేశాడు.

"బ్రహ్మణస్తు శిరశ్ఛిన్న మంగుళ్యగ్రనఖేన హ" (స్కాం-పు-కాశీఖండం)

'నిరపరాధియైన నాతలను త్రుంచినఫలితంగా నీవు 'కపాలివి కాగలవు' అని బ్రహ్మ రుద్రుణ్ని శపించాడు.

"యస్మాదనపరాధస్య శిరశ్ఛిన్నం త్వయా మమ।
తస్మాచ్ఛాపసమాయుక్తః కపాలీ త్వం భవిష్యసి॥"

'బ్రహ్మహత్య' అనే గురుపాతకంవల్ల బ్రహ్మకపాలం శివుని అరచేతికి అంటుకొన్నది.

"కపాలపాణి ర్విశ్వాత్మా చచార భువనత్రయమ్।

నాత్యాక్షీచ్చాపి తం దేవం బ్రహ్మహత్యా సుదారుణా॥"

అది మొదలు కపాలపాణి ముల్లోకాల్లో భిక్షాటనం చేశాడు. కపాలం నిండలేదు. దారుణమైన బ్రహ్మహత్యాపాతకం ఆయనను వదలలేదు.

"కాపాలికో యయౌ దేవో నారాయణనికేతనమ్"।

కాపాలికుడైన శివదేవుడు ఒకనాడు బదరికాశ్రమానికి చేరి నారాయణున్ని సేవించాడు. "క్షీరోదమథనోద్భూతాం ప్రాహ పద్మాలయాం హరిః।

ప్రియే పశ్యాబ్జనయనే ధన్యాఽసి సుభగేఽనఘే॥"

నారాయణుడు లక్ష్మీదేవితో ' ఈకాపాలికుని స్థితిని చూడు' మన్నాడు.

"ఇత్థం వదతి గోవిందే విమలా పద్మయా తయా।

మనోరథవతీ నామ భిక్షాపాత్రే సమర్పితా॥" (కాశీఖండం - స్కాందం)

వెంటనే లక్ష్మీదేవి విమలమైన - పాతకాన్ని నశింపచేసే - 'మనోరథవతి' అనే భిక్షను పెట్టింది. కపాలం నిండింది.

"విష్ణుప్రసాదాత్ సుశ్రోణి కపాలం తత్సహస్రధా।

స్ఫుటితం బహుధా యాతం స్వప్నలబ్ధం ధనం యథా॥" (మత్స్యపురాణం)

విష్ణుమూర్త్యనుగ్రహంవల్ల, కలలో దొరికిన ధనం చెల్లా చెదరైనట్లే, కపాలం చేతి నుంచి జారిపడి వేయి ముక్కలయింది.

దక్షయజ్ఞాన్ని ధ్వంసంచేసినతర్వాత రుద్రునిశూలం తపస్సు చేస్తున్న నరనారాయణులను తాకింది. శూలతేజస్సుచేత నారాయణునికేశాలు 'ముంజ' వర్ణమయ్యాయి. ముంజకేశుడు హుంకరిస్తే ఆశూలం పోయి శివుని చేతిలో పడింది.

"అథ రుద్రము పాధావత్తా వృషీ తపసాన్వితౌ।

తత ఏనం సముద్భూతం కంఠే జగ్రాహ పాణినా॥

నారాయణః స విశ్వాత్మా తేనాస్య శితికంఠతా।" (భార.శాంతి. - 342 అ.114 1/2)

వెంటనే రుద్రుడు నరనారాయణులపైన విరుచుక పడ్డాడు. నారాయణుడు తనచేతితో రుద్రుని గళాన్నిగట్టిగా పట్టాడు. అందువల్ల రుద్రుని గళం నీలవర్ణంగా కమిలిపోయింది. శితికంఠుడు, నీలగ్రీవుడు అనే అన్వర్థనామం శివునికేర్పడిందని మోక్షధర్మం స్పష్టంచేసింది.

"త్వం హి రుద్ర! మహాబాహో! మోహశాస్త్రాణి కారయ।
దర్శయిత్వాఽల్పమాయాసం ఫలం శీఘ్రం ప్రదర్శయ॥"

'మహాబాహో! రుద్రా! నీవు జనులను మోహింప జేసే శాస్త్రాలను ప్రవర్తింప జేయుము. కొద్దిశ్రమతో శీఘ్రంగా ఫలమిచ్చే మార్గాన్ని ప్రదర్శించుము' అని నారాయణుడు ఆదేశించాడు.

"బ్రహ్మాదయః సురాస్సర్వే విష్ణుమారాధ్యతే పురా।
స్వం స్వం పదమనుప్రాప్తాః కేశవస్య ప్రసాదతః॥

బ్రహ్మరుద్రేంద్రాదులు విష్ణుమూర్తిని ఆరాధించి తమతమ పదవులను పొందారు. "తదా దర్శితపంథానౌ సృష్టిసంహారకారకౌ॥" బ్రహ్మకు సృష్టికోసం, రుద్రునికి సంహారంకోసం ఈశ్వరత్వాన్ని ప్రసాదించాడు. విష్ణుమూర్తి, అని భారతం - కర్ణపర్వం విశదం చేసింది.నీలగ్రీవుడు రామనామాన్ని జపించి భగవదనుగ్రహాన్ని పొందడంవల్ల ఈశ్వరుడనే పేరుతో ప్రఖ్యాతుడయ్యాడు. (ఈవిషయం కొంత 39వ పద్యంలో వ్యాఖ్యాతం.)

ఎవరికి ఈశ్వరత్వం ఉన్నా అది అవధిలేని అతిశయంకలది కాదు. ఒక్క నారాయణునికే 'ఇంతకుపైన లేదు' అన్నట్లు నిరవధికాతిశయమైన ఈశ్వరత్వం ఉంది.

నీలగ్రీవుడు త్రిపురా(సురు)లను జయించడానికి సకలదేవతల తేజస్సును ఒక్కరాశిగా గ్రహించాడు. ముఖ్యంగా నారాయణున్ని సేవించి, నారాయణాస్త్రాన్ని ప్రయోగించాడు. ఇనుము, వెండి, బంగారంతో నిర్మింపబడిన మూడుపురాలను ఒక్కచోట చేర్చి దహించాడు.

రాజసతామసపురాణాలలో బ్రహ్మకూ, శివునికీ పరత్వం చెప్పబడింది. వేదమూలమైన సాత్త్విక పురాణాలలో నారాయణునికే అసాధారణమైన సర్వేశ్వరత్వమూ, పరత్వమూ స్థాపింపబడింది. రాజస తామస పురాణాలను విరోధాధికరణ న్యాయంగా గ్రహించడం ఆవశ్యకంకదా!

**మ. నిను వర్ణింపనివాఁడు మూఁగ మదిలో నీనామమున్ వీనులన్**
**విని మోదింపనివాఁడు చెవ్డు మరి నిన్ వేడ్కన్ మనోవీథినిన్**
**గని పూజింపనివాఁడు నాశకరుఁడౌ కర్మక్రియారంభుఁడై**
**తవలోఁ గాననివాఁడు నీచమతిపో తత్త్వజ్ఞ నారాయణా॥ 93**

అర్థం : ఓ తత్త్వజ్ఞ = విశ్వరహస్యం తెలిసినవాడా!నారాయణా! నిను వర్ణింపనివాఁడు మూఁగ = నిన్ను అక్షరాలాస్తోత్రంచేయనివాడు నోటనాలుకలేనివాడు. నీ నామమున్

వీనులన్ విని మదిలో మోదింపనివాఁడు చెవ్డు = నీపేరు చెవులతో విని కూడా మనస్సులో సంతోషించనివాడు బధిరుడే. మరి = ఇంక; నిన్ వేడ్కన్ = నిన్ను కుతూహలంతో; మనోవీధినిన్ = హృదయమందు; కని = చూచి; పూజింపనివాఁడు = భక్తితో ఆరాధించనివాడు; నాశకరుఁడౌ = ఆత్మ నాశకుడేకాక పరులను చెడగొట్టేవాడవుతాడు. కర్మక్రియా+ఆరంభుడై = కర్మచేయ పూనుకొన్నవాడై; తనలోన్ = అంతరంగంలో; కానని వాఁడు = చూడనివ్యక్తి; నీచమతి, పో = కొంచెపు బుద్ధి కలవాడే సుమా!

తా : ఓ తత్త్వజ్ఞ!నారాయణా! నిన్ను వర్ణింపని వ్యక్తి మూగవాడు. నీపేరు చెవిలో పడగానే సంతోషింపని వ్యక్తి చెవిటివాడు. నిన్ను మానస దృష్టితో చూచి పూజింపని వ్యక్తి ఆత్మనాశకరుడు. కార్యాలను చేయబూను కొని అంతరంగమందు నిన్ను గానని వ్యక్తి క్షుద్రబుద్ధికలవాడు.

**వ్యాఖ్య : నారాయణున్ని భజించని వ్యక్తులు పామరులు, అంటున్నాడు కవి.**

నారాయణగుణవిభూతులను స్మరించినవాని జీవితం ధన్యమవుతుంది. భగవంతుడు నిర్గుణుడు, నిరాకారుడు అంటారు కొందరు. ఆయన సగుణుడు, సాకారుడంటారు మరికొందరు, ఈతత్త్వం భగవంతునికి తప్ప మరెవ్వరికీ తెలియదు. కాబట్టి తత్త్వజ్ఞుడు భగవంతుడే.

సగుణ, నిర్గుణ వాదాలన్నీ ఉపాసనలోని భేదాలే కాని ఉపాస్యుడైన భగవంతుడొక్కడే బుభుక్షువులైనా ముముక్షువులైనా అంటే సంసారసుఖాన్ని అనుభవించాలని కోరేవారైనా, సంసారబంధం నుంచి విముక్తిని కోరేవారైనా, భగవంతుణ్ని భజించవలసిందేకదా!

"క ఉత్తమశ్లోక గుణానువాదాత్

పుమాన్ విరజ్యేత వినా పశుఘ్నాత్?" (భా.గ.10 స్కం)

ఉత్తమ శ్లోకుడైన నారాయణుని గుణ గణాలను గానం చేయడానికి, కథలను వినడానికి పశుహంతకుడు-కసాయివాడు-తప్ప విముఖుడెవడుంటాడు? కసాయివాడైనా భుక్తికోసం కంసారిని సంస్మరించక ఉండలేడేమో!

అపశుఘ్నాత్ (= అపగతా శుక్ యస్మాత్ సః = అపశుక్, ఆత్మా, తం హంతి) ఆత్మఘాతకుడు విముఖుడు కావచ్చును, అంటే అతడు అదే సుఖమనుకొని దైవచింతన చేసి యుండవచ్చునుకదా! ఇంతకు దైవచింతన లేని దెవరు? అంటే పశువులను చంపే సాధనం. చైతన్యంలేని ఖడ్గం, కుఠారం అని వ్యాసోక్తి. ఈ,సుకవి నిర్వేదంతో చెప్పిన పద్యమిది. నోటిలో నాలుక లేదు కాబట్టి మూగవాడు భగవంతుణ్ని వర్ణింప లేడు. బధిరునికి భగవన్నామం చెవుల్లోకి చొచ్చినా హృదయంలోకి ప్రవేశించదు, కాబట్టి హర్షించడు. నాశకరుడు ఉన్మాదుడు కాబట్టి చంచలమనస్సుతో

చక్రిని కనలేడు, పూజింపలేడు. ఉచ్ఛస్థితిగతిలేని మతికలవాడు నీచమతి. కాబట్టి దిగజారిన బుద్ధికలవాడు అంతర్ముఖుడెలా అవుతాడు? ఆత్మారాముణ్ని ఎలా కనుగొంటాడు? కాననివాడే కదా!

వ్యతిరేకాన్వయ పద్ధతిగానూ చెప్పదగిన పద్యమిది.

**మ. నిను వర్ణింపని నీచబంధమతి దా నిర్మగ్నమూఢాత్ముఁడై**
**పెను దైవంబులఁగోరి తా మనమునన్ సేవించు చందంబు తా**
**ననలంబారిన భూతియందు వెలయన్నాజ్యాహుతుల్ పూని వే**
**ల్చిన చందంబున వ్యర్థమై తనరుఁ జూ చిద్రూప నారాయణా॥94**

అర్థం : ఓ చిత్+రూప = ఓ జ్ఞానమూర్తీ! నారాయణా! నిను వర్ణింపని = నిన్ను స్తుతించని; నీచబంధమతి = మందమతి; తాన్; నిర్మగ్నమూఢ+ఆత్ముఁడై = అజ్ఞాన మందు మునిగినవాడై; పెను దైవంబుల కోరి = పెక్కు దేవతలను ప్రార్థించి, తాన్; మనమునన్ = మనస్సునందు; సేవించు చందంబు = ధ్యానించే విధం; తాన్; అనలంబు+ఆరిన = అగ్గి ఆరిపోయిన; భూతియందు = బూడిదలో; వెలయన్ = ప్రకాశంగా; ఆజ్య+ఆహుతుల్, పూని = నేతిధారలను పోసి; వేల్చిన చందంబున = హోమం చేసిన రీతిగా; వ్యర్థమై, తనరు = నిష్ఫలమవుతుంది; చూ=సుమా!

తా : ఓ చిద్రూపా! నారాయణా!క్షుద్రబుద్ధికలవాడు నిన్ను స్తుతించడు. మూఢమనస్కుడై అనేక దేవతలను ప్రార్థిస్తాడు. మనస్సులోనూ ధ్యానిస్తాడు. ఈ విధానం అగ్గి ఆరిపోయిన బుగ్గిలో ఆజ్యధారను పోసినట్లు వ్యర్థమవుతుంది సుమా!

**వ్యాఖ్య : పెక్కుదేవతలను భజించడం మూఢలక్షణ మంటున్నాడు కవి.**

జ్ఞాన - జ్యోతి రూపంతో వెలిగేవాడు నారాయణుడు. కర్మబంధుడు జీవుడు. పుణ్యకర్మలనాచరించిన వ్యక్తికి దొడ్డబుద్ధి, పాపకర్మలను చేసిన వ్యక్తికి నీచబుద్ధి ఉంటుంది. కర్మానుబంధిఫలదానరతుడు నారాయణుడే. నీచకర్మలచేత కట్టుబడిన వ్యక్తికి నారాయణుణ్ని వర్ణించే బుద్ధి పుట్టదు. అజ్ఞానం నిండుగా కమ్ముకొని ఉంటుంది. తత్ఫలితంగా అనేక దేవతలను కొలుస్తాడు. అగ్నిలో ఆజ్యం పోస్తే ప్రజ్వరిల్లుతుంది కాని బూడిదలో ఎంతపోస్తే నేమి ప్రయోజనం? ద్రవ్యనష్టమేకాక కాలమూ వృథా, శ్రమకూడా ఫలమీయదు. పెక్కుదేవతలను పూజిస్తే, ఏదేవతకూ అతనిమీద విశ్వాసం ఉండదు. ఒక్క ధ్యేయమూర్తి మంత్రంతో 'స్వాహా' అంటూ, అగ్నికుండంలో ఆజ్యాహుతులు వేస్తే, "అగ్నే నయ సుపథా రాయే అస్మాన్" అన్నట్లే, మోక్షం లభిస్తుంది. "మౌఢ్యాత్ భస్మన్యేవ జుహోతి సః" (భాగ.3-29-3) కపిలుడు దేవహూతికి భక్తియోగం తెలిపాడుకదా!

"మూఢుడై యుచితభక్తిని నన్ను భజింపఁడేని, యమ్మనుజుఁడు భస్మకుండమున మానక వేల్చినయట్టివాఁడగున్" (అం.భాగ.3-29-955)

**మ. నిను వర్ణింపనిజిహ్వ దాఁబదటికా? నీలాభ్రదేహాంగకా**
**నిను నాలింపని చెవ్లు దాఁబదటికా? నీరేజపత్రేక్షణా**
**నినుఁబూజింపనికేలు దాఁబదటికా? నిర్వాహకక్ష్మాతలా**
**నినుఁ జింతింపని యాత్మ దాఁబదటికా నిర్వాణ నారాయణా॥ 95**

అర్థం : నీల+అభ్ర దేహ+అంగకా = నీలమేఘంవంటి శరీరావయవాలుకలవాడా! నిను వర్ణింపని = నిన్ను స్తుతించనట్టి; జిహ్వ = నాలుక; తాన్ = అది; బదని (టి)కా = చెట్టులోనే పుట్టి పెరిగిన మరొక చెట్టా? నిష్ఫలమా? నీరేజ పత్రేక్షణా = తామరసదళనయనా? నినున్ ఆలింపని = నిన్ను విననట్టి; చెవ్లు = శ్రవణేంద్రియాలు; తాన్, బదటికా? నిర్వాహకక్ష్మాతలా = భూ తలాన్ని వహించేవాడా! నినున్ పూజింపని; కేలు = చేయి; తాన్, బదటికా = నిష్ప్రయోజనం. నిర్వాణ నారాయణా = మోక్షసుఖ (మిచ్చే) దేవా! నినున్, చింతింపని = స్మరింపని ఆత్మ = మనస్సు, తాన్, బదటికా = నిష్ప్రయోజనం.

తా : ఘనశ్యామశరీరుణ్ని వర్ణించనినాలుక బదనికయా? నీరేజ పత్ర్యేక్షణుని కథలను వినని చెవులు అంటే శ్రవణేంద్రియం బదనికయా? నిర్వాహక క్ష్మాతలుని పూజసేయని చేతులు బదనికలాంటివా? మోక్షదాతయైన నారాయణుణ్ని స్మరించని మనస్సు బదనిక కదా!

**వ్యాఖ్య : నారాయణ సేవకు ఉపయోగపడని కర్మజ్ఞానేంద్రియసముదాయం నిష్ఫలమని కవి భావన.**

ఒక చెట్టులో మట్టి చేరి దానిలో పక్షుల ద్వారా లేక గాలిద్వారా విత్తు (లు) పడితే చెట్టు మొలుస్తుంది. అది తీగయో వృక్షమో కావచ్చు. కాని దానికి నేరుగా ఆహారం - లవణ రసాయనాలసారం - సరిగా అందక తొందరగా అంతరిస్తుంది. పరాన్నభుక్కుగా ఉన్న ఈ నిష్ఫలతరువు బదనిక (బదటిక) 'బదటిక' అనేది పలుకుభేదం.

నీలమేఘం ఔదార్యానికి సంకేతం. వర్షంద్వారా మేఘం నేల నంతా సస్య శ్యామలం చేస్తుంది. జీవకోటికి భుక్తిని కల్పిస్తుంది. నీలాభ్రవర్ణంగల దేహాంగాలు కలిగిన నారాయణుడు చేతనాచేతనవర్గాలకు భుక్తినీ, ముక్తినీ కల్పిస్తాడు. అలాంటి భగవంతుణ్ని నోరార కీర్తించనివాడు 'కలుగనేటికి తల్లుల కడుపుచేటు' అంటాడు కవిపోతన -

"సా జిహ్వా యా హరిం స్తౌతి". "శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ"
లేకపోతే అది జిహ్వ కాదు. బదనిక అవుతుందా కాదా?

తామరరసదళనయనుని గుణవిభూతులను ఆలింపని చెవులు చెవులు కావు. అవి బదనికలాంటి వవునా కాదా? "విష్ణునాకర్ణించు వీనులు వీనులు" కదా! భూభారనిర్వాహకునికి పూజ చేయక పోతే అవి చేతులుకావు. బదనికలే కాక మరేమి? "కమలాక్షునర్చించు కరములు కరములు" అన్నాడు కదా! భక్తపోతన. మోక్షసుఖాన్ని కలిగించే నారాయణుని గూర్చి నిశ్చలచిత్తంతో ధ్యానం చేయకుంటే అది చిత్తం కాదు. చిత్తం చెత్త కాకూడదు.

"మధువైరి దవిలిన మనము మనము" అని భాగవతసూక్తి.

"అరయ తనదుజిహ్వ హరి పేరు నుడువదు, చిత్తమతని పాదచింతఁ జనదు।
తలఁప తమకు ముక్తి తంగేటి జున్నొకో? సకల విష్ణుభక్తులకునుబోలె॥

(భాగ.6 స్కం.190)

జీవుడు యాత్రికుడు. శరీరం రథం. పది ఇంద్రియాలు అశ్వాలు, పదకొండవ ఇంద్రియమైన మనస్సు కళ్ళెం. నియంత భగవానుడు. ప్రతిపదనుంచి పదకొండవతిథి ఏకాదశి. అది హరివాసరమన్నారు పెద్దలు. కాబట్టి ఏకాదశీతిథినాడైన మనస్సును భగవద్ధ్యానంలో మగ్నం చేస్తే, సర్వేంద్రియాలు ఆయన కభిముఖంగా ఉండి, వాటికర్తవ్యాన్ని చక్కగా నిర్వహిస్తాయికదా! అలాగా చేయకుంటే శరీరమే ఒక చెట్టు, ఆచెట్టులోనే ఉన్న మనస్సు బదనికలాగా వ్యర్థమైనదే.

చిత్తమొక్కటి బదనిక అయితే, ఇంద్రియాలన్నీ బదటి(ని)కలవుతాయనడం యుక్తమే.

హరిని స్తుతించే జిహ్వాయే జిహ్వ. భగవంతునికి అర్పింపబడే చిత్తమే చిత్తం. భగవంతుని పూజించే చేతులే చేతులు. ప్రశంసాపాత్రము'లని 'విష్ణుధర్మ' సూక్తి.

"సా జిహ్వా యా హరిం స్తౌతి, తచ్చిత్తం యత్తదర్పితమ్।
తావేవ చ కరౌ శ్లాఘ్యౌ యౌ తత్పూజాకరౌ కరౌ॥"

**శా నీవే తల్లివి నీవె తండ్రివరయన్నీవే జగన్నాథుఁడౌ**
**నీవే నిశ్చలబాంధవుండ వరయ న్నీవే మునిస్తుత్యుఁడౌ**
**నీవే శంకరమూలమంత్రమరయన్ నీవే జగత్కర్తవున్**
**నీవే దిక్కనువారివారలె కడున్నీవారు నారాయణా॥ 96**

అర్థం: ఓ నారాయణా! నీవే తల్లివి తండ్రివి; అరయన్ = విచారింపగా, నీవే; జగత్+నాథుడవు; నీవే; నిశ్చలబాంధవుండవు = స్థిరమైన చుట్టానివి. నీవే; మునిస్తుత్యుఁడవు = మునులచే స్తుతింపదగినవాడవు; శంకరమూలమంత్రము = సుఖంకలిగించడానికి ఆది కారణమైన మంత్రం, నీవే. జగత్‌కర్తవున్ = విశ్వనిర్మాతవుకూడా నీవే, దిక్కు = గతి; అనువారూ, వారి సంబంధులే; నీ వారు = నీభక్తులు,

తా : ఓ నారాయణా! నీవే తల్లివి, తండ్రివి, జగత్పతివి, ఆప్తబంధుడవు, మునులచే స్తోత్రంచేయదగినవాడవు; నీవే సుఖప్రాప్తికి మూలమంత్రం. విశ్వనిర్మాతవు నీవే. నిన్ను శరణు పొందినవారూ, వారి సంబంధులుకూడా నీవారే.

**వ్యాఖ్య : 'పరమాత్ముడే పరమగతి' అనేవారు పరమభక్తులని పేర్కొన్నాడు కవి.** భక్తులకు నారాయణుడే సర్వవిధబంధువు. తల్లి, తండ్రి, రక్షకుడు అతడే.

"సర్వేషామపి లోకానాం పితా మాతా చ మాధవః।
గచ్ఛధ్వమేనం శరణం శరణ్యం పురుషర్షభాః॥" (భార.అర.18 9-52)

'క్లేశనాశకుడైనకేశవుడే మాకు దిక్కు' అనే భక్తులూ, వారిని ఆశ్రయించిన వారూ భగవంతునికి నేదిష్ఠులు.

"పద్మనయనుమీఁది భక్తియోగం బెల్ల
ముక్తియోగమనుచు మొదలెఱుంగు
వారి వారి వారి వారిఁ జేరిన వారి
త్రోవఁబోవవలదు, దూతలార॥" (భాగ.6-191)

అని యముడు తన దూతలకు బోధించాడు కదా!

"త్వమేవ మాతా చ పితా త్వమేవ, త్వమేవ బంధుశ్చ సఖా త్వమేవ।
త్వమేవ విద్యా ద్రవిణం త్వమేవ, త్వమేవ సర్వం మమ దేవదేవ॥" అని ప్రార్థించే ప్రపన్నులూ, వారి సంబంధ సంబంధులూ భగవద్బంధువులే.

**మ. అపరాధంబులు నిన్ను నమ్మి విను మే నాజన్మపర్యంతమున్**
**విపరీతంబుగఁ జేసినాఁడ నిఁక నీవే దిక్కు నాలోనికిన్**
**గపటంబింతయు లేక దండధరుకుం గట్టీక రక్షింపు మీ**
**కృపకుంబాత్రుఁడనయ్య ధర్మపురి లక్ష్మీనాథ నారాయణా॥ 97.**

అర్థం: ధర్మపురి = ధర్మమే గృహంగా కలవాడా! లక్ష్మీనాథ = శ్రీపతీ! నారాయణా! వినుము; ఏను = నేను; ఆజన్మ పర్యంతమున్ = పుట్టినప్పటినుంచి; నిన్ను నమ్మి; అపరాధంబులు = నేరాలు; విపరీతంబుగ = వ్యత్యస్తంగా। లెక్కకుమిక్కిలి; చేసినాడను; ఇక; నాలోనికిన్ = నా అంతరంగానికి; నీవే, దిక్కు = శరణం, గతి; కపటంబు = వ్యాజం; ఇంతయులేక; దండధరుకున్ = యమునికి; కట్టు+ఈక = బంధించనీయక; రక్షింపు; మీ కృపకున్ పాత్రుడను; అయ్య = తండ్రీ.

తా : ఓ ధర్మగేహీ! లక్ష్మీనాథా! నారాయణా! జన్మించినప్పటినుంచి నిన్ను నమ్మినాను. ఎనలేని, ఎనలేని అపరాధాలను చేశాను. ఇప్పుడు నా మనస్సుకు నీవే దిక్కు; యముడు బంధించకుండా అవ్యాజంగా కాపాడుము. అయ్యా! నీదయకు పాత్రుడను.

వ్యాఖ్య : **అపరాధియైన తనను రక్షింపుమని కవిభగవంతుణ్ని ప్రార్థించే పద్యం.**
ధర్మపురి తీర్థక్షేత్రం. గోదావరీతీరాన ఉన్నది. లక్ష్మీనృసింహక్షేత్రమిది.

ఈ కవికీ, ఆక్షేత్రానికీ ఉన్న సంబంధం విచారణీయం. పురం అంటే గృహం, శరీరం అనే అర్థాలున్నాయి. కాబట్టి ధర్మమే గృహం శరీరంగా కలవాడనతగును. లేదా, "పౄపాలన పూరణయోః" అనే ధాత్వర్థాన్ని బట్టి, ధర్మాన్ని పాలించేవాడు. జీవుడు అనేక జన్మలెత్తుతాడు.దేవుణ్ని నమ్ముతుంటాడు, పాపాలు చేస్తూ ఉంటాడు. చేయతగినవి చేయకుండడమూ, చేయకూడని పనులను చేయుడమూ విపరీతకృత్యాలుగా భావింపబడుతాయి.

"దోషో యద్యపి తస్య స్యాత్" శ్రీరాముడు, మిత్రభావంతో శరణుపొందిన వ్యక్తిని, అతనికి దోషమున్నా, రక్షించకుండా విడిచి పెట్టనన్నాడు. శ్రీకృష్ణావతారంలోనూ భగవానుడు సర్వధర్మాలను త్యజించి తననే శరణుపొందితే సర్వపాపాలనుంచి విముక్తుణ్ని చేస్తానన్నాడు. ఈ మాటలను నమ్మి విపరీతంగా నేరాలు చేశాడు. ఇప్పుడు శరణాగతుడయ్యాడు.

పాపాలు చేసిన వ్యక్తిని యముడు దండిస్తాడు. అది 'కట్టు' అంటే నియమం. పాపాత్ముడనే వ్యాజంతో యముడు బంధించకుండా తనను కాపాడుమని వేడుకొంటున్నాడు.

"న నిందితం కర్మ యదస్తి లోకే సహస్రశోఽయం న మయా వ్యధాయి।
సోఽహం విపాకావసరే ముకుంద! క్రందామి సంప్రత్యగతిస్తవాగ్రే॥"(స్తోత్రరత్నం 23) లోకంలోనూ శాస్త్రంలోనూ నింద్య క్రూర కర్మలెన్ని ఉన్నాయో వాటిలో నేను చేయనిది లేదు. ఆపాపాలు పండినప్పుడు నాకు గత్యంతరమూ లేదు. కాబట్టి, ఓ ముకుంద! నీ యెదుట ఇప్పుడే మొరపెట్టుకొంటున్నాను "అనుత్తమం పాత్ర మిదం దయాయాః" నీదయకు పాత్రుడను" అన్నారు శ్రీయామునాచార్యులు - "లక్ష్మ్యా సహ హృషీకేశో దేవ్యా కారుణ్యరూపయా। రక్షకః సర్వసిద్ధాన్తే వేదాంతేషు చ గీయతే" - అన్నట్లు లక్ష్మీనాథుడే రక్షకుడు కదా!

**శా. చెల్లంజేసితి పాతకంబులు మదిన్ శ్రీనాథ మీనామముల్**
**పొల్లుల్ బోవని నమ్మి పద్యశతమున్ బూర్ణంబుగాఁ జెప్పితిన్**
**చెల్లంబో నను నమ్మె వీఁడని దయంజేపట్టి రక్షింపుమీ**
**తల్లిం దండ్రియు నీవుగాక యొరులే తర్కింప నారాయణా॥ 98**

అర్థం : ఓ నారాయణా! పాతకంబులు = పాపాలు; చెల్లన్, చేసితి = వాటి ఫలాలను పొందునట్లుగా చేశాను. ఓ శ్రీనాథ = ఓ లక్ష్మీపతీ! మీ నామముల్ = మీపేర్లు; పొల్లుల్,

పోవు = వ్యర్థంకావు; అని; మదిన్, నమ్మి = మనస్సులో విశ్వసించి; పద్యశతమున్ = నూరుపద్యాలను; పూర్ణంబుగా; నిండుగా; చెప్పితిన్; చెల్లన్, పో = చెల్లనీగాక; అది అట్లుండనీయండి. 'వీడు, నన్ను నమ్మె' అని, దయన్ = కృపతో; చేపట్టి = కైకొని; రక్షింపుమీ = కాపాడుమీ. తర్కింప = విచారింపగా; తల్లిందండ్రియు = తల్లి మరియు తండ్రికూడ; నీవుగాక = నీవు తప్ప; ఒరులే = ఇతరులౌతారా?

తా : ఓ నారాయణా! పాపాలను, వాటిఫలాలను అవశ్యం అనుభవించక తప్పవన్నట్లు చేశాను. ఓ లక్ష్మీపతీ! మీ నామాలు రిత్తబోవని యెదలో నమ్మినాను. పూర్ణసంఖ్యగల నూరు పద్యాలతో నిన్ను స్తుతించాను. ఆపాపాలు చెల్లనీగాక. "వీడు నన్ను నమ్మినా"డని కృపతో గ్రహించి నన్ను రక్షింపుము. తల్లివి, తండ్రివి నీవే కాబట్టి వేరే వారెలా నన్ను కాపాడుతారు?

**వ్యాఖ్య : నమ్మిన వ్యక్తిని చే(త)పట్టి రక్షించేశక్తిమంతుడు శ్రియఃపతి.**

చేసిన కర్మలకు ఫలమనుభవించక తప్పదు.

"అశుభస్యాస్పదమపితవ స్మారం స్మారం గుణగణమితీచ్ఛామి గత భీః" (స్తోత్రరత్నం - 58) 'పాపరాశికి జన్మభూమిగా ఉన్న నేను నీ కల్యాణగుణాలను పలుమారులు తలిచినప్పుడు, చేసిన పాపాలు నన్నేమి చేస్తాయని భయంవీడి, భగవంతుణ్ని ప్రార్థించాడు శ్రీయామునాచార్యులు. అలాగే ఈకవి భగవన్నామసంకీర్తనఫలం అమోఘమని నమ్మినాడు. పాపాలన్నీ పటాపంచలౌతాయని విశ్వసించి, అనేక గుణవిభూతులను కీర్తిస్తూ; నారాయణ నామంతో భగవంతుణ్ని వందసార్లు స్మరిస్తూ (నారాయణ) శతకాన్ని పూర్తిచేశాడు.

పాపాలు పండే అవకాశమున్నా, భక్తుని నమ్మకాన్ని వమ్ముచేయక భగవంతుడు కృపతో కటాక్షిస్తే, వేచిన విత్తనపు గింజలకు మొలిచే శక్తి నశించేరీతిగా, పాపాలకు ఫలించేశక్తి నశిస్తుంది. అచ్యుత, అనంత, గోవింద నామాలను స్మరిస్తే భవరోగమే నశిస్తుంది.

"పితా త్వం మాతా త్వం" (స్తోత్రరత్నం) అన్నట్లు జగజ్జననకారణుడైన నారాయణుడే పాపాలను తొలగించి, శాశ్వతసుఖాన్ని ప్రసాదించగలడు. ఆ సామర్థ్యం నాన్యతోదర్శనీయం.

**మ. నరసింహాచ్యుత వాసుదేవ వికసన్నాళీకపత్రాక్ష భూ**
**ధర గోవింద ముకుంద కేశవ జగత్త్రాతాహితల్పాంబుజో**
**దర దామోదర తార్క్ష్యవాహన మహాదైత్యారి వైకుంఠమం**
**దిర పీతాంబర భక్తవత్సల కృపన్ దీవింపు నారాయణా॥ 99.**

అర్థం : నరసింహా! అచ్యుత! వాసుదేవ! వికసత్+నాళీకపత్ర+అక్ష = వికసిస్తున్న కమలదళాల లాంటి కన్నులు కలవాడా! భూధర = భూమిని ధరించినవాడా! గోవింద = గోవులను కాపాడేవాడా! ముకుంద = ముక్తిని, భుక్తిని కల్పించువాడా! కేశవ! జగత్+త్రాత = ప్రపంచాన్ని రక్షించేవాడా! అహితల్ప = పాముసెజ్జకలవాడా! అంబుజ+ఉదర = కమలం కడుపున కలవాడా! దామ+ఉదర = దమమనేనియమంకలవారికి ఉన్నతస్థితిని కల్పించువాడా! తార్క్ష్యవాహన = గరుడవాహనా! మహాదైత్య+అరి = గొప్పరాక్షసులకు శత్రువైనవాడా! వైకుంఠమందిర = వైకుంఠమందుకాపురంకలవాడా! పీత+అంబర = పచ్చని పట్టు పుట్టంకట్టేవాడా! భక్త వత్సల = భక్తుల దోషభోగ్యుడా! నారాయణా! కృపన్ = దయతో; దీవింపు = ఆశీర్వదింపుము.

తా : నరసింహాచ్యుత వాసుదేవాది నామాలచే ప్రసిద్ధిపొందిన ఓ నారాయణా! దయతో కాపాడుము.

**వ్యాఖ్య : నామావళితో భగవంతుణ్ని కీర్తించిన పద్యమిది.**

ఒక్క క్షణకాలమైనా భగవంతుణ్ని చింతించక పోతే భక్తునికి చాల కష్టమనిపిస్తుంది.

"యన్ముహూర్తం క్షణం వాఽపి వాసుదేవో న చింత్యతే।
సా హానిస్తన్మహచ్ఛిద్రం సా భ్రాంతిః సా చ విక్రియా॥"

1. నరసింహుడు: "ఆకంఠమాదిపురుషం కంఠీరవముపరి" (కామాసికాష్టకం) అన్నట్లు, భక్తుల మాటను సత్యంగా నెరవేర్చడానికి పూర్వకాయం మానవరూపంగానూ, ఉత్తరకాయం సింహరూపంగానూ ప్రకటించుకొని దుష్టశిక్షణచేసిన విష్ణుమూర్తి యొక్క అద్భుతావతారమిది.

2. అచ్యుతుడు: "చ్యవనోత్పత్తియుక్తేషు బ్రహ్మేంద్రవరుణాదిషు ।
యస్మాన్నచ్యవసే స్థానాత్తస్మాత్సంకీర్త్యతేఽచ్యుతః॥"

బ్రహ్మేంద్రాదులతో సమానంగా అవతరించినా, వ్యూహంలోకూడా, తనస్థానంనుంచి జరుగక, స్థిరంగా ఉండేవాడు అచ్యుతుడు.

"యస్మాన్నచ్యుతపూర్వోహమచ్యుతస్తేన కర్మణా॥"

తాను జారక, తనను ఆశ్రయించిన పరమభక్తులను చేపట్టి జారవిడువనివాడు.

3.వాసుదేవుడు: "ఛాదయామి జగత్సర్వం భూత్వా సూర్య ఇవాంశుభిః
సర్వభూతాధివాసశ్చ వాసుదేవస్తతః స్మృతః॥ (భారతం)

సమస్త లోకాలను, సూర్యుడు కిరణాలచే ఆవరించియున్నట్లే, భగవంతుడు ఆవరించి సమస్త భూతాలకు ఉనికి పట్టువయినవాడు.

"సర్వత్రాసౌ సమస్తం చ వసత్యత్రేతి వై యతః।
తతస్స వాసుదేవేతి విద్వద్భిః పరిపఠ్యతే॥" (వి.పు)

తానంతటా వసించేవాడు, తనయందన్నీ వసిస్తాయి కాబట్టి భగవంతునికి 'వాసుదేవుడు' అని వ్యవహారనామం.

4. వికసన్నాళీక పత్రాక్షుడు: "రామః కమలపత్రాక్షః" వికసిస్తున్న తామరలవలె, ఆశ్రితులశ్రమను తొలగించే అందమైన కన్నులు కలవాడు.

5. భూధరుడు: "ఉద్ధృతాసి వరాహేణ". (శ్రుతి) నీటమునిగియున్న భూమిని ధరించి పైకి తెచ్చిన వరాహమూర్తి.

"సదాధారపృథివీం ద్యాముతే మామ్"(శ్రుతి)

భూమి ఉపలక్షణం సత్పదవాచ్యుడైన పరమపురుషుడు భూమినీ, ఆకాశాన్నీ ధరించినవాడు.

6. గోవిందుడు: "గాః - వాచః, విందతీతి గోవిందః" స్తోత్రవాక్కులను పొందేవాడు.

7. ముకుందుడు: "ముం,కుం దదా తీతి ముకుందః" ముక్తినీ, భుక్తినీ ఇచ్చేవారు.

8. కేశవుడు: "సూర్యస్య తపతో లోకానగ్నేః సోమస్య చాప్యత।
అంశవో యత్ప్రకాశంతే మమైతే కేశసంజ్ఞితాః॥
సర్వజ్ఞాః కేశవం తస్మాన్మ మాహుర్ద్విజసత్తమాః।"

లోకాలను తపింపజేసే సూర్యుని యొక్క, ప్రకాశించే అగ్నియొక్క, ఆహ్లాదపరచే చంద్రుని యొక్క కిరణాలే నారాయణుని కేశాలుగా పేరు పొందాయి. అలాంటి ప్రశస్తకేశాలు కలవాడు కేశవుడు.

9. జగత్త్రాత : జగద్రక్షకుడు

10. అహితల్పుడు : పాముపడక కలవాడు

11. అంబుజోదరుడు: పద్మంలాంటి ఉదరం కలవాడు, లేదా పద్మం ఉదరమందుకలవాడు.

12. దామోదరుడు: దమమంటే ఇంద్రియనిగ్రహసామర్థ్యం, దమమే దామం. (దామేన ఉదీర్యతే యస్మాత్సః) ఇంద్రియసంయమం కలవారికి ఉన్నతస్థితిని కల్పించేవాడు దామోదరుడు. (భారతం)

"దమాత్సిద్ధిం పరీప్సంతో మాం జనాః కామయంతి హ।
దివం చోర్వీం చ మధ్యం చ తస్మాద్దామోదరోహ్యాహమ్॥"

13. తార్క్ష్యవాహనుడు: మాతృదాస్యవిముక్తికై అమృతభాండాన్ని సాహసంతో తెచ్చినా, ఒక్క బిందువునైనను ఆస్వాదించని అలౌల్యప్రవృత్తికి సంతోషించిన నారాయణుడు గరుత్మంతుణ్ని వాహనంగా వరించి స్వీకరించాడు.

14. మహాదైత్యారి: దంభ దర్పాలుకలిగిన మధు, కైటభులనే గొప్ప రాక్షసులను వధించినవాడు.

15. వైకుంఠమందిరుడు: అనేకావతారాలెత్తినా , వైకుంఠమందు స్థిరమైన కాపురమున్నవాడు.

16. పీతాంబరుడు: పసుపుపచ్చనిపట్టు ధోతి కట్టుపుట్టంగా కలవాడు.

17. భక్తవత్సలుడు: "ప్రపన్నాన్ మాధవః సర్వాన్ దోషేణ పరిగృహ్యతే।
అద్యజాతం యథావత్సం దోషేణ సహ వత్సలామ్॥"

ప్రసన్నుల దోషాలను, ఆవు లేదూడ మురికిని వలె, భోగ్యంగా పరిగ్రహించి, వారిని పరిశుద్ధులుగా జేసే ఆదిపురుషుడు.

18. నారాయణుడు : జయసూచకమైనది పద్దెనిమిది (18) సంఖ్య. ఆ నామాలతో ఆర్తత్రాణపరాయణుణ్ని స్తుతించి, తనను కటాక్షించుమని కవి ప్రార్థించాడు.

**మ. కడకంటం గడలేని సంపద లొగింగావింపు లక్ష్మీశ! పా**
**ల్కడలిన్ బన్నగశాయివై భువనముల్ గల్పించు సత్పుత్రునిన్**
**బొడమన్ జేసిన నాభిపంకజ జగత్పుణ్యాత్మ భాగీరథీ**
**పడతింగన్న పదారవిందముల నే భావింతు నారాయణా॥ 100**

అర్థం : ఓ నారాయణా! పాల్కడలిన్ = పాలసముద్రమందు; పన్నగశాయివై = పాముమీద పవళించినవాడవై; భువనముల్ = లోకాలను; కల్పించు = సృజించే; సత్ పుత్రునిన్ = శ్రేష్ఠుడైన కుమారుణ్ని; పొడమన్ జేసిన = పుట్టించిన; నాభిపంకజ = బొడ్డున కమలంకలవాడా! జగత్+పుణ్య+ఆత్మ = జగమే పవిత్రమైన శరీరం కలవాడా! భాగీరథీ = భాగీరథి, అనే పడతిని (గంగను); కన్న = ఉద్గమింప జేసిన; పద+అరవిందములనే = పాదకమలాలనే; భావింతు = స్మరింతు, ఓ, లక్ష్మీ+ఈశ = శ్రియః పతీ! కడకంటన్ = కటాక్షంతో; కడలేని = అంతంలేని; సంపద = భాగ్యాలను; ఒగిన్ = క్రమంగా; కావింపు = కలిగింపుము.

తా : ఓనారాయణా! క్షీరాబ్ధిలో శేషశాయివై లోకాలను సృష్టించేమంచి తనయుణ్ని పుట్టించిన పొక్కిలి తామర కలవాడా! ప్రపంచమే పవిత్రదేహంగా కలవాడా । గంగాదేవిని ఉద్భవింపజేసిన పాదపద్మాలనే ధ్యానిస్తూంటాను. ఓ లక్ష్మీశా! అపాంగ దృష్టితో అనంతభాగ్యాలను క్రమంగా కల్పించుము.

**వ్యాఖ్య : బ్రహ్మనూ భాగీరథినీ కన్నవాడు బహుభాగ్యదాత అనే వర్ణన.** పాలకడలిలో శేషతల్పాన పవళించిన స్వామియొక్క పొక్కిలి యందు ఒక్క కమలముంది. ఆ నాభీకమలమే విశ్వాయమానమైన రజః పుంజం కలిగిఉంది. కాబట్టి, ఆకమలంనుంచి లోకాలను సృజించే స్రష్టను ఉద్భవింప జేశాడు నాభిపంకజుడు.

"యస్య పృథివీ శరీరం" అనే శ్రుతిప్రకారంగా, ప్రపంచమే పరమాత్ముని పవిత్ర శరీరం. ఆవిశ్వాత్మకుని పాదాలు కూడా సుగంధసుకుమారమకరంద భరితారవిందాలను పోలిఉన్నాయి. లోకాలను పావనంచేసే భాగీరథి ఆయన చరణారవిందాలనుంచి ఉద్గమించింది, అంటే, ఆపాదాలెంత పవిత్రమైనవో కదా! కొబట్టి అందరు ఆ పాదారవిందాలనే ఎదలో నిల్పుకొని ధ్యానిస్తుంటారు.ఒక పుత్రుణ్ణి, ఒక పుత్రికను కన్నభాగ్యశాలి లక్ష్మీశుడు. ఆయన సిరిగలవాడైనందువల్ల, కటాక్షిస్తే ధనధాన్యపశ్వన్నభోగారోగ్యైశ్వర్యాదులు క్రమంగా ఒన గూడుతాయి. కాబట్టి, లక్ష్మీశుడు భుక్తినీ, ముక్తినీ తనకు కటాక్షిస్తాడనే దృఢాధ్యవసాయంతో కవి, ఆయన పాదారవిందాలనే సర్వదా సంస్మరిస్తుంటా నన్నాడు.

"ధ్యాయంతి యే విష్ణు మనంత మవ్యయం, .....
తే యాంతి సిద్ధిం పరమాం చ వైష్ణవీమ్॥" అన్నారు శ్రీకులశేఖరులు.

**మ. తపముల్ మంత్రసమస్తయజ్ఞఫలముల్ దానక్రియారంభముల్**
**జపముల్ పుణ్యసుతీర్థసేవఫలముల్ సద్వేదవిజ్ఞానమున్**
**ఉపవాసవ్రతశీలకర్మఫలముల్ ఒప్పార నిన్నాత్మలో**
**నుపమింపంగలవారికే కలుగు వేయున్నేల? నారాయణా॥ 101**

అర్థం : ఓ నారాయణా! తపముల్; మంత్రసమస్త యజ్ఞఫలముల్ = వేదమంత్రాలతో పూర్ణమైన యజ్ఞాలవల్ల కలిగే పుణ్యాలు; దానక్రియా+ఆరంభముల్ = దానం చేసే ప్రయత్నాలు; జపముల్; పుణ్యతీర్థస్నాన ఫలముల్ = పవిత్రమైన నదీజలాల యందు స్నానం చేయడం వల్ల కలిగే ఫలాలు; సత్ వేద విజ్ఞానమున్ = పరబ్రహ్మను తెలిపే వేదాన్త శాస్త్రమందలి అనుభవజ్ఞానం; ఉపవాసవ్రత శీలకర్మఫలముల్ = భగవత్సన్నిధిలో నియమంగా ధ్యానం చేసే స్వభావంగల కార్యం వలని ఫలాలు; వేయున్, ఏల = వేలమాటలెందుకు? ఆత్మలో = మనస్సులో; నిన్ను; ఉపమింపంగలవారికే = ఇవన్నీ నారాయణ నామస్మరణం వల్ల కలిగే ఫలంతో సమానమైనవని భావించిన వారికే; కలుగు = పొందును.

తా : ఓ నారాయణా! జపతపః ఫలాలు, సకల యజ్ఞఫలాలు, దానకర్మ ఫలాలు, సర్వతీర్థస్నానఫలాలు, వేయిమాటలేల? వేదాన్తవిజ్ఞానఫలమూ, ఉపవాసంవల్లనూ. నోములనోచడంవల్లనూ, సచ్చరిత్రవల్లనూ కలిగే ఫలాలన్నీ ఒక్క నారాయణ నామాన్ని స్మరించడంవల్ల కలిగే ఫలంతో సమానమైనవి.

**వ్యాఖ్య : భగవన్నామస్మరణచేసినవారికే సకలకర్మల ఫలాలు కలుగునని కవి ఆశయం.**

భగవంతుణ్ని స్మరించకుండా అభీష్టసిద్ధికోసం ఎన్నేండ్లు కాయక్లేశానికోర్చి తపస్సు చేసినా, అది నిష్ప్రయోజనమే.

"ఇష్టాపూర్తాని కర్మాణి సుబహూని కృతాన్యపి।
భవే హేతూని తాన్యేవ, హరేర్నామ తు ముక్తిదమ్॥" (బోధాయనసంహిత)

ఇష్టం: దర్శపూర్ణమాసాది శ్రౌతకర్మలు.

పూర్తం: వాపీకూపతటాకారామనిర్మాణాదిస్మార్తకర్మలు.

ఇష్టాపూర్తకర్మలన్నీ సంసారబంధాలకు - పునర్జన్మలకు హేతువులే.

నారాయణున్ని సంతతం స్మరిస్తే భవబంధాలు తెగిపోతాయి. మోక్షఫలం సిద్ధిస్తుంది. నారాయణస్మరణ చేయనివారు, నూరు అశ్వమేధయాగాలను, నూరు వాజపేయ యజ్ఞాలను చేసినా, సద్గతిని పొందలేరు.

"అశ్వమేధశతైరిష్ట్వా, వాజపేయ శతైరపి।
న ప్రాప్నువంతి సుగతిం నారాయణపరాఙ్ముఖాః॥" (నృసింహపురా)

దివ్యక్షేత్రసందర్శనంవలనిఫలమూ, సర్వతీర్థస్నానఫలమూ, వేయేల;

"సముద్రకోటిగంభీరః తీర్థకోటి సమాహ్వయః । ....
కోట్యశ్వమేధపాపఘ్నః, యజ్ఞకోటిసమార్చనః॥" (పద్మపురాణం)

భగవదర్చన, కోటియజ్ఞాలఫలసదృశమనడం అతిశయోక్తి కాదు.

**శా. శ్రీనారాయణ యన్నఁజాలు దురితశ్రేణిన్నివారింపగా**
**నానందస్థితి గల్గునంచు నిగమార్థానేక మెల్లప్పుడున్**
**నానాభంగులఁ జెప్ప నేను విని శ్రీనారాయణా! యంచు ని**
**న్నేనే నెప్పుడు గొల్తుఁబ్రోవఁగదె తండ్రీ! నన్ను నారాయణా॥ 102**

అర్థం : ఓ నారాయణా! దురిత శ్రేణిన్ = పాపరాశిని; నివారింపగా = పోగొట్టడానికి; శ్రీనారాయణ । అన్నన్ చాలు = లక్ష్మీనారాయణ! అని తలచిననూ సమర్థమైనది. ఆనంద స్థితికలుగున్; అంచు =అంటూ; నిగమ+అర్థ+అనేకము = వేదార్థాలబాహుళ్యం; ఎల్లప్పుడున్ నానాభంగుల = అనేకవిధాలా; చెప్ప; నేను, విని, శ్రీనారాయణా! యంచు; నిన్నే, నేను. ఎప్పుడు, కొల్తు = ధ్యానింతును; తండ్రీ! నన్ను, ప్రోవగఁదె = కాపాడుము.

తా : ఓ నారాయణా! శ్రీనారాయణా! అని స్మరిస్తే సకల పాపాలు తొలగిపోవడమే కాక శాశ్వత ఆనంద స్థితి కలుగుతుందని అనేక వేదార్థాలు అనేక విధాలా చెప్పగా విన్నాను. శ్రీనారాయణా! అంటూ నిన్నే ఎల్లప్పుడు ధ్యానిస్తుంటాను. తండ్రీ! నన్ను కాపాడుము.

**వ్యాఖ్య : శ్రీ నారాయణస్మరణవల్ల శాశ్వతానందస్థితి కలుగుతుందని కవి ఆశయం.**

ఈకృతికర్తకు వేదశాస్త్రాలమీద ఎనలేని, ఎన్నలేని విశ్వాసముంది. ఈ విశ్వాసంకలవాడే ఆస్తికుడు, లేనివాడు నాస్తికుడు.

"శ్రోత్రం దైవం, శ్రోత్రేణ హి తద్విందతే, బహుధా శ్రోతవ్యం"

అని బృహదారణ్యకోపనిషద్వాక్యాల రీతిగా, వైదికమంతా దైవికం. అది జ్ఞానద్రవ్యం. చెవులతో వినదగినదేకాని కనదగినది కాదు. అందుకే అనేకపర్యాయాలు, అనేకులు చెప్పగా వింటూనే ఉండాలి. వినగా వినగా, ప్రత్యక్షసమానాకారదర్శన మవుతుంది. దీనినే భగవత్సాక్షాత్కారమంటారు.

"అస్మై దేవాసో వపుషే చికిత్సత యమాశిరాదంపతీ వామమశ్నుతః ।"

దేవతలుకూడా జ్ఞానగమ్యుడైన, లక్ష్మితో కూడియున్న నారాయణుణ్ని ఆది దంపతులను సేవించి అందమైన భగవదనుభవాన్ని పొందుతారన్నది యజుర్వేదం. దంపతులలో ఏ ఒకరినో సేవించడం ఆసురలక్షణమంటారు.

"జగత్కుటుంబినం దేవం నారాయణ మనుత్తమమ్।

క్షీరాబ్ధిశాయినం నిత్యం లక్ష్మీనాథం నమామ్యహమ్॥" అని, శ్రీనారాయణుడే ధ్యేయుడు. భగవన్నామస్మరణకు దేశ కాలనియమాలుండవు.

"న దేశనియమో రాజన్! న కాలనియమస్తథా।

విద్యతే నాత్ర సందేహో, విష్ణోర్నామానుకీర్తనే"॥ (స్కాంద పురాణం) అన్నదే సిద్ధాంతం.

శ్రీమహావిష్ణువును ఉపాసిస్తే పాపాలూ పోతాయి. శాశ్వతానందమే ఉనికిగా గలలోకాన్నీ పొందుతాడన్నది 'విష్ణుధర్మోత్తర(పురాణ)ం.'

"విధూతపాపాస్తే యాంతి బ్రహ్మలోకం సనాతనమ్"

"యే నృశంసా దురాత్మానః పాపాచారరతాస్తథా।

తేఽపి యాంతి పరంధామ నరా నారాయణాశ్రయాః"

నరులెంత పాపిష్ఠులయినా నారాయణుణ్ని ఆశ్రయిస్తే పరంధామాన్ని - వైకుంఠాన్ని పొందుతార్నది నృసింహపురాణం.

"అథ పాతకభీతస్త్వం సర్వభావేన భారత।

విముక్తాన్యసమారంభో నారాయణపరో భవ॥"

ఓ భారతీయుడా! పాతకాలనుంచి భయపడిననీవు, మరొకటి వేరే ఏదీ ఆలోచించక, ఆచరించక, సర్వవిధాలా నారాయణ మూర్తినే శరణు పొందుమని 'భారతం' నొక్కి వక్కాణించింది.

"సకృదుచ్చారయేద్యస్తు నారాయణ మతంద్రితః।

శుద్ధాంతఃకరణోభూత్వా నిర్వాణమధిగచ్ఛతి ॥" (పద్మపురాణం)

అప్రమత్తుడై ఒక్కసారి 'నారాయణా!' అని ఆర్తితో ప్రార్థించినవాడు పరిశుద్ధాంతఃకరణుడవుతాడు. మోక్షఫలాన్నీ పొందుతాడు.

"బద్ధః పరికరస్తేన మోక్షాయ గమనంప్రతి।
సకృదుచ్చారితం యేన హరి రిత్యక్షరద్వయమ్॥" (హర్యష్టకం)

మోక్షమార్గంలో పయనించడానికి అవసరమైన సాధనసామగ్రిని కష్టపడి కూడబెట్టుకోనక్కరలేదు. ఒక్కసారి మనసార 'హరి' అనే అక్షర ద్వయాన్ని ఉచ్చరిస్తే అది అన్నింటినీ సిద్ధంచేసి పెడుతుంది.

ఇలా వేదశాస్త్రపురాణాలయందలి సునిశ్చితార్థాన్ని విన్నవాడు కాబట్టి 'శ్రీనారాయణా!' అని సర్వదా స్మరిస్తూ ఉంటాడట ఈకవి. "పితేవాభిరక్షతాత్" - తండ్రిలాగా రక్షించడం శ్రీనారాయణునిధర్మమే అన్నాడు. ఉపాయం - సాధనం నారాయణ స్మరణమే. ఉపేయం - సాధ్యం కూడా శ్రీనారాయణుని సన్నిధానమేకదా!

**మ. కలితాఘౌఘవినాశకారి యగుచుంగైవల్యసంధాయియై**
**నలి నొప్పారెడు మంత్రరాజమగు నీనామంబు ప్రేమంబునన్**
**అలరన్నెవ్వని వాక్కునం బొరయదో యన్నీచుదేహంబు దా**
**వెలయన్ భూరుహకోటరం బదియ సూ వేదాత్మ!నారాయణా॥103**

అర్థం : ఓ వేదాత్మ = ఓ వేదమూర్తి! నారాయణా! కలిత+అఘ+ఓఘ, వినాశకారి, అగుచున్ = (కూడిన) సంచితమైన పాపరాశిని నశింపజేస్తూ; కైవల్యసంధాయియై = మోక్షఫలాన్ని సమకూర్చునదై; నలిన్, ఒప్పు, ఆరెడు = కడు యోగ్యంగా ఉండే; మంత్రరాజము, అగు = మంత్రాలలో శ్రేష్ఠమైన; నీ నామంబు = 'నారాయణ' అనే నీ పేరు; అలరన్ = స్ఫుటంగా; ఎవ్వని; వాక్కునన్ = వాగింద్రియమైన నాలుకమీద; పొరయదో = కీర్తింపబడదో; ఆ, నీచు, దేహంబు = ఆక్షుద్రుని శరీరం; తాన్ = ఆ శరీరం, అదియే; వెలయన్ = స్పష్టంగా; భూరుహకోటరంబు = మ్రానితొఱ్ఱయే; సూ = సుమా.

తా : ఓ వేదాత్మ ! నారాయణ! మంత్రరాజమైననీనామాన్ని భక్తితో అనుసంధానం చేసినవ్యక్తికి సకలపాపరాశి నశిస్తుంది, మోక్షసామ్రాజ్యమూ లభిస్తుంది. అత్యంత యోగ్యమైన నీనామాన్ని ఉచ్చరించనివాని దేహమే ఒక చెట్టు, వాని నోరు ఆచెట్టుకున్న తొఱ్ఱియే సుమా!

**వ్యాఖ్య : మంత్రరాజమైన నారాయణనామాన్ని అనుసంధించని నోరు మ్రాను తొఱ్ఱగా వర్ణితం.**

మానవుడు ఒక వృక్షం, ఆ వృక్షమూలమే మంత్రం. ఆమూలాన్ని అతిశ్రద్ధతో

రక్షించుకోవాలి "తస్మాన్మూలం యత్నతో రక్షణీయమ్" అంటుంది దేవీ భాగవతం. చెట్టుకు తొర్ర ఏర్పడితే అది కల్పగా ఉపయోగపడదు. పైగా మొత్తం చెట్టు నశించడానికి కారణమవుతుంది. మంత్రరాజమైన నారాయణ నామాన్ని ఉచ్చరించని వ్యక్తి, సమాజంలో గౌరవం, ఆదరం, అభిమానం తక్కువ కలవాడనీ, అతని నోరు, చెట్టు తొర్రలాగా, ప్రలాపాలతో ఆత్మనాశక మవుతుందనీ వర్ణించాడు కవి. నీచుణ్ణి రూపకాలంకారంతో శోభింపజేశాడు.

ప్రపత్తే ర్లక్షణే మంత్రే విధౌ వాక్యాంతరేషు చ।
భాష్యాదౌ సంప్రదాయే చోపాయత్వం బ్రహ్మణి స్థితమ్"॥

ప్రపత్తిలక్షణమందూ, మంత్రమందూ, విధియందూ, ఇతర వాక్యాలయందూ, భాష్యాదులందూ, సంప్రదాయమందుకూడా పరబ్రహ్మమే సిద్ధోపాయం - మోక్షోపాయమనీ భగవచ్ఛాస్త్రం బోధిస్తుంది.

కాబట్టి "వదామి నారాయణనామ నిర్మలమ్
స్మరామి నారాయణతత్త్వ మవ్యయమ్"॥ (ముకుందమాల)
అన్నట్లు పర్వదా నారాయణనామాన్ని స్మరిస్తూ ఉండాలి.

ఈపద్యం, రెండు,మూడు పదాల, ప్రత్యయాలభేదంతో (33) ముప్పదిమూడవ పద్యంగా పునరుక్తమయిందని చెప్పనక్కరలేదుకదా!

**మ. రమణీయంబుగ నాదిమంబు నవతారంబున్ భవద్దివ్యరూ**
**పమునామామృతమున్ దలంప దశక ప్రాప్తయ్యె(గృష్ణావతా**
**రము సుజ్ఞానము మోక్షమున్ ద్వివిధసంప్రాప్తిన్ శతాంధ్రాఖ్యకా**
**వ్యము నర్పించితి మీ పదాబ్జములకున్ వైకుంఠ!నారాయణా॥ 104**

అర్థం : ఓ వైకుంఠ!నారాయణా! ఆదిమంబున్ = మొదటిది; అవతారంబున్; భవత్+దివ్యరూపము = నీదివ్యమైన ఆకృతి; నామ+అమృతమున్ = అమృతం వంటి నామం, తలంప = విచారించగా; రమణీయంబుగ = అందంగా, దశక ప్రాప్తి, అయ్యెన్ = ఒక్కొక్కటి పది పద్యాలతో ఏర్పడినది. కృష్ణావతారము; సుజ్ఞానము; మోక్షమున్; ద్వివిధ సంప్రాప్తిన్ = పదికి రెట్టింపు అవడంతో; శత+ఆంధ్ర+ఆఖ్య, కావ్యమును = ఆంధ్రభాషయందు వంద పద్యాలు గల శతకమనే కావ్యాన్ని; మీ, పద+అబ్జములకున్ = మీపాదపద్మాలకు; అర్పించితి = సమర్పించాను.

తా : ఓ వైకుంఠ! నారాయణా! ఆదిమదశకం, అవతారదశకం, నీదివ్య రూపదశకం, నామప్రభావదశకం అని ఈ నాలుగు విషయాలు పదేసి పద్యాలతో అందంగా సమకూరినాయి.

కృష్ణావతార వింశతి, జ్ఞాన వింశతి, మోక్షవింశతి, అనే ఈ మూడు విషయాలు ఇరవై యేసి పద్యాలతో కూడి ఆంధ్రభాషలో నూరు పద్యాలు రచింపబడినాయి. ఓ నారాయణా! ఈశతకావ్యాన్ని మీ చరణారవిందాలకు సమర్పించాను.

**వ్యాఖ్య: శతకరచనావిధానాన్ని వివరించి, కవి తనకావ్యాన్ని నారాయణుని పాదపద్మాలయందు సమర్పించాడు.**

ఈ పద్యరచనతో కవి, తన శతకాన్ని విషయసౌలభ్యంకోసం సప్తశీర్షికలు కలదిగా విభజించినట్లు స్ఫురింపజేశాడు.

1. ఆదిదశకం: ప్రప్రథమంగా జగత్కారణుడైన పరబ్రహ్మయొక్క వైచిత్రిని పది పద్యాలలో రమణీయంగా వర్ణించాడు.

2. అవతారదశకం : ప్రసిద్ధమైన భగవంతుని దశావతారాలను పది పద్యాలలో అద్భుతంగా వర్ణించాడు.

3. దివ్యరూపదశకం: శ్రీమన్నారాయణుని విశ్వరూపవైభవాన్ని పద్యదశకంలో గరీయః ప్రతిభతో చిత్రించాడు.

4. నామప్రభావదశకం: నాల్గవదశకంలో భగవంతుని గుణవిభూతులను అమృతాయమానంగా ఆస్వాదించాడానికి యోగ్యమైన నామమహిమను హృద్యంగా స్తుతించాడు.

5. కృష్ణావతారవింశతి: పరత్వ, సౌలభ్యాలను ప్రదర్శించిన శ్రీకృష్ణుని లీలలను ఇరవైపద్యాలలో కమనీయంగా వర్ణిస్తూ మధురభక్తిరసామృతాని కేతమెత్తాడు.

6. జ్ఞానవింశతి: ఇహలోకపరలోకసుఖాలను ఆవిష్కరించే సుజ్ఞాన విషయాన్ని వింశతి పద్యాలలో సుగమంగా భాసింపజేశాడు.

7. మోక్షవింశతి: ఉభయ విభూతి నాయకుడైన శ్రీమన్నారాయణుని నిర్హేతుక జాయమాన కటాక్షంచేత లభ్యమయ్యే మోక్షమనే పరమపురుషార్థాన్ని విలక్షణంగా విశదపరచాడు.

"అగ్నిర్వై వాక్" వాక్కును అగ్నిగా బోధిస్తుంది వేదం.

శబ్దాహ్వయజ్యోతిచేత పరంజ్యోతి ప్రకటితమవుతుంది. సప్తావరణాలతో కూడిన ప్రకృతిమండలం పరిదృశ్యమానవమవుతుంది.

"సప్తప్రాణాః ప్రభవంతి తస్మాత్సప్తార్చిషస్సమిధస్సప్త జిహ్వాః। సప్తఇమే లోకా యేషు చరంతి ప్రాణా గుహాశయాన్నిహితా స్సప్త సప్త" "అతస్సముద్రా గిర యశ్చ సర్వేఽస్మా త్స్యందతే సింధవస్సర్వరూపాః"॥ (శ్రుతి)

"సప్తార్ణవ స్సప్తకులాచలాశ్చ
సప్తర్షయో ద్వీపవనాని సప్త"॥ (స్మృతి)

హృదయగుహయందు వెలిగే పరంజ్యోతివల్ల సప్త ప్రాణాలు -

"సప్త వై శీర్షణ్యాః ప్రాణాః" అన్నట్లు తలయందు చక్షురాది సప్తసంఖ్యగల ప్రాణాలు - సప్తార్చిస్సులు, సప్తసమిధలు, సప్తజిహ్వాలు, సప్తలోకాలు, సప్తద్వీపాలు, సప్తర్షులు, సప్తసముద్రాలు, సప్తగిరులు, సప్తవనాలు, సప్తనదులు ప్రభవించినట్లు, వేయేల? సప్తాహంగా కాలచక్రం పరిభ్రమిస్తున్నట్లు శబ్దప్రమాణం ఉంది కదా!సఖ్యమూ సాప్తపదీనమే.

ఆది కావ్యమైన రామాయణ మహార్ణవం సప్తకాండలతో సందీప్తమేకదా! శబ్దజ్యోతి సప్తవిభక్తులతో, త్రిధా వచనబద్ధమై ఆకాశగుణమై విశ్వంలో శక్తిమంతంగా వెలుగుతున్నది.

సప్త కింజల్కాలు కలిగి వందరేకులతో వికసించిన ఈ శతకకావ్యశతపత్రాన్ని శ్రీనారాయణచరణారవిందాలయందు సమర్పించి ధన్యుడయ్యాడు, కవులలో మూర్ధన్యుడయ్యాడు.

**శా. నీమూర్తుల్ గన నీకథల్ వినఁ దుదిన్ నీ పాదనిర్మాల్యని**
**ష్ఠా మోదంబునెఱుంగ, నీచరణతోయంబాడ, నైవేద్యముల్**
**నీమంబొప్ప భజింప, నీజపము వర్ణింపన్ గృపంజేయవే**
**శ్రీమించన్ బహుజన్మజన్మములకున్ శ్రీయాదినారాయణా॥ 105**

అర్థం: శ్రీ ఆదినారాయణా = సంపత్కరమైన ఆదిదేవుడవైన ఓ నారాయణా! బహుజన్మజన్మములకున్ = అనేక జన్మాలకు; శ్రమించన్ = జ్ఞానలక్ష్మి ప్రకాశింపగా; నీ మూర్తులే కనన్ = నీ రూపాలను చూడడానికి; నీ కథల్ వినన్ = నీగాథలు వినడానికి; తుదిన్ = చివరకు, నీపాదనిర్మాల్యనిష్ఠా+ఆమోదరిబును+ఎఱుంగ = నీచరణాల యందర్పింపబడిన తులసీ పుష్పమాలికలను స్థిరనియమంతో ఆఘ్రాణించడానికి; నీచరణతో యంబు+ఆడన్ = నీ పాదతీర్థాన్ని సేవించడానికి; నైవేద్యముల్ నీమంబు+ఒప్ప భజింప = అనుభవింపదగిన పదార్థాలను నీకు నియమంగా సమర్పించి సేవించడానికి; నీజపము వర్ణింపన్ = నీ నామమంత్రాన్ని పునఃపునః ఉచ్చరించడానికి, నీ గుణ జాలాన్ని స్తుతించడానికి; కృపన్, చేయవే = దయతో అనుగ్రహించుము.

తా : ఓ శ్రీదేవీయుక్త ఆదినారాయణా! జన్మజన్మలలోనూ నీరూపాలను కనడానికి, నీ కథలను వినడానికి, నీ పాదనిర్మాల్యాన్ని ఆఘ్రాణించడానికి, నీచరణ తీర్థాన్నీ, నీకు నివేదించిన ప్రసాదాన్నీ సేవించడానికి, నీనామాన్ని జపించడానికి, నీగుణశీలాదులను కీర్తించడానికి దయతో జ్ఞానలక్ష్మిని ప్రకాశింపజేయుము.

**వ్యాఖ్య : శ్రీమన్నారాయణుసేవచేయదగిన జ్ఞానాన్ని ప్రసాదించుమని కవి ఆకాంక్ష.**

ఇదివరకెన్ని జన్మలయ్యాయో, ముందు ఎన్ని జన్మలననుభవించాలో తెలియదు. జ్ఞానం కలిగిన జన్మయే చివరిజన్మగా సంభావితం.

జీవాత్మయొక్క స్వరూపధర్మం భగవత్కైంకర్యం. అదే మోక్షధర్మం.

"సోఽశ్నుతే సర్వాన్కామాన్ సహ బ్రహ్మణా విపశ్చితా"(తై.ఉ.ఆనంద వల్లి)

భగవంతుని స్వరూపగుణశీల విభూతులనన్నింటిని ఆయనతోడ ఉండి సేవిస్తూ, ఆనందంగా తానూ - జీవుడూ పొందడమే సాయుజ్యమనే మోక్ష లక్షణం.

"బహూనాం జన్మనామంతే జ్ఞానవాన్మాం ప్రపద్యతే! (భ.గీ.)

అనేక జన్మలసాధన ఫలితంగా జ్ఞానోదయమైన వ్యక్తికి భగవత్సాన్నిధ్యం లభిస్తుంది.

భగవత్సేవకు నోచుకోని జీవితం నరకతుల్యమే.

"భోగాః పురందరాదీనాం తే సర్వే నిరయోపమాః"।

పరమపురుషార్థపరులచే, దేవేంద్రాదులయొక్క సుఖభోగస్థానాలైన స్వర్గాది లోకాలు కూడా రౌరవాది నరకలోకాలతో సమానంగా భావింపబడుతాయి.

దివిలో ఉన్నా, భువిలో ఉన్నా ఇతరాపేక్ష లేకుండా శ్రీమన్నారాయణునికి చేసే నిత్య, నిరవద్య కైంకర్యమే సర్వోత్తమపురుషార్థం. దీనికి మించి మరేదీ వేరే లేదనే దృఢాధ్యవసాయంగల మహనీయులు, వైకుంఠంలో ఉండే అనంత గరుడాది నిత్యసూరులచేతనూ ప్రియమైన అతిథులుగా సేవింప బడుతారు, సత్కరింపబడుతారు.

"యే బ్రహ్మన్! భగవద్దాస్యభోగైకనిరతాః సదా।

తే ప్రియాతిథయః ప్రోక్తాః శ్రీవైకుంఠనివాసినామ్"॥ (శ్రీశాస్త్రం)

భగవంతుని అనంతగుణాలన్నీ వైకుంఠంలో కంటెను ~~ఈ~~లోకంలోనే పుష్కలంగా ప్రకాశిస్తుంటాయి. ఆ గుణాలను పుష్కలంగా అనుభవించడానికే కొందరు మహాత్ములు "వైకుంఠవాసేఽపి న మేఽభిలాషః" ~~ఈ~~లీలా విభూతియందు జన్మించడం శ్రేయస్కరం, వైకుంఠంలో ఉండాలనే కోరిక కూడా మాకు లేదు' అంటారు.

"లక్ష్మణో లక్ష్మిసంపన్నః" అన్నాడు వాల్మీకి మహర్షి

కందమూల ఫలాదులను త్రవ్వి, నింపి తేవడానికి గడ్డపార తోను, గంపతోను శ్రీసీతారాములవెంట బయల్దేరిన లక్ష్మణుడు లక్ష్మిసంపన్నుడట.

"భవాంస్తు సహ వైదేహ్యా గిరిసానుషు రంస్యతే।

అహం సర్వం కరిష్యామి జాగ్రతః స్వపతశ్చ తే॥" (రామాయణం)

'కొండచరియలయందు నీవు సీతాదేవితో వినోదంగా విహరిస్తుంటే మీయిర్వురికి

నిద్రిస్తున్నా, మేల్కొనియున్నా, నేను సర్వవిధాలా కైంకర్యం చేయగలను' అని లక్ష్మణుడు శ్రీరాముణ్ని ప్రార్థించి, తన - జీవాత్మ - ఉద్దేశం తెల్పుతాడు. ఇది సమ్యక్జ్ఞానం.

"సా హి శ్రీరమృతా సతామ్" సత్పురుషులకు కింకరత్వభావమే ప్రధానమైనది. అదే జ్ఞానలక్ష్మి.

'శ్రీమించన్, అంటే జ్ఞానం, సుందర సుకుమార సుగంధ భరితమై ఉండా'లని అర్థం.

వేరే విషయాలమీద మనస్సును పోనీయక ఏకాగ్రంగా ఉంచడమే జ్ఞానానికి సౌందర్యం.

తాను అనుభవించాలనే బుద్ధి లేక పోవడం, జ్ఞానానికి సౌకుమార్యం. నిరతిశయమైన ప్రేమ కలిగి ఉండడం, జ్ఞానానికి గల సౌగంధ్యం.

జ్ఞానలక్ష్మి ప్రకాశిస్తే సర్వేంద్రియాలు ఇతరత్ర ప్రసరించక, సర్వేశ్వరునికి అభిముఖంగా ఉంటాయి. కన్నులు, కమలాక్షుణ్ని చూస్తాయి. వీనులు, విష్ణుకథలనే వింటాయి. నాసిక, భగవత్పాదతులసీపుష్పాలనే మూర్కొంటుంది. భగవత్పాద తీర్థమాడి శరీరం, (త్వక్కు) తాపత్రయాన్ని శమింపజేసుకొంటుంది. రసన, ముకుందుని తీర్థ ప్రసాదాలనే స్వీకరిస్తూ, ఉత్కంఠతో వైకుంఠుణ్ణి కీర్తిస్తుంది. అంతరంగం హృషీకేశుని నిరంతరచింతనలో మగ్నమవుతుంది.

ఇతరజలాలనపేక్షించని చాతకపక్షి, వాన నీటికోసమే ప్రతీక్షించే రీతిగా, ప్రపన్నుడు ఇతరవిషయాలను అపేక్షించక, ఆలోచించక, శ్రీమన్నారాయణుని దివ్యానుగ్రహంకోసమే నిరీక్షిస్తాడు.

"నీపద్యావళులాలకించు చెవులున్ నిన్నాడు వాక్యంబులున్
నీ పేరంబని సేయు హస్తయుగముల్ నీమూర్తిపై చూపులున్
నీ పాదంబులపొంత మ్రొక్కు శిరముల్ నీసేవపై చిత్తముల్
నీ పై బుద్ధులు మాకు నిమ్ము కరుణన్ నీరేజపత్రేక్షణా॥"

అనే భాగవత (10స్కం) పద్యం ఇచట స్మరణీయం. దేవుడు అవాప్త సమస్తకాముడు, సర్వపూర్ణుడు, చేతనుని దగ్గరినుంచి ఏదైనా స్వీకరించవలసిన ఆవశ్యకత, కొరత ఆయనకు లేదు. చేతనుడు అకించనుడు. కాబట్టి దేవునికీయడానికి తనది అనే వస్తువొక్కటి కూడా ఈయనకు లేదు.

కావ్య కళామర్మజ్ఞుడైన ఈకృతికర్త, సకలసుకల మైన సాహిత్యసంపద్విశిష్టంగా భగవద్రూపగుణవిభవైశ్వర్యశీలాదులను వర్ణించడానికి, భక్తి రూపమైన శేముషిని కృప జేయుమని శ్రీమన్నారాయణమూర్తిని ప్రార్థిస్తూ, నారాయణ శతకాన్ని 'శ్రీమించన్' ముగించాడు.

జయ శ్రీమన్నారాయణ.

తాము సంపాదించిన ఆస్తిని, సంపత్తిని తమ సంతానానికి సంక్రమింపజేసే తల్లిదండ్రులు ఈ లోకంలో కోకొల్లలు.

భగవచ్చింతనతో ధర్మబద్ధమైన జీవనం అలవరచుకొన్నవారే భగవన్నామ మహిమ వల్ల ఇహపరసౌఖ్యాలు ప్రాప్తింప జేసుకో గలుగుతారు. అట్టివారే తమ సంతతికి భౌతిక సంపత్తిని, భక్తి సంపత్తిని కూడ సంక్రమింపజేసినందున యోగ్యులైన తల్లి దండ్రులవుతారు. వారు ధార్మికులు - సత్కర్ములు - చరితార్థులూ కూడా.

అలాంటివారి ఇళ్లల్లో ఆబాలగోపాలానికి శ్రీనారాయణశతకము శాంతి సుఖ సౌభాగ్యాలను చేకూరుస్తుంది.

శ్రీ బమ్మెరపోతనామాత్య ప్రణీతము, శ్రీనారాయణ శతకము భగవత్ప్రాప్తికి శరణాగతి వినా శరణ్యము లేదనీ, ఇందుకు భగవన్నామస్మరణ ఒక్కటే మార్గమనీ బోధన చేస్తోంది.

స్వామి శివశంకరస్వామి వారి మాటలలో 'భక్తి, జ్ఞాన, వైరాగ్యములు ఈ శ్రీనారాయణ శతకమున బీజరూపమున నున్నవి,' అనునది సత్యము.

నీతి, భక్తి, భావబోధకాలైన శతకాలు బాలబాలికలను విజ్ఞానవంతులుగా చేయడానికి అధికంగా ఉపయోగపడతాయి, అని అంటున్నారు శ్రీనారాయణ శతకమునకు వ్యాఖ్య వ్రాసిన శ్రీమాన్ కె.వి.రాఘవాచార్యుల వారు.

ఇది అమూల్యనిధి - దీనిని మీ ఇంటనిలిపి, మీ సంతతికి ఒంటబట్టించి మీరు ధన్యులు, మాన్యులు కావాలనేదే శ్రీపావని సేవాసమితి ఆకాంక్ష.

**చల్లా సాంబిరెడ్డి,** బి.ఏ., ఎల్‌ఎల్.బి
సంపాదకులు.